## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా

గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్థం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# బోధాయన ధర్మ సూత్రము

## తెలుగు తాత్పర్యంతో



మర్యాదానాం చ లోకస్య కర్తా కారయితా

గాయత్రీ ప్రచురణలు

హైదరాబాద్-10

# బోధాయన ధర్మసూత్రము

తెలుగు తాత్పర్యముతో

తాత్పర్య రచన

డా॥ [illegible]ంతిగళ్ లక్ష్మీనరసింహాచార్య

విశ్రాంతోపన్యాసకులు

గాయత్రీ ప్రచురణలు

హైదరాబాద్–10

బోధాయన ధర్మసూత్రము (తెలుగు తాత్పర్యముతో)
తాత్పర్యం: - డా॥ నల్లంతిగళ్ లక్ష్మీనరసింహాచార్య
ప్రథమ ముద్రణ : - 2008 సర్వధారి
ప్రతులు : - 1000
వెల : - రూ॥ 100లు మాత్రమే.

ఈ ధార్మిక గ్రంథం
తిరుమల తిరుపతి దేవస్థానం వారి
ఆర్థిక సహాయంతో ముద్రింపబడినది

ప్రతులకు : -

శ్రీమతి ఎన్ రంగనాయకమ్మగారు
7-1-110, రెడ్డి ఎన్‌క్లేవ్, దేవుని అల్వాల
హైదరాబాద్ - 500010
సెల్ : 9247355355 / 9704168678

డి.టి.పి. మరియు ముద్రణ
దీప్తి టెక్నికలర్ ప్రింటర్స్, C - 15, బాలాజీ టవర్స్
గాంధీనగర్, హైదరాబాద్‌సెల్ : 9949703224



श्री श्री जगद्गुरु शङ्कराचार्य महासंस्थानम्,
दक्षिणाम्नाय श्री शारदापीठम्, शृङ्गेरी
Sri Sri Jagadguru Shankaracharya Mahasamstanam
Dakshinamnaya Sri Sharada Peetham, Sringeri - 577 139

Ref : Camp : Date.............

నల్లంతిగళ్ లక్ష్మీనరసింహాచార్యులుగారికి నమస్కారములు.

తమరు వ్రాసినపత్రము, దానిజతలో పంపిన బోధాయనసూత్రము, గృహ్యాసూత్రము (సంస్కృత మూలము) అందినవి. శ్రీచరణుల సన్నిధిన సమర్పించితిని.

ఈ గ్రంథము బోధాయన సూత్రమువారికిఇవిఅత్యంత ఉపయోగకరముగ నుండుగాకయని ఈ గ్రంథమును సంకలనమొనరించిన మీకు దీర్ఘాయురారోగ్యాది సకలశ్రేయస్సులు లభించుగాకయని శ్రీచరణులు ఆశీర్వదించినారు.

శ్రీచరణులు నారాయణ స్మరణ పూర్వకముగా ఆశీర్వదించి అనుగ్రహించిన ఆశీర్మంత్రాక్షతలను, శ్రీశారదాచంద్రమౌళీశ్వర ప్రసాదములను పంపించుచున్నాము.

నల్లంతిగళ్ లక్ష్మీనరసింహాచార్య
7-1-110, రెడ్డి ఎస్టేట్
దేవుని అల్వాల
హైదరాబాద్ - 500 001

ఇట్లు
T. Dakshinamurthy

**Prof. B. NARASIMHA CHARYULU**
Retd.,
Department of Sanskrit, Osmania University
Hyderabad - 500 007



**Residence :**
2-2-186/17/A/2,
Bagh Amberpet,
Hyderabad - 13

# రోచనీ

శ్లో॥ ధర్మేణ ధ్రియతే లోకో ధర్మస్సర్వహితంకరః ।
సర్వో ధర్మే హి వర్తేత జహ్యాద్ధర్మం న జాతుచిత్॥

ధర్మే లోకప్రతిష్ఠా చ సత్యే ధర్మః ప్రతిష్ఠితః ।
సత్యమాచారమూలం హి తేనాచారం ప్రవర్తయేత్॥

ధర్మము అనుపదమూ దాని చుట్టూ ఉన్న భావన సంస్కృతానికి చెందిన ఓ ప్రత్యేకత. ఈపదానికి సరిపోయిన పదము ఇతర భాషలలో ఉన్నట్టు కనిపించదు. మానవుని మహోన్నతునిగా నిలిపేదీ, జంతు జాలాన్నుండి వేరు చేసేది ఈ ధర్మమే. ఈ ధర్మానికి మూలమూ, ప్రమాణమూ వేదమే. అదే శ్రుతి. దానినాధారంగా వెలువడినవే స్మృతులు. వీటికే ధర్మశాస్త్రము అని మరియొక పేరు. వీటి మొదటిరూపము 'ధర్మసూత్రము'లలో ఉన్నది. వేదాఙ్గములలోనిదగు కల్పము అను అంగమునకు చెందినవి శ్రౌత, గృహ్య, ధర్మ, శుల్బ సూత్రములు. ఈ కల్పమును వేదపురుషునకు చేతులుగా చెప్పి, వైదికక్రియాకలాపము చేయడానికి వాటి అవసరమును బాగుగా గుర్తించారు ప్రాచీనర్షులు–"హస్తౌ కల్పోఽథ పఠ్యతే" అని. కొన్ని క్రతువులు వేద మంత్రాలు లేకుండా చేయగలరేమో కాని, కల్పంలేకుండా చేయలేరని, వీటి ప్రాముఖ్యాన్ని శ్రీకుమారిలభట్టుగారు కూడా తెలిపారు.

వేదాదృతేఽపికుర్వన్తి కల్పైః కర్మాణి యాజ్ఞికాః ।
న తు కల్పైర్వినా కేచిన్మన్త్ర బ్రాహ్మణ మాత్రకాత్ ॥ అని. ధర్మమనగా వేదవిహిత కర్మాచరణ చేస్తూ మూడు విధాలయిన ఋణాలనుండి ముక్తుడయి, ముక్తుడుగావడానికి ప్రయత్నం చేయడమే. ధర్మసూత్ర గ్రంథములు ఆచార వ్యవహారములను నిరూపిస్తాయి, నిర్ణయిస్తాయి, విధిస్తాయి. ఈ గ్రంథాలలో మనిషికి రాష్ట్రంతో గల సంబంధం పయి ఎక్కువ ప్రాధాన్యం ఉండడంతో కుటుంబంతో, కుటుంబంతో గల ధర్మాలు అంతగా

ప్రాధాన్యాన్ని సంతరించుకోవు. వీటిలో వర్ణాశ్రమ ధర్మాలను చాలా వివరంగా నిరూపించారు. వ్యవహారము, నేరస్థుల దండన, న్యాయచర్చ ఈ ధర్మశాస్త్ర గ్రంథాలలోనే మొదలవుతుంది. పౌరన్యాయం, దానికి సంబంధించిన పన్నుల విధానము, వారసత్వ హక్కు, స్త్రీల స్థితిగతులు మొదలయినవి ఈ ధర్మసూత్ర లేక స్మృతిగ్రంథాలలో మనం చూడవచ్చును. వీటిలో భాగంగా, దాడి, వ్యభిచారము, దొంగతనము, మొదలయినవి చర్చకు వస్తాయి. వివిధ ధర్మసూత్ర (స్మృతి) గ్రంథాలలో అభిప్రాయ భేదం ఉండడానికి కారణాలు వేరువేరు కాలాల్లో అవి రావడం, వేరు ప్రాంతానికి చెందడం. వేరు వేరు వేదశాఖలకు చెందడమే తప్ప మరి ఒకటి కాదు అని భావించవచ్చును.

నాలుగు వేదాలకు చెందిన ఆఱు అంగాలు వేరువేరుగా ఉన్నవి. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము అనేవి నాలుగు వేదాలు. యజుర్వేదమేమో శుక్ల యజుర్వేదము, కృష్ణ యజుర్వేదము అని రెండు ప్రధాన శాఖలు కలది. విశేషమేమంటే బౌధాయన మరియు ఆపస్తంబుల కల్ప సూత్ర విభాగమే శ్రౌత,గృహ్య,ధర్మ, శుల్బ అను నాలుగు విధముల సూత్రగ్రంథాలు కలిగి ఉన్నది. ఇంకొక విశేషమేమంటే భగవద్రామానుజులు, శ్రీభాష్యంలో పూర్వవ్యాఖ్యాతృ ఋషులలో బౌధాయన, టంక, ద్రమిడులను పేర్కొన్నారు. బౌధాయన ఆపస్తంబులిద్దరు 'ప్రవచనకారులు'. ఈ ప్రవచన పద్ధతి బ్రాహ్మణ-సూత్రగ్రంథముల మధ్య ఉండి ఉండవచ్చునని చరిత్రకారుల అభిప్రాయము. పితృమేధ సూక్తమని ఓ గ్రంథముకూడ బౌధాయనునిదిగా ప్రసిద్ధము. గౌతమ,బౌధాయన, కాత్యాయన ఆపస్తంబులు క్రీ.పూ.800-400 మధ్యకాలానికి చెందినవారని ప్రఖ్యాత పరిశోధకులు బ్యూలర్, జోలీలు నిర్ణయించారు. బౌధాయన, ఆపస్తంబ సూత్రాలననసరించే తైత్తిరీయ శాఖకు చెందిన వారు దక్కన్-దక్షిణ ప్రాంతంలోనే ఎక్కువగా ఉన్నారు. ఉత్తర మధ్య భారతంలో లేరు. క్రీ.శ.1354-55 లోనిదయిన బుక్కరాయల శాసనంలో బౌధాయనులకు మహీశూర గ్రామము భూదానం చేసినట్టు పేర్కొన్నారు.

తైత్తిరీయారణ్యకము బౌధాయన ధర్మసూత్రరచనకు ఉపయోగింప బడినది. ఆ ఆరణ్యకము తెలుగులిపిది ప్రాచీనమయినది దొరుకుతున్నది. సముద్రప్రయాణాలు, సరుకు రవాణాల మీద పన్నును చర్చించడం మొదలయిన కారణాలవల్ల బౌధాయనుడు తూర్పు సముద్ర తీరప్రాంతమువాడు కావచ్చునేమో అని అభిప్రాయపడ్డారు బ్యూలర్ పండితులు. కాని మ.మ.పీ.వి. కాణే దీన్ని ఇష్టకోరు. పం.బలదేవుపాధ్యాయులు వీరిని ఆర్యావర్త ప్రాంతవాసి అని ఒప్పుకున్నారు. ఎనిమిదవ శతాబ్ది భవస్వామి బౌధాయనశ్రౌత

సూత్రాలకు వ్యాఖ్యానం వ్రాసారు. పదకొండవ శతాబ్దపు విజ్ఞానేశ్వరుడు మొదటిసారి ఈ ధర్మ సూత్రాలనుంచి ఉదహరించారు. శ్రీగోవిందస్వామి ఈ ధర్మ సూత్రాలకు వ్యాఖ్యానం వ్రాసారు.

బౌధాయన ధర్మసూత్రములు నాలుగు ప్రశ్నలలోనున్నది. మొదటి ప్రశ్నలో పదకొండు, రెండవదానిలో, మూడవ దానిలో పది చొప్పున, నాలుగవ దానిలో ఎనిమిది అధ్యాయాలున్నవి. మళ్ళీ ఈ నాలుగు ప్రశ్నలు వరుసగా 21,18,10,8 ఖండాలలో విభక్తమయ్యాయి. విషయపరిశీలన గావించిన పండితులు మొదటి రెండు ప్రశ్నలు మూల భూతాలని, మూడవది అతి ప్రాచీన కాలంలో, నాలుగవది కొంచెం తర్వాతి కాలంలో కల్పబద్ధాయని భావిస్తున్నారు. ఇక కొంత విషయ వివేచనం చేద్దాము.

"పుత్రేణ లోకాన్ జయతి పౌత్రేణామృతమశ్నుతే।
అథపుత్రస్య పౌత్రేణ నాకమేవాధిరోహతి 2-16-6 అని పుత్రసంతిని అభినందించారు, అభిలషించారుకూడా.

సప్తావరాన్ సప్త పూర్వాన్ షడన్యానాత్మ సప్తమాన్ ।
సత్పుత్రమధిగచ్ఛానః తారాయత్యేనసో భయాత్॥ పు 153 అధిగచ్ఛన్ అనడానికి ఆర్షప్రయోగం అధిగచ్ఛానః అని. పన్నెండు విధములయిన పుత్రులను గురించి నిర్ణయించారు. పుత్రులను వినయాధాన భరణ రక్షణలతో సాకాలి. పతితులను కాపాడాల్సిన పనిలేదు. పు.97 పతితురాలయినను తల్లిని పోషించాలి. పు.97. తల్లికి చెందిన ఆస్తి(ఆడబిడ్డ) కూతురికే చెందాలి. ఆస్తి విషయములో స్వాతంత్ర్యములేదు. చాలా విషయాలు 97,98 పుటల్లో ఉన్నాయి. అయితే వారి పవిత్రతను గురించి గొప్పగా స్త్రియః పవిత్రమతులం నైతా దుష్యన్తి కర్హిచిత్ అని నిష్కల్మషాః స్త్రియః అని పు.99 లో కొనియాడాడు.

ఎనిమిది రకాల వివాహాలను చర్చించాడు. వాటిలో బ్రహ్మాదైవ ప్రాజాపత్య ఆర్ష పద్ధతులనే ప్రోత్సహించాడు. ఆ కాలపు ఆచారమయిన కన్యాశుల్కాన్ని నిందించాడు. శుల్కేన యే ప్రయచ్ఛంతీతి.పు. 73. ప్రాజాపత్య వివాహములో కన్యాయా ఆచ్ఛాదనాలఙ్కారౌ విహితౌ। వరస్యాప్యేకే మన్యన్తే స్మ ॥ పు.70. అని గోవిందస్వామి వ్యాఖ్యానము. వరునికి కట్నం ఇచ్చే ఆచారం మొదలయి ప్రబలింది. రజస్వలా పూర్వవివాహానికి ఎక్కువ ఆదరముండేది. సంతానప్రాప్తి వివాహఫలము. సతీ ప్రథ కనపడదు. బహు భార్యాత్వము ఉండేది. ప్రేమ బంధమే అది. కానీ లెక్కపత్రం లాంటిది కానే కాదు. పుత్రులనే కోరినా పుత్రికలను నిందించలేదు. ఆపలేదు. వేద మంత్రాలు

లేకుండా వారికీ అన్నికర్మలు జరిపిస్తుండేవారని తెలుస్తుంది. ఇంట్లో స్త్రీ స్థానం బాగుండేది. వారు సుఖసంతోషాలతో నృత్తగీతాదులతో జీవితం నిరాటంకంగా వెళ్ళబుచ్చేవారు. ఈ నృత్తగీతాదులు పెళ్ళిలో జరుగుతుండేవి. అతిథులను బాగా అరుసుకునేవారు. దమము దానము దయా పాటించేవారు. ఎన్నేళ్ళు విద్యాభ్యాసం చేయాలి? బ్రహ్మచర్యం గొప్పతనం ఏమిటి? ఏ ఆశ్రమం స్వీకరించక ఒక్కక్షణం ఉండకూడదు.

"హుతమశ్రద్ధధానస్య శ్రద్ధాపూతం విశిష్యతే।
అశ్రద్ధా పరమః పాప్మా శ్రద్ధా హి పరమం తపః॥
తస్మాదశ్రద్ధయా దత్తం హవిర్నాశ్నన్తి దేవతాః॥ "1-10-16. అని శ్రద్ధ మహిను ఉగ్గడించాడు.

బౌధాయన మహర్షి చాలా ఉదారుడు. మన అలసత్వం బాగా తెలసినవాడు. అందుకనే

"యద్యౌవనే చరతి విభ్రమేణ సద్వాఽసద్వా యాదృశం వా యదా వా ।
ఉత్తరే చేద్వయసి సాధువృత్తస్తదేవాస్య భవతి నేతరాణి॥ 1-10-33 పు. 41 అనువాదకులు దీనితాత్పర్యము మాత్రమే ఇచ్చారు. కాని గోవిందస్వామి తనవ్యాఖ్యానంలో 59 ఏళ్ళ 8నెలల కంటె పూర్యము వయస్సును యౌవనము అని వ్యాఖ్యానించారు- ఉత్తరం వయః పఞ్చాశద్వర్షాదుపరి; ఏతస్యోర్ధ్వమ్। ఆచార్యాభిమతం ఊనషష్టేశ్చ వర్షేభ్యో హ్యష్టాభ్యశ్చమాసేభ్యః ఏత స్మాదర్వాగ్యౌవనమ్ అని. ఇప్పటి రిటైర్మెంటు వయస్సుకు దగ్గరగా ఉంది ఈ వయస్సు. పతితపుత్రుడు పతితుడే కానక్కరలేదు - అఙ్గహీనోఽ పి సాఙ్గం జనయతి సా ఙ్గోఽ ప్యఙ్గహీనం అతోనావశ్యం పతిత పుత్రేణాపి పతితేన భవితవ్యమ్ పు. 86. విహిత కర్మలనాచరిస్తూ శరీరం క్లేశపెట్టుకోకుండ జీవించడానికి అవసరమయిననంత ధనం సంపాదించాలని బోధిస్తాడు బౌధాయనుడు. అంతేకాదు శుక్తాః రూక్షాః పరుషా వాచో న బ్రూయాత్-పు 109 దుఃఖము కలిగించే మాటలు శుక్తాః విధవను విధవఅనడం, దోషం లేకున్నా దోషం కలిగించేవి 'రూక్షాః' శ్రోతియుణ్ణి పట్టుకొని అశ్రోత్రియుడు అనడం దోషమున్నా గుణమున్నట్టు చెప్పేవి 'పరుషాః '-గుడ్డివానిని కళ్ళుగలవాడని, అని గోవిందస్వామి వ్యాఖ్యానించాడు. భోజన, దుగ్ధపాన, విధినిషేధాదులను వివరించాడు బౌధాయనుడు. నిషేధించారంటేనే అవి చేస్తుండేవారని అర్థాపత్తితో తాత్పర్యం రావచ్చును. మహాపాతకాలేవి ?ఉపపాత కాలేవి? వాటి పరిహార మార్గాలేవి? ఎక్కడ నివసించాలి? ఎట్లా భోం చేయాలి? ఎట్లా చేయగూడదు ? అనే ప్రశ్నలన్నిటికకీ జవాబులున్నాయి యీ ధర్మసూత్రంలో. అన్నదానం, అవసరార్థం ధనదానం-

అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః తస్మాదన్నం ప్రదాతవ్యమన్నం హి పరమం హవిః॥ 2-6-41. "సుబ్రాహ్మణ.... పు.107. ఇంటియజమాని(నులు) అందరికి తృప్తిగా భోజనం పెట్టే తినాలి అని విధించాడు. గృహస్థుడు బ్రహ్మచారి తప్పక భోం చేయాల్సిందేనంటాడు. పు.140 రెండో ప్రశ్న పదమూడవ ఖండంలో ఇవే విశేషాలు. ప్రాయశ్చిత్తేన సర్వం పాప్మానం తరతి, తరతి బ్రహ్మహత్యాం యోఽ శ్వమేధేనయజేతేతి॥ 3-10-8 జపః,తపః, హోమః, ఉపవాసః, దానమ్ ఇతి నిష్క్రయణాని 13-10-10 అంతమాత్రాన అందరూ పాపాలు చేసి ప్రాయశ్చిత్తం చేసుకోవాలని కాదు.- అడుసుతొక్కనేల కాలుకడునేలగద!- ప్రక్షాళనాద్ధి పఙ్క స్య దూరాదస్పర్శనం వరమ్! "వేదైః పశ్యన్తి- అని ఆర్యోక్తి. ఆ వేదంతో పాటు స్మతులు కూడ మానవులకు కళ్ళే. చక్షుః పూతం న్యసేత్పాదం కనుక కళ్ళులేకపోతే భ్రష్టులమవుతాము-పడతాము. ధర్మభ్రష్టులము కాకూడదని, స్మృతులను మనం చదువుకోవాలి. యథాశక్తి ఆ ధర్మాలను ఆచరించాలి. బృహస్పతి స్మృతి సంస్కారకాండలో

"శ్రుతిస్మృతీ చక్షుషీ ద్వే నరాణాం న్యాయ వర్త్మని।

మార్గే ముహ్యన్తి తద్ధీనాః ప్రపతన్తి పథశ్చ్యుతాః ॥ 11 అని స్మృతుల గొప్పతనాన్ని విశదీకరించారు.

ఈ బౌధాయన ధర్మ సూత్రము యొక్క మొదటి ప్రశ్నలో బ్రహ్మచర్యం, శుద్ధాశుద్ధవిచారం, రాజకీయవిధి, వివాహవిధి నిరూపణ జరిగింది. రెండవ ప్రశ్నలో ప్రాయశ్చిత్తం, దాయభాగం, వర్ణాశ్రమ ధర్మాలు, శ్రాద్ధవిషయాలు; మూడవ దానిలో వైఖానస చాంద్రాయణాది వ్రతాలు, నాలుగవ దానిలో కామ్య సిద్ధులు బాగుగా చర్చించారు.

సత్యం వలన, జ్ఞానం వలన, తపస్సు వలన, దానం వలన మనం ధర్మం సాధించవచ్చును-

సత్యం జ్ఞానం తపో దానం ఏతద్ధర్మస్య సాధనమ్।

ధర్మాత్సుఖం చ జ్ఞానం చ జ్ఞానాన్మోక్షోఽ ధిగమ్యతే॥ బృ.స్మ.సం॥కాండ 3వ శ్లో॥ ఆ ధర్మంతో సుఖాన్ని, తత్త్వ జ్ఞానాన్ని పొందవచ్చును. తద్వారా మోక్షాన్నే పొందవచ్చునన్నారు.

ఇహపర సాధనమయిన ధర్మాలన్ని సంస్కృతంలోనే ఉన్నందున, సంస్కృతం రాని వారికర్థం కానందున జరుగుతున్న నష్టాన్ని తొలగించే సత్సంకల్పతో శ్రీమాన్ నల్లతింఘళ్ లక్ష్మీ నరసింహాచార్యులు గారు ఈ సూత్రాలకు తెలుగులో తాత్పర్యము వ్రాసి ముద్రించి తెలుగువారికందించి మహోపకారం గావించారు.

" కృతే తు మానవాధర్మాస్త్రేతాయాం గౌతమాః స్మృతాః ।
ద్వాపరే శఙ్ఖలిఖితౌ కలౌ పారాశరస్మృతిః ॥ అన్న స్మృతి వాక్యాన్ని ఆధారంగా వీరు ఇదివఱకే, పరాశర స్మృతిని అనువదించారు. అంతకు పూర్వము, తమ సూత్రమయిన అపస్తంబ గృహ్య, ధర్మసూత్రాలని తాత్పర్యంతో ముద్రించారు (తమజ్ఞానాన్ని అందరితో పంచుకొని, అందరినీ సద్ధర్మవర్తనులుగా చేయాలనే వీరి సంకల్ప, ప్రయత్నాలు అనుదినము పెరిగే ఆశీస్సులు ఆ శ్రియః పతివీరికివ్వాలని కోరుకుంటున్నాను.

అనువాదం అనేక విధాలు. పద,పాద, తాత్పర్యరూపాలుగా, వీరిదితాత్పర్యానువాదము. సాఫీగా సాగింది. పునర్ముద్రణఅంటూ జరిగితే గోవిందస్వామి వ్యాఖ్యానంతో సహా అనువదిస్తే బాగుంటుందని సూచన.

బౌధాయన సూత్రకారో ధర్మసూత్రం వినిర్మమే।
జ్ఞాత్వానుష్ఠాయ తత్సర్వం (యత్కిఞ్చిత్) హితం పథ్యం లభేమహి॥ వీరికి తెలుగు వారు చాలా ఋణపడి ఉన్నారు. ఆదరంతో, పఠనంతో, ప్రోత్సాహంతో, ఆ ఋణాన్ని తీర్చుకుంటారని, తీర్చుకొవాలని ఆకాంక్షిస్తున్నాను. దాంతో వీరు ఇంకా ఎన్నో సంస్కృత గ్రంథాలను, అననూదితాలను, అనువదించి మనకు అందిస్తారని భావిస్తున్నాను.

స్మృతిర్బౌధాయనస్యేయం తెల్గుభాషోపబృంహితా
కృతిః శ్రీనరసింహస్య భూయాద్ధార్మికతోషిణీ॥

ఇట్లు
భగవద్భాగవత విధేయుడు
**బూరుగడ్డ నరసింహాచార్యులు**



**Prof . H. Siva Kumar**, M.A., Ph.d.
8-4-24, 'Sree Vihar', Srikrishna Colony
WARANGAL - 506 002 - A.P. - INDIA
Ph : 0870-2505532, 2441797
Mobile : 94405-80084

# శ్రీముఖము

సృష్టిలోని 84 లక్షల జీవరాశులలో మానవజన్మ పరమ ఉత్కృష్టమైనది. అలాంటి మానవజన్మ కూడా మాతృగర్భంలో ప్రవేశించినప్పటినుంచీ అంత్యేష్టి వరకూ మనకు తెయకుండానే ఎన్నో రకములైన దుష్కర్మలకు పాత్రమవుతున్నది. ఉదాహరణకు శిశువు గర్భస్థమై ఉన్నప్పుడు గర్భజల పానదోషం అంటుకుంటుంది. జాతకర్మ సంస్కారం జరిగితేనే కాని ఆశరీరం పునీతం కాదు. ఆ దుష్కర్మలకు లోనుకాకుండా ఉండటానికి, మహర్షులు కొన్ని సంస్కారములను తప్పక చేసుకోవాలని నిర్దేశించారు. అలాంటి షోడశ సంస్కారాలను స్మృతికారులు, సూత్రకారులు చెప్పి, వాటి ఆవశ్యకతను, వాటిని ఆచరించవలసిన విధానాలను, అవి ఆచరించక పోతే కలిగే అనర్థాలను, ఆ అనర్థాలను తొలగించుకోటానికి చేయవలసిన ప్రాయశ్చిత్తాదులను వివరించారు. ఇవన్నీ మానవజన్మను పునీతం చేసుకోటానికి తప్పక ఆచరించ వలసిన నియమాలు. ఆ విధంగా వివరించిన సూత్రకారులలో బోధాయనుడు, ఆపస్తంబుడు, ఆశ్వలాయనుడు అగ్రగణ్యులు. వారు నిర్దేశించిన నియమావళి శ్రౌతసూత్రములు, ధర్మసూత్రములు, గృహ్యాసూత్రములు. అవి ఆయా సూత్రకర్తలపేర్లతోనే ప్రసిద్ధమైనాయి.

ఈనాడు ద్విజులందరూ తమ ప్రవర చెప్పుకొనేటప్పుడు తాము ఏవేదశాఖకు చెందినవారో, ఏసూత్రకారుల నియమావళిని అనుసరిస్తున్నారో చెప్పుకుంటూ- ఆపస్తంబ సూత్రః, కృష్ణ యజుశ్శాఖాధ్యాయీ అన్నట్లు చెప్పటం ఇప్పటికీ ఆనవాయితీగా వస్తున్నది. వీరిలో ఆపస్తంబీయులు ఆంధ్రదేశంలోను, ఆశ్వలాయనసూత్రీయులు బోధాయనసూత్రీయులు కర్ణాటక-తమిళ దేశాలలోను ఎక్కువగా ఉన్నారు. అయితే ఆపస్తంబీయులు కూడా బోధాయనోక్త కర్మలను నిత్యమూ ఆచరిస్తున్నారు.

ముఖ్యంగా-నిత్యనైమిత్తిక కర్మలలో చేసే పుణ్యాహవాచనము, రక్షాబంధనము, ఆయుష్యహూమము, ఉగ్రరథశాంతి, భీమరథ శాంతి, సహస్ర చంద్రదర్శన శాంతి, ఉదకశాంతి, దత్తత స్వీకారవిధి, సంతానార్థులకు శాంతిహోమము, అశనిపాతశాంతి, గ్రహోత్పాతశాంతి వంటిప్రక్రియలకు బోధాయన మహర్షి ప్రోక్త విధానాలనే ఆపస్తంబ ఆశ్వలాయన సూత్రీయులు కూడా అవలంబిస్తున్నారంటే, బోధాయనుని బోధలు ఎంత ప్రభావాన్ని కలిగి ఉన్నాయో విశదమవుతుంది. అంతేకాక వారు ముగ్గురూ చెప్పిన చాలా విషయాలలో సారూప్యం కనిపిస్తుంది. అయితే కొన్ని విషయాలలో దేశాకాల

పరిస్థితుల బట్టి చెప్పిన అభిప్రాయభేదాలు ఉండవచ్చును. అంతటి సామాజిక స్పృహతో వ్రాయటంవల్లనే వారు ముగ్గురూ అందరికీ ఆరాధ్యులు, అనుసరణీయులు అయినారు. అందుకే వారిని ప్రతినిత్యమూ తలచుకొని, ఋషిఋణం నుండి విముక్తులమవుతున్నాము.

ఆత్మీయులైన డా॥నల్లంతిగళ్ నరసింహాచార్యులుగారు ఆపస్తంబ ధర్మసూత్రము, గృహ్యసూత్రములను, ఆశ్వలాయన గృహ్యసూత్రమును, బోధాయన గృహ్యసూత్రమును ప్రచురించారు. ఇది బోధాయన ధర్మసూత్రగ్రంథము. ఇవికాక మనుస్మృతి, పరాశరస్మృతులను చక్కని అనువాదాలతో ప్రచురించారు. మన ఆర్ష సంస్కృతికి మూలవిరాట్టులైన వారిపేర్లు కూడా తెలియని ఈరోజులలో ఆ మహర్షుల గ్రంథాలను చక్కని తేటతెలుగు అనువాదంతో ప్రచురించి మన సంస్కృతికి ఎంతో సేవచేస్తున్న శ్రీఆచార్యులవారు ధన్యులు!

బోధాయనుడు క్రీ.పూ. 800 ప్రాంతంవాడని సాహిత్యచరిత్ర అభిప్రాయము కనుక దాదాపు 3000 సంవత్సరాల క్రితం ఉన్నట్లు భావింపబడుతున్నాడు.

మరొక విశేషము-బోధాయనుని గ్రంథాలు 1.బోధాయన శ్రౌతసూత్రం. 2. బోధాయన గృహ్య సూత్రం. 3. బోధాయన ధర్మసూత్రములను బట్టి అవి బోధాయన విరచితములుగా కన్పిస్తున్నాయి. కాని బోధాయన గృహ్యసూత్రంలో-"భగవాన్ బోధాయనః "(పు.168) అని కన్పిస్తుంది. అట్లాగే బోధాయన ధర్మ సూత్రంలో-"ఇతి బౌధాయనః "(3-5-8) అని కన్పిస్తుంది. వీటిని బట్టి ఆచార్యులవారు అభిప్రాయపడినట్లు, ఈ సూత్రాలను బోధాయనుని శిష్య పరంపరలోని వారెవరో గ్రంథస్థంచేసి ఉంటారనటమే సమంజసంగా కన్పిస్తుంది. అంతేకాక ఈ బోధాయన ధర్మసూత్రంలోని ఋషి తర్పణంలో 2-9-14 బోధాయన, ఆపస్తంబ, ఆశ్వలాయనుల పేర్లు ప్రస్తావింబడటం ఆవిషయాన్నే ధ్రువీకస్తున్నది.

ఇందులోని మరొక విశేషము-బోధాయన సూత్రాల వివరణలో-మను (1-3-11;1-3-26;1-4-48;2-3-5), ఆపస్తంబ(2-3-35;4-3-5) పరాశరుల (4-5-12;4-5-13) అభిప్రాయ భేదాలను తాండ్య (1-3-48), శతపథ(1-4-4) బ్రాహ్మణములలోని భేదాలను వివరించటం నరసింహాచార్యులవారి వ్యుత్పన్నతకు నిదర్శనాలు.

గ్రంథప్రారంభంలో అన్ని విషయాలనూ ప్రదర్శించే విషయాను క్రమణిక ఎంతో ఉపయుక్తంగా ఉన్నది.

ఈ బోధాయన ధర్మసూత్ర గ్రంథం జాగ్రత్తగా చదివితే, నిత్యజీవితంలో మనం తెలుసుకొని ఆచరించవలసిన విషయాలు చాలా తెలుస్తాయి.

**.ఆచారములు:** "ఆచారఃప్రథమో ధర్మః" అని శ్రుతి చెబుతున్నది. ఈనాడు మనం ఎన్నో

అనాచారపు పనులు చేస్తున్నామనిపిస్తుంది.

1. బ్రాహ్మణుడు ఉప్పు అమ్మరాదు (1-2-7)

2. సముద్రయానం చేయరాదు (1-2-7) మొన్న మొన్నటివరకూ జీవించిన కంచిపీఠాధిపతులు శ్రీచంద్రశేఖరేంద్ర సరస్వతీ మహాస్వామివారు సముద్రయానంచేసి వచ్చివారు శుద్ధిచేసుకోనిదే వారితో మాట్లాడేవారుకాదు.

3. చేతులు కడుక్కొనేటప్పుడు మణికట్టు వరకూ కడుక్కోవాలి.(1-6-16).

4. నూతన వస్త్రము పవిత్రమైనది; కనుక సమస్త కర్మలు నూతన వస్త్రంతోనే చెయ్యాలి. (1-13-4)

5. బావుల వద్ద స్నానం చేసేటప్పుడు ముందుగా 3 చెంబుల నీళ్లు బయటపోసి, ఆ తరువాత తోడుకొని స్నానం చెయ్యాలి(2-5-7)

6. సూర్యాస్తమయం తరువాత స్నానం చెయ్యరాదు(2-6-3)

7. నగ్నంగా స్నానం చెయ్యరాదు(2-6-25)

8. ఒక పాదంతో ఇంకొక పాదం తోముకో రాదు(2-6-8)

**శౌచము:** శౌచము 2 విధములు. 1 బాహ్యశౌచము. అపవిత్రములైన వస్తువులు శరీరానికి తగలకపోవడం. ఈ బాహ్యశౌచము స్నానంవల్ల కలుగుతుంది.

2. అంతశ్శౌచము. ఏప్రాణికి హింస కలిగించకుండుట. జ్ఞానము వలన బుద్ధి, అహింసవలన ఆత్మ, సత్యభాషణము వలన మనస్సు పవిత్రమవుతాయి(3-1-23,24).

3. ప్రతిపర్వదినములలో మాత్రమే వెంద్రుకలు, గోళ్లు తీయించుకోవాలి.(3-1-22) అంతేకాని ఎప్పుపడితే అప్పుడు తీయించు కోరాదు.

**ఆచమనము:** శరీరశుద్ధికి ప్రధానమైనది ఆచమనము. దానికి కూడా కొన్ని నియమాలు ఉన్నాయి. 1 ఆ తీర్థము వ్రేళ్ల సందులలో నుండి జారిపోకూడదు. నురగతో ఉండకూడదు. వేడిగా ఉండకూడదు. ఉప్పునీళ్లు కారాదు. రంగు మారకూడదు. దుర్గంధంగా ఉండరాదు(1-8-14).

2. నవ్వుతూ, మాట్లాడుతూ, ఇటు అటు చూస్తూ, శిఖముడివేయక, తలపాగపెట్టుకొని, యజ్ఞోపవీతములేక, కాళ్లనుచాపి, శబ్దం చేస్తూ ఆచమనం చేయరాదు(1-8-15).

3. స్త్రీలు, ద్విజేతరులు నీటితో పెదవులను తాకినంత మాత్రముననే ఆచమనం అవుతుంది(1-8-18).

4. ఆచమనమువలన సమస్త పాపాలు పోతాయి(4-3-5).

**సంధ్యావందనము:**

1. ప్రాతఃకాల సంధ్యను నక్షత్రములున్నప్పుడే ప్రారంభించి, సూర్యోదయం వరకూ చెయ్యాలి. సాయంసంధ్యను సూర్యాస్తమయం కాకముందే ప్రారంభించి, నక్షత్రోదయం

వరకూ చెయ్యాలి. రెండు సంధ్యలూ చక్కగా పూర్తి చేస్తే, రాత్రింబగళ్లూ అవిచ్ఛిన్నంగా ఉంటాయి. ఆయుర్వృద్ధి జరుగుతుంది (2-7-12,13,14).

2. ఋషులు సంధ్యావందనం చాలాకాలం ఆచరించి, దీర్ఘాయుస్సును, ప్రజ్ఞను, యశస్సును, కీర్తిని, బ్రహ్మవర్చస్సును పొందారట(2-7-14).

3. ప్రాతస్సంధ్య చేత, రాత్రి చేసిన పాపములు అన్నీ నశిస్తాయి. సాయం సంధ్య చేత వరుణుని అనుగ్రహము కలుగుతుంది. ప్రాతస్సంధ్య వలన ఆదిత్యుని అనుగ్రహము కలిగి స్వర్గఫలము లభిస్తుంది.(2-7-21,20,23).

4. గాయత్రీజపం చేసేటప్పుడు-ఓం భూః, ఓం భువః, ఓగ్ంసువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం- అన్న సప్త వ్యాహృతులతోను ఆద్యంతములలో ఓం కారముతోను, గాయత్రీమంత్రమును కనీసం 10 మార్లైనాచేయాలి.(2-7-7).

**ప్రాణాయామము:**

1 ప్రాణాయామమువలన చిన్న చిన్నదోషములు తొలగిపోతాయి. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు, మనస్సుతో చేసిన పాపములు, ప్రాణాయామముతో నశిస్తాయి.(4-1-3,4,5)

2. ప్రాణాయామముచేత మహాపాతకములను కూడా పోగొట్టు కొనవచ్చును.(4-1-8)

3. ప్రాణాయామము ఉత్తమ తపస్సు. దానివలన అంతశ్శరీరము అంతయు పవిత్రము అగుచ్నుది. (4-1-25)

4. సమస్త పాపములను నశింప చేయుటలో ప్రాణాయామమే విశిష్టమైనది (4-1-30).

**వివాహము:** 1. వివాహ విషయంలో దేశకాల ఆచార భేదాలను పాటించాలని బోధాయనుడు చెప్పినాడు.(1-2-3 నుండి 6)

2. ఈనాడు వైద్యులు, పనికి రాదని చెబుతున్న మేనరికమును బోధాయనుడు ఎప్పుడో నిషేధించినాడు.(1-2-7;2-4-10).

3. ధనమిచ్చికొన్న (కన్యాశుల్కం) స్త్రీ భార్యకాదు. -దాసీది(1-21-4).

4. రజస్వల అయిన మూడు సంవత్సరములవరకు కన్య తండ్రి ఆజ్ఞను అనుసరించి అతడు తెచ్చిన వరుని వివాహమాడవలెను. ఆ తరువాత ఆమె స్వతంత్రించి తనకు నచ్చిన వరుని వివాహము చేసుకొనవచ్చును.(4-1-15).

5. మంత్రపూర్వకముగా వివాహము చేసికొని అత్తవారింటికి పోయిన తరువాత ఏదైనా కారణమువలన భర్త చనిపోతే, అక్షతయోనియైన కన్యను తండ్రి తనయింటికి తీసుకొని వచ్చి మారుమనువు చేయవచ్చును(4-1-18).

6. భర్తమీద కోపముతో ఔషధాలతో భ్రూణహత్య చేసిన స్త్రీని ఇంటినించి

వెళ్ళగొట్టాలి.(4-1-22)

**పుత్రసంతతి:** వివాహము యొక్క ప్రధాన ధ్యేయము సత్‌సంతతి.

1. సత్‌పుత్రుని పొందినవాడు, తనకు పూర్వమున్న పదితరములను తరువాత ఉన్న పదితరములను (మొత్తం21 తరములను) ఉత్తమలోకాలకు చేరుస్తాడు(2-16-9).
2. పుత్రసంతానమునకు ఔషధములను వాడవచ్చును.లేదా మంత్రముల సహాయమును పొందవచ్చును(2-16-12)
3. బోధాయనుడు దేవరన్యాయమును అంగీకరించినాడు(2-4-9)కాని తరువాతివాడైన ఆపస్తంబుడు పవిత్రమైన వివాహ వ్యవస్థ చెడిపోకుండుటకు దానిని వ్యతిరేకించుట గమనార్హము.

**సన్యాసము:** మానవ జీవనయానంలోని నాలుగు ఆశ్రమాలలో ఉత్కృష్టమైనది, పరమ పవిత్రమైనది సన్యాసాశ్రమము. పునర్జన్మ లేకుండా చేసేది. అందువలన ఈ ఆశ్రమాన్ని గురించి 40 సూత్రములలో వివరించాడు. బోధాయనుడు (2-17వఖండము)

**భోజనము:**

1. అతిగా భోజనము చేయరాదు (2-12-9)
2. భోజనము చేసేటప్పుడు మాట్లాడరాదు(2-12-5,7)
3. ప్రతిదినము ప్రాణాహుతులవలన సమస్త పాపాలు నశిస్తాయి(2-13-1)
4. నీటిని వడబోసి ఉపయోగించుకోవాలి.(2-11-27)

5. రోజుకు రెండుసార్లు మాత్రంభుజించేవాడు 'సదోపవాసి'(2-13-12). అంటే నిత్యమూ ఉపవసించేవాడితో సమానము. భోజనం అగ్నికార్యం వంటిదని, అగ్నికార్యం పగలు సాయంత్రాలలో రెండు మార్లేచేస్తారు కనక, భోజనం కూడా రెండుసార్లే చెయ్యాలని వేదం నిర్దేశిస్తున్నది. అంతే కాక " ఒకసారితింటే యోగి, రెండు సార్లు తింటే భోగి, మూడుసార్లు తింటే రోగి" అన్న తెలుగు సామెతకూడా ఈవిధినే చెబుతున్నది.

**దాయభాగము:**

1. మనువు తన ఆస్తిని పుత్రులకు విభజించి ఇచ్చాడని వేదంలో చెప్పబడినది. అట్లాగే గృహస్థు కూడా పుత్రులకు తన ఆస్తిని విభజించి ఇవ్వాలి(2-3-3).

2. తల్లి పుట్టింటి ధనము, కుమార్తెకు చెందుతుంది(2-3-44)

**న్యాయ వ్యవస్థ:**

1. ఆనాటి పటిష్ఠమైన న్యాయవ్యవస్థకు అద్దం పట్టేవి, నాటి ధర్మపరిషత్తులు. ఆ పరిషత్‌లో 10 మంది శిష్టులైన సభ్యులు ఉండేవారు(1-1-8).

2. ధర్మనిర్ణయం చేసేటప్పుడు, ఒంటరిగా చేయరాదని బోధాయనుడు శాసించాడు(1-1-13).

3. తప్పు చేసినవారి శరీర ప్రకృతిని బట్టి పాపప్రాయశ్చిత్తం చెప్పాలని చెప్పటం బోధాయనుని మానవతా దృక్పథానికి నిదర్శనం(1-1-15)

**ఇతర విశేషాలు:**

1. వటువు భిక్షను, తమకు నిర్దేశించిన కర్మలను చేసే వారి వద్దనే అడగాలి,(1-3-19).

2. గురువుగారి వద్ద ఉన్నప్పుడు మరొక సాధు పురుషునకు నమస్కరింపదలిస్తే, గురువుగారి అనుజ్ఞ తీసుకోవాలి(1-3-30).

3. ద్విజులు కమండలుధారణ ఎప్పుడూ చేయాలి. కారణం-బ్రహ్మదేవుడు కమండలంతో పుట్టాడు కనుక(1-7-2)

4. దేవతలకు శ్రద్ధతో సమర్పింపరాదు. పవిత్ర పదార్థమైనా (1-10-5).

5. నాభికిపై భాగము పవిత్రమైనది, అధోభాగము అపవిత్రమైనది.(1-10-19)

6. ఋత్విక్కులకు, దీక్షితులకు, బ్రహ్మచారులకు జాతాశౌచమృతా శౌచములు ఉండవు (1-11-1)

7. జున్నుపాలను, చూలుకట్టినప్పటి పాలను తాగరాదు.(1-12-9)

8. మూడు మార్లు పలికితే అదే సత్యమైనమాట అని దేవతలు అనుకుంటారని వేదం చెబుతున్నది(2-17-28).అందుకే మూడుసార్లు చెబితేనే దేవతలు గ్రహిస్తారట(4-2-11).

9. ప్రాయశ్చిత కర్మలలో ఉపయోగించే ధాన్యరాజమైన యవధాన్యము పరమ పవిత్రమైనది(3-6వ ఖండము).

10. కూష్మాండ హోమంవలన దేవలోక ప్రాప్తి కలుగుతుంది(3-7-16) అందువలననే హోమాలలో గుమ్మడికాయను ఉపయోగిస్తారు.

11. విషం పూసిన ఆయుధాలను యుద్ధాలలో ఉపయోగించరాదు(1-18-10)

12. చాలా శాసనాలలో కనిపించే-"న విషం విషమిత్యాహుః, బ్రహ్మస్వం విషముచ్యతే"-అనేది బోధాయన వాక్యమే!(1-11-14)

ఇలాంటి తెలుసుకోవలసిన విషయాలు ఈ బోధాయన ధర్మసూత్రంలో ఎన్నో కనిపిస్తాయి.

ఇన్ని చక్కని విషయాలను చెప్పిన బోధాయనుడు చతుర్థజాతివారి విషయముగ చెప్పిన విషయాలు మాత్రం సమర్థనీయంగాలేవు. అవి-1. బ్రహ్మణ,క్షత్రియ, వైశ్యవర్ణములవారిని సేవించుట శూద్రుని కర్తవ్యము(1-18-5); 2 ద్విజాతి స్త్రీలు కాని, ద్విజాతి వర్ణ పురుషులు కాని, వర్ణేతరులతో అక్రమ సంబంధం పెట్టుకొంటే కృచ్ఛ్రవ్రతాదులను ప్రాయశ్చిత్తంగా విధించిన బోధాయనుడు, శూద్రుడు, పరస్త్రీలతో అక్రమసంబంధం కలిగి ఉంటే గడ్డి గాదెములోవేసి తగులబెట్టాలని చెప్పాడు.(2-3-53).

ఇవి రెండూ బహుశః అనాటి దేశకాల పరిస్థితులను బట్టి చెప్పినవిగా కన్పిస్తుంది. అట్లాగే-"పద్భ్యాగ్ం శూద్రో అజాయత"(1-18-6) అన్న వేదవాక్యం కూడా అనేక వ్యాఖ్యలకు దారి తీసింది. కాని ఇక్కడ శరీర స్థితిగతులకు పాదాలు ప్రధానమైనట్లే, సమాజస్థితి, గతులకు మానవజాతిమనుగడకు వారు కారణభూతులవుతున్నారు. మరొక్క విషయము గురుదేవులు శివ శ్రీకందుకూరి శివానంద మూర్తిగారు చెప్పినట్లు మనము భగవంతునివద్దకు వెళ్లినపుడు భక్తితో నమస్కరించేది పాదాలకే కాని, శిరస్సుకో శరీరానికో కాదు కదా! అందువలన విరాట్పురుషుని పాదాలనుండి పుట్టిన శూద్రులు కూడా వందనీయులని భావము. విష్ణుపాదోద్భవయైన గంగని ఈశ్వరుని శిరస్సునఉంచటమే కాక, త్రిలోకాలను పవిత్రం చేస్తున్నది కదా!

మరొకటి "న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి"(2-3-46)అనేది. స్త్రీ సర్వదా, సర్వథా రక్షణీయ అనే ఆశ్లోక తాత్పర్యం- చిన్నతనంలో తండ్రి,యౌవనంలో భర్త, ముసలితనంలో పుత్రులు రక్షించాలి. అంతే కాని ఆమెను స్వతంత్రంగా వదిలిపెట్టరాదు అనే అర్థంకాని, స్వాతంత్ర్యం ఇవ్వరాదు అని భావము కాదు. ఆమె ఎప్పుడూ ఎవరో ఒకరి రక్షణలోనే ఉండాలి అని గ్రహించాలి. స్త్రీలకు ఎలాంటి స్వాతంత్ర్యం ఇవ్వబడిందో గ్రంథమంతా జాగ్రత్తగా చదివితే విశదమవుతుంది.

గ్రంథాంతలో ఇచ్చిన విశేషపదముల అర్థములు ఎంతో ఉపయుక్తంగా ఉన్నాయి.

ఇంతమంచి గ్రంథాన్ని తిరిగి వెలుగులోకి తెస్తున్న ఆచార్యులవారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

బోధాయనుడే చెప్పినట్లు-ఈ ధర్మ శాస్త్రాన్ని చెప్పిన గురువుకు వేయి బంగారు నాణెములు, పదిగోవులతో పాటు ఒక ఒక వృషభమును గురుదక్షిణగా ఇవ్వాలి(4-4-10). కనుక అయనపడిన శ్రమకు ప్రతిఫలంగా ఈ గ్రంథాన్ని సహృదయతతో చదివి, ఆస్వాదించి, ఆచరించటమే మనం ఇవ్వగల గురుదక్షిణ!

ఆయుష్మాన్ భవ సౌమ్య శ్రీనరసింహాచార్య! చిరంజీవ! సుఖీభవ!

వరంగల్

17-9-2008

– హరి శివకుమార్.

# కృతజ్ఞతాంజలి

మన సనాతన ధర్మం శ్రుతుల్లో గుప్తమైయుంటే దాన్ని విస్పష్టంగా వివరిస్తున్నవి స్మృతులు. ఈ శృతులకు స్మృతులకు మధ్య వారధిగా వేదాంగమైన కల్పసూత్రంలో ఒక భాగంగా కన్పిస్తున్నవే ధర్మసూత్రాలు. ఆ ధర్మసూత్రగ్రంథాలూ ఆయావేదవిభాగాన్ని అనుసరించి భిన్నంగా కన్పిస్తున్నాయి.

యజుర్వేదానికి అందులోనూ కృష్ణయజుర్వేదానికి అంగమైన కల్పసూత్రాన్ని రచించినవారిలో బోధాయనుడు అపస్తంబుడు ప్రధానమైనవారు. భారతీయుల అదృష్టంకొద్ది ఈ ఇద్దరు మహర్షులు రచించిన కల్పసూత్రమంతా నేటికీ లభిస్తున్నది. అంటే శ్రౌత, గృహ్యా, ధర్మ సూత్రాలు సంపూర్ణంగా లభిస్తున్నాయి. అట్లే తెలుగువారు స్వతః ఆపస్తంబసూత్రులైనా కొన్ని కొన్ని కర్మాచరణలో బోధాయన సూత్రాన్ని అనుసరిస్తున్నారనేది జగద్విదితం.

అందువల్లనే హైదరాబాదు దగ్గర ఉన్న కీసర వేదపాఠశాలలోని ప్రముఖ ఆచార్యులు, వైదిక ధర్మాన్ని అనుష్ఠించే విధానాన్ని తమ ప్రవచనములతో మాత్రమే కాక తమ గ్రంథములద్వారా ఇతర విధాలుగా కూడా ప్రచారం చేస్తున్న మాన్యులు బ్ర.శ్రీ. మూర్తి వెంకట్రామ శర్మగారు బోధాయన మహర్షి రచించిన గృహ్యాసూత్ర గ్రంథాన్ని, ధర్మసూత్ర గ్రంథాన్ని నాకిచ్చి తెలుగువారికి అందుబాటులో ఉండేట్లు చేయమని ఆదేశించినారు. ఇతః పూర్వం వారి ప్రేరణవల్ల వచ్చిన ఆపస్తంబ గృహ్యాసూత్రం మూడవ ముద్రణ కోరుకొంటున్నది. అది నా వారి సంకల్ప బలం. అట్లే వారి ప్రేరణ మొదలైన వాటి వల్ల బోధాయన గృహ్యాసూత్ర గ్రంథాన్ని తెలుగులిపిలో ప్రచురించి ప్రస్తుతం బోధాయన ధర్మసూత్ర గ్రంథాన్ని తెలుగువారికి సవినయంగా సమర్పించుకొంటున్నాను.

ఇది తెలుగు తాత్పర్యంతో కలిసి ఉంది. వివరణ వ్యాఖ్యవంటివి పండితులకు ఉపయోగిస్తాయి. సంస్కృతంలో వ్యాఖ్య వ్రాసిన గోవిందస్వామి వంటి పండిత ప్రకాండుల రచనల సహాయం వారికెట్లాగూ ఉండనే ఉంది. మన సనాతన ధర్మం గురించి తద్విశిష్టత గూర్చి తెలుసుకోవాలనే సామాన్య పాఠకులను దృష్టిలో పెట్టుకొని మహర్షియొక్క సూత్రాలకు అతి సంక్షిప్తమైన తాత్పర్యాన్ని ఇచ్చినాను. నామూలం లిఖ్యతే కించిత్ నానపేక్షితముచ్యతే అని మల్లినాథసూరి అన్నట్లు నేను ఎంచుకొన్న పాఠకుని దృష్టిలో పెట్టుకొని రాయడం జరిగింది మధ్య మధ్య నా వ్యాఖ్యలు ఏమీలేవు.

ఐతే పెద్దలతో ఒక చిన్న మనవి. బోధాయన ధర్మసూత్రం ప్రశ్నలుగా అధ్యాయాలుగా, ఆ తరువాత ఖండాలుగా సూత్రాలుగా విడగొట్టబడింది. అధ్యాయ ప్రయోజనం సామాన్యునికి లేనందువల్ల ప్రశ్న, ఖండములను మాత్రమే తీసికొని గ్రంథం పై భాగాన 1-1, 1-2 అంటూ సూచించడం జరిగింది.

ఇక ఈ గ్రంథాన్ని అనువదించి శ్రీవారి శుభాశీస్సులకై శృంగేరికి పంపిస్తే నేను వారిని దర్శించుకోక పోయినా, ధర్మంపై గల అభిమానంతో పరమ పూజ్యులు తాము అనుగ్రహించుటే కాక ఆ పరమేశ్వరి అనుగ్రహాన్ని నాకు ప్రసాదించినారు. సామాన్యునికి ఇంతకంటె కావాల్సిన మహద్భాగ్యమేముంటుంది.

అందువల్ల పరమపూజ్యులు, జగద్గురువులు శారదాపీఠాధిష్ఠితులు

**శ్రీశ్రీశ్రీ స్వామి వారికి**

వినయంతో సాష్టాంగ ప్రణామములు సమర్పించు కొంటున్నాను.

పుస్తక రచన ఒక ఎత్తైతే పుస్తకం ముద్రించుకోవడం అష్టకష్టాల్లో ఒకటి కాబోలు. ధార్మిక గ్రంథాల విషయం మరీ ఇబ్బందికరం. చదివేవాడు కరువు. చదివేవాడికి గ్రంథం కరువు. ఇటువంటి స్థితిలో ప్రాచీనమైన ఈ ధార్మిక గ్రంథ ప్రచురణకై యథోచితంగా **శ్రీ తిరుపతి వెంకటేశ్వర స్వామి** అనుగ్రహరూపంగా ఆర్థిక సహాయం చేసిన తిరుమల తిరుపతి దేవస్థానములు ఇ.ఓ. శ్రీమాన్ కే.వి. **రమణాచార్యుల గారికి, సప్తగిరి ప్రధాన సంపాదకులకు, కృతజ్ఞతాపూర్వక నమోవాకములు** అట్లే బ్ర.శ్రీ మార్తి వెంకట్రామ శర్మ గారి ప్రేరణవల్ల నేనెవరినో నా వ్యాసంగమేమిటో తెలియకపోయినా సనాతన ధర్మం పైనున్న ఆదరాభిమానాల వల్ల అటు బోధాయన గృహ్యసూత్రాన్ని ఇటు బోధాయన ధర్మ సూత్రాన్ని ప్రచురించుటకు వారి పితృ దేవుల స్మృతి చిహ్నంగా సహాయం చేసిన వైదిక ధర్మ నిరతులు, సహృదయులు, ఉదారులు, సత్యం కంప్యూటర్స్ సి.ఎఫ్ ఓ. **శ్రీ వడ్లమాని శ్రీనివాస్ గారికి వారి ధర్మపత్ని శ్రీమతి లలితా పరమేశ్వరిగారికి, వారి కుటుంబానికి**

పద్మావతీ సమేత శ్రీవేంకటేశ్వరస్వామి కృపాకటాక్షము, వారి గురువుగారి అనుగ్రహము సదా సంపన్నం కావాలని ప్రార్థిస్తున్నాను.

ఇంతకు ముందు పేర్కొన్నట్లు బోధాయసూత్రం తెలుగువారికి పరిచయం చేయించినవారు మాన్యులు బ్ర.శ్రీ **మార్తి వెంకట్రామ శర్మగారు** వారు కీసరగుట్ట వేదపాఠశాలలో ఉండి అనేక విద్యార్థులకు స్మార్త విద్యను బోధిస్తున్నారు. విద్యార్థులకు వైదికాభిమానులకు ఉపయుక్తంగా అనేక వైదిక గ్రంథాలు రచించి లోకోపకారం చేస్తున్నారు. సనాతన ధర్మ ప్రచారకులు కూడా, అందువల్లనే తమ గ్రంథాన్ని నాచేతికిచ్చి అనువాదం చేయమని ప్రేరేపించడం మాత్రమే గాక ఈ గ్రంథ ప్రచురణలో కూడా మాధ్యస్థ్యం వహించి తోడ్పడినారు.

**అట్టి మాన్యులు బ్ర.శ్రీ. మార్తి వెంకట్రామశర్మ గారికి**

హైదరాబాదులో ఉన్న సీతారాంబాగ్ వేదాంత వర్ధినీ సంస్కృత కళాశాలలో ఉ.వే.ప్ర.కో.కం.అ. శఠగోపరామానుజాచార్యుల వారి వంటి దిగ్దంతి పండితుల వద్ద

తర్క విద్యను ప్రాచీన పద్ధతిలో అధ్యయనం చేసి, స్వయం కృషితో ఉస్మానియా విశ్వవిద్యాలయం సంస్కృతశాఖలో ఆచార్యులు, ప్రాచార్యులుగా చాలాకాలం పనిచేసినా సతీర్థుడనైన నాపై, సనాతన ధర్మం పైనున్న ఆదరాభిమానాలతో 'రోచని' అనే పేరుతో గోవిందస్వామి వ్యాఖ్యలో ఉండే అనేక విశేషాలతో విపులమైన పరిచయాన్ని అందిస్తూ, సూచనలు కూడ ఆత్మీయభావనతో ఇచ్చిన

**శ్రీమాన్ ఆచార్య బూరుగడ్డ నరసింహాచార్యులు గారికి**

కాకతీయ విశ్వవిద్యాలయంలో నేను ఎం.ఫిల్ చేస్తున్నప్పుడు అప్పుడే వారి పరిచయం జరిగింది. అప్పుడు విద్యామార్గనిర్దేశకులు. (గైడ్) కాని ఆ పరిచయం ఆత్మీయంగా మారి అనువదించిన మనుస్మృతి, ఆశ్వలాయన గృహ్యాసూత్రాలకు విపులమైన పీఠికనందించే వరకు పోయింది. ప్రస్తుతమూ అదే ఆదరంతో ఈ గ్రంథానికీ సుదీర్ఘమైన పరిచయ రూపమైన శ్రీముఖాన్ని (ఆముఖాన్ని) తెలుగు పాఠకులకు అందిస్తూ నన్ను ఆశీర్వదించిన గురుమూర్తులు బ్ర.శ్రీ. **ఆచార్య హరిశివకుమార్ గారికి** కృతజ్ఞతా పూర్వక అనేక నమోవాకములు

ఇక పుస్తకం రాయడం ఒక ఎత్తైతే పుస్తకం ముద్రించడం ఒక ఎత్తు. నేడిది ఒక కళగా అందంగా మారింది. పాఠకుని ఆకట్టుకొనేటట్లు ముద్రించడం సాధరణ విషయం కాదు. ఎంతో అనుభవం ఓపిక ఉండాలి. ప్రధానంగా డి.టి.పి. విషయలో ఇది ఎంతో అవసరం. దీనిలో నాకు ఎన్నో విషయాలు చెప్తూ ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించిన దీప్తి టెక్నికలర్ ప్రింటర్స్ గాంధీనగర్ హైదరాబాద్ అధినేత

బ్ర.శ్రీ **కౌండిన్య శాస్త్రి గారికి, వారి సిబ్బందికి**

కృతజ్ఞతాపూర్వక అభివందనములు.

ఈ పుస్తకాన్ని అనువదింపమని బ్ర.శ్రీ. మార్తి వెంకట్రామ శర్మగారు నాకు ఇచ్చినప్పుడు, ఆ తరువాతి సమయాల్లోనూ వారికి, నాకు, వారధిగా నిలిచి అన్ని విధాలా సహకరించిన కీసర వేదపాఠశాలలో స్మార్తాధ్యాపకులు **చి.ముడుంబై దామోదరాచార్యులకు**, నా రచనావ్యాసంగానికి సర్వదా, సర్వథా తోడ్పడుతున్న నా ధర్మపత్ని **శ్రీమతి రంగనాయకమ్మకు**

**శుభాశీస్సులు.**

# మా ఇతర ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | కాకతీయ శాసనాలు - ఆంధ్రభాషాపరిశీలనము (సిద్ధాంత వ్యాసము) | అలభ్యం |
| 2. | బెజ్జంకి దేవాలయ శిల్పవిశేషాలు | అలభ్యం |
| 3. | మనుస్మృతి - తెలుగు తాత్పర్యంతో | అలభ్యం |
| 4. | పరాశరస్మృతి - తెలుగు తాత్పర్యంతో | రూ. 50/- |
| 5. | ఆపస్తంబ ధర్మసూత్రము - తెలుగు తాత్పర్యంతో | రూ. 80/- |
| 6. | ఆపస్తంబ గృహ్యాసూత్రము - తెలుగు తాత్పర్యంతో | త్వరలో.. |
| 7. | ఆశ్వలాయన గృహ్యాసూత్రము - తెలుగు తాత్పర్యంతో | రూ. 100/- |
| 8. | శ్రీసుదర్శన శతకము - మూలము | రూ. 5/- |
| 9. | శ్రీమద్భాగవతము రెండు సంపుటములు - మూలము | రూ. 200/- (తగ్గింపు వెల) |
| 10. | శ్రీహయగ్రీవ స్తోత్రము - మూలము | రూ. 3/- |
| 11. | శ్రీలక్ష్మీ నృసింహ కరావలంబస్తోత్రం - మూలము | రూ. 3/- |
| 12. | శ్రీమద్వాల్మీకి రామాయణము - మూలము (6 సంపుటములు) | రూ. 300/- |
| 13. | శ్రీ పాంచరాత్రాగమోక్త భగవదారాధన విధిః - తెలుగు తాత్పర్యంతో | రూ. 100/- |
| 14. | బోధాయన గృహ్యాసూత్రము | రూ. 150/- |

ప్రతులకు : **శ్రీమతి ఎన్. రంగనాయకమ్మ గారు**

7-1-110, రెడ్డి ఎన్‌క్లేవ్, దేవుని అలవాల, హైదరాబాద్ - 10

ఫోన్ : 9247355355, 9704168678

# విషయానుక్రమణిక

శ్రీ యాదగిరి లక్ష్మీ నృసింహ పరబ్రహ్మణే నమః

శ్రీమతే రామానుజాయ నమః

# బోధాయన ధర్మసూత్రము

## అథ ప్రథమ ప్రశ్నః

### అథ ప్రథమః ఖండః

**ఉపదిష్టో ధర్మః ప్రతివేదమ్॥** 1

ధర్మము అన్ని వేదములందు, ఆయా వేదశాఖలన్నిటిలోను చక్కగా చెప్పబడింది.

**తస్యానువ్యాఖ్యాస్యామః॥** 2

ఆయా వేదములందు ప్రతిపాదింపబడ్డ ధర్మముననుసరించి ప్రస్తుతము ధర్మమునకు వ్యాఖ్యానము చేయుచున్నాము.

**స్మార్తో ద్వితీయః॥** 3

వేదప్రతిపాదిత ధర్మము తర్వాత స్మృతి ప్రతిపాదితమైన ధర్మము రెండవ స్థానమున ఉండును.

**తృతీయః శిష్టాగమః॥** 4

పెద్దలు (శిష్టులు) ఆచరించిన ధర్మము మూడవ స్థానమునకు వచ్చును. అనగా వేదమందు చెప్పబడిన ధర్మమునకు తొలి ప్రాధాన్యమునిచ్చి స్మృతి ప్రతిపాదిత ధర్మమునకు, శిష్టాచారమునకు తరువాతి ప్రాధాన్యము నీయవలెను. ఈ విషయమునే మనుస్మృతి (వేదోఽఖిలం ధర్మ మూలం స్మృతి శీలే చ తద్విదామ్ 1-6) తెల్పుచున్నది. ఆపస్తంబ ధర్మ సూత్రమున చెప్పిన ధర్మజ్ఞ సమయః ప్రమాణం వేదాశ్చ అను సూత్రములకు ధర్మజ్ఞులైన పెద్దల మాటలు వేదములు కూడా అను అర్థమును చెప్పుట కంటె ఆ గ్రంథములోనే మరియొక చోట చెప్పిన "బ్రాహ్మణోక్తా విధయస్తేషాముత్సన్నాః పాఠాః ప్రయోగాదనుమీయంతే" 1-12-10 మొదలైన సూత్రములననుసరించి వేదప్రామాణ్యము లభింపని చోట మాత్రమే పెద్దల ఆచారమును ప్రమాణముగా తీసుకొనుట సరియైనది.

శిష్టులనగా

శిష్టాః ఖలు విగతమత్సరాః నిరహంకారాః కుంభీధాన్యాః

అలోలుపాః దంభ దర్ప లోభ మోహ క్రోధ వర్జితాః॥ 5

అసూయ, అహంకారము, ఆశ, ఆడంబరము గర్వము, లోభము, వ్యామోహము, కోపము లేక ధనధాన్యములను ఎక్కువగా కూడబెట్టని వారే శిష్టులు. కుంభీధాన్యులనగా పదిరోజులకు మాత్రము సరిపడు ధాన్యమును కుండలో నిలువ చేసికొనువారు.1 తరువాత యాచన మొదలగు వాటిచే ఇంకొక పది రోజులకు మాత్రము సరిపడు ఆహార పదార్థములను నిలవ చేసికొనవచ్చును.

ధర్మేణాధిగతో యేషాం వేదస్స పరిబృంహణః।

శిష్టాస్తదనుమానజ్ఞాః శ్రుతి ప్రత్యక్ష హేతవః॥ 6

ఇతిహాస పురాణములు ధర్మశాస్త్రములు మొదలైన వాటితో కలిసి వేదమును అర్థ సహితముగా చక్కగా అధ్యయనము చేసి ధర్మము తెలిసికొన్న వారు శిష్టులు, వారు వేదప్రతిపాదితమైన్న ధర్మాన్ని తెలిపెదరు. లేనిచో వేద ప్రమాణమును అనుసరించి చేసికొని ధర్మమును ఊహించి చెప్పెదరు.

తదభావే దశావరా పరిషత్॥ 7

పైన పేర్కొన్నట్లు ఉండే శిష్టులు లభించని సమయంలో పదిమందికి తక్కువ కాకుండా ఉండే ధర్మ పరిషత్తును అడిగి ధర్మము తెలిసికొనవలెను.

అథాప్యుదాహరంతి

చాతుర్వైద్యం వికల్పీ చ అంగవిద్ధర్మ పాఠకః।

ఆశ్రమస్థాస్త్రయో విప్రాః పర్షదేషా దశావరా॥ 8

తమ తమ వేదములను (ఋక్, యజుస్, సామ, అథర్వ వేదములను) చక్కగా

---

1.తన కుటుంబమును పోషించుటకు ఆరుదినములుమాత్రము సరిపడు ధాన్యమును నిలువచేసికొనువాడు కుంభీధాన్యుడని విజ్ఞానేశ్వరుడు గోవిందరాజు పేర్కొనగా,మనుస్మృతిని(4-7) వ్యాఖ్యానిస్తూ మేధాతిథి ఆరు మాసములకు సరిపడు ధాన్యమును నిలువజేయువాడని, కుల్లూకకభట్టు సంవత్సరమునకు సరిపడు ధాన్యమును నిలువ జేసికొనువాడని పేర్కొనెను.

అర్థజ్ఞానముతో అధ్యయనము చేసినవారు నలుగురు, మీమాంసా శాస్త్రమును అధ్యయనము చేసినవాడొక్కడు, వేదాంగములైన శిక్ష, వ్యాకరణాదులను అధ్యయనము చేసినవాడొక్కడు, ధర్మ శాస్త్రమును చక్కగా అధ్యయనము చేసినవాడొక్కడు, నైష్ఠిక బ్రహ్మచారి, గృహస్థు, సన్యాసి అను ముగ్గురు కలిసినచో ఈ ధర్మ పరిషత్తు ఏర్పడును. ఇచ్చట వాన ప్రస్థాశ్రమమున ఉండువాడు అడవిలో నివసించుచున్నందు వలన అతనిని ధర్మ పరిషత్తులో చేర్చుకొనుటకు వీలుపడదని గోవిందస్వామి పేర్కొనెను. కాని మనుస్మృతి కర్త తొలి మూడు ఆశ్రమములందున్న వారు మాత్రమే ధర్మ పరిషత్తులో ఉండవలెనని పేర్కొనెను. త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యా దశావరా॥ 12-111

**అథానుకల్పమాహ : -**

**పంచ వా స్యుస్త్రయో వా స్యురేకో వా స్యాదనిందితః।**
**ప్రతివక్తా తు ధర్మస్య నేతరే తు సహస్రశః॥** 9

లేక ధర్మ పరిషత్తులో ఐదుగురు లేక ముగ్గురు సభ్యులైనా ఉండవచ్చును. అది కూడా వీలు పడనిచో దోషములు లేని ఒక్కడైనా ధర్మ బోధ చేయవచ్చును. కాని దుష్టులు వేలమంది ఉన్నను ధర్మ పరిషత్తులో సభ్యులు కాకూడదు. యాజ్ఞవల్క్య స్మృతి1 కూడా (1-9) ఇదే విషయమును చెప్పుచున్నది. మనుస్మృతి2 (12వ అధ్యాయములో 111-113 శ్లో) ఇదే విషయమును తెల్పుచున్నది.

- - - - - - - - - - - - - -

1. చత్వారో వేదధర్మజ్ఞాః పర్షత్ త్రైవిద్యమేవ వా
   సా బ్రూతే యం స ధర్మస్స్యాదేకో వాఽధ్యాత్మవిత్తమః॥ యాజ్ఞవల్క్య స్మృతి
2. త్రైవిద్యో హేతుకస్తర్కీ నైరుక్తో ధర్మపాఠకః।
   త్రయశ్చాశ్రమిణః పూర్వే పరిషత్స్యా దశావరా॥
   ఋగ్వేదవిద్యజుర్విచ్చ సామవేదవిదేవ చ।
   త్ర్యవరా పరిషద్ జ్ఞేయః ధర్మ సంశయ నిర్ణయే॥
   ఏకోఽపి వేదవిద్ధర్మం యం వ్యవస్యేద్ ద్విజోత్తమః।
   స విజ్ఞేయః పరో ధర్మో నాజ్ఞానాముదితోఽయుతైః॥ మనుస్మృతి

**అవ్రతానామమంత్రాణాం జాతిమాత్రోపజీవినామ్।**
**సహస్రశస్సమేతానాం పరిషత్త్వం న విద్యతే ॥** 10

ఎట్టి వ్రతములనాచరింపక, వేదమంత్రములేవియు నేర్వక కేవలము తమ జాతి పేరుతో బ్రదుకుచున్నవారు వేయిమంది ఉన్నా ధర్మ పరిషత్తులో వారికి సభ్యత్వముండదు.

**యథా దారుమయో హస్తీ యథా చర్మమయో మృగః।**
**బ్రాహ్మణశ్చానధీయానః త్రయస్తే నామధారకాః॥** 11

కఱ్ఱ ఏనుగు, తోలు తోనున్న లేడి (ప్రాణము లేనిది) వేదాధ్యయనము చేయని బ్రాహ్మణుడు ఈ ముగ్గురు పేరునకు మాత్రమున్నవారు. వీరితో ఎట్టి ప్రయోజనము లేదు

**యద్వదంతి తమోమూఢాః మూర్ఖా ధర్మమజానతః।**
**తత్పాపం శతధా భూత్వా వక్తౄన్ సమధిగచ్ఛతి॥** 12

అజ్ఞానమనే చీకటిచే ఆవరింపబడి ధర్మము తెలియని మూర్ఖులు ధర్మ పరిషత్తులో ఉండి ధర్మ నిర్ణయము చేయుచు దండన మొదలైన ప్రాయశ్చిత్తమును తెలిపినచో, దండనార్హులైన దుష్టులు చేసిన పాపము వందరెట్లు పెరిగి అది ధర్మ నిర్ణయము చేసినవారికే చెందును కావున ధర్మజ్ఞానములేక ధర్మ నిర్ణయము చేయరాదు.

**బహుద్వారస్య ధర్మస్య సూక్ష్మా దురనుగా గతిః।**
**తస్మాన్న వాచ్యో హ్యేకేన బహుజ్ఞేనాపి సంశయే॥** 13

ధర్మమును శ్రుతి స్మృతి సదాచారములనాధారముగా చేసికొని నిర్ణయింప వలెను కావున ధర్మము బహుద్వారమైయుండును. అట్లే ధర్మ నిర్ణయము చాలా కఠినమైనది మిక్కిలి సూక్ష్మము కూడా. కావున ధర్మసంశయమేర్పడినప్పుడు బాగుగా చదువుకొన్నా ఒంటరిగా ఎవ్వరును ధర్మ నిర్ణయమును చెప్పరాదు.

**ధర్మశాస్త్ర రథారూఢా వేదఖడ్గధరా ద్విజాః।**
**క్రీడార్థమపి యద్బ్రూయుః స ధర్మః పరమః స్మృతః॥** 14

వేదమను ఖడ్గము ధరించి ధర్మశాస్త్రమను రథమును అధిరోహించిన ద్విజులు ( సద్జ్ఞానముకలవారు)ఏది చెప్పినా అది పరమ ధర్మముగానే గుర్తింపవలెను.

**యథాశ్మని స్థితం తోయం మారుతోఽర్కః ప్రణాశయేత్।**
**తద్వత్కర్తరి యత్పాపం జలవత్ సంప్రలీయతే॥** 15

బండపైనున్న నీటిని వాయువు మరియు సూర్యుడు పోగొట్టినట్లు ధర్మమును (పాప ప్రాయశ్చిత్తమును) చక్కగా చెప్పినచో ఆ పాపము పటాపంచలగును.

**శరీరం బలమాయుశ్చ వయః కాలం చ కర్మ చ।**
**సమీక్ష్య ధర్మవిద్ బుద్ధ్యా ప్రాయశ్చిత్తాని నిర్దిశేత్॥** 16

తప్పు చేసినవారియొక్క శరీరప్రకృతిని, వారిబలమును, వారి ఆయుస్సును, వారు తప్పు చేసిన కాలమును, వారు చేసిన తప్పును వీటినన్నిటిని జాగ్రత్తగా గమనించి ధర్మవేత్త వివేకముతో పాపప్రాయశ్చిత్తమును తెలుపవలెను.

ఇతి ప్రథమః ఖండః

అథ ద్వితీయః ఖండః

**పంచధా విప్రతిపత్తిః దక్షిణతస్తథోత్తరతః॥** 1

దక్షిణ దేశమునకు ఉత్తరదేశమునకు చెందిన శిష్టాచారములందు ఐదు విధములైన భేదములు ప్రధానముగా ఉన్నవి. దక్షిణదేశమనగా నర్మదా నదికి దక్షిణముగా కన్యాకుమారికి ఉత్తరముగా ఉండు ప్రదేశము. అట్లే ఉత్తర దేశమనగా వింధ్య పర్వతమునకు ఉత్తరముగా, హిమాలయములకు దక్షిణముగా ఉండు ప్రదేశము.

**యాని దక్షిణతస్తాని వ్యాఖ్యాస్యామః॥** 2

దక్షిణ దేశమునకు చెందిన శిష్టాచారములను తొలుత వివరింతును.

**యథైతదనుపేతేన సహ భోజనం స్త్రియా సహ భోజనం పర్యుషిత భోజనం మాతుల పితృష్వసృ దుహితృ గమనమ్॥** 3

ఉపనయనము కాని వానితో కలసి భుజించుట, స్త్రీతో కలసి భుజించుట, చద్ది అన్నము తినుట, మేనమామ కూతురును వివాహమాడుట, మేనత్త కూతురును వివాహమాడుట అనునవి దాక్షిణాత్యుల ప్రధానాచారములు.

**అధోత్తరతః ఊర్ణావిక్రయః శీధుపానముభయతో దద్భిః వ్యవహారః ఆయుధీయకం సముద్రసంయానమితి॥** 4

ఊలును అమ్ముట, మద్యమును త్రాగుట, రెండుదౌడలకు పండ్లున్న జంతువులనమ్ముట, ఆయుధములు కలిగి ఉండుట, సముద్ర ప్రయాణము అనునవి ఔత్తరాహికుల ప్రధానాచారములు.

**ఇతరదితరస్మిన్ కుర్వన్ దుష్యతి ఇతరదితరస్మిన్॥** 5

దాక్షిణాత్యుల ఆచారమును ఔత్తరాహికులు, ఔత్తరాహికుల యొక్క ఆచారమును దాక్షిణాత్యులు చేయుట దోషము.

**తత్ర తత్ర దేశప్రామాణ్యమేవ స్యాత్॥** 6

ఆయా ఆచారములందు ఆయా దేశమునే ప్రమాణముగా గ్రహింపవలెను.

**మిథ్యైతదితి గౌతమః॥** 7

ఆయా దేశాచారములను ప్రమాణముగా తీసుకొనుట అసంబద్ధమైనదని గౌతముడను స్మృతికారుడు పేర్కొనెను. దేశజాతి కులధర్మాశ్చా మ్నాయైరవిరుద్ధాః ప్రమాణమ్ (వేదము చెప్పిన ధర్మములకు విరుద్ధము కాని దేశ, జాతి, కులధర్మాలను మాత్రమే తీసుకొనవలెను) అని గౌతముడు పేర్కొనెను. గృత్స్నమదుడను స్మృతికారుడు ఉపనయనము కానివానితో భోజనము చేసినచో పన్నెండు దినములు, ఉచ్ఛిష్ట భోజనము చేసినచో ఇరువది నాలుగు దినములు ప్రాయశ్చిత్తము చేసికొనవలెనని అనెను. 1 అట్లే స్త్రీతో కలసి భోజనము చేసినచో మూడు దినములు ఉపవాసముండి తరువాత ఘృతప్రాశన చేయవలెనని పేర్కొనెను. 2 చద్ది అన్నము తిన్నచో ఒక దినమంతయు ఉపవాసము చేయవలెనని సంవర్తుడను ముని పేర్కొనెను. 3 అట్లే మేనమామ కూతురు, మేనత్త కూతురు వంటి వారిని వివాహ మాడినచో చాంద్రాయణ వ్రతమును ప్రాయశ్చిత్తముగా చేసికొనవలెనని చాలామంది

---

1. "అనుపనీతేన సహ భోజనే ద్వాదశరాత్రముచ్ఛిష్ట భోజనే ద్విగుణమ్"
2. "స్త్రియా సహ భోజనే త్రిరాత్రోపవాసో ఘృతప్రాశనం చేతి"
3. "పర్యుషిత భోజనే అహోరాత్రోపవాసః"

ఆచార్యులు పేర్కొనుచున్నారు. బ్రాహ్మణుడు ఎప్పుడు కూడా మద్యమును సేవింపరాదని గౌతమ మహర్షి తెల్పెను.1 అట్లే రెండు దౌడలకు పండ్లున్న జంతువులను ఉప్పును అమ్మరాదని2 అదేవిధముగా బ్రాహ్మణుడు పరీక్షించుటకైనా ఆయుధమును పట్టరాదని తెలిపెను.3 బోధాయన మహర్షియే సముద్ర ప్రయాణము పాపమనెను.4

**ఉభయం చైవ నాద్రియేత॥** 8

రెండు ప్రాంతములకు చెందిన పై శిష్టాచారములను ఆదరింప కూడదు.

**శిష్టస్మృతి విరోధ దర్శనాత్ శిష్టాగమ విరోధ దర్శనాచ్చ॥** 9

పైన పేర్కొన్న ఆచారములు మనువు మొదలైన శిష్టుల స్మృతులకు, శిష్టాగమములకు విరుద్ధముగా కనిపించుచున్నందువలన వాటిని ఆదరింపనక్కరలేదు.

**ప్రాగదర్శనాత్ ప్రత్యక్కాలకవనాత్ దక్షిణేన హిమవంతం ఉదక్పారి యాత్రం ఏతదార్యావర్తం తస్మిన్ య ఆచారస్స ప్రమాణమ్॥** 10

కనపడకుండా ఉన్న సరస్వతీ నదికి తూర్పునుండి, కాలకవనమను పర్వతమునకు పడమరవరకు, హిమాలయ పర్వతములకు దక్షిణమున పారియాత్ర పర్వతమునకు ఉత్తరముననున్న భూభాగమును ఆర్యావర్తమందురు. అచ్చట అనుష్ఠింపబడుచున్న ఆచారమే ప్రమాణమైనది. మనువు పూర్వ పశ్చిమ సముద్రముల మధ్యనున్న భూభాగము ఆర్యావర్తమనెను.5

**గంగాయమునయోరంతరమిత్యేకే॥** 11

కొందరు గంగా యమునల మధ్యనున్న భూభాగము ఆర్యావర్తమని అందురు.

---

1. "నిత్యం మద్యమపేయం బ్రాహ్మణస్య"
2. "అశ్వ లవణమపణ్యమ్"
3. "పరీక్షార్థోఽపి బ్రాహ్మణ ఆయుధం నాదదీత"
4. సముద్ర సంయానమ్.............2-1-2-2
5. ఆ సముద్రాత్తు వై పూర్వాత్ ఆ సముద్రాత్తు పశ్చిమాత్। తయోరేవాంతరం గిర్యోః ఆర్యావర్తం విదుర్బుధాః 2-22.

**అథాప్యత్ర భాల్లవినో గాథాముదాహరంతి॥** 12

సామవేదశాఖకు చెందిన భాల్లవులు పై విషయమున ఒక శ్లోకమును ప్రమాణముగా చూపించుచున్నారు. గాథ అనునది ఒక ప్రత్యేక ఛందస్సుకు సంబంధించిన శ్లోకము.

**పశ్చాత్సింధుర్విసరిణీ సూర్యస్యోదయనం పురః।**
**యావత్ కృష్ణో విధావతి తావద్ధి బ్రహ్మవర్చసమితి॥** 13

విసరిణీయనగా అంతర్ధానమైన నదియని అర్థము.పశ్చిమ భాగమున అంతర్ధానమైన సరస్వతీ నది ,తూర్పున సూర్యుడు ఉదయించు స్థానము , కృష్ణ మృగము (నల్లని జింక) తిరుగుచుండు ప్రదేశముననే వేదాధ్యయనానుష్ఠానాదుల వల్ల బ్రహ్మతేజస్సు కలుగును.

**అవంతయోంఽగ మగధాః సురాష్ట్రా దక్షిణాపథాః।**
**ఉపావృత్సింధు సౌవీరా ఏతే సంకీర్ణయోనయః॥** 14

అవంతి, అంగ, మగధ, సౌరాష్ట్ర, దక్షిణాపథము, ఉపావృత్, సింధు సౌవీర దేశములందుండు వారు సంకీర్ణజాతులు.

**ఆరట్టాన్ కారస్కరాన్ పుండ్రాన్ సౌవీరాన్ వంగాన్ కలింగాన్**
**ప్రానూనానితి చ గత్వా పునస్తోమేన యజేత సర్వపృష్ఠయా వా॥ 15**

ఆరట్టదేశము, కారస్కరదేశము,పుండ్రదేశము, సౌవీర దేశము, వంగదేశము, కళిందేశము, ప్రానూనదేశములకు పోయినవారు పునస్తోమమను యాగమును[1]. లేక సర్వపృష్ఠాయను ఇష్టిని [2]. ప్రాయశ్చిత్తముగా చేసికొనవలెను. అనగా ఈ ప్రదేశములకు పోయినచో పాపము కలుగును.

---

1. ఇది ఒక దినమున చేయు సోమయాగము

2. బృహత్, రథంతర, వైరూప, వైరాజ, శాక్వర, రైవతములను ఆరు సామమంత్రములు పృష్ఠయనే స్తోత్రమునకు సాధనములుగా ఉండును.

అథాప్యుదాహరంతి : -

పద్భ్యాం స కురుతే పాపం యః కలింగాన్ ప్రపద్యతే।
ఋషయో నిష్కృతిం తస్య ప్రాహుర్వైశ్వానరం హవిః॥ 16

కళింగ దేశమునకు పోయినచో వైశ్వానరేష్టినైనా ప్రాయశ్చిత్తముగా చేసికొనవలెనని మునులు పేర్కొనుచున్నారు. ఇది మరియొక ప్రాయశ్చిత్తము.

బహూనామపి దోషాణాం కృతానాం దోషనిర్ణయే।
పవిత్రేష్టిం ప్రశంసంతి సా హి పావనముత్తమమ్॥ 17

అనేక పాపములు చేసినప్పటికీ ఆ పాపములు పూర్తిగా తొలగించుకొనుటకు పవిత్రేష్టిని 1 చేయవలెనని ఆ ఇష్టి పరమ పవిత్రమైనదని పెద్దలందురు.

వైశ్వానరీం వ్రాతపతీం పవిత్రేష్టిం తథైవ చ।
ఋతావృతౌ ప్రయుంజానః పాపేభ్యో విప్రముచ్యతే।
పాపేభ్యో విప్రముచ్యతే ఇతి ॥ 18

వైశ్వానరేష్టిని, వ్రాతపతేష్టిని, పవిత్రేష్టిని ఆయా కాలములందు చేసినచో సమస్త పాపములు తొలగిపోవును.

ఇచ్చట అధ్యాయపరిసమాప్తిని సూచించుటకు పాపేభ్యో విప్రముచ్యతే అనునది రెండు పర్యాయములు ఉపయోగింపబడినది. ఈ పద్ధతి వేదమున కూడా కనిపించుచున్నది.

ఇతి ద్వితీయః ఖండః

- - - - - - - - - - - - - - -

1 అజ్ఞానముచే చేయు పాపములను తొలగించుకొనుటకు యజ్ఞములందు దీనిని చేయుదురు.

అథ తృతీయః ఖండః

**అష్టాచత్వారింశద్వర్షాణి పౌరాణం వేదబ్రహ్మచర్యమ్ ॥** 1

వేదాధ్యయనము చేయుటకై నలుబది ఎనిమిది సంవత్సరములు బ్రహ్మచర్య వ్రతమునాచరింపవలెనని మన్వాది పూర్వీకులచేత చెప్పబడినది.

**చతుర్వింశతిం ద్వాదశ వా ప్రతివేదమ్॥** 2

లేక ఒక్కొక్క వేదమును నేర్చుకొనుటకు ఇరువది నాలుగు లేక పన్నెండు సంవత్సరముల బ్రహ్మచర్యవ్రతమును అవలంబింపవలెను.

**సంవత్సరావమం ప్రతికాండమ్ ॥** 3

ప్రాజాపత్య, సౌమ్య, ఆగ్నేయ, వైశ్వదేవ, స్వాయంభువములను ఐదు కాండలలో ప్రతికాండను నేర్చుకొనుటకు ఒక సంవత్సరమైనా బ్రహ్మచర్యవ్రతమునుచక్కగా అనుష్ఠింపవలెను.

**గ్రహణాంతం వా ॥** 4

లేక ఆ వేదమును పూర్తిగా నేర్చుకొనువరకైనా బ్రహ్మచర్య వ్రతమును అవలంబిపవలెను. ఇచ్చట వేదాధ్యయనమనగా వేదమును కేవలము వల్లె వేయుట కాక అర్థసహితముగా వేదమునభ్యసించుట అని తెలియవలెను.

**జీవితస్యాస్థిరత్వాత్॥** 5

ఎంత వరకు మానవుడు జీవించునో తెలియదు కావున వేదమునంతయు నేర్చుకొనువరకు బ్రహ్మచారిగా ఉండవలెను.

**కృష్ణకేశోఽగ్నీనాదధీతేతి శ్రుతిః॥** 6

తలవెంట్రుకలు నల్లగా ఉన్నప్పుడే అగ్న్యాధానము చేయవలెనని వేదములు చెప్పుచున్నవి. ఈ అగ్న్యాధాన కర్మను వేదమును అభ్యసించుచు నిర్వహించెదరు. కావున ఆ సమయముననే వేదమునధ్యయనము చేయవలెను.

**నాస్య కర్మ నియచ్ఛంతి కించిదామౌంజి బంధనాత్।**
**వృత్త్యా శూద్రసమో హ్యేష యావద్వేదేషు జాయతే॥** 7

మౌంజి బంధనము చేయు వరకు (ఉపనయనము వరకు) బాలుడు ఎట్టి ధర్మకార్యములు చేయుటకు వీలులేదని పెద్దలందరు. వేదాధ్యయనము

(ఉపనయనము) వలన ఆ బాలునికి పునర్జన్మ లభించును. అంతవరకు అతడు శూద్రునితో సమానుడు.

**గర్భాదిసంఖ్యా వర్షాణాం తదష్టమేషు బ్రాహ్మణముపనయేత్॥** 8

ఉపనయనమునకు తగిన కాలమును తల్లి కడుపులో పడినప్పటి నుండి లెక్కింతురు. కావున గర్భాష్టమమున బ్రాహ్మణ కుమారునకు ఉపనయనము చేయవలెను. పంచమే బ్రహ్మవర్చసకామః ఇత్యాది వేదవాక్యముననుసరించి చక్కని బ్రహ్మ తేజస్సు కావలెనన్నచో గర్భపంచమముననే బ్రాహ్మణునకు ఉపనయనము చేయవలెనని మనువు పేర్కొనెను. 1. కాని ఆపస్తంబ, 2. సత్యాషాఢ మహర్షులు గర్భ సప్తమమున చేయవచ్చునని తెలిపిరి.

**త్ర్యధికేషు రాజన్యముపనయీత॥** 9

బ్రాహ్మణ కుమారుని కంటె మూడు సంవత్సరముల తరువాత అనగా గర్భైకాదశమున క్షత్రియ కుమారునకు ఉపనయమునము చేయవలెను

**తస్మాదేకాధికేషు వైశ్యమ్॥** 10

క్షత్రియ కుమారుని కంటె ఒక సంవత్సరము తరువాత (గర్భ ద్వాదశమున) వైశ్య కుమారునకు ఉపనయనము చేయవలెను

**వసంతో గ్రీష్మశ్శరదిత్యృతవో వర్ణానుపూర్వ్యేణ॥** 11

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కుమారులకు క్రమముగా వసంతఋతువు, గ్రీష్మఋతువు, శరదృతువులలో ఉపనయనము చేయవలెను. ఆశ్వలాయన మహర్షి తన గృహ్య సూత్రమున ఉదగయన ఆపూర్యమాణ పక్షే కల్యాణే నక్షత్రే చౌల కర్మోపనయన గోదాన వివాహాః అని శుక్ల పక్షమున శుభనక్షత్రమున చౌళాది శుభకర్మలు చేయవలెనని చెప్పెను.

**గాయత్రీ త్రిష్టుబ్ జగతీభిర్యథాక్రమమమ్॥** 12

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కుమారులకు క్రమముగా గాయత్రీ మంత్రము చేత, త్రిష్టుబ్ మంత్రము చేత, జగతీ మంత్రము చేత ఉపనయనము చేయవలెను.

---

1 బ్రహ్మ వర్చసకామస్య కార్యం విప్రస్య పంచమే। 2-37

2 అథ కామ్యాని, సప్తమే బ్రహ్మవర్చసకామమ్......... 1-1-20, 21

**ఆషోడశాదాద్వావింశాదాచతుర్వింశాదిత్యనాత్యయ ఏషాం క్రమేణ॥**

అట్లే వీరికి క్రమముగా పదునారు సంవత్సరముల వరకు, ఇరువది రెండు సంవత్సరముల వరకు, ఇరువది నాలుగు సంవత్సరముల వరకు ఉపనయనము చేసినా కాలాతిక్రమణ జరుగదు.

**మౌంజీ ధనుర్జ్యా శాణీతి మేఖలాః॥** 14

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కుమారులకు క్రమముగా ముంజమనుగడ్డి, అల్లిత్రాడు, జనపనారలచే చేయబడిన మేఖల (నడుమున ధరించుతాడు) ఉండవలెను.

**కృష్ణరురు బస్తాజినాన్యజినాని॥** 15

అట్లే క్రమముగా కృష్ణ మృగము, రురు మృగము, మేక చర్మములను అజినముగా ధరింపవలెను.

**మూర్ధ లలాట నాసాగ్రప్రమాణా యాజ్ఞికస్య వృక్షస్య దండాః॥** 16

అదే విధముగా వీరు ధరించు యజ్ఞదండములు క్రమముగా శిరస్సు వరకు, నొసలు వరకు, నాసాగ్రము వరకు ఉండవలెను.

**భవత్పూర్వాం భిక్షామధ్యాం యాచ్ఞాంతాం చరేత్ సప్తాక్షరాం**
**క్షాం చ హిం చ న వర్ధయేత్॥** 17

బ్రహ్మణ కుమారుడు భిక్ష నడుగునప్పుడు భవచ్ఛబ్దము తొలుత, భిక్షా శబ్దము మధ్యలో, చివరకు యాచన శబ్దముండవలెను. ఇది అంతయు ఏడు అక్షరములలో (అనగా భవతి! భిక్షాం దేహి, భవాన్ భిక్షాం దదాతు అని) ఉండవలెను. దీనిలో "క్ష" కారమును "హ" కారమును గట్టిగా పలుకరాదు.

**భవత్పూర్వాం బ్రాహ్మణో భిక్షేత భవన్మధ్యాం రాజన్యో**
**భవదంత్యాం వైశ్యస్సర్వేషు వర్ణేషు॥** 18

భిక్షనడుగునప్పుడు బ్రాహ్మణ కుమారుడు భవత్ శబ్దమును తొలుత ప్రయోగింపవలెను. క్షత్రియ కుమారుడు భవత్ శబ్దమును మధ్యలో (భిక్షాం భవతి! దేహి) ప్రయోగింపవలెను. వైశ్య కుమారుడు భవచ్ఛబ్దము చివరకు వచ్చునట్లు (భిక్షాం దేహి భవతి!) అడుగవలెను. వీరు భిక్షను అన్ని వర్ణముల దగ్గర స్వీకరింపవచ్చును. కాని దీనికి వ్యాఖ్య వ్రాసిన గోవిందస్వామి, సర్వవర్ణములనగా త్రైవర్ణికులనే అర్థము చెప్పవలెనని తెలిపెను.

**తే బ్రాహ్మణాద్యాః స్వకర్మస్థాః॥** 19

తమకు నిర్దేశించిన కర్మలను చక్కగా చేయు బ్రాహ్మణుడు మొదలగు వారి వద్ద బ్రహ్మచారులు భిక్షాచరణమును చేయవలెను.

**సదాఽరణ్యాత్సమిధ ఆహృత్య ఆదధ్యాత్॥** 20

బ్రహ్మచారి ప్రతి దినము అడవికి పోయి సమిధలను తెచ్చి, అగ్న్యాధానము చేయవలెను.

**సత్యవాదీ హ్రీమాననహంకారః॥** 21

బ్రహ్మచారి సత్యమును పలుకుచు లజ్జ కలిగి అహంకార రహితుడుగా ఉండవలెను.

**పూర్వోత్థాయీ జఘన్యసంవేశీ॥** 22

బ్రహ్మచారి గురువుగారి కంటె ముందు లేవవలెను. అట్లే గురువు గారితో సమానముగా కూర్చొనరాదు ఈ సూత్రము ఆపస్తంబ ధర్మ సూత్రమందును కనిపించును.

**సర్వత్రాప్రతిహత గురువాక్యోఽన్యత్ర పాతకాత్॥** 23

దుష్ట కర్మలు తప్ప గురువు చెప్పిన పనులనన్నిటిని చేయవలెను.

**యావదర్థసంభాషీ స్త్రీభిః॥** 24

బ్రహ్మచారి అవసరమున్నంతవరకే స్త్రీలతో మాట్లాడవలెను.

**నృత్త గీత వాదిత్ర గంధమాల్యోపానచ్ఛత్ర ధారణాంజనాభ్యంజన వర్జీ॥** 25

బ్రహ్మచారి నృత్యమందు, పాటలందు, వాద్యములందు పాల్గొనరాదు. అట్లే గంధమును, పూలమాలలను, చెప్పులను, ఛత్రమును, కాటుకను ధరింపరాదు. ఇంకను తల అంటుకొని స్నానమును చేయరాదు.

**దక్షిణం దక్షిణేన సవ్యం సవ్యేన చోపసంగృహ్ణీయాద్దీర్ఘమాయుః స్వర్గం చేచ్ఛన్॥** 26

దీర్ఘాయువున్నను స్వర్గ ఫలమును కోరు బ్రహ్మచారి గురువుగారికి నమస్కరించునప్పుడు కుడిచేతిచే కుడికాలును, ఎడమ చేతిచే ఎడమ కాలును స్పృశింపవలెను. ఆపస్తంబమహర్షి దక్షిణేన పాణినా దక్షిణం పాదమధస్తాదభ్యధిమృశ్య

సకుష్ఠికం ఉపసంగృహ్ణీయాత్ 1-5-21 అని పేర్కొనెను. మనువు కూడా వ్యత్యస్తపాణినా కార్యముపసంగ్రహణం గురోః।సవ్యేన సవ్యః స్ప్రష్టవ్యో దక్షిణేన తు దక్షిణః॥-2-72 అని నమస్కారమును వ్యత్యస్తపాణిగా చేయవలెనని అనెను.

**అసావహం భోః" ఇతి శ్రోత్రే సంస్పృశ్య మనస్సమాధానార్థమ్॥**

నమస్కారము చేయునప్పుడు తన మనస్సును ఏకాగ్రము చేయుటకు రెండు చేతులచే రెండు చెవులను స్పృశించుచు అసావహం భోః అనుచు తన పేరును చెప్పవలెను. కాని ఆపస్తంబ మహర్షి బ్రాహ్మణుడు నమస్కరించునపుడు తన కుడిచేతిని తన కుడి చెవివరకెత్తవలెనని (దక్షిణం బాహుగ్ం శ్రోత్ర సమం ప్రసార్య బ్రాహ్మణోఽభివాదయీత 1-5-16) పేర్కొనెను.

**అధస్తాజ్జాన్వోరాపద్భ్యామ్॥** 28

పాదముల నుండి మోకాళ్ళ వరకు ఒత్తుచు ఉపసంగ్రహణము చేయవలెను.

**నాసీనో నాసీనాయ న శయానో న శయానాయ**
**నాప్రయతో నాప్రయతాయ॥** 29

గురువుగారు కూర్చొని యున్నప్పుడు తాను కూర్చొని, గురువుగారు పడుకొని యున్నప్పుడు తాను పడుకొని, తాను అపవిత్రముగానుండి గురువునకు నమస్కరింపరాదు. అట్లే అపవిత్రముగానున్న గురువునకు నమస్కరింపరాదు.

**కామమన్యస్మై సాధువృత్తాయ గురుణానుజ్ఞాతః॥** 30

గురువుగారి దగ్గర ఉన్న సాధు పురుషునకు ఆచార్యుని అనుజ్ఞ తీసుకొని నమస్కరింపవలెను.

**శక్తి విషయే ముహూర్తమపి నాప్రయతః స్యాత్॥** 31

పరిశుద్ధముగానుండుటకు వీలున్నచో క్షణకాలము కూడా బ్రహ్మచారి అపవిత్రుడు కారాదు.

**సమిద్ధార్యుదకుంభ పుష్పాన్నహస్తో నాభివాదయేద్యచ్చాన్యదపి**
**ఏవం యుక్తమ్ ॥** 32

బ్రహ్మచారి సమిధలను ధరించియున్నప్పుడు, నీటి కడవ, పుష్పములు,

అన్నము మొదలగునవి చేతిలో ఉన్నప్పుడు, ఇంకను పితృదేవతాగ్ని కార్యములు చేయునప్పుడు పెద్దలకు నమస్కరింపరాదు. గురువు కూడా ఇటువంటి పరిస్థితిలో ఉన్నప్పుడు ఆశీర్వదించలేదు. కావున బ్రహ్మచారి అతనికి నమస్కరింపరాదు.

**న సమవాయేఽభివాదనమత్యంతశః॥** 33

గురువునకు చాలా దగ్గరగానున్నప్పుడు నమస్కరింపరాదు.

**భ్రాతృపత్నీనాం యువతీనాం చ గురుపత్నీనాం జాతవీర్యః॥** 34

యువకుడైన బ్రహ్మచారి, యువతులైన వదినలు ఆచార్య పత్నులకు కాళ్ళు ముట్టుకొని నమస్కరింపరాదు.

**నౌశిలాఫలక కుంజర ప్రాసాద కటకేషు చక్రవత్సు చాదోషం సహాసనమ్॥**

ఓడ, శిలా ఫలకము, ఏనుగు, మేడ, చాప, బండి వంటి వాటి యందు గురువు, అతని భార్యతో కలసి బ్రహ్మచారి కూర్చున్నప్పటికీ తప్పులేదు.

**ప్రసాధనోచ్ఛాదన స్నాపనోచ్ఛిష్ట భోజనానీతి గురోః॥** 36

గురువును అలంకరించుట, ఛత్రము పట్టుకొనుట, స్నానము చేయించుట, ఉచ్ఛిష్టమును భుజించుట మొదలగు వానిని శిష్యుడు చేయవచ్చును.

**ఉచ్ఛిష్టవర్జం తత్పుత్రేఽనూచానే వా॥** 37

అనూచానుడనగా ఒక వేదశాఖను సంపూర్ణముగా అధ్యయనము చేసినవాడు. అట్టి అనూచానునకు, గురుపుత్రునకు ఉచ్ఛిష్ట భోజనము తప్ప మిగిలిన సేవలు అన్నిటిని చేయవచ్చును.

**ప్రసాధనోచ్ఛాదన స్నాపనోచ్ఛిష్టవర్జం చ తత్పత్న్యామ్॥** 38

గురువు భార్యకు అలంకరించుట, గొడుగు పట్టుట, స్నానము చేయించుట, ఉచ్ఛిష్టమును తినుట అనువాటిని తప్ప మిగిలిన సేవలు చేయవచ్చును.

**ధావంతమనుధావేత్ గచ్ఛంతమనుగచ్ఛేత్ తిష్ఠంతమనుతిష్ఠేత్॥**

గురువుగారు పరుగెత్తుచున్నచో శిష్యుడు వారి వెంట పరుగెత్తుచు విద్య నేర్చుకొనవలెను. నడుచుచున్నచో అతని వెంట నడుచుచు నేర్చుకొనవలెను. అట్లే గురువు నిలబడి యున్నచో అతని దగ్గర నిలబడి విద్య నేర్చుకొనవలెను.

**నాప్సు శ్లాఘమానః స్నాయాత్॥** 40

నీటిలో ఉండి ఆ నీటిని చేతులతో ఇటునటు గొట్టుచు స్నానము చేయరాదు శ్లాఘమానః అనగా ఈత కొట్టుట కావచ్చును.

**దండ ఇవ ప్లవేత్॥** 41

దండము వలె చక్కగా ఉండి ఆ నీటిని దాటవలెను. అనగా చేపలు మొదలగు జలచరములకు ఎక్కువ ఇబ్బంది కలుగకుండ నదిని దాటవలెనని భావము

**అబ్రహ్మణాదధ్యయనమాపది॥** 42

ఆపత్కాలమున బ్రహ్మణేతరుని దగ్గర కూడా విద్య నేర్చుకొనవచ్చును.

**శుశ్రూషాఽనువ్రజ్యా యావదధ్యయనమ్॥** 43

వారిదగ్గర చదువుకొనుచున్నప్పుడు మాత్రమే వారికి శుశ్రూష అనుగమనము వంటి సేవలు చేయవలెను

**తయోస్తదేవ పావనమ్॥** 44

ఇంత మాత్రము శుశ్రూష చేయుట వలన ఆ గురు శిష్యులకు ఇద్దరికి వర్ణవ్యతిక్రమమైన పాపము కలుగదు.

**భ్రాతృ పుత్ర శిష్యేషు చైవమ్॥** 45

ఇదే విధముగా ఆచార్యుని సోదరులను, పుత్రులను, తనకంటె పెద్దవారైన శిష్యులను అధ్యయన కాలము పూర్తియగువరకు సేవింపవలెను.

**ఋత్విక్ శ్వశుర పితృవ్య మాతులానాం తు యవీయసాం**
**ప్రత్యుత్థాయాభిభాషణమ్॥** 46

తన కంటె చిన్నవారైన ఋత్విక్కు, మామ, పినతండ్రి,ఎదురైనచో లేచి నిలబడి పలుకరింపవలెను.

**ప్రత్యభివాద ఇతి కాత్యః॥** 47

కాత్యుడను ఆచార్యుడు పై వారికి లేచి నిలబడి పలుకరించినచో అది ప్రత్యభివాదము (నమస్కారము) అగునని పేర్కొనెను.

**శిశావాంగిరసే దర్శనాత్॥** 48

తాండ్యమహాబ్రాహ్మణమున శిశువుగా ఉన్న ఆంగీరసుని కథ కలదు. అతడు

గొప్ప జ్ఞానియైనందు వలన తన తండ్రికే వేదమును బోధించినట్లు ఆ సమయమున తండ్రినే 'పుత్రకాః' అని సంబోధించినట్లు దేవతలు దానిని ఆమోదించినట్లు మనుస్మృతి 2-150-153 యందు కలదు.

ఇతి తృతీయః ఖండః

అథ చతుర్థః ఖండః

**ధర్మార్థౌ యత్ర న స్యాతాం శుశ్రూషా వాఽపి తద్విధా।**
**విద్యయా సహ మర్తవ్యం న చైనామూషరే వపేత్ ॥ 1**

ధర్మము కాని అర్థము కాని లభింపని చోట లేక గురు శుశ్రూషయైనా లభింపని చోట విద్యా దానము చేయరాదు. ఆచార్యుడు తన దగ్గర ఉన్న విద్య అను బీజమును చౌటినేలలో వేయక అట్లే చనిపోయినను తప్పులేదు. అనగా అయోగ్యునకు విద్యా దానము చేయరాదు అని భావము.

**అగ్నిరివ కక్షం దహతి బ్రహ్మపృష్టమనాదృతమ్।**
**తస్మాద్వై శక్యం న బ్రూయాత్ బ్రహ్మమానమకుర్వతామ్॥ 2**

వేదమును ఆదరింపనిచో అగ్ని ఇంటిని దహించినట్లు అది అధ్యయనము చేయు శిష్యుని దహించి వేయును. కావున వేదమునందు భక్తి శ్రద్ధలు లేనివానికి వేదమును ఉపదేశింపరాదు.

**అత్రైవాస్మై వచో వేదయంతే॥ 3**

ఈ విషయమును వేదమిట్లు వివరించుచున్నది.

**బ్రహ్మచారిణమేవ న ప్రాయచ్ఛత్ సోఽబ్రవీత్ అస్తు మహ్యమపి**
**ఏతస్మిన్ భాగ ఇతి యామేవ రాత్రిం సమిధం నాఽహరతా ఇతి॥ 4**

శత పథ బ్రాహ్మణములో (11-2-6) ఈ విషయము కనిపించును. బ్రహ్మ దేవుడు తాను సృష్టించిన ప్రాణి సమూహమునంతయు మృత్యువున కొసగెను. కాని బ్రహ్మచారిని మాత్రము ఈయలేదు. అప్పుడు మృత్యువు బ్రహ్మదేవునితో బ్రహ్మచారిలో కూడ భాగమిమ్మని ప్రార్థింపగా బ్రహ్మదేవుడు అతనితో బ్రహ్మచారి సమిదాహరణమును ఎప్పుడు చేయడో ఆ రాత్రి నీకు వశమగునని చెప్పెను.

**తస్మాద్ బ్రహ్మచారీ యాం రాత్రిం సమిధం నాహరతి**
**ఆయుష ఏవ తామవదాయ వసతి॥** 5

అందువల్ల బ్రహ్మచారి ఏనాడు సమిదాహరణము చేయడో ఆనాడు అతని ఆయుస్సు క్షీణించును. అనగా బ్రహ్మ చర్య వ్రతమును శ్రద్ధగా చేయవలెనని దీని భావము.

**తస్మాద్ బ్రహ్మచారీ సమిధమాహరేన్నేదాయుషోఽ వదాయవసానీతి॥**

అందువల్ల బ్రహ్మచారి సమిదాహరణము మొదలగునవి చేయనిచో తన ఆయుస్సులో కొంత భాగమును పోగొట్టుకొనును.

**దీర్ఘ సత్రం హ వా ఏష ఉపైతి యో బ్రహ్మచర్యముపైతి॥** 7

బ్రహ్మచర్య వ్రతమును స్వీకరించినచో అనేక సంవత్సరముల వరకు ఆచరించు సత్రయాగ దీక్ష తీసికొన్నట్లగును.

**యాముపయన్ సమిధ ఆదధాతి సా ప్రాయణీయా అథ యాం**
**స్నాస్యన్ సోదయనీయా అథ యా అంతరేణ సత్ర్యా ఏవాస్య తాః** 8

ఉపనయనము చేసికొని "ఆయుర్దా దేవ జరసమ్" ఇత్యాదిమంత్రములు చదువుచు సమిదాహరణము చేసినచో అది ప్రాయణీయమను అతిరాత్రయాగము చేసినట్లగును. అట్లే "ఇమం స్తోమమర్హతే జాతవేదసే" ఇత్యాది మంత్రములచే స్నాతకము చేసి సమిదాహరణము చేసినచో అది ఉదయనీయమనే అతి రాత్రయాగము చేసినట్లుగును. ఈ రెండు అతిరాత్రముల మధ్య చేసిన సమిదాహరణము సత్ర యాగమువంటి ఫలితము నిచ్చును.

**బ్రాహ్మణో హ వై బ్రహ్మచర్యముపయంశ్చతుర్ధా భూతాని ప్రవిశతి అగ్నిం పదా మృత్యుం పదాచార్యం పదాత్మన్యేవ చతుర్థః పాదః పరిశిష్యతే। తం స యదగ్నౌ సమిధమాదధాతి య ఏవాస్యాగ్నౌ పాదస్తమేవ తేన పరిక్రీణాతి। తం సంస్కృత్యాఽత్మన్ధత్తే స ఏనమావిశతి అథ యదాత్మానం దరిద్రీకృత్యాహ్రీర్భూత్వా భిక్షతే బ్రహ్మచర్యం చరతి య ఏవాస్య మృత్యౌ పాదః తమేవ తేన పరిక్రీణాతి తం సంస్కృత్యాఽత్మన్ధత్తే స ఏనమావిశతి అథ యదాచార్యవచః కరోతి య ఏవాస్యాఽచార్యే పాదస్తమేవ తేన పరిక్రీణాతి**

తం సంస్కృత్యాऽऽత్మన్ధత్తే స ఏనమావిశతి అథ యత్స్వాధ్యాయమధీతే య ఏవాస్యాత్మని పాదః తమేవ తేన పరిక్రీణాతి తం సంస్కృత్య ఆత్మన్ధత్తే స ఏనమావిశతి న హ వై స్నాత్వా భిక్షేతాపి హ వై స్నాత్వా భిక్షాం చరత్యపి జ్ఞాతీనామశనాయాపి పితౄణామన్యాభ్యః క్రియాభ్యః స యదన్యాం భిక్షితవ్యాం న విందేత అపి వా స్వామేవ ఆచార్య జనానాం భిక్షేతాథో స్వాం మాతరం నైనం సప్తమ్యభిక్షితాతీయాత్॥

భైక్షస్యాచరణే దోషః పావకస్యాసమింధనే।
సప్తరాత్రమకృత్వైతదవదవకీర్ణివ్రతం చరేత్ ॥
**తమేవంవిద్వాంసమేవ చరంతం సర్వేవేదా ఆవిశంతి॥** 9

బ్రాహ్మణుడు ఉపనయనము చేసికొని నాలుగు భాగములుగా భూతముల యందు ప్రవేశించుచున్నాడు. అందు ఒక భాగము అగ్నియందు, ఒక భాగము మృత్యువు నందు, ఇంకొక భాగము ఆచార్యుని యందుండగా చివరి భాగము తనయందే మిగిలియుండును.

బ్రహ్మచారి ప్రతిదినము సమిదాధానము చేసినచో అగ్నిలో ఉన్న నాలుగవ భాగమును కొనినట్లుగును. ఆ భాగమును సంస్కరించి తనయందు ప్రవేశపెట్టుకొన్నచో ఆ భాగము ఆ బ్రహ్మచారికి చెందుచున్నది.

ఇక తనను దరిద్రుడుగా భావించుకొని సిగ్గు బిడియమును వదలుకొని భిక్షను యాచించుచు బ్రహ్మ చర్యమును పాలించుచున్నచో మృత్యువునందున్న నాలుగవ భాగమును కొనినట్లగును. ఆ భాగమును సంస్కరించి తనయందు ప్రవేశపెట్టుకొన్నచో ఆ రెండవ భాగము కూడా బ్రహ్మచారికే చెందుచున్నది.

ఇక తన ఆచార్యునియొక్క ఆజ్ఞను భక్తి శ్రద్ధలతో పరిపాలించుచున్నచో ఆచార్యునియందున్న భాగమును బ్రహ్మచారి కొనినట్లుగును. ఆ భాగమును సంస్కరించి తనలో చేర్చుకొన్నచో ఆ మూడవ భాగము కూడా బ్రహ్మచారికే చెందుచున్నది.

ఇక అనుదినము వేదాధ్యయనము చేయుచున్నచో తనయందు మిగిలిపోయిన నాలుగవ భాగమును కూడా ఆ బ్రహ్మచారి కొనినట్లగును. ఆ భాగమును సంస్కరించి తనలో చేర్చుకొన్నచో అది కూడా బ్రహ్మచారికి లభించును.

ఇట్లు బ్రహ్మ చర్యవ్రతమును పూర్తి చేసికొని స్నాతక కర్మను చేసిన తరువాత యాచింపరాదు. స్నాతక వ్రతము చేసిన తరువాత యాచన చేసినచో జ్ఞాతులకు, పితృదేవతలకు ఆహారము లభింపదు. అట్లే ఇతర క్రియలను చేయజాలదు.

బ్రహ్మచారి భిక్షకై పోయినప్పుడు భిక్షపెట్టు స్త్రీ ఎవ్వరు లభించనిచో ఆచార్య పత్నిని లేక తన తల్లిని భిక్షనడుగవలెను. ఇట్లు ఎవరిని భిక్షనడుగక ఏడు రాత్రులు గడపరాదు.

స్నాతకుడు భిక్షకై పోయినను, సమిదాధానము చేయకపోయినను, అతనికి పాపము కల్గును. ఏడు రాత్రులు ఇట్టి పాపకార్యము చేసినచో ప్రాయశ్చిత్తముగా అవకీర్ణివ్రతము నాచరింపవలెను. ఈ విషయము తెలిసికొని బ్రహ్మచర్య వ్రతమును అనుష్ఠించు విద్వాంసునకు సమస్త వేదములు స్వయముగానే వచ్చును.

**యథా హ వా అగ్నిస్సమిద్ధో రోచత ఏవం**
**హ వా ఏష స్నాత్వా రోచత య ఏవం విద్వాన్**
**బ్రహ్మచర్యం చరతీతి బ్రాహ్మణమితి బ్రాహ్మణమ్॥** 10

యథా హ వా మొదలుకొని బ్రహ్మచర్యం చరతి వరకున్న భాగమంతా బ్రాహ్మణ భాగము. ఇట్లు అగ్న్యాధానము చేయుచు స్నాతకము చేసికొన్నచో విజ్ఞాన వంతుడై బ్రహ్మచర్య వ్రతము నాచరించినట్లగునని బ్రాహ్మణ భాగము తెలుపుచున్నది.

రెండవ అధ్యాయము పూర్తియైనట్లు బ్రాహ్మణమ్ అను పదము రెండు మార్లు ఉపయోగింపబడినది.

ఇతి చతుర్థః ఖండః

## అథ పంచమః ఖండః

**అథ స్నాతకస్య॥** 1

బ్రహ్మచారి విధుల గురించి చెప్పిన తరువాత స్నాతక వ్రతము నాచరించిన వాని విధులు వివరింపబడుచున్నవి.

**అంతర్వాస్యుత్తరీయవాన్॥** 2

అంతర్వాసము, ఉత్తరీయము ఈ రెండు ఉండవలెను. అంతర్వాసమనగా మొలత్రాదని గోవిందస్వామి తెలిపెను?

**వైణవం దండం ధారయేత్॥** 3

చేతిలో వెదురు దండమును ధరింపవలెను.

**సోదకం చ కమండలుమ్॥** 4

నీరున్న కమండలువును కూడా ధరింపవలెను.

**ద్వి యజ్ఞోపవీతీ॥** 5

రెండు యజ్ఞోపవీతములను ధరింపవలెను.

**ఉష్ణీషమజినముత్తరీయముపానహౌ ఛత్రం చౌపాసనం**
**దర్శపూర్ణమాసౌ చ॥** 6

ఇంకను తలపాగా, కృష్ణాజినము, ఉత్తరీయము, చెప్పులు, ఛత్రము, కలిగియుండవలెను. అగ్న్యుపాసన చేయవలెను. దర్శపూర్ణమాసయాగములను స్థాలీపాక విధానమునను సరించి చేయవలెను.

**పర్వసు చ కేశశ్మశ్రులోమనఖవాపనమ్॥** 7

పర్వదినములందు తలవెంట్రుకలను, గడ్డమును, ఇతర వెంట్రుకలను, గోళ్ళను తీసికొనవలెను.

**తస్య వృత్తిః॥** 8

ఆ స్నాతకుని యొక్క జీవన వృత్తి ఇట్లుండవలెను.

**బ్రాహ్మణ రాజన్య వైశ్య రథకారేష్వామం లిప్సేత॥** 9

స్నాతకుడు బ్రాహ్మణుడు, క్షత్రియుడు, వైశ్యుడు, రథకారుని (వడ్రంగి?) నుండి ఉడికించని పదార్థమును తీసికొనవలెను.

**భైక్షం వా॥** 10

ఆపత్కాలమున ఉదరపోషణమునకై యాచనయైనా చేయవచ్చును.

**వాగ్యతస్తిష్ఠేత్॥** 11

అతడు మౌనముగా ఉండవలెను.

**సర్వాణి చాస్య దేవపితృసంయుక్తాని పాకయజ్ఞ సంస్థాని**

**భూతికర్మాణి కుర్వీత॥** 12

భిక్షవల్ల లభించిన వస్తువులచే దేవతలకు, పితృదేవతలకు సంబంధించిన పంచమహా యజ్ఞములను, అష్టకాహెూమాది పాకయజ్ఞములను, అయుష్యహెూమము వంటి భూతికర్మలను అనుష్ఠింపవలెను.

**ఏతేన విధినా ప్రజాపతేః పరమేష్ఠినః పరమర్షయః**
**పరమాం కాష్ఠాం గచ్ఛంతీతి బౌధాయనః ॥** 13

ఈ విధముగా తన విధిని నిర్వర్తించినందువల్ల ఉత్కృష్టస్థానమందుండు బ్రహ్మదేవుని లోకమునకు వారు పోయెదరని బౌధాయనుడు తెలిపెను.

ఇతి పంచమః ఖండః

అథ షష్ఠః ఖండః

**అథ కమండలు చర్యాముపదిశంతి (వేదవిదః)॥** 1

వేదము తెలిసినవారు కమండలు ధారణ విధిని ఇట్లు తెలుపుచున్నారు

**ఛాగస్య దక్షిణే కర్ణే పాణౌ విప్రస్య దక్షిణే।**
**అప్సు చైవ కుశస్తంబే పావకః పరిపఠ్యతే॥**
**తస్మాచ్ఛౌచం కృత్వా పాణినా పరిమృజీత పర్యగ్నికరణం**
**హితమ్। "ఉద్దీప్యస్వ జాత వేద" ఇతి పునర్దాహాద్విశిష్యతే॥** 2

మేక యొక్క కుడి చెవిలో, బ్రాహ్మణుని యొక్క కుడి చేతిలో, నీటియందు, దర్భల సమూహమున అగ్ని దేవుడుండును. అందువలన శౌచము చేసిన తరువాత "ఉద్దీప్యస్వ" అనుమంత్రమును చదువుచు తన కుడి చేత కమండలువును తుడువవలెను. అది పర్యగ్ని కరణముతో సమానమైనది. పునర్దహనము చేసిన దానికంటె ఎక్కువ పవిత్రత ఆ కమండలువునకు కలుగును.

**అత్రాపి కించిత్ సంస్పృష్టం మనసి మన్యతే కుశైర్వా**
**తృణైర్వా ప్రజ్వాల్య ప్రదక్షిణం పరిదహనమ్॥** 3

కమండలువునకు అశుద్ధమైన వస్తువు ఇంకా అంటుకొన్నట్లు భావించినచో దర్భలను లేక ఎండు గడ్డిని కాల్చి చుట్టు తిప్పవలెను.

**అత ఊర్ధ్వం శ్వ వాయసప్రభృత్యుపహతానాం**
**అగ్నివర్ణ ఇత్యుపదిశంతి॥** 4

కుక్క, కాకి వంటివి తగిలినప్పుడు ఆ పాత్రను అగ్ని వర్ణమునకు వచ్చునంత వరకు ఎఱ్ఱగా కాల్చవలెనని అందురు.

**మూత్ర పురీష రోహిత రేతః ప్రభృత్యుపహతానాముత్సర్గః॥** 5

మూత్రము, మలము, రక్తము, రేతస్సు మొదలగునవి కమండలువునకు తగిలినచో దానిని పూర్తిగా వదలిపెట్టవలెను

**భగ్నే కమండలౌ వ్యాహృతిభిశ్శతం జుహుయాత్॥** 6

కమండలువు భగ్నమైనచో ఓం భూః స్వాహా ఇత్యాది వ్యాహృతులచే నూరు ఆజ్యాహుతులనీయవలెను.

**జపేద్వా॥** 7

లేనిచో ఆ వ్యాహృతులను నూరు పర్యాయములు జపింపవలెను.

**భూమిర్భూమిమగాన్మాతా మాతరమప్యగాత్।భూయాస్మ పుత్రైః పశుభిర్యో నో ద్వేష్టి స భిద్యతామితి కపాలాని సంహృత్య అప్సు ప్రక్షిప్య సావిత్రీం దశావరాం కృత్వా పునరేవాన్యం గృహ్ణీయాత్॥** 8

భూమిర్భూమిమన్వగాత్ ఇత్యాది మంత్రమును చదువుచు పగిలిపోయిన కమండలువుయొక్క ముక్కలను అన్నిటిని కలిపి నీటిలో వేసి పదికి తగ్గకుండ గాయత్రీ జపము చేసికొని నూతన కమండలువును తీసికొనవలెను.

**వరుణమాశ్రిత్య "ఏతత్తే వరుణ పునరేవ తు మామోమిత్యక్షరం ధ్యాయేత్**

నీటియందున్న వరుణదేవుని ధ్యానించుచు ఏతత్తే అను మంత్రమును చదువుచు ఓంకారమును మనస్సున ధ్యానింపవలెను.

**శూద్రాద్గృహ్య శతం కూర్యాత్ వైశ్యాదర్ధశతం స్మృతమ్।**
**క్షత్రియాత్పంచవింశత్తు బ్రాహ్మణాద్దశ కీర్తితాః॥** 10

కమండలువును శూద్రుని దగ్గరనుండి తీసుకొన్నచో శతగాయత్రిని, వైశ్యుని దగ్గరనుండి తీసికొన్నచో అర్ధశత గాయత్రిని, క్షత్రియునినుండి తీసికొన్నచో

పంచవింశతి (25) గాయత్రిని, బ్రాహ్మణునినుండి తీసుకొన్నచో దశగాయత్రిని చేయవలెను.

**అథాస్తమితే ఆదిత్యే ఉదకం గృహ్ణీయాత్**
**న గృహ్ణీయాదితి మీమాంసంతే బ్రహ్మవాదినః॥** 11

సూర్యాస్తమనము తరువాత జలమును త్రాగవచ్చునా? కూడదా? అని వేద వేత్తలు శంకించుచున్నారు.

**గృహ్ణీయాదిత్యేతదపరమ్॥** 12

జలమును త్రాగవచ్చుననుటయే శ్రేష్ఠమైన అభిప్రాయము.

**యావదుదకం గృహ్ణీయాత్తావత్ప్రాణానాయచ్ఛేత్॥** 13

సూర్యాస్తమనము తరువాత నీరు త్రాగునపుడు ప్రాణాయామము చేయవలెను.

**అగ్నిర్హ్యవై హ్యుదకం గృహ్ణాతి॥** 14

ఈ విధముగా ప్రాణాయామము చేయుటవలన శరీరమున ఉన్న అగ్నియే ఆ నీటిని గ్రహించుచున్నట్లు భావింపవలెను.

**కమండలూదకేన అభిషిక్త పాణిపాదో యావదార్ద్రం తావదశుచిః**
**పరేషామాత్మానమేవ పూతం కరోతి నాన్యత్కర్మ కుర్వీతేతి విజ్ఞాయతే॥**

కమండలువులోని నీటిచే కాళ్ళుఅరిపోవునంతవరకు అతడు ఇతరులకు అపవిత్రుడగును. తాను మాత్రము పవిత్రుడగును కావున కమండలు జలముచే శ్రాద్ధాది ఇతర కర్మలు చేయరాదని వేదము చెప్పుచున్నది.

**అపి వా ప్రతిశౌచమామణిబంధాచ్ఛుద్ధిరితి బౌధాయనః॥** 16

కాళ్ళు చేతులు కడుగుకొనునప్పుడు మణికట్టు వరకు కడుగుకొనవలెనని బౌధాయనుడు పేర్కొనుచున్నాడు.

ఇతి షష్ఠః ఖండః

అథ సప్తమః ఖండః

**అథాప్యుదాహరంతి**

**కమండలుర్ ద్విజాతీనాం శౌచార్థం విహితః పురా।**
**బ్రహ్మణా ముని ముఖ్యైశ్చ తస్మాత్తం ధారయేత్సదా॥**
**తతశ్శౌచం తతః పానం సంధ్యోపాసనమేవ చ।**
**నిర్విశంకేన కర్తవ్యం య ఇచ్ఛేచ్ఛ్రేయ ఆత్మనః॥** 1

ద్విజులు శుద్ధి కొరకు కమండలువు ధరింపవలెనని బ్రహ్మ దేవుడు మొదలగు వారు నిర్ణయించిరి. అందువలన ద్విజులు దీనిని ఎల్లప్పుడు ధరింపవలెను. తనకు శ్రేయస్సు కలుగవలెనని కోరుకొనువాడు కమండలు జలము చేతనే శరీర శుద్ధి చేసికొనవలెను. జలపానము చేయవలెను. సంధ్యోపాసన కూడా ఈ జలముల చేతనే చేసికొనవలెను. ఈ పనులను ఎట్టి శంకలేక చేయవచ్చును.

**కుర్యాచ్ఛుద్ధేన మనసా న చిత్తం దూషయేద్బుధః।**
**సహకమండులునోత్పన్నః స్వయంభూః తస్మాత్ కమండులునాచరేత్॥**

బుద్ధిమంతుడు పై కార్యములనన్నిటిని ఎట్టి శంకపెట్టుకొనక పరిశుద్ధమైన మనస్సుచే చేయవలెను. బ్రహ్మదేవుడు కమండలువుతో పుట్టినందువలన కమండలువుచే సమస్త కర్మలు చేయవచ్చును.

**మూత్ర పురీషే కుర్వన్ దక్షిణే హస్తే గృహ్ణాతి సవ్యే ఆచమనీయమ్॥**

మలమూత్రములు విసర్జించునప్పుడు కమండలువును కుడిచేతిలో పట్టుకొనవలెను. ఆచమనము చేయునప్పుడు కమండలువును ఎడమ చేతిలో పట్టుకొనవలెను.

**ఏతత్సిధ్యతి సాధూనామ్॥** 4

ఈ కమండలువు సాధుపురుషులకే ఉండును. సాధువులనగా శాస్త్రార్థ విషయమున ఎట్టి శంకలేని విద్వాంసులని గోవిందస్వామి వివరించెను.

**యథా హి సోమసంయోగాచ్చమసో మేధ్య ఉచ్యతే।**
**అపాం తథైవ సంయోగాన్నిత్యో మేధ్యః కమండలుః॥** 5

సోమరస సంయోగము వలన చమసమను యజ్ఞ పాత్ర ఎట్లు పవిత్రమగునో అదే విధముగా నీటితో ఉన్నందువలన కమండలువు పవిత్రమగుచున్నది.

**పితృ దేవాగ్ని కార్యేషు తస్మాత్తం పరివర్జయేత్॥** 6

ఆ విధముగా కమండలువును అన్ని కార్యములందు వినియోగించు చున్నను దేవ, పితృ, అగ్ని కార్యములందు దీనిని వినియోగింపరాదు.

**తస్మాద్వినా కమండలునా నాధ్వానం వ్రజేత్**
**న సీమాంతం న గృహాద్ గృహమ్॥** 7

అందువలన సత్పురుషుడు కమండలువు లేక ఎచ్చటికిని పోరాదు. ఊరి పొలిమెర వరకైనా పోరాదు. చివరకు ఒక ఇంటి నుండి మరియొక ఇంటికి కూడా పోరాదు.

**పదమపి న గచ్ఛేదిషుమాత్రాదిత్యేకే॥** 8

**యదిచ్ఛతి ధర్మ సంతతిమితి బౌధాయనః॥** 9

బాణముకంటె ఒక అడుగు దూరమైనా కమండులువు లేక పోరాదని కొందరాచార్యులు పల్కుచుండగా నిరంతరము ధర్మపాలనచేయువాడు కమండులువు లేక ఎక్కడకు పోరాదని బౌధాయనుడనెను.

**ఋగ్విధం ఋగ్విధానం వాగ్వదతి ఋగ్విధం ఋగ్విధానం వాగ్వదతి॥**

"తస్యైషా భవతి। యత్తే శిల్పం కశ్యప రోచనావత్" అను బ్రాహ్మణ వాక్యము కూడా పై విషయమునే బలపరచుచున్నది.

ఇచ్చట అధ్యాయ సమాప్తిని సూచించుచు ఋగ్విధం ఇత్యాది పదములు రెండు పర్యాయములు చెప్పబడినవి.

ఇతి సప్తమః ఖండః

అథ అష్టమః ఖండః

**అథాతశ్శౌచాధిష్ఠానమ్ ॥** 1

అనుష్ఠానమనగా కారణము. ప్రస్తుతము శుద్ధికి సంబంధించిన ఇతర కారణములు తెలుపబడుచున్నవి.

**అద్భిశ్శుధ్యంతి గాత్రాణి బుద్ధిర్జ్ఞానేన శుధ్యతి।**
**అహింసయా చ భూతాత్మా మనస్సత్యేన శుధ్యతి॥** 2

శరీరము నీటిచే, బుద్ధి జ్ఞానముచే, భూతాత్మ అహింస వలన, మనస్సు సత్యముచే శుద్ధమగును యః కరోతి కర్మాణి స భూతాత్మోచ్యతే బుధైః॥ అను మనుస్మృతి వచనము ననుసరించి ఆత్మయే భూతాత్మగా పరిగణింపబడుచున్నది.

**మనశ్శుద్ధిరంతశ్శౌచమ్॥** 3

అంతశ్శౌచమనగా మనస్సు పరిశుద్ధముగా నుండుట .

**బహిశ్శౌచం వ్యాఖ్యాస్యామః॥** 4

ఇక బాహ్యశౌచమును వివరింతును.

**కౌశం సౌత్రం వా త్రిస్త్రివిద్యజ్ఞోపవీతమానాభేర్దక్షిణం**
**బాహుముద్ధృత్య సవ్యమవధాయ శిరోఽవదధ్యాత్॥** 5

యజ్ఞోపవీతము తొమ్మిది పురులతో పత్తి లేక దర్భలకు సంబంధించినది కావలెను. ఇది బొడ్డు కుడి భుజముక్రిందనుండి ఎడమభుజము పైనుండి శిరస్సున ధరింపవలెను. ఈ యజ్ఞోపవీతము పెద్దలను సేవించుచున్నప్పుడు, అతిథిపూజ చేయునపుడు హోమము, జపము, భోజనము, ఆచమనము వేదాధ్యయనములు చేయునప్పుడు అనగా అన్ని కాలములందు సర్వావస్థలందు ఉండవలెను. **"ఉపాసనే గురూణాం వృద్ధానామతిథీనాం హోమే యజ్ఞోపవీతీ స్యాత్"** అని ఆపస్తంబ మహర్షి తెలిపెను.

**విపరీతం పితృభ్యః॥** 6

పితృకార్యములు చేయునప్పుడు పై పద్ధతికి విపరీతముగా అనగా కుడి చేయిపైనుండి ఎడమ చేయి క్రిందినుండి ధరింపవలెను. "ఏత దేవ విపరీతం ప్రాచీనావీతం" అని వేదము కూడ తెలుపుచున్నది.

**కంఠేఽవసక్తం నివీతమ్॥** 7

యజ్ఞోపవీతము కంఠమున వ్రేలాడుచున్నచో అది నివీతమనబడును.

**అధోవసక్త మధోవీతమ్॥** 8

నాభికి క్రింది భాగమున ఉన్నచో అది అధోవీతము.

**ప్రాఙ్ముఖ ఉదఙ్ముఖో వాఽఽసీనశ్శౌచమారభేత శుచౌ దేశే దక్షిణం**
**బాహుం జాన్వంతరాకృత్వా ప్రక్షాళ్య పాదౌపాణీ చామణిబంధాత్॥ 9**

శౌచక్రియలను తూర్పు లేక ఉత్తర ముఖముగానుండి ప్రారంభింపవలెను. పరిశుద్ధమైన ప్రదేశమున కుడిచేయి, మోకాళ్ళ మధ్య ఉండునట్లు కూర్చొని (గొంతు కూ ర్చొని)శౌచమునాచరింపవలెను. అట్లే శౌచమునకుపూర్వము మణికట్టు వరకు చేతు లను, మరియు పాదములను కడుగుకొని యుండవలయును. **ఇచ్చట శౌచమనగా అచమనము.**

**పాదప్రక్షాలనోచ్ఛేషణేన నాచామేత్ యద్యాచామేత్**
**భూమౌ స్రావయిత్వా౽౽ చామేత్॥** 10

పాదప్రక్షాళనము చేసిన తరువాత కలశమున మిగిలిపోయిన నీటితో ఆచమనము చేయరాదు. విధిలేక ఆచమనము చేయవలసి వచ్చినచో ఆ పాత్రలో నున్న నీరును కొంత భూమిపై పోసిన తరువాతనే ఆచమనమును చేయవలెను.

**బ్రాహ్మణేన తీర్థేనా౽చామేత్॥** 11

బ్రాహ్మణుడు బ్రాహ్మ తీర్థముచే ఆచమనము చేయవలెను.

**అంగుష్ఠమూలం బ్రాహ్మం తీర్థమ్॥** 12

ఆచమనమునకై నీరు చేతిలోనికి తీసికొన్నప్పుడు అది బొటన వ్రేలు మొదటి వరకు వచ్చినచో అది బ్రాహ్మ తీర్థము.

**అంగుష్ఠాగ్రం పిత్ర్యమ్ అంగుళ్యగ్రం దైవమ్ అంగుళిమూలమార్షమ్॥**

బొటనవ్రేలు ఇతర వ్రేళ్ళ మధ్య ఉండునది పితృతీర్థము. ప్రాదేశిన్యంగు ష్ఠ్యోరంతరే పిత్ర్యమ్ అని వసిష్ఠ మహర్షి తెల్పెను. ఆ అంగుళుల మూల భాగము వరకుండు తీర్థము ఆర్షము. అట్లే అంగుళుల అగ్రభాగము వరకు ఉండునది దైవతీర్థము.

**నాంగుళీభిర్న సంబుద్ధం న ఫేనాభిర్నోష్ణాభిర్న క్షారాభిర్న**
**కటుకాభిర్న వివర్ణాభిర్న దుర్గంధరసాభిః॥** 14

ఆచమనమునకు తీసికొను తీర్థము వ్రేళ్ళ సందులలోనుండి జారి పోకూడదు. నురగతో ఉండకూడదు. వేడిగా ఉండకూడదు. ఉప్పునీళ్ళు కారాదు. రంగు మారకూడదు. దుర్గంధముగా కూడ ఉండరాదు.

**న హసన్న జల్పన్న తిష్ఠన్న విలోకయన్న ప్రహ్వో న ప్రణతో**
**న ముక్తశిఖో న ప్రావృతకంఠో న వేష్టితశిరా న త్వరమాణో**
**నాయజ్ఞోపవీతో న ప్రసారితపాదో నాబద్ధకక్ష్యో న బహిర్**
**జానుః శబ్దమకుర్వన్ త్రిరపో హృదయంగమాః పిబేత్॥** 15

నవ్వుచు, మాట్లాడుచు, ఇటునటు చూచుచు, తలవంచి, వంగి, శిఖముడి వేయక, కంఠము చుట్టూ కప్పుకొని, తలపాగా పెట్టుకొని, తొందర పడుచు, యజ్ఞోపవీతము లేక, కాళ్ళను చాపి, ఆసనబంధమును వేసికొని, కుడిచేయి మోకాళ్ళకు బయట ఉండగా, శబ్దమును చేయుచు ఆచమనము చేయరాదు. హృదయమువరకు పోవు (అధికమైన) నీటిని తీసికొని మూడు మార్లు ఆచమనము చేయవలెను.

**త్రిః పరిమృజేత్ ద్విరిత్యేకే॥** 16

ఆచమనము చేసిన తరువాత పెదవులను మూడు మార్లు తుడుచుకొనవలెను. కొందరు రెండు మార్లు తుడుచుకొనవలెనని అనుచున్నారు

**సకృదుభయం స్త్రియాశ్శూద్రస్య చ॥** 17

స్త్రీ కాని, శూద్రుడు కాని ఆచమనమును, ఓష్ఠ పరిమార్జనము ఒకే పర్యాయము చేయవలెను.

**అథాప్యుదాహరంతి : -**

**గతాభిర్ హృదయం విప్రః కంఠ్యాభిః క్షత్రియశ్శుచిః**
**వైశ్యోఽ ద్భిః ప్రాశితాభిః స్యాత్ స్త్రీ శూద్రౌ స్పృశ్యచాంతతః ఇతి॥** 18

ఆచమనమునకు తీసికొనవలసిన జల పరిణామమును ధర్మశాస్త్రములిట్లు చెప్పుచున్నవి.

బ్రాహ్మణుడు హృదయంగమము లైన నీటిచే, క్షత్రియుడు కంఠగతమైన నీటిచే, వైశ్యుడు ముఖమున ప్రవేశించు స్వల్పమైన నీటిచే ఆచమనము చేయవలెను. అట్లే స్త్రీలు, శూద్రులు జలమును పెదవులచే స్పృశించినంత మాత్రమున ఆచమనమగును. మనువు కూడ 2- 62లో ఇదే విషయమును పేర్కొనెను.

**దంతవద్దంతసక్తేషు దంతవత్తేషు ధారణా।**
**ప్రస్తేషు తేషు నాచామేత్తేషాం సంస్రావవచ్ఛుచిరితి॥** 19

దంతములకు తగిలిన జలము దంతములవలె పవిత్రమైనదని భావింపవలెను నోటినుండి జారి పడిన నీటిని లాలా జలమువలె శుద్ధమైనదని భావింపవలెనే కాని అది అపవిత్రమైనదని భావించి ఆచమనము చేయనక్కరలేదు

**అథాప్యుదాహరంతి : -**

**దంతవద్దంతలగ్నేషు యచ్చాప్యంతర్ముఖే భవేత్।**
**ఆచాంతస్యావశిష్టం స్యాన్నిగిరన్నేవ తచ్ఛుచిరితి॥** 20

నోటియందున్న ఏ వస్తువైనను దంతములవలె పవిత్రమైనదే అగును. ఆచమనము చేసిన తరువాత నోటిలో మిగిలిన పోయిన నీటిని మ్రింగినచో అది కూడా పవిత్రమైనదేయని పూర్వాచార్యులు తెలిపిరి. ఇదే భావమును మనువు అధ్యా 5 శ్లో 19లో తెలిపియున్నాడు.

**ఖాన్యద్భిః సంస్పృశ్య పాదౌ నాభిః శిరః సవ్యం పాణిమంతతః॥** 21

కండ్లు మొదలగు ఇంద్రియములను నీటిచే స్పృశించిన తరువాత పాదములను, నాభిని, శిరస్సును, చివరకు ఎడమచేయిని నీటిచే స్పృశింపవలెను. వ్యాఖ్యానకర్తయైన గోవిందస్వామి ఇంకొకస్మృతి నుండి ఈ శ్లోకములను తీసికొని ఏ అవయవమును ఎట్లు స్పృశింపవలెనో వివరించెను.

అంగుష్ఠానామికాభ్యాం తు చక్షుషీ సముపస్పృశేత్।
ప్రదేశిన్యంగుష్ఠాభ్యాం తు నాసికే సముపస్పృశేత్॥
కనిష్ఠికాంగుష్ఠాభ్యాం తు శ్రవణే సముపస్పృశేత్।
పాదావభ్యుక్ష్య, సర్వాభిః నాభిమంగుష్ఠకేన తు।
దద్యాత్తు మూర్ధ్ని సర్వాభిః సవ్యే పాణౌ తతో జలమ్॥

బొటనవ్రేలు ఉంగరపు వ్రేళ్ళచే రెండు కండ్లను, చూపుడు వ్రేలు బొటనవ్రేళ్ళచే రెండు చెవులను, అన్ని వ్రేళ్ళచే రెండు పాదములను, బొటన వ్రేలిచే నాభిని, అన్ని వ్రేళ్ళచే శిరస్సును స్పృశించిన తరువాత ఎడమ చేతిని నీటిచే స్పృశింపవలెను.

**తైజసం చేదాదాయోచ్ఛిష్టీ స్యాత్ తదుదస్య ఆచమ్య**
**ఆదాస్యన్నద్భిః ప్రోక్షేత్॥** 22

బంగారమువంటి ధాతువస్తువులను చేతిలో తీసికొన్నప్పుడు ఆ చేయి ఎంగిలైనచో, ఆ పాత్రను ప్రక్కన పెట్టి ఆచమనము చేసి, ఆ పాత్రను ప్రోక్షించి తిరిగి తీసికొనవచ్చును.

**అధ చేదన్నేన ఉచ్ఛిష్టీ స్యాత్ తదుదాస్య**
**ఆచమ్య ఆదాస్యన్నద్భిః ప్రోక్షేత్॥**

అట్లే అన్న పాత్రచే చేయి ఎంగిలైనచో ఆ పాత్రను ప్రక్కన బెట్టి ఆచమనము చేసి ప్రోక్షించుచు ఆ పాత్రను తీసికొనవలెను.

**అధ చేదద్భిరుచ్ఛిష్టీ స్యాత్తదుదాస్యాచమ్యాదాస్యన్నద్భిః ప్రోక్షేత్॥**

అట్లే జలపాత్ర చేతిలో ఉన్నప్పుడు చేయి ఎంగిలైనచో ఆ పాత్రను ప్రక్కన బెట్టి ఆచమనము చేసిన తరువాత ఆ పాత్రను ప్రోక్షించి తీసికొనవలెను.

**ఏతదేవ విపరీతమమత్రే॥** 25

అమత్రమనగా మట్టి పాత్రయని అర్థము. మట్టి పాత్రచేతిలో ఉండగా చేయి ఎ ంగిలైనచో ఆ పాత్రను ప్రక్కనబెట్టి ఆచమనము చేసి ప్రోక్షించినను తిరిగి తీసికొనరాదు. ఆ పాత్రను పారవేయవలెనే కాని తిరిగి తీసికొనరాదు.

**వానస్పత్యే వికల్పః॥** 26

కఱ్ఱ పాత్ర చేతిలో ఉన్నప్పుడు ఆ పాత్ర ఉచ్ఛిష్టమైనచో ఆ పాత్రను ఆచమనము ప్రోక్షణ తరువాత తిరిగి తీసికొనవచ్చును. లేక పారవేయవచ్చును.

**తైజసానాముచ్ఛిష్టానాం గోశకృన్మృద్భస్మభిః**
**పరిమార్జనమన్యతమేన వా॥** 27

బంగారు వంటి పాత్రలు అపవిత్రమైనచో ఆవు పేడ, మట్టి, బూడిద వీటిలో దేనిచేనైనా ఆ పాత్రను తోమవలెను.

**తామ్ర రజత సువర్ణానామమ్లైః॥** 28

ఇంకను రాగి, వెండి, బంగారు పాత్రలను చింతపండుచే 'శుద్ధి' చేయవచ్చును.

**అమత్రాణాం దహనమ్॥** 29

అపవిత్రమైన మట్టి పాత్రలను కాల్చినచో పవిత్రమగును.

**దారవాణాం తక్షణమ్॥** 30

చెక్క పాత్రలు అపవిత్రమైనచో వాటిని చెక్కినచో పవిత్రమగును.

**వైణవానాం గోమయేన॥** 31

వెదురు పాత్రలు అపవిత్రమైనచో ఆవు పేడచే కడిగిన అవి పవిత్రమగును.

**ఫలమయానాం గోవాలరజ్జ్వా॥** 32

మారెడు, కొబ్బరి వంటి ఫలములకు సంబంధించిన పాత్రలను ఆవుతోకనుకుచ్చుగా చేసి తుడిచినచో పవిత్రమగును.

**కృష్ణాజినానాం బిల్వతండులైః॥** 33

కృష్ణాజినమునకు, మారెడు పండు బియ్యము కలిపి లేపము చేసినచో అది పవిత్రమగును.

**కుతపానామ్ అరిష్టైః ॥** 34

కుతపమను కంబళి (ధావళి) అరిష్టములను వృక్షములయొక్క పండ్లను లేపనము చేసినచో పవిత్రమగును.

**ఔర్ణానామాదిత్యేన॥** 35

ఊలుతో నేయబడిన కంబళి సూర్య కిరణములచే పరిశుద్ధమగును.

**క్షౌమాణాం గౌరసర్షప కల్కేన॥** 36

పట్టు వస్త్రములను తెల్లని ఆవాల లేపము చేత పరిశుద్ధి చేయవలెను.

**మృదా చేలానామ్॥** 37

పత్తి వస్త్రములు మట్టిచే (చౌడు?) పరిశుద్ధమగును.

**చేలవత్ చర్మణామ్॥** 38

తోలుచే చేసిన వాటిని పత్తివస్త్రములవలె మట్టిచే శుద్ధి చేయవలెను.

**తైజసవదుపలమణీనామ్॥** 39

ధాతు నిర్మితమైన వస్తువులవలె రాయి ఇంకను మణులచే చేయబడిన పాత్రలను ఆవు పేడ, మట్టి, బూడిదలలో వేటి చేతనైనను శుద్ధిచేయవచ్చును.

**దారువదస్థ్నామ్॥** 40

చెక్క పాత్రలవలె అస్థులచే చేసినవాటిని శుద్ధి చేయవలెను.

**క్షౌమవచ్ఛంఖ శృంగశుక్తి దంతానామ్॥** 41

శంఖము, కొమ్ము, ముత్యము, ఏనుగు దంతములచే చేసిన వానిని పట్టు వస్త్రములవలె శుద్ధి చేయవలెను.

**పయసా వా॥** 42

పైన పేర్కొన్న శంఖాది వస్తువులను పాల చేతనైనను శుద్ధి చేయవలెను.

**చక్షుర్ఘ్రాణానుకూల్యాద్వా మూత్ర పురీషాసృక్శుక్ల కుణప స్పృష్టానాం పూర్వోక్తానామన్యతమేన త్రిస్సప్తకృత్వః పరిమార్జనమ్॥** 43

మల మూత్రములు రక్తము రేతస్సు శవాదులచే దూషితమైన తైజస వస్తువులను కంటికి, ముక్కుకు అనుకూలముగా (చూచుటకు, వాసన చూచుటకు వీలుగా) పైన పేర్కొన్న అవు పేడ మొదలగు వాటియందు ఏదియో ఒకదాని చేత ఇరువది యొక్క పర్యాయములు (పూర్తిగా వాసన, మురికి పోవునట్లు) పరిశుద్ధి చేయవలెను.

**అతేజసానామేవంభూతానాముత్సర్గః॥** 44

ధాతు సంబంధము లేని పదార్థములు పై విధముగా దూషితమైనచో వాటిని పారవేయవలెను.

**వచనాద్యజ్ఞే చమసపాత్రాణామ్॥** 45

యజ్ఞమందలి చమసమను పాత్రలు ఉచ్ఛిష్టాదులచే దూషితమైనను తప్పులేదని వేదమందు చెప్పబడినది.

**న సోమేనోచ్ఛిష్టా భవంతీతి శ్రుతిః॥** 46

సోమరసస్పర్శ వలన పాత్రలు ఎంగిలి కావని వేదవచనము.

**కాలోఽగ్నిర్మనసశ్శుద్ధిరుదకాద్యుపలేపనమ్।**
**అవిజ్ఞాతం చ భూతానాం షడ్విధం శౌచముచ్యత ఇతి॥** 47

కాలము, అగ్ని, మనస్సు, జలము మొదలైనవాటిచే అలుకుట, అపవిత్రమైనట్లు తెలియక పోవుట అనునవి ఆరు విధములైన శౌచములు.

**అథాప్యుదాహరంతి : -**

**కాలం దేశం తథాత్మానం ద్రవ్యం ద్రవ్యప్రయోజనం ।**
**ఉపపత్తిమవస్థాం చ విజ్ఞాయ శౌచజ్ఞః కుశలో ధర్మేప్సుః సమాచరేత్॥**

ఈ విషయమున ధర్మ శాస్త్రజ్ఞులు దీనిని పేర్కొనుచున్నారు.

శుద్ధి నియములను తెలిసినవాడు, బుద్ధిమంతుడు, ధర్మాచరణ చేయువాడు అశుద్ధి జరిగిన సమయమును, స్థలమును, తనను, పదార్థమును, ఆ పదార్థము వలన జరుగు ప్రయోజనమును అశుద్ధికారణమును, అశుద్ధియైన వస్తు స్థితిని జాగ్రత్తగా విచారించి పరిశుద్ధిని చేయవలెను.

ఇతి అష్టమః ఖండః

అథ నవమః ఖండః

**నిత్యం శుద్ధః కారుహస్తః పణ్యం యచ్చ ప్రసారితమ్।**
**బ్రహ్మచారిగతం భైక్షం నిత్యం మేధ్యమితి శ్రుతిః॥** 1

మాలాకారుని చేయి, అంగడిలో పెట్టిన వస్తువు, బ్రహ్మచారి దగ్గర ఉన్న భిక్ష ఇవన్నియు పవిత్రమైనవని వేదము తెలుపుచున్నది.

**వత్సః ప్రస్నవనే మేధ్యః శకునిః ఫలశాతనే।**
**స్త్రియశ్చ రతిసంసర్గే శ్వా మృగ గ్రహణే శుచిః॥** 2

పాలు పితుకునప్పుడు దూడ (ముఖము) శుద్ధమైనది. పక్షిముఖము నుండి పండు జారి పడుచున్నప్పుడు ఆ పక్షి (ముఖము) పరిశుద్ధమైనది. రతి సమయమున స్త్రీ (ముఖము) పరిశుద్ధమైనది. అట్లే వేటాడు సమయమున కుక్క (ముఖము) పరిశుద్ధమైనది.

**ఆకరాశ్శుచయస్సర్వాః వర్జయిత్వా సురాకరమ్।**
**అదూష్యాస్సంతతాధారాః వాతోద్ధూతాశ్చ రేణవః॥** 3

మద్యము ఉత్పత్తియగు స్థానము తప్ప సమస్తమైన ఉత్పత్తి స్థానములు పవిత్రమైనవే. అట్లే ఎడ తెగకుండ పడు నీటి ధార, గాలికి కొట్టుకొని వచ్చిన దుమ్ము పరిశుద్ధమైనవి.

**అమేధ్యేషు చ యే వృక్షా ఉప్తా పుష్ప ఫలోపగాః।**
**తేషామపి న దుష్యంతి పుష్పాణి చ ఫలాని చ॥** 4

అపవిత్ర స్థానమందున్న వృక్షములయొక్క పువ్వులు, పండ్లు, మొదలైనవి అపవిత్రము కావు.

**చైత్యవృక్షం చితిం యూపం చండాలం వేదవిక్రయమ్।**
**ఏతాని బ్రాహ్మణః స్పృష్ట్వా సచేలో జలమావిశేత్॥** 5

చైత్యమందున్న వృక్షమును, చితిని, యజ్ఞ సంబంధమైన యూపాన్ని (పశువును బంధించుకొయ్య) చండాలుని, వేదమువలన ధనము సంపాదించువానిని (వేదవిక్రయీ) బ్రాహ్మణుడు తగిలినచో, కట్టుకొన్న వస్త్రముతోనే స్నానము చేయవలెను.

**ఆత్మశయ్యాసనం వస్త్రం జాయాऽపత్యం కమండలుః।**
**శుచీన్యాత్మన ఏతాని పరేషామశుచీని తు॥** 6

తన యొక్క శయ్య, తాను కూర్చుండు ఆసనము, తన వస్త్రము, తన భార్య, తన పుత్రుడు, తన కమండలువు ఇవన్నియు తనకు పవిత్రమైనవి. ఇతరులకివి అపవిత్రమైనవి.

**ఆసనం శయనం యానం నావః పంథాః తృణాని చ।**
**చండాల పతిత స్పృష్టం మారుతేనైవ శుద్ధ్యతి॥** 7

ఆసనము, శయ్య, బండి, నౌక, త్రోవ, గడ్డి వీటిని చండాలుడు లేక పతితుడు స్పృశించినను గాలి చేతనే అవి పవిత్రమగుచున్నవి.

**ఖలక్షేత్రేషు యద్ధాన్యం కూపవాపేషు యజ్జలమ్।**
**అభోజ్యాదపి తద్భోజ్యం యచ్చ గోష్ఠగతం పయః॥** 8

పంటకళ్ళములో ఉన్న ధాన్యము, బావులు చెరువులందున్న నీరు, కొట్టము నుండి తీసికొన్న పాలు, వీటిని అభోజ్యుని దగ్గర నుండియైనను తీసికొనవచ్చును.

**త్రీణి దేవాః పవిత్రాణి బ్రాహ్మణానామకల్పయన్।**
**అదృష్టమద్భిర్నిర్ణక్తం యచ్చ వాచా ప్రశస్యతే॥** 9

దోషమున్నట్లు ప్రత్యక్షముగా తెలియనిది, నీటిచే ప్రోక్షింపబడినది, బాగుగా ఉన్నదనివాక్కు చేత ప్రశంసింపబడినది ఈ మూడు పవిత్రమైనవని దేవతలు పేర్కొనిరి.

**ఆపః పవిత్రం భూమిగతాః గోతృప్తిర్యాసు జాయతే।**
**న వ్యాప్తాశ్చేదమేధ్యేన గంధవర్ణరసాన్వితాః॥** 10

భూమిపైనున్న నీరు పవిత్రమైనది. ఎందుకనగా ఆవులు ఆ నీటిని త్రాగి సంతృప్తి చెందుచున్నవి. కాని అమేధ్యమున్న నీరు, దుర్గంధముతోనున్న నీరు, చెడు రంగుతో, రుచితో ఉన్న నీరు మాత్రము అపవిత్రమైనది.

**భూమేస్తు సమ్మార్జన ప్రోక్షణ ఉపలేపన అవస్తరణ ఉల్లేఖనైర్యథా**
**స్థానం దోష విశేషాత్ ప్రాయత్యమ్॥** 11

ఊడ్చుట, ప్రోక్షించుట, అలుకుట, దర్భాదులను పరచుట, త్రవ్వుట మొదలైన వాటిచేత ఆయా స్థానముననుసరించి భూమి పరిశుద్ధమగును.

ఇతి నవమః ఖండః

అధ దశమః ఖండః

**అథాప్యుదాహరంతి**

**గోచర్మ మాత్రమబ్బిందుః భూమేశ్శుద్ధ్యతి పాతితః।**
**సమూఢమసమూఢం వా యత్రామేధ్యం న లక్ష్యతే॥** 1

అమేధ్యము లేనిచోట ఊడ్చినను, ఊడ్వకున్నను జలబిందువును ప్రోక్షణ చేసినచో ఆ జలబిందువు గోచర్మ మేర భూమిని పరిశుద్ధి చేయును.

**పరోక్షమధిశ్రితస్యాన్నస్యావద్యోత్య అభ్యుక్షణమ్॥** 2

పరోక్షముగా వండిన అన్నమును జ్వలించుచున్న అగ్నికి చూపి నీటిని అభ్యుక్షణము చేసిన అది పరిశుద్ధమగును. అభ్యుక్షణమనగా నీటిని చిలకరించుట.

**తథా ఆపణేయానాం చ భక్ష్యాణామ్॥** 3

అట్లే అంగడిలో ఉన్న తినుబండారములను కొన్నప్పుడు వాటిని జ్వలించుచున్న అగ్నికి చూపి నీటిని అభ్యుక్షణము చేసినచో అవి పవిత్రమగును.

**బీభత్సవః శుచికామా హి దేవాః నాశ్రద్ధధానాయ హవిర్జుషంతఇతి॥**

దేవతలు స్వభావతః పవిత్రమైన వానినే కోరుకొందురు. అందువల్లనే అపవిత్రమైన వస్తువులనసహ్యించుకొందురు. ఐనప్పటికీ శ్రద్ధగా సమర్పించినచో వాటిని స్వీకరింతురు.

**శుచేరశ్రద్ధధానస్య శ్రద్ధధానస్య చాశుచేః।**
**మీమాంసిత్వోభయం దేవాః సమమన్నమకల్పయన్॥**
**ప్రజాపతిస్తు తానాహ న సమం విషమం హి తత్।**
**హతమశ్రద్ధధానస్య శ్రద్ధాపూతం విశిష్యతే॥** 5

పవిత్రమైనా శ్రద్ధ లేక నివేదించిన పదార్థము, శ్రద్ధ ఉన్నను అపవిత్రమైన పదార్థము ఈ రెండిటిలో ఏది గొప్ప అనువిషయము పైన దేవతలు బాగా చర్చించి రెండూ సమానమే అని అనిరి. కాని ప్రజాపతి వారితో ఇవి రెండు సమానము కావు. శ్రద్ధ లేక సమర్పించిన పదార్థము వ్యర్థమైనది కాని శ్రద్ధతో సమర్పించుట వలన పవిత్రమైన పదార్థము చాలా గొప్పదని తెలిపెను.

అథాప్యుదాహరంతి : -

**అశ్రద్ధా పరమః పాప్మా శ్రద్ధా హి పరమం తపః।**
**తస్మాదశ్రద్ధయా దత్తం హవిర్నాశ్నంతి దేవతాః॥** 6

ఈ విషయమున ధర్మశాస్త్ర కారులిట్లు తెలుపుచున్నారు.

అశ్రద్ధ చాలా చెడ్డది. శ్రద్ధ గొప్ప తపస్సు వంటిది. కావున శ్రద్ధతో సమర్పించిన హవిస్సు మొదలగు వానినే దేవతలు స్వీకరింతురనిరి.

**ఇష్ట్వా దత్వాఽపి మూర్ఖః స్వర్గం న హి స గచ్ఛతి॥** 7

అజ్ఞానియైనవాడు శ్రద్ధలేక యాగము చేసినను, పదార్థములను నివేదించినను వాటి ఫలితములను పొందజాలడు కావున స్వర్గాది స్థానమును పొందలేక పోవుచున్నాడు.

**శంకాపిహితచారిత్రో యస్స్వాభిప్రాయమాశ్రితః।**
**శాస్త్రాతిగః స్మృతో మూర్ఖో ధర్మతంత్రోపరోధనాత్॥** 8

ఎల్లప్పుడు శంకించుచు, తన అభిప్రాయమే గొప్పదని భావించుచు శాస్త్రనియమముల నతిక్రమించువాడు ధర్మ శాస్త్రములను అతిక్రమించి ప్రవర్తించుచున్నందువలన **మూర్ఖుడని పిలువబడుచున్నాడు.**

**శాక పుష్ప ఫల మూలౌషధీనాం తు ప్రక్షాళనమ్॥** 9

ఆకు కూరలు, పుష్పములు, పండ్లు, గడ్డలు, ఓషధులు వీటిని బాగుగా కడిగినచో పరిశుద్ధమగును.

**శుష్కం తృణమ్ అయాజ్ఞికం కాష్ఠం లోష్టం వా తిరస్కృత్య అహో-**
**రాత్రయోః ఉదగ్దక్షిణాముఖః ప్రావృత్య శిర ఉచ్చరేత్ అవమేహేద్వా॥** 10

మలమూత్రములు విడుచునప్పుడు ఎండిన గడ్డినైనా యజ్ఞమునకు సంబంధించని కట్టెపుల్లనైనా అడ్డుపెట్టుకొని ఉత్తరము లేక దక్షిణ దిక్కుకు ముఖము పెట్టి శిరస్సునకు వస్త్రము చుట్టుకొని మలమూత్రములను వదలవలెను.

**మూత్రే మృదా అద్భిః ప్రక్షాళనమ్॥** 11

మూత్రము చేసిన తరువాత మూత్రేంద్రియమును తొలుత మట్టి చేత తరువాత నీటి చేత ఒకమారు ప్రక్షాళన చేయవలెను.

**త్రిః పాణేః॥** 12

మూత్రము చేసి మూత్రేంద్రియమును ప్రక్షాళన చేసికొన్న తరువాత చేతిని మూడు పర్యాయములు మట్టి మరియు నీటిచేత ప్రక్షాళన చేయవలెను.

**తద్వత్పురీషే॥** 13

మూత్రము చేసిన తరువాత హస్త ప్రక్షాళనము చేసికొన్నట్లే మలమును విసర్జించిన తర్వాత హస్త ప్రక్షాళన చేయవలెను.

**పర్యాయాస్త్రి స్త్రిః పాయోః పాణేశ్చ॥** 14

మల విసర్జనము తరువాత మలద్వారమును, చేతిని, మూత్ర విసర్జ నానంతరము కంటె మూడు రెట్లు అధికముగా ప్రక్షాళనము చేయవలెను.

**మూత్రవద్రేతస ఉత్సర్గే॥** 15

రేతస్సును విసర్జించినప్పుడు మూత్ర విసర్జనానంతరము చేసినట్లే మూత్రావయవమును, చేతిని ప్రక్షాళన చేయవలెను.

**నీవీం విస్రస్య పరిధాయ అప ఉపస్పృశేత్॥** **16**

**ఆర్ద్రం తృణం గోమయం భూమిం వాసముపస్పృశేత్॥** 17

తాను నడుమునకు ధరించు వస్త్రమును విప్పినప్పుడు, తిరిగి కట్టుకొనునప్పుడు ఆచమనము చేయవలెను. లేనిచో పచ్చిగడ్డి, ఆవుపేడ, భూమి వీటిలో దేనినైనా స్పృశింపవలెను.

**నాభేః అధఃస్పర్శనం కర్మయుక్తో వర్జయేత్॥** 18

ధార్మిక కార్యములు చేయునప్పుడు బొడ్డు క్రింది భాగమును తాకరాదు.

**"ఊర్ధ్వం వై పురుషస్య నాభేః మేధ్యమవాచీనమమేధ్యమి"తిశ్రుతిః॥**

పురుషుని యొక్క నాభికి ఊర్ధ్వ భాగము పవిత్రమైనది. అధోభాగము, అపవిత్రమైనదని వేదము (తైత్తిరీయ సంహిత) తెలుపుచున్నది.

**శూద్రాణామార్యాధిష్ఠితానాం అర్ధమాసి మాసి వా వపనమ్॥** 20

ఆర్యపురుషులదగ్గర సేవచేయు శూద్రులు పక్షము లేక నెలకు ఒకమారు క్షౌరము చేసికొనవలెను.

**ఆర్యవదాచమనకల్పః॥** 21

ఆర్యుల దగ్గర ఉన్న శూద్రుల ఆచమన విధానము ఆర్యులవలెనే ఉండును.

**వైశ్యః కుసీదముపజీవేత్ ॥** 22

వైశ్యుడు వడ్డీ వలన జీవింపవలెను.

**పంచవింశతిస్త్వేవ పంచమాషకీ స్యాత్॥** 23

ఇరువది ఐదు కార్షాపణములకు ఐదు మాషముల వృద్ధిని ప్రతినెల తీసుకొనవలెను. 20 మాషకములు ఒక పణము. అనగా నెలకు సుమారు 1 శాతము వడ్డీని తీసుకొని అతడు జీవింపవలెను.

**అథాప్యుదాహరంతి : -**

**యస్సమర్ఘమృణం గృహ్య మహార్ఘం యః ప్రయోజయేత్ ।**
**స వై వార్ధుషికో నామ సర్వధర్మేషు గర్హితః॥**
**వృద్ధిం చ భ్రూణహత్యాం చ తులయా సమతోలయత్।**
**అతిష్ఠద్భ్రూణహా కోట్యాం వార్ధుషిస్సమకంపత॥** 24

వడ్డి గురించి ఈ శ్లోకములను చెప్పుచున్నారు. ఒకరి దగ్గరనుండి తక్కువ వడ్డీకి అప్పు తీసుకొని ఎక్కువ వడ్డీకి ఇతరులకప్పిచువాడు వార్ధుషికుడు. అతనిని సమస్త ధర్మములు నిందించుచున్నవి. వడ్డీని భ్రూణహత్య అను మహాపాపమును ఒక త్రాసులో పెట్టి జోకినప్పుడు మహాపాతకమైన భ్రూణహత్య తేలికగా నుండి పైకి పోగా, వార్ధుషికుడు బరువుగా నుండి ఇటునటు కదలుచుండెను. (ఈ రెండవ శ్లోకమునకు గోవిందస్వామి ఏ కారణము వలననో వ్యాఖ్య వ్రాయలేదు.)

**గోరక్షకాన్ వాణిజకాన్ తథా కారు కుశీలకాన్।**
**ప్రేష్యాన్వార్ధుషికాంశ్చైవ విప్రాన్ శూద్రవదాచరేత్॥** 25

ఆవులను మేపువారు, వ్యాపారము చేయువారు, మాలాకారులు, అభినయము చేయువారు, భృత్యులుగా ఉన్నవారు, వడ్డీ వ్యాపారము చేయువారు అగు బ్రాహ్మణులను శూద్రులుగా భావింపవలెను.

**కామం తు పరిలుప్తకృత్యాయ కదర్యాయ నాస్తికాయ**
**పాపీయసే పూర్వౌ దద్యాతామ్॥** 26

కాని పూర్వవర్ణములవారగు బ్రాహ్మణ క్షత్రియులు ధార్మికకార్యములు చేయనివానికి, లుబ్ధునకు నాస్తికునకు, పాపికి ఇష్టమున్నట్లు వడ్డికి ధన మీయవచ్చును.

**అయజ్ఞేనావివాహేన వేదస్యోత్సాదనేన చ।**

**కులాన్యకులతాం యాంతి బ్రాహ్మణాతిక్రమేణ చ॥** 27

యజ్ఞములు చేయక వివాహము చేసికొనక, వేదాధ్యయనము కూడ చేయక, బ్రాహ్మణాతిక్రమణము చేసినవారు ఉన్నత కులమున పుట్టినను నికృష్టులగుచున్నారు.

**బ్రాహ్మణాతిక్రమో నాస్తి మూర్ఖే మంత్రవివర్జితే।**

**జ్వలంతమగ్నిముత్సృజ్య న హి భస్మని హూయతే॥** 28

మూర్ఖుడు, వేదాధ్యయనముచేయనివాడు అనువారియందు బ్రాహ్మణాతిక్రమదోషము లేదు. జ్వలించుచున్న అగ్నిని వదలి బూడిదలో ఎవ్వరు హోమము చేయరు కదా!

**గోభిరశ్వైశ్చ యానైశ్చ కృష్యా రాజోపసేవయా।**

**కులాన్యకులతాం యాంతి యాని హీనాని మంత్రతః॥** 29

**మంత్రతస్తు సమృద్ధాని కులాన్యల్ప ధనాన్యపి।**

**కులసంఖ్యాం చ గచ్ఛంతి కర్షంతి చ మహద్యశః॥** 30

గోవులు, గుఱ్ఱములు, వాహనములున్నా, సమృద్ధముగా భూమి ఉండి కృషి చేయుచున్నా, రాజసేవ చేయుచున్నప్పటికీ (రాజాధికారమున్నప్పటికీ) వేదమంత్రములు రానిచో ఎంత గొప్పవారైనను నికృష్టులగుదురు. అట్లే వేదాధ్యయనము బాగుగా చేసినవారు దరిద్రులైనా ఉన్నతులగుచున్నారు. ఇంకా అధిక కీర్తిని పొందుచున్నారు.

**వేదః కృషి వినాశాయ కృషిర్వేదవినాశినీ।**

**శక్తిమానుభయం కుర్యాత్ అశక్తస్తు కృషిం త్యజేత్॥** 31

వేదాధ్యయనము, అధ్యాపనములు చేయువానియొక్క వ్యవసాయము నాశనమగును. వ్యవసాయమును బాగుగా చేయువాడు వేదాధ్యయనాధ్యాపనములు చేయలేడు. శక్తి ఉన్న ద్విజుడు కృషితో పాటు వేధాధ్యయనాదులను చేయవచ్చును. కాని శక్తిలేనిద్విజుడు వ్యవసాయమును వదలి వేదాధ్యయనాధ్యాపనములను మాత్రము చేయవలెను.

**న వై దేవాన్ పీవరో సంయతాత్మా రోరూయమాణః కకుదీ సమశ్నుతే।**
**చలత్తుందీ రభసః కామవాదీ కృశాస ఇత్యణవస్తత్ర యాంతి॥ 32**

మిక్కిలి బలసినవాడు, నిగ్రహము లేనివాడు, గానప్రియుడు, ఎద్దులచే బ్రతుకుచున్నవాడు, ప్రాణిహింస చేయువాడు, తీక్షణమైన స్వభావము కలవాడు, యథేష్టముగా మాట్లాడువాడు అగు ద్విజుడు దేవతలను పొందలేడు. కాని తపోవ్రతాదులచే కృశించి అణువులవలె తేలికగా ఉన్న వారు మాత్రము దేవలోకమును చేరెదరు.

**యద్యౌవనే చరతి విభ్రమే సద్వాఽసద్వా యాదృశం వా యదా**
**వా।ఉత్తరే చేద్వయసి సాధువృత్తః తదేవాస్య భవతి నేతరాణి॥ 33**

యౌవనంలో ఉన్నవాడు  ఎట్లు తిరిగినను తరువాతి సమయములో మంచి ప్రవర్తన కలిగియున్నచో అతడు సత్ ఫలితమునే పొందును కాని బాల్యమున మరియు యౌవనము చేసిన చెడు కర్మల ఫలితమును పొందడు.

**శోచేత మనసా నిత్యం దుష్కృతాన్యనుచింతయన్।**
**తపస్వీ చాప్రమాదీ చ తతః పాపాత్ప్రముచ్యతే॥ 34**

యౌవనానంతరకాలమున తాను పూర్వము చేసిన తప్పులను తలచుకొని పశ్చాత్తాపపడుచూ తపస్వివలె తప్పులేవి చేయకుండా ఉన్నచో పాపములకు అతడు దూరమగును.

**స్పృశంతి బిందవః పాదౌ య ఆచామయతః పరాన్।**
**న తైరుచ్ఛిష్టభావస్స్యాత్ తుల్యాస్తే భూమిగైస్సహ॥ 35**

ఆచమనము చేయుచున్నప్పుడు భూమి పై బడిన నీటి బిందువులు చిల్లి ఇతరుల పాదములపై పడినచో అవి ఎంగిలినీరు కాక భూగతమైన నీరువలె పవిత్రమగును.

ఇతి దశమః ఖండః

అథ ఏకాదశః ఖండః

**సపిండేష్వాదశాహమాశౌచమితి జనన మరణయోరధికృత్య వదంతి ఋత్విక్ దీక్షిత బ్రహ్మచారివర్జమ్॥** 1

జనన మరణములందు సపిండులకు పది దినములు అశౌచముండునని ధర్మజ్ఞులందురు. కాని ఋత్విక్కు, దీక్షితుడు బ్రహ్మ చారులకు ఇది వర్తింపదు.

**సపిండతా త్వాసప్తమాత్సపిండేషు॥** 2

సపిండులందు ఏడు తరముల వరకు సపిండత ఉండును. అనగా తనకు ముందు మరియు తరువాత మూడు తరముల వరకు సపిండత ఉండును.

**ఆసప్తమాసాదాదంత జననాద్వోదకస్పర్శనమ్॥** 3

శిశువుపుట్టినప్పటి నుండి ఏడు నెలలవరకు లేక దంతములు మొలుచువరకు శిశువు చనిపోయినచో సపిండులు స్నానము మాత్రము చేయవలెను. ఇచ్చట ఉదకోపస్పర్శనమనగా స్నానము అని అర్థము.

**పిండోదకక్రియా ప్రేతే నాత్రివర్షే విధీయతే।**
**ఆదంత జననాద్వాఽపి దహనం చ న కారయేత్॥** 4

శిశువునకు మూడు సంవత్సరములు వచ్చు వరకు లేక దంతములు వచ్చువరకు పిండదానము, ఉదకదానము చేయరాదు. అట్లే ఆ శిశువునకు దహనమును కూడా చేయరాదు.

**అప్రత్తాసు చ కన్యాసు ప్రత్తాస్వేకేహ కుర్వతే।**
**లోకసంగ్రహణార్థం హి యదమంత్రాస్త్రియో మతాః॥** 5

వివాహము కాని కన్యకు పిండములు పెట్టుట, ఉదకదానము చేయరాదు. కొందరు వివాహమైన తమ పుత్రికలకు పిండ, ఉదకదానములు చేయుచున్నారు. ఇది లౌకికమైన ఆచారమే. ఎందువలన అనగా స్త్రీలకు చేయు సమస్త కర్మలు మంత్రములు లేకుండనే చేయువలసియున్నవి. యాజ్ఞవల్క్యుడు కూడ కామోదకం సఖి ప్రత్తా స్వస్రీయ శ్వశురర్త్విజామ్ అని సఖి మొదలగు వారికి ఇష్టమున్నచో చేయవచ్చుననెను.

**స్త్రీణాం కృతవివాహానాం త్ర్యహాచ్ఛుధ్యంతి బాంధవాః।**
**యథోక్తేనైవ కల్పేన శుధ్యంతి చ సనాభయః॥** 6

పెండ్లియైన స్త్రీలు చనిపోయినచో వారి యొక్క తల్లి పక్షమునకు చెందిన బంధువులు మూడు దినముల అశౌచము తరువాత స్నానము చేసి శుద్ధినొందుచున్నారు. కాని సోదరులు శాస్త్రోక్తముగా అశౌచమును పాటించవలెను.

**అపి చ ప్రపితామహః పితామహః పితా స్వయం సోదర్యా భ్రాతరః సవర్ణాయాః పుత్రః పౌత్రః ప్రపౌత్రః తత్పుత్రవర్జం తేషాం చ పుత్రపౌత్రమ్ అవిభక్తదాయం సపిండానాచక్షతే॥** 7

ప్రపితామహుడు, పితామహుడు, తండ్రి, తాను, తన స్వంతతమ్ములు, సవర్ణయైన తన భార్య యొక్క పుత్రులు, పౌత్రులు, వారి పుత్రులు (ప్రపౌత్రులు) వీరందరు సపిండులు. వీరి మధ్య ఆస్తి పంపకముండదు. కాని తమ ప్రపౌత్రుని పుత్రులు మాత్రము సపిండులు కారు.

**విభక్తదాయానపి సకుల్యానాచక్షతే॥** 8

ఆస్తి పంపకము చేసికొన్న వారిని సకుల్యులని అందురు. బుల్హర్ చెప్పినట్లు జీమూత వాహనుని వచనానుసారము ప్రపితామహునికి ముందున్న వారు, తన మునిమనుమని తరువాతి వారు అందరు సకుల్యులు.

**అసత్స్వన్యేషు తద్గామీ హ్యర్థో భవతి॥** 9

తన తరువాత ఔరసపుత్రాదులు లేనిచో అతని ఆస్తి సపిండులకు చెందును.

**సపిండాభావే సకుల్యః॥** 10

సపిండులెవ్వరు జీవించియుండనిచో ఆ ఆస్తి సకుల్యులకు చెందును.

**తదభావే పితాఽచార్యోఽంతేవాసీ ఋత్విగ్వా॥** 11

ఆ సకుల్యులు కూడా ఎవ్వరూ లేనిచో ఆ ఆస్తి పితృతుల్యుడైన ఆచార్యునకు గాని, శిష్యునకు గాని, ఋత్విక్కునకు గాని చెందును.

**తదభావే రాజా తత్స్వం త్రైవిద్యవృద్ధేభ్యః సంప్రయచ్ఛేత్॥** 12

వారు కూడా జీవించిలేనిచో రాజు ఆ ఆస్తిని తీసికొని వేద పండితులకు ఈయవలెను. అన్యవర్ణములవారి ఆస్తి మాత్రము రాజునకే చెందును.

**న కదాచిత్ స్వయం రాజా బ్రాహ్మణస్వమాదదీత॥** 13

బ్రాహ్మణుని ఆస్తిని రాజుగాని ఇతరులు గాని ఎట్టి పరిస్థితిలోను తీసికొనరాదు.

అథాప్యుదాహరంతి : -

బ్రహ్మస్వం పుత్రపౌత్రఘ్నం విషమేకాకినం హరేత్।
న విషం విషమిత్యాహుః బ్రహ్మస్వం విషముచ్యతే॥
తస్మాద్రాజా బ్రాహ్మణస్వం నాదదీత కదాచన।
పరమం హ్యేతద్విషం యద్ బ్రాహ్మణస్వమితి॥ 14

విషము ఒక్కరినే చంపును కాని బ్రాహ్మణుని ఆస్తి తీసుకొన్నచో అతని పుత్రులు, పౌత్రులందరు నశింతురు. అందువలన బ్రాహ్మణుని ఆస్తి గొప్ప విషముగా పేర్కొనబడుచున్నది. ఆకారణము వలన పరమ విషమైన బ్రాహ్మణ ధనమును రాజు ఎట్టి పరిస్థితిలోను తీసికొనరాదు.

**జననమరణయోస్సన్నిపాతే సమానో దశరాత్రః॥** 15

చావు, పుట్టుకలు ఒకేసారి కలసి వచ్చినచో రెండిటికి సమానముగా దశ రాత్రము అశౌచముండును.

**అథ యది దశరాత్రాస్సన్నిపతేయురాద్యం దశరాత్రమాశౌచమ్ ఆనవమాద్దివసాత్॥** 16

దశ రాత్రాశౌచములో మరియొక అశౌచము వచ్చినచో తొమ్మిదవ దినము వరకు మొదటి అశౌచమే పరిగణనలోకి తీసుకొనబడును.

**జననే తావన్మాతాపిత్రోర్దశాహమాశౌచమ్॥** 17

శిశువు జన్మించినప్పుడు ఆ శిశువు యొక్క తల్లి దండ్రులకు మాత్రము దశాహాశౌచముండును.

**మాతురిత్యేకే తత్పరిహరణాత్॥** 18

కొందరు తల్లికిమాత్రమే దశాహ అశౌచముండునని అప్పుడామెను స్పృశింపకూడదని అందురు.

**పితురిత్యపరే శుక్లప్రాధాన్యాత్॥** 19

రేతస్సు ప్రధానము కావున తండ్రికి మాత్రమే జాతాశౌచము ఉండునని మరికొందరు పేర్కొనుచున్నారు.

**అయోనిజా అపి పుత్రాః శ్రూయంతే॥** 20

వేదమందు తల్లి కడుపున పుట్టని అగస్త్యుడు వసిష్ఠుడు మొదలగు పుత్రులు కనిపించుచున్నారు.

**మాతాపిత్రోరేవ తు సంసర్గసామాన్యాత్॥** 21

సాధారణముగా సంతానోత్పత్తియందు ఇద్దరకు సంబంధముండును కావున జాతాశౌచము తల్లిదండ్రులిద్దరకుండును.

**మరణే తు యధాబాలం పురస్కృత్య యజ్ఞోపవీతాన్యపసవ్యాని కృత్వా తీర్థమవతీర్య సకృత్సకృత్త్రిర్నిమజ్య ఉత్తీర్యాచమ్యతత్ప్రత్యయముదకమాసిచ్య అత ఏవ ఉత్తీర్య ఆచమ్య గృహద్వార్యంగారముదకమితి సంస్పృశ్య అక్షారలవణాశినో దశాహం కటమాసీరన్॥** 22

చనిపోయినప్పుడు చిన్న వయస్సువారు ముందుండగా వృద్ధులు తరువాత రాగా శవమువెంట పోవలెను. వారందరు యజ్ఞోపవీతములను అపసవ్యము చేసికొని ఒక్కొక్క మారు నీటిలో మునిగి స్నానము చేసి, ఒడ్డుకు వచ్చి ఆచమనము చేయవలెను. ఇట్లు మూడు పర్యాయములు నీటిలో దిగి స్నానము చేసి ఆచమనము చేయవలెను. తరువాత చనిపోయిన వ్యక్తికి నీటిలో నుండి ఉదకదానము చేసి తీరమునకు వచ్చి మరల ఆచమనము చేయవలెను. తరువాత ఇంటికి తిరిగివచ్చి ప్రధాన ద్వారము దగ్గర నిప్పునో జలమునో స్పృశింపవలెను. అశౌచముతోనున్న వారందరు ఉప్పు కారము లేని ఆహారము తీసికొనుచు ఆ పది దినములు చాపపైననే పడుకొనవలెను.

**ఏకాదశ్యాం ద్వాదశ్యాం శ్రాద్ధకర్మ॥** 23

మరణించిన పదకొండు పన్నెండు దినములందు శ్రాద్ధము పెట్టవలెను.

**శేషక్రియాయాం లోకోఽనురోద్ధవ్యః॥** 24

శ్రాద్ధము కాక మిగిలిన క్రియాకలాపమందు లోకాచారమననుసరింపవలెను.

**అత్రాప్యసపిండేషు యథాఽసన్నం త్రిరాత్రమహో రాత్రమేకాహమ్ ఇతి కుర్వీత॥** 25

ఇచ్చట సపిండులు కానివారి విషయమున మృతునితో ఉన్న సంబంధము ననుసరించి మూడు రాత్రులు, ఒక రాత్రి మరియు పగలు, లేక ఒక పగలు

మాత్రము అశౌచముండును. గౌతమ ధర్మ సూత్రము అసపిండే యోనిసంబంధే సహాధ్యాయిని చ ఇత్యాది 2-5-18 సూత్రముననుసరించి పక్షిణి అశౌచముండవలెనని తెలుపుచున్నది.

**ఆచార్యోపాధ్యాయ తత్పుత్రేషు త్రిరాత్రం పక్షిణ్యేకాహమ్॥** 26

ఆచార్యుడు మృతి చెందినచో త్రిరాత్రము, ఉపాధ్యాయునకు పక్షిణి, వారి పుత్రులకు ఒక పగలు అశౌచముండవలెను.

**ఋత్విజాం చ॥** 27

ఋత్విక్కులు మృతి చెందినచో మూడు రాత్రులు అశౌచమును పాటింపవలెను.

**శిష్య సతీర్థ సబ్రహ్మచారిషు త్రిరాత్రమహోరాత్రమేకాహమితి కుర్వీత॥28**

శిష్యుడు, తన తోడి విద్యార్థి (ఒకే గురువు దగ్గర చదువుకొన్నవాడు) సహాధ్యాయి చనిపోయినచో మూడు రాత్రులు, అహోరాత్రము, ఒక పగలు అశౌచము ఉండవలెను.

**గర్భస్రావే గర్భమాస సమ్మితా రాత్రయః స్త్రీణామ్॥** 29

గర్భస్రావము జరిగినచో ఎన్ని మాసముల గర్భమున్నచో అన్ని దినములు స్త్రీలకు అశౌచముండును.

**పరశవోపస్పర్శనేనభిసంధిపూర్వం సచేలోఽపః స్పృష్ట్వా సద్యశ్శుద్ధో భవతి॥**

తెలియక అసపిండుని శవమును తగిలినచో తాను ధరించిన వస్త్రముతో (సచేలముగా) స్నానము చేసి పరిశుద్ధుడగును.

**అభిసంధి పూర్వం త్రిరాత్రమ్॥** 31

సపిండుడు కాని వాని శవమును తెలిసి ముట్టినచో మూడు రాత్రులు అశౌచముండవలెను.

**ఋతుమత్యాం చ॥** 32

రజస్వలయైన స్త్రీని తెలియక స్పృశించినచో సచేల స్నానము, తెలిసి కూడ ముట్టుకొన్నచో త్రిరాత్రములు అశౌచముండవలెను.

**"యస్తతో జాయతే సోఽభిశస్త" వ్యాఖ్యాతాన్యస్యై వ్రతాని॥** 33

వివాహిత కాక రజస్వలయైన స్త్రీకి పుట్టినవాడు అభిశస్తుడనబడునని వేదము

(తై.సం.2-1) తెలుపుచున్నది. అట్లే రజస్వలయైన స్త్రీ చేయవలసిన వ్రతములను కూడా వేదము వివరించినది.

**వేదవిక్రయిణం యూపం పతితం చితిమేవ చ।**
**స్పృష్ట్వా సమాచరేత్ స్నానం శ్వానం చండాలమేవ చ॥** 34

వేదమును విక్రయించువానిని, యజ్ఞయూపమును, పతితుడైన వానిని, చితిని, శునకమును, చండాలుని స్పృశించినచో స్నానము చేయవలెను.

**బ్రాహ్మణస్య వ్రణద్వారే పూయశోణిత సంభవే।**
**కృమిరుత్పద్యతే తత్ర ప్రాయశ్చిత్తం కథం భవేత్॥** **35**
**గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్।**
**త్ర్యహం స్నాత్వా చ పీత్వా చ క్రిమిదష్టః శుచిర్భవేత్॥** 36

శరీరమున వ్రణమై చీము రక్తము కారుచు చివరకు పురుగులు పడినచో గోమూత్రము, గోమయము, గోక్షీరము, ఆవు పెరుగు, ఆవు నేయి వీటిని దర్భలున్న నీటితో కలిపి స్నానము చేసి వీటినే త్రాగినచో అతడు పరిశుద్ధుడగును.

**శునోపహతస్సచేలోఽవగాహేత॥** 37

కుక్క కరచినచో వెంటనే తాను ధరించిన వస్త్రములతో (సచేలముగా) స్నానము చేయవలెను.

**ప్రక్షాళ్య వా తం దేశమగ్నినా సంస్పృశ్య పునః ప్రక్షాళ్య**
**పాదౌ చ ఆచమ్య ప్రయతో భవతి॥** 38

ఇంకను కుక్క కరచిన చోట వెంటనే బాగుగా కడిగి అక్కడ నిప్పుచురక వేయవలెను. తరువాత పాదములు కడుగుకొని ఆచమనము చేసినచో నిర్మలించును.

**అథాప్యుదాహరంతి : -**

**శునా దష్టస్తు యో విప్రో నదీం గత్వా సముద్రగామ్।**
**ప్రాణాయామశతం కృత్వా ఘృతం ప్రాశ్య విశుధ్యతి॥**
**సువర్ణ రజతాభ్యాం వా గవాం శృంగోదకేన వా।**
**నవైశ్చ కలశైః స్నాత్వా సద్య ఏవ శుచిర్భవేత్॥** 39

బ్రాహ్మణునకు కుక్క కరచినచో వెంటనే జీవనదిలో (సముద్రము వరకు

పోవునది) స్నానము చేసి నూరు పర్యాయములు ప్రాణాయామము చేయవలెను. తరువాత గోఘృతమును తిన్నచో బాగుపడును. లేక బంగారు కలశములు, వెండికలశములు ఇంకను మట్టికుండలు తొమ్మిది తీసికొని వాటిలో నీరు తీసికొని స్నానము చేసినను, గోశృంగోదకముచే స్నానము చేసినను నిమ్మళించును.

ఇతి ఏకాదశః ఖండః

అథ ద్వాదశః ఖండః

**అభక్ష్యాః పశవో గ్రామ్యాః॥** 1

పల్లెటూరి పశువులను తినరాదు. ప్రధానముగా ఆవు, లేక ఎద్దు, అశ్వము, మేక, గొఱ్ఱె, గాడిద, ఒంటె, కుక్క అను వాటిని తినరాదు.

**క్రవ్యాదాశ్శకునయశ్చ॥** 2

మాంసమును తినే గ్రామ్య పక్షులను కూడ తినరాదు.

**తథా కుక్కుట సూకరమ్॥** 3

అట్లే కోడి, పంది అనువానిని తినరాదు.

**అన్యత్రాజావికేభ్యః॥** 4

మేక, గొఱ్ఱె తప్ప తక్కిన గ్రామ్య పశువులను తినరాదు అని ప్రత్యేకముగా తెలుపుచున్నందువలన మేక, గొఱ్ఱెలను తినవచ్చునని భావము.

**భక్ష్యాః శ్వావిట్ గోధా శశ శల్యక కచ్ఛప ఖడ్గాః**
**ఖడ్గ వర్జాః పంచ పంచనఖాః॥** 5

శ్వావిట్ (కుక్క వంటి మృగము) ఉడుము, కుందేలు, ఏదుపంది, తాబేలు అను ఐదు గోళ్ళున్నవాటిని మాత్రము తినవచ్చును. ఖడ్గ మృగము విషయమున కొందరు సందేహమును తెలుపుచున్నారు.

**తథర్శ్య హారిణ పృషత మహిష వరాహ కులుంగాః**
**కులుంగవర్జాః పంచ ద్విఖురిణః॥** 6

అట్లే రెండు గిట్టలున్న ఋశ్యము? లేడి, పృషతము? అడవి దున్న, అడవి పంది అను ఐదింటిని కూడా తినవచ్చును. కులుంగమను మృగము విషయమున కొందరు సందేహించుచున్నారు.

**పక్షిణస్తిత్తిరి కపోత కపింజల వార్ధ్రాణస మయూరాం**
**వారణాః వారణవర్జా పంచ వివిష్కిరాః॥** 7

ఆహారమును ఏరుకొని తినే తిత్తిరి పక్షి, పావురము, కపింజల పక్షి, వార్ధ్రాణసము, నెమిలి అను ఐదు పక్షులను తిన వచ్చును. వారణమను పక్షి విషయమున కూడా సందేహము కలదు.

**మత్స్యాస్సహస్రదంష్ట్రచిలిచిమో వర్మీ బృహచ్ఛిరో**
**రోమశకరి రోహిత రాజీవాః॥** 8

సహస్రదంష్ట్రము, చిలిచిమము, వర్మీ, బృహచ్ఛిర, రోమశకరి, రోహిత, రాజీవములను చేపలను తినవచ్చును. ఇంతవరకు చెప్పిన మృగపక్షి మత్స్యములలో తెలియని పదములను పల్లెటూరివారి ద్వారా తెలిసికొనవలెనని గోవిందస్వామి తెలుపుచున్నాడు.

**అనిర్దశాహ సంధినీ క్షీరమపేయమ్॥** 9

పై మృగములు పది దినములవరకు ఇచ్చు జున్ను పాలను, చూలు కట్టిన తరువాత ఇచ్చు పాలను తీసికొనరాదు.

**వివత్సాఽన్యవత్సయోః॥** 10

దూడ చనిపోయినధేనువుయొక్క తల్లి చనిపోయిన దూడలకు పాలిచ్చు ధేనువుయొక్క పాలను తీసికొనరాదు.

**ఆవికమౌష్ట్రికమేకశఫమ్॥** 11

గొఱ్ఱె, ఒంటె ఇంకను ఒకే గిట్ట ఉన్న జంతువుల పాలను త్రాగరాదు.

**అపేయ పయఃపానే కృచ్ఛ్రోఽన్యత్ర గవ్యాత్॥** 12

ఆవు పాలు తప్ప మిగిలిన జంతువుల పాలు త్రాగ కూడని సమయమున త్రాగినచో కృచ్ఛ్రమను ప్రాయశ్చిత్తమును చేయవలెను.

**గవ్యే త్రిరాత్రముపవాసః॥** 13

త్రాగకూడని ఆవు పాలను త్రాగినచో మూడు దినములు ఉపవాసము ఉండవలెను.

**పర్యుషితం శాక యూష మాంస సర్పిశ్శృత**

**ధానాగుడ దధి మధు సక్తు వర్జమ్॥** 14

ఆకుకూరలు, యూషము, మాంసము, నేయి, పిండి పాలు కలిపి ఉడికించిన పాయసము, పురోడాశము, బెల్లము, పెరుగు, తేనె, సత్తుపిండి తప్ప మిగిలిన ఆహార పదార్థములు చద్దివైనచో తినరాదు.

**శుక్తాని॥** 15

పులిసిపోయిన పదార్థములను తినరాదు.

**తథాஉజాతో గుడః** 16

అట్లే పూర్ణముగా పక్వము కాని బెల్లమును తినరాదు.

**శ్రావణ్యాం పౌర్ణమాస్యామాషాఢ్యాం వా ఉపాకృత్య**

**తైష్యాం మాఘ్యాం వా ఉత్సృజేయురుత్సృజేయుః॥** 17

శ్రావణ పూర్ణిమ లేక ఆషాఢ పూర్ణిమనాడు ఉపాకరణము చేసికొని (వేదాధ్యయనమును ప్రారంభించి) పుష్య పౌర్ణమి లేక మాఘ పూర్ణిమనాడు ఉత్సర్గము చేయవలెను.

ఇచ్చట పదావృత్తి అధ్యాయసమాప్తిని తెలుపను.

ఇతి ద్వాదశః ఖండః

## అథ త్రయోదశః ఖండః

**శుచిమధ్వరం దేవా జుషంతే॥** 1

ధ్వరము అనగా హింస, హింస లేనిది అధ్వరము అనగా యాగము. దేవతలు పవిత్రమైన యజ్ఞమునే స్వీకరింతురు. ఇచ్చట దేవ శబ్దముచేత పితృదేవతలను కూడ స్వీకరింపవలెను.

**శుచికామా హి దేవాశ్శుచయః॥** 2

దేవతలు తాము స్వయము పవిత్రముగా ఉందురు. మరియు పవిత్రతను కోరుకొందురు.

**'శుచీ వో హవ్యా మరుతశ్శుచీనాం శుచిం హినోమ్యధ్వరం శుచిభ్య!**
**ఋతేన సత్యమృతసాప ఆయంశ్చుచి జన్మానశ్శుచయః పావకా' ఇతి॥**

ఈ ఋఙ్మంత్రము దేవతల పవిత్రతను తెలుపుచున్నది.

ఓ మరుద్దేవతలారా! పవిత్రులైన మీ యొక్క హవ్యములు శుచిగా ఉండును. పవిత్రులైన మీకొరకు పవిత్రమైన యజ్ఞమునే ఆచరించెదను. అందువలన పవిత్రమైన ఈ యజ్ఞమును సేవించువారు పవిత్రమైన జన్మ కలవారు స్వయముగా పవిత్రులైన (చండాల పతితస్పృష్టం మారుతేనైవ శుద్ధ్యతి అన్నట్లు అపవిత్రమైన పదార్థములను కూడ పవిత్రము చేయు) మీరు సత్యమైన పరమస్థానమును పొందెదరు అని భావము.

**అహతం వాససాం శుచి తస్మాద్యత్కించేజ్యాసంయుక్తం**
**స్యాత్ సర్వం తదహతేన వాససా కుర్యాత్॥** 4

వస్త్రములందు నూతన వస్త్రము పవిత్రమైనది. అందువలన యాగ సంబంధమైన సమస్త కర్మలను నూతన వస్త్రము చేతనే చేయవలెను.

**ప్రక్షాళితోపవాతాన్యక్లిష్టాని వాసాంసి పత్నీ యజమానౌ**
**ఋత్విజశ్చ పరిదధీరన్॥** 5

అట్లే యజమాని, అతని భార్య, యాగమునందు పని చేయు ఋత్విక్కులు ఉతికి ఆరవేసినవి చిరిగిపోనివి ఐన వస్త్రములను ధరింపవలెను.

**ఏవం ప్రక్రమాదూర్ధ్వమ్॥** 6

ఈ విధముగా యజమాని మొదలగువారు నూతన వస్త్రములచే యాగము నారంభించి యాగము చివరివరకు ఇట్టి వస్త్రములనే ధరింపవలెను.

**దీర్ఘసోమేషు సత్రేషు చైవమ్॥** 7

దీర్ఘకాలము జరుగు సోమయాగములందు సత్రయాగములందు కూడ ఇట్టి నూతనవస్త్రములనే ధరింపవలెను.

**యథా సమామ్నాతం చ॥** 8

ఆయా యాగములందు నిర్దేశించినట్లు కూడా వస్త్రధారణ చేయవలెను.

**యథైతదభిచారణీయేష్విష్టి పశు సోమేషు లోహితోష్ణీషా లోహిత**
**వాసశ్చఋత్విజఃప్రచరేయుఃచిత్రవాససశ్చిత్రసంగావృషాకపావితిచ॥**

అభిచార హోమములందు, కొన్ని సోమయాగములందు ఎఱ్ఱని వస్త్రములు ధరింపవలెను. అట్లే వృషాకపియాగమున రంగు రంగుల వస్త్రములను ధరింపవలెను. కావున ఆయా యాగములందు నిర్దేశింపబడిన వస్త్రములనే ధరింపవలెను.

**అగ్న్యాధానే క్షౌమాణి వాసాంసి తేషామలాభే**

**కార్పాసికాన్యౌర్ణాని వా భవంతి॥** 10

అగ్న్యాధాన సమయమున యజమాని అతని భార్య పట్టు వస్త్రములు ధరింపవలెను. పట్టు బట్టలు లభింపనిచో ప్రత్తి లేక ఊలుకు సంబంధించిన బట్టలు ధరింపవచ్చును.

**మూత్ర పురీషలోహిత రేతః ప్రభృత్యుపహతానాం**

**మృదాఽ ద్భిరితి ప్రక్షాళనమ్॥** 11

మూత్రము, మలము, రక్తము, రేతస్సు మొదలగు వానిచే అపవిత్రమైన వస్త్రములను మట్టి, మరియు నీటిచే ఉతకవలెను.

**వాసోవత్తార్ప్య వృకలానామ్॥** 12

నూలు వస్త్రములను పరిశుద్ధము చేసినట్లే తృప, వృకల? అను వృక్షముల నుండి చేసిన వస్త్రములు అపవిత్రమైనప్పుడు శుద్ధి చేయవలెను.

**వల్కలవత్కృష్ణాజినానామ్॥** 13

నార బట్టలను పరిశుద్ధము చేసినట్లే కృష్ణాజినమును పవిత్రము చేయవలెను.

**న పరిహితమధిరూఢమ్ అప్రక్షాలితం ప్రావరణమ్॥** 14

నడుము క్రింద ధరించిన వస్త్రమును, కూర్చొనుటకు, పడుకొనుటకు ఉపయోగించిన వస్త్రమును ఉతుకక కప్పుకొనరాదు.

**నాపల్పులితం మనుష్య సంభుక్తం దేవత్రా యుంజ్యాత్॥** 15

పల్పూలితమనగా శిలపై బాదినది, అట్లు రాతిపై బాదక, మనుష్యుడు ఉపయోగించిన వస్త్రమును దేవతాకార్యములందు ఉపయోగింపరాదు.

**ఘనాయా భూమేరుపఘాతే ఉపలేపనమ్॥** 16

వేదిక వంటి కఠినమైన భూమి అపవిత్రమైననప్పుడు గోమయముచే అలుకవలెను.

**సుషిరాయాః కర్షణమ్॥** 17

రంధ్రములున్నభూమిని దున్నినచో పరిశుద్ధమగును.

**క్లిన్నాయాః మేధ్యమాహృత్య ప్రచ్ఛాదనమ్॥** 18

తడిగా ఉన్న భూమిని పవిత్రమైన మట్టిచే కప్పినచో అది పవిత్రమగును.

**చతుర్భిశ్శుధ్యతే భూమిః గోభిరాక్రమణాత్ ఖననాత్**
**దహనాత్ అభివర్షణాచ్చ॥** **19**

అపవిత్రమైన భూమి ఆవులు తిరుగాడినందువలన, త్రవ్వినందువలన, కాల్చినందువలన, వర్షమువలన ఈ నాల్గింటిచే పరిశుద్ధమగును.

**పంచమాచ్చోపలేపనాత్ షష్ఠాత్కాలాత్॥** 20

ఇంకను అలికినందువలన లేక కాలముగడచినందువలన భూమి పవిత్రమగుచున్నది.

**అసంస్కృతాయాం భూమౌ న్యస్తానాంతృణానాం ప్రక్షాళనమ్॥** **21**

జలాదులచే పవిత్రము చేయబడని భూమిపై ఉంచిన దర్భాది తృణములను కడుగవలెను.

**పరోక్షోపహతానామ్ అభ్యుక్షణమ్॥** 22

తన పరోక్షములో అపవిత్రమైనట్లు భావించిన దర్భాది తృణములను అభ్యుక్షణము చేయవలెను.

**ఏవం క్షుద్ర సమిధానామ్॥** 23

ఇదే విధముగా చిన్న చిన్న సమిధలను కూడా అభ్యుక్షణము చేయవలెను.

**మహతాం కాష్ఠానాముపఘాతే ప్రక్షాళ్య అవశోషణమ్॥** 24

పెద్దగా ఉన్న కట్టెలు అపవిత్రమైనచో తొలుత వాటిని ప్రక్షాళన చేసి ఎండ బెట్టవలెను.

**బహూనాం తు ప్రోక్షణమ్॥** 25

సమిధలు మొదలైన పెద్ద కట్టెలు అనేకమున్నచో పవిత్రతకై నీటిని ప్రోక్షింపవలెను.

**దారుమయానాం పాత్రాణాముచ్ఛిష్టసమన్వారబ్ధానామ్ అవలేఖనమ్॥**

చెక్కతో చేసిన యజ్ఞ పాత్రలు ఎంగిళ్ళకు తగిలినచో ఆ పాత్రలను గీకినచో పవిత్రమగును

**ఉచ్ఛిష్టలోపోపహతానామ్ అవతక్షణమ్॥** 27

చెక్కతో చేసిన స్రుక్ స్రువాది యజ్ఞ పాత్రలు ఎంగిలై అపవిత్రమైనచో వాటిని చెక్కివేయవలెను.

**మూత్ర పురీష లోహిత రేతః ప్రభృత్యుపహతానామ్ ఉత్సర్గః॥** 28

స్రుక్ స్రువాది కఱ్ఱ పాత్రలు మల మూత్రములు, రక్తము, రేతస్సు మొదలగు వాటిచే అపవిత్రమైనచో ఆ పాత్రలను పారవేయవలెను.

**తదేతదన్యత్ర నిర్దేశాత్॥** 29

యజ్ఞాది పాత్రలను శుద్ధి చేయు విధానము, ఇంకొక చోట కూడా (14వ ఖండమున) తెలుపబడినది.

**యథైతదగ్నిహోత్రే ఘర్మోచ్ఛిష్టే చ దధిఘర్మే చ కుండపాయినామ్**
**అయనేచోత్సర్గిణామయనే చ దాక్షాయణయజ్ఞే చైడాదధే చ**
**చతుశ్చక్రే చ బ్రహ్మోదనేషు చ తేషు సర్వేషు దర్భైరద్భిః ప్రక్షాళనమ్॥** 30

అగ్నిహోత్రమున ఆహుతులనన్నిటిని ఇచ్చిన తరువాత మిగిలిన హవిస్సును భక్షించుట చెప్పబడినది. ప్రవర్గ్యమను దానిలో ఘర్మోచ్ఛిష్టము చెప్పబడినది. అట్లే సోమయాగమున దధిఘర్మ భక్షణము కలదు. కుండపాయినామయనమను దీర్ఘ సత్రమున ఋత్విక్కులు చమసపాత్రలో భక్షింతురు. ఉత్సర్గిణామయనము కూడా ఒక దీర్ఘ సత్రయాగము. అచ్చట సాన్నాయ్యాన్న భక్షణముండును. దాక్షాయణ యజ్ఞము ఒక విధమైన దర్శపూర్ణమాసము. ఇచ్చట కూడా సాన్నాయ్య అన్న భక్షణముండును. ఐడాదధము చతుశ్చక్రము అనునవి ఇష్టులు. ఇవి కూడా దర్శపూర్ణమాసము వంటివే. ఇచ్చట కూడా సాన్నాయ్యాన్న భక్షణముండును. ఇటువంటి భక్షణల తరువాత చమసమువంటి యజ్ఞ పాత్రల శుద్ధిని దర్భలు మరియు జలములచేతనే చేయవలెను.

**సర్వేష్వేవ సోమభక్షేష్వద్భిరేవ మార్జాలీయే ప్రక్షాళనమ్॥** 31

సోమయాగములన్నిటియందు చమసమువంటి మార్జాలీయములను నీటిచేతనే ప్రక్షాళన చేయవలెను.

**మూత్ర పురీష లోహిత రేతః ప్రభృత్యుత్సర్గః॥** 32

మల మూత్రములు, రక్తము, రేతస్సువంటి వాటిచే అపవిత్రమైన చమసాది పాత్రలను మాత్రము పారవేయవలెను.

ఇతి త్రయోదశః ఖండః

అథ చతుర్దశః ఖండః

**మృణ్మయానాం పాత్రాణాముచ్ఛిష్ట సమన్వారబ్ధానామవకూలనమ్॥** 1

యజ్ఞ సంబంధము కల మట్టి పాత్రలు ఎంగిళ్ళకు తగిలినచో వాటిని కుశాగ్నిచే కాల్చవలెను.

**ఉచ్ఛిష్ట లోపోపహతానాం పునర్దహనమ్॥** 2

ఆ పాత్రలకు ఎంగిలి బాగుగా అంటుకొన్నచో వాటిని బాగుగా కాల్చవలెను.

**మూత్ర పురీష లోహిత రేతః ప్రభృత్యుపహతానామ్ ఉత్సర్గః॥** 3

ఆ పాత్రలు మలమూత్రాదుల చేత అపవిత్రమైనచో వాటిని పారవేయవలెను.

**తైజసానాం పాత్రాణాం పూర్వవత్పరిమృష్టానాం ప్రక్షాళనమ్॥** 4

బంగారు పాత్రలు మొదలైన వాటికి ఇంతకు ముందు పేర్కొన్నట్లు ఎంగిళ్ళు మొదలైనవి అంటుకొన్నచో వాటిని బాగుగా కడుగవలెను.

**పరిమార్జన ద్రవ్యాణి గోశకృన్మృద్భస్మేతి॥** 5

బంగారు పాత్రలు మొదలైన వాటిని శుద్ధి చేయుటకు ఆవు పేడ, మట్టి, బూడిద అనువానిని ఉపయోగింపవలెను.

**మూత్ర పురీష లోహిత రేతః ప్రభృత్యుపహతానాం పునః కరణమ్॥**

ఆ పాత్రలు మల మూత్రాదుల చేత అపరిశుద్ధమైనప్పుడు వాటిని చెడగొట్టి తిరిగి పాత్రలుగా చేయించవలెను.

**గోమూత్రే వా సప్తరాత్రం పరిశాయనమ్॥** 7

లేక గోమూత్రమున ఏడు దినములు సంపూర్ణముగా ముంచవలెను.

**మహానద్యాం వా ఏవమ్॥** 8

లేక మహానదిలోనైనా ఏడు దినములు పూర్తిగా ముంచవలెను.

**ఏవమశ్మమయానామ్॥** 9

ఈ విధముగా రాతిచే చేసిన పాత్రలను శుద్ధి చేయవలెను.

**అలాబు, బిల్వ వినాళానాం గోవాలైః పరిమార్జనమ్॥** 10

సొరకాయ, నేరెడు, వెదురుతో చేసిన యజ్ఞ పాత్రలపవిత్రమైనచో గోవాలమును గుత్తిగా చేసి దానిచే ఆ పాత్రలను తుడువవలెను.

**నల వేణు శర కుశవ్యూతానాం గోమయేనాద్భిరితి ప్రక్షాళనమ్॥**

నలమను వెదురు, శరము, దర్భలచే అల్లబడిన పాత్రలు అపవిత్రమైనచో నీటిచే కడుగవలెను.

**వ్రీహీణాముపఘాతే ప్రక్షాళ్య అవశోషణమ్॥** 12

వడ్లు మొదలైనవి (తక్కువ పరిణామములో ఉన్నవి) అపవిత్రమైనచో కడిగి ఎండ బెట్టవలెను. ఎక్కువ పరిమాణమున ఉన్నచో నీటిచే ప్రోక్షింపవలెను.

**తండులానామ్ ఉత్సర్గః॥** 13

బియ్యము అపవిత్రమైనచో వాటినన్నిటిని పారవేయవలెను.

**ఏవం సిద్ధహవిషామ్॥** 14

ఇదే విధముగా వండిన హవిస్సు కూడా అపవిత్రమైనచో పారవేయవలెను.

**మహతాం శ్వవాయస ప్రభృత్యుపహతానాం తం దేశం పురుషాన్న ముద్ధృత్య 'పవమానస్సువర్జన' ఇత్యేతేనానువాకేనాభ్యుక్షణమ్॥ 15**

అధిక పరిమాణమున ఉన్న అన్నమును కుక్క, కాకి మొదలైనవి ముట్టుకొన్నచో ఆ అన్నమును మాత్రము తీసివేసి పవమానసూక్తముచే ప్రోక్షింపవలెను.

**మధూదకే పయోవికారే పాత్రాత్ పాత్రాంతరానయనే శౌచమ్॥** 16

పెరుగు, తేనె, నేయి నీరు, పురోడాశములచే తయారు చేయబడిన మధూదకము, పాలచే చేయబడిన పదార్థములు తగిలినందువలన అపవిత్రమైనచో ఒక పాత్రనుండి మరియొక పాత్రలోనికి తీసికొన్నందువలన అవి పవిత్రమగును.

**ఏవం తైలసర్పిషీ ఉచ్ఛిష్టసమన్వారబ్ధే ఉదకేఽవధాయోపయోజయేత్॥**

ఇట్లే నూనె, నేయి పాత్రలకు ఎంగిలి అంటుకొన్నచో వాటిని నీటిలో ఉంచి ఉపయోగించుకొనవలెను.

**అమేధ్యాభ్యాధానే సమారోప్యాగ్నిం మథిత్వా పవమానేష్టిం కుర్యాత్॥**

మలమూత్రాదులు అగ్నిలో పడినచో తిరిగి అగ్నిని మథించి పవమానేష్టి [illegible] ఆ అగ్ని పవిత్రమగును. ఆ పవమానేష్టియందు పురోడాశమునకు బదులు [illegible] ఉపయోగింపవలెను.

**శౌచదేశమంత్రావృదర్ధ ద్రవ్య సంస్కార కాలభేదేషు**
**పూర్వ పూర్వ ప్రాధాన్యం పూర్వ పూర్వ ప్రాధాన్యమ్॥** 19

పవిత్రత, స్థానము, మంత్రము, క్రియాక్రమము, ప్రయోజనము, పదార్థము, వాటి సంస్కారము, ఆయాకర్మలు చేయుకాలము అనువాటిలో పూర్వ పూర్వమైనవి ప్రదానమగుచున్నవి.

ఇచ్చట పదావృత్తి అధ్యాయసమాప్తిని సూచించును

ఇతి చతుర్దశః ఖండః

అధ పంచదశః ఖండః

**ఉత్తరత ఉపచారో విహారః॥** 1

యజ్ఞాగ్నికి ఉత్తరమునుండియే ప్రదక్షిణముగా ఋత్విగ్యజమానులు పోవలెను.

**తధాపవర్గః॥** 2

అట్లే ఉత్తరదిక్కునందే పరిసమాప్తి చేయవలెను.

**విపరీతం పిత్ర్యేషు ॥** 3

పితృకార్యములందు దక్షిణమున ప్రారంభించి దక్షిణముననే అంతముకావలెను.

**పాదోపహతం ప్రక్షాళయేత్॥** 4

పాదములు తగిలినందువల్ల అపవిత్రమైన పాత్రలను నీటిచే కడుగవలెను.

**అంగముపస్పృశ్య సిచం వా అప ఉపస్పృశేత్॥** 5

యజ్ఞాది కార్యములందు అవయమును తగిలినను, వస్త్రము యొక్క కొంగును తగిలినను నీటిని స్పృశింపవలెను.

**ఏవం ఛేదన భేదన ఖనన నిరసన పిత్ర్య రాక్షస నైఋత రౌద్రాభిచరణీయేషు॥**

ఇదే విధముగా యాగమున ఏదేని వస్తువును త్రుంచినప్పుడు, విరిచినప్పుడు, పాతినప్పుడు, తీసి వేసినప్పుడు, పితృ, రాక్షస, నిర్ఋతి, రుద్రులకు సంబంధించిన ఆహుతులనిచ్చిన తరువాత, అభిచారిక హోమము చేసి, తరువాత జలస్పర్శనము చేయవలెను.

**న మంత్రవతా యజ్ఞాంగేన ఆత్మానం పరిహరేత్॥** 7

మంత్రోచ్చారణ చేయుచున్నప్పుడు యజ్ఞోపకరణములకు అగ్నికి మధ్య తానుండరాదు. అనగా మంత్రోచ్చారణతో ఉపయోగించు యజ్ఞోపకరణములు తనముందు ఉండవలెనే కాని వెనక భాగమున ఉండరాదు.

**అభ్యంతరాణి యజ్ఞాంగాని॥** 8

యజ్ఞోపకరణములన్నియు అగ్ని సమీపముననే ఉండవలెను.

**బాహ్యా ఋత్విజః॥** 9

ఋత్విక్కులు యజ్ఞోపకరణములకు వెలుపల ఉండవలెను.

**పత్నీ యజమానౌ ఋత్విగ్భ్యోఽ ంతరతమౌ॥** 10

యజమాని, అతని ధర్మపత్ని ఋత్విక్కులకంటె అగ్నికి సమీపమున ఉండవలెను.

**యజ్ఞాంగేభ్యః ఆజ్యమ్ ఆజ్యాద్ధవీంషి హవిర్భ్యః**
**పశుః పశోస్సోమః సోమాదగ్నయః॥** 11

యజ్ఞోపకరణములముందు నేయి, నేయి ముందు హవిస్సులు, హవిస్సులముందు పశువు, పశువునకు ముందు సోమరసము, సోమరసము ముందు యాగాగ్ని ఇట్లుండవలెను.

**యథాకర్మర్త్విజో న విహారాదభిపర్యావర్తేరన్॥** 12

యాగము పూర్తియగువరకు ఋత్విక్కులు యజ్ఞాగ్నికి విముఖముగా ఉండరాదు. అనగా యజ్ఞాగ్నికి వీపు చూపరాదు.

**ప్రాఙ్ముఖశ్చేద్దక్షిణమంసమ్ అభిపర్యావర్తేత॥** 13

తూర్పు ముఖముగా ఉన్నప్పుడు కుడి భుజము వైపు ముఖమును త్రిప్పవలెను.

**ప్రత్యఙ్ముఖస్సవ్యమ్॥** 14

పశ్చిమముఖముగా ఉన్నప్పుడు ఎడమ భుజమువైపు ముఖమును త్రిప్పవలెను. ఈ రెండు సూత్రములవల్ల ఋత్విక్కులు అగ్నికి ప్రదక్షిణము చేయుచు పోవలెనే కాని అప్రదక్షిణముగా పోరాదని తెలియుచున్నది. ముఖమును కూడా అగ్నివైపుననే ఉంచవలెను.

**అంతరేణ చాత్వాలోత్కరౌ యజ్ఞస్య తీర్థమ్॥** 15

చాత్వాలము వేదికి ఈశాన్యమున ఉండును. అక్కడి నుండియే మట్టిని తీసికొందురు. ఉత్కరమనగా వేదిపురీషముంచు స్థలము. యజ్ఞతీర్థమనగా వేది యొక్క మార్గము. ఇది చాత్వాలము మరియు ఉత్కరముల మధ్య ఉండును.

**అచాత్వాల ఆహవనీయోత్కరౌ॥** 16

చాత్వాలములేని దర్శపూర్ణమాసాదులందు యజ్ఞతీర్థము, ఆహవనీయము మరియు ఉత్కరముల మధ్య ఉండును.

**తతః కర్తారః పత్నీయజమానౌ చ ప్రపద్యేరన్॥** 17

ఆ మార్గమునుండియే యాగము చేయు ఋత్విక్కులు, యజమాని, అతని ధర్మపత్ని మొదలగు వారు ప్రవేశింపవలెను.

యజ్ఞము పూర్తియగు వరకు ఈ విధానమునే పాటింపవలెను.

**సంస్థితే చ సంచరోనూత్కరదేశాత్॥** 19

యజ్ఞము పూర్తియైన తరువాత ఋత్విక్కు మొదలగువారు ఉత్కరస్థానమును వదలి అనగా దాని వెనక నుండి బయటకు పోవలెను.

**నాప్రోక్షితమప్రపన్నం క్లిన్నం కాష్ఠం సమిధం నాభ్యాదధ్యాత్॥** 20

అగ్నియందు కట్టె లేక సమిధను ప్రోక్షింపకుండా, ఆహుతికి సిద్ధము చేయకుండా, పచ్చిగా ఉండగా దానిని వేయరాదు.

**అగ్రేణాహవనీయం బ్రహ్మయజమానౌ ప్రపద్యేతే॥** 21

బ్రహ్మ మరియు యజమాని ఆహవనీయాగ్నికి ముందునుండి వేదిక దగ్గరకు పోవలెను.

**జఘనేనాహవనీయమ్ ఇత్యేకే॥** 22

కొందరాచార్యులు ఆహవనీయాగ్ని వెనకనుండి బ్రహ్మ యజమానులు వేది దగ్గరకు పోవలెనని అనుచున్నారు.

**దక్షిణేనాహవనీయం బ్రహ్మాయతనమపరేణ యజమానస్య॥** 23

ఆహవనీయాగ్నికి దక్షిణమున (కుడిప్రక్క) బ్రహ్మ స్థానము, పశ్చిమమున (వెనక) యజమాని స్థానముండును.

**ఉత్తరాం శ్రోణిముత్తరేణ హోతుః॥** 24

హెూతస్థానము వేదికి ఉత్తరముననున్న శ్రోణికి ఉత్తరముననుండును.

**ఉత్కర ఆగ్నీధ్రస్య॥** 25

ఆగ్నీధ్రుని స్థానము ఉత్కరమునకు సమీపము నుండును.

**జఘనేన గార్హపత్యం పత్న్యాః॥** 26

యజమానియొక్క ధర్మపత్ని గార్హపత్యాగ్నికి వెనక ఉండును.

**తేషు కాలే కాల ఏవ దర్భాన్ సంస్తృణాతి॥** 27

బ్రహ్మ మొదలైనవారి స్థానములందు ఆయా యజ్ఞ ప్రారంభ కాలముననుసరించి కూర్చొనుటకు దర్భాసనములను సమకూర్చవలెను.

**ఏకైకస్య చోదకకమండలురుపాత్రస్స్యాత్ ఆచమనార్థమ్॥** 28

బ్రహ్మ మొదలైన పురుషులు ఒక్కొక్కరు ఆచమనము చేయుటకు ప్రత్యేకముగా జలపూర్ణమైన పాత్రలనుంచవలెను.

**వ్రతోపేతో దీక్షితః స్యాత్॥** 29

యజ్ఞమున వ్రతమును ఆచరించువాడు దీక్షితుడు కావలెను. (యజ్ఞ నియమముల పాటింపవలెను.)

**న పరపాపం వదేత్ న కృధ్యేత్ న రోదేత్ మూత్రపురీషే నావేక్షేత॥**

యజ్ఞదీక్షితుడు ఇతరుల తప్పులనెన్నరాదు. కోపమునకు రారాదు. ఏడ్వరాదు. మలమూత్రముల చూడరాదు.

**అమేధ్యం దృష్ట్వా జపతి "అబద్ధం మనో దరిద్రం చక్షుస్సూర్యో జ్యోతిషాం శ్రేష్ఠో దీక్షేమా మా హాసీరి"తి॥** 31

మలమూత్రములను చూచినప్పుడు "అబద్ధం మనో అనుమంత్రమును శుచియై జపింపవలెను.

ఇతి పంచదశః ఖండః

అధ షోడశః ఖండః

**చత్వారో వర్ణాః బ్రాహ్మణ క్షత్రియ విట్ శూద్రాః॥** 1

వర్ణములు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులని నాలుగు విధములు.

**తేషాం వర్ణానుపూర్వ్యేణ చతస్రో భార్యాః బ్రాహ్మణస్య॥** 2

బ్రాహ్మణుడు, క్రమముగా బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రవర్ణములకు చెందిన కన్యలను వివాహము చేసికొనవచ్చును

**తిస్రో రాజన్యస్య॥** 3

క్షత్రియునకు క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణములకు చెందిన ముగ్గురు భార్యలుండవచ్చును.

**ద్వే వైశ్యస్య॥** 4

వైశ్యునకు వైశ్య, శూద్రవర్ణములకు చెందిన ఇద్దరు భార్యలుండవచ్చును.

**ఏకా శూద్రస్య॥** 5

శూద్రునకు తన వర్ణమునకు చెందిన భార్య మాత్రమే ఉండవలెను

**తాసు పుత్రాస్సవర్ణాస్వనంతరాసు సవర్ణాః॥** 6

తన వర్ణమునకు, తరువాతి వర్ణమునకు చెందిన స్త్రీలయందు జన్మించిన పుత్రులందరు సవర్ణులేయగుచున్నారు. తరువాతి వర్ణములకు చెందిన స్త్రీలకు పుట్టినవారు సవర్ణ సదృశులని మనువు తెల్పెను.

స్త్రీష్వనంతరాసు జాతాసు ద్విజైరుత్పాదితాన్ సుతాన్।
సదృశానేవ తానాహుర్మాతృదోష విగర్హితాన్॥ మను-10-6

**ఏకాంతర ద్వ్యంతరాస్వంబష్ఠోగ్ర నిషాదాః॥** 7

బ్రాహ్మణునకు వైశ్యస్త్రీ ఏకాంతరా. ఆమెకు పుట్టినవాడు అంబష్ఠుడు. అట్లే అతనికి శూద్రస్త్రీ ద్వ్యంతర. ఆమెకు కలిగినవాడు నిషాదుడు. అదేవిధముగా క్షత్రియునకు శూద్రస్త్రీ ఏకాంతర. ఆమెయందు పుట్టినవాడు ఉగ్రుడు. వీరందరు అనులోమ సంతానము.

**ప్రతిలోమాస్త్వాయోగవ మగధ వైణ క్షత్తృ పుల్కస**
**కుక్కుట వైదేహక చండాలాః॥** 8

ఆయోగవ, మాగధ, వైణ, క్షత్తృ, పుల్కస, కుక్కుట, వైదేహక, చండాలురనువారు ప్రతిలోమ సంతానము.

**అంబష్ఠాత్ ప్రథమాయాం శ్వపాకః॥** 9

అంబష్ఠునికి బ్రాహ్మణస్త్రీకి పుట్టినవాడు శ్వపాకుడు.

**నిషాదాత్ తృతీయాయాం పుల్కసః॥** 11

నిషాదుని వలన వైశ్యస్త్రీకి జన్మించినవాడు పుల్కసుడు.

**విపర్యయే కుక్కుటః॥** 12

వైశ్యునకు నిషాదస్త్రీకి పుట్టినవాడు కుక్కుటుడు. ఇంకను క్షత్రియునకు విప్రకన్యయందు పుట్టినవాడు సూతుడు. వైశ్యునకు క్షత్రియబ్రాహ్మణస్త్రీలయందు పుట్టినవారు మాగధ వైదేహులు. శూద్రునివలన వైశ్య, క్షత్రియ, బ్రాహ్మణస్త్రీలయందు పుట్టినవారు ఆయోగవుడు, క్షత్త, చండాలుడు అని మనుస్మృతివల్ల తెలియుచున్నది.

క్షత్రియాద్విప్రకన్యాయాం సూతో భవతి జాతితః।
వైశ్యాత్ మాగధవైదేహౌ రాజ విప్రాంగనాసుతౌ॥
శూద్రాదాయోగవః క్షత్తా చండాలశ్చాధమో నృణామ్।
వైశ్యరాజన్యవిప్రాసు జాయంతే వర్ణ సంకరాః॥ 10-11,12

**నిషాదేన నిషాద్యామాపంచమాజ్జాతోపహంతి శూద్రతామ్॥** 13

నిషాద పురుషుడు నిషాదస్త్రీని వివాహము చేసి కొన్నచో ఐదవతరమున పుట్టినవానికి శూద్రత్వము ఉండదు.

**తముపనయేత్ షష్ఠం యాజయేత్ సప్తమో అవికృతో భవతి॥** 14

ఆ ఐదవతరము పురుషునకు ఉపనయనము చేయవచ్చును. ఆరవతరము పురుషుని చేత యాగము చేయింపవచ్చును. ఏడవ తరమునకు చెందిన పురుషుడు పరిశుద్ధుడగును. మనువు కూడా బ్రాహ్మణుడు శూద్ర స్త్రీని వివాహమాడినప్పుడు పుట్టిన స్త్రీని మరియొక బ్రాహ్మణుడు వివాహమాడగా స్త్రీ పుట్టినచో, ఆ స్త్రీని మరియొక బ్రాహ్మణుడు వివాహము చేసికొని స్త్రీని కన్నచో, ఈవిధముగా ఏడవతరమున పుట్టిన వాడు బ్రాహ్మణుడౌతాడని అట్లే క్షత్రియ వైశ్యులు కూడా శూద్రస్త్రీని పెండ్లి

చేసికొన్నప్పుడు పుట్టిన స్త్రీని అదేవర్ణమువాడు పెండ్లి చేసికొనుట అనునది ఏడు తరముల వరకు జరిగితే ఏడవ తరమున పుట్టినవాడు మూల వర్ణమును పొందునని చెప్పెను.

శూద్రాయాం బ్రాహ్మణాజ్జాతః శేయసా చేత్ప్రజాయతే।
అశ్రేయాన్ శ్రేయసీం జాతిం గచ్ఛత్యాసప్తమాద్యుగాత్॥
శూద్రో బ్రాహ్మణతామేతి బ్రాహ్మణశ్చైవ శూద్రతామ్।
క్షత్రియాజ్జాతమేవం తు విద్యాద్వైశ్యాత్తథైవ చ ॥మను- 10-64,65

ఇతి షోడశః ఖండః

## అథ సప్తదశః ఖండః

**తత్ర సవర్ణాసు సవర్ణాః ॥** 1

తమకు సమానమైన వర్ణము కలస్త్రీలందు పుట్టినవారు సవర్ణులు.

**బ్రాహ్మణాత్ క్షత్రియాయాం బ్రాహ్మణో వైశ్యాయామంబష్ఠః శూద్రాయాంనిషాద॥**

బ్రాహ్మణునికి క్షత్రియస్త్రీయందు పుట్టినవాడు బ్రాహ్మణసముడు. అతనికి వైశ్యస్త్రీయందు పుట్టినవాడు అంబష్ఠుడు. శూద్రస్త్రీయందు పుట్టినవాడు నిషాదుడు.

**పారశవ ఇత్యేకే॥** 3

నిషాదుని కొందరు పారశవుడని అందురు.

**క్షత్రియాద్వైశ్యాయాం క్షత్రియః శూద్రాయాముగ్రః॥** 4

క్షత్రియునకు వైశ్యస్త్రీయందు పుట్టినవాడు క్షత్రియసముడు. శూద్రస్త్రీయందు జన్మించినవాడు ఉగ్రుడు.

**వైశ్యాచ్ఛూద్రాయాం రథకారః॥** 5

వైశ్యునకు శూద్రస్త్రీ యందు కలిగినవానికి రథకారుడని అందురు.

**శూద్రాద్వైశ్యాయాం మాగధః క్షత్రియాయాం క్షత్తా బ్రాహ్మణ్యాం చండాలః॥ 6**

శూద్రునికి వైశ్యస్త్రీయందు కలిగినవాడు మాగధుడు. క్షత్రియస్త్రీయందు కల్గినవాడు క్షత్త. బ్రాహ్మణ, స్త్రీయందు కలిగినవాడు చండాలుడు. ఇచ్చుటపేర్కొనబడిన మాగధుడు అయోగవుడని మనుస్మృతియందు (10-12)చెప్పబడినది.

**వైశ్యాత్ క్షత్రియాయామాయోగవో బ్రాహ్మణ్యాం వైదేహకః॥** 7

వైశ్యునకు క్షత్రియస్త్రీయందు పుట్టినవాడు ఆయోగవుడు. బ్రాహ్మణస్త్రీయందు జన్మించినవాడు వైదేహకుడు. కాని మనుస్మృతియందు (10–11) ఈ ఆయోగవుడు మాగధుడుగా చెప్పబడినది.

**క్షత్రియాద్బ్రాహ్మణ్యాం సూతః॥** 8

క్షత్రియునకు బ్రాహ్మణస్త్రీయందు జన్మించినవాడు సూతుడు. వీరందరు ప్రతిలోమ సంతానము.

**తత్ర అంబష్ఠోగ్రసంయోగో భవత్యనులోమః॥** 9

అంబష్ఠుడు మరియు ఉగ్రా స్త్రీ కలయికవల్ల పుట్టినవాడు అనులోమ సంతానమేయగుచున్నాడు.

**క్షత్తృ వైదేహకయోః ప్రతిలోమః॥** 10

క్షత్త్ర మరియు వైదేహస్త్రీయందు పుట్టినవాడు ప్రతిలోమ సంతానము.

**ఉగ్రాజ్జాతః క్షత్త్రాయాం శ్వపాకః॥** 11

ఉగ్రునకు క్షత్తృస్త్రీకి కలిగినవాడు శ్వపాకుడు.

**వైదేహకాదంబష్ఠాయాం వైణః॥** 12

వైదేహునకు అంబష్ఠస్త్రీయందు పుట్టినవాడు వైణుడు.

**నిషాదాచ్ఛూద్రాయాం పుల్కసః॥** 13

నిషాదునకు శూద్రస్త్రీకి కలిగినవాడు పుల్కసుడు.

ఇచ్చటనే 16వ ఖండము 11 సూత్రమున నిషాదునకు వైశ్యస్త్రీకి పుట్టినవాడు పుల్కసుడు అని చెప్పబడింది? క్షత్తురుగ్రాయాం జాతః పుల్కసః అని మనుస్మృతియందు (10–18) కలదు.

**శూద్రాన్నిషాద్యాం కుక్కుటః॥** 14

శూద్రునకు నిషాదస్త్రీయందు పుట్టినవాడు కుక్కుటుడు. 16–12 సూత్రము?

**వర్ణసంకరాదుత్పన్నాన్ వ్రాత్యానాహుర్మనీషిణో**
**వ్రాత్యానాహుర్మనీషిణ ఇతి॥** 15

వర్ణ సంకరము వల్ల పుట్టినవారిని వ్రాత్యులని అందురు.

ఇతి సప్తదశః ఖండః

అథ అష్టాదశః ఖండః

**షడ్భాగభృతో రాజా రక్షేత్ప్రజామ్॥** 1

పట్టాభిషిక్తుడైన రాజు ప్రజలయొక్క ఆదాయమునుండి ఆరవ భాగమును తీసికొని ప్రజలను రక్షింపవలెను.

**బ్రహ్మ వై స్వం మహిమానం బ్రాహ్మణేష్వదధాత్ అధ్యయనాధ్యా -**
**పన యజన యాజన దాన ప్రతిగ్రహ సంయుక్తం వేదానాం గుప్త్యై॥**

బ్రహ్మదేవుడు తన మహిమరూపమైన వేదమును బ్రాహ్మణులందుంచెను. ఆ వేదములను రక్షించుటకై బ్రాహ్మణుని అధ్యయనము, అధ్యాపనము, యాగము చేయుట, చేయించుట, దానమిచ్చుట, దానము తీసికొనుట అను షట్కర్మయుక్తునిగా చేసెను.

**క్షత్రే బలమధ్యయన యజన దాన శస్త్ర కోశ భూత**
**రక్షణ సంయుక్తం క్షత్రస్య వృధ్ద్యై॥** 3

బ్రహ్మదేవుడు ప్రజారక్షణను చేయుటకై క్షత్రియునికి బలమును ప్రసాదించెను. అతనికి అధ్యయనము, యాగము చేయుట, దానమిచ్చుట, శస్త్రములను ధరించుట, ధనమును ప్రాణులను రక్షించుట అను కర్తవ్యముల నేర్పరచెను.

**విట్సు అధ్యయన యజన దాన కృషి వాణిజ్య**
**పశుపాలన సంయుక్తం కర్మణాం వృధ్ద్యై॥** 4

యజ్ఞాది కర్మలు పెంపొందుటకు వైశ్యునకు అధ్యయనము, యాగము చేయుట, దానము చేయుట వ్యవసాయము, వర్తకము, పశుపాలన అను కర్తవ్యములను కల్పించెను.

**శూద్రేషు పూర్వేషాం పరిచర్యా॥** 5

పూర్వవర్ణములైన బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులను సేవించుట శూద్రుని కర్తవ్యముగా నిర్దేశించెను.

**పత్తో హ్యసృజ్యంతేతి॥** 6

శూద్రులు పరమాత్మ పాదములనుండి పుట్టినట్లు "పద్భ్యాగ్ం శూద్రో అజాయత" మొదలైన శ్రుతి వాక్యములు తెలుపుచున్నవి. **అనగా శూద్రుడు సమాజము నిలబడుటకు తద్ గమనమునకు కారణమగుచున్నాడు.**

**సర్వతోధురం పురోహితం వృణుయాత్॥** 7

రాజు అన్ని విధములుగా సమర్థుడైన వానిని పురోహితుడుగా నియమించుకొనవలెను. న హ వా అపురోహితస్య రాజ్ఞో దేవా అన్నమదంతి అని పురోహితుని గూర్చి ఐతరేయ బ్రాహ్మణమున 40-1 చెప్పబడినది.

**తస్య శాసనే వర్తేత॥** 8

సర్వసమర్థుడైన పురోహితుడు చెప్పినట్లు రాజు నడుచుకొనవలెను. గౌతమస్మృతిలో పురోహితుడు విద్యావంతుడు, న్యాయపద్ధతిలో నడచువాడు తపస్వి కావలెనని చెప్పబడినది.

**సంగ్రామే న నివర్తేత॥** 9

అట్టి రాజు శత్రువులతో యుద్ధము చేయునప్పుడు వెనకంజ వేయరాదు.

**న కర్ణిభిర్న దిగ్ధైః ప్రహరేత్॥** 10

శూలము వంటి ఆయుధములను, విషము పూసిన ఆయుధములను యుద్ధమున ప్రయోగింపరాదు.

**భీత మత్తోన్మత్త ప్రమత్త విసన్నాహ స్త్రీ బాల వృద్ధ బ్రాహ్మణైర్న**
**యుధ్యేత అన్యత్ర ఆతతాయినః॥** 11

భయపడినవారు, మద్యముచే మత్తులు, పిచ్చివారు, యుద్ధ సన్నాహము చేయనివారు, స్త్రీలు, బాలురు, వృద్ధులు, బ్రాహ్మణులు వీరితో క్షత్రియుడు యుద్ధము చేయరాదు. వారు దుష్టులైనచో మాత్రము యుద్ధము చేయవచ్చును.

**అథాప్యుదాహరంతి**

**అధ్యాపకం కులే జాతం యో హన్యాదాతతాయినమ్।**
**న తేన భ్రూణహా భవతి మన్యుస్తం మన్యుమృచ్ఛతీతి॥** 12

ధర్మశాస్త్రవేత్తలు ఇట్లు చెప్పుచున్నారు. అధ్యాపకుడు ఉన్నత కులమున పుట్టినవాడైనను దుష్టుడైనచో అతనిని చంపిన క్షత్రియునకు బ్రాహ్మణ హత్యాపాపమంటదు. కోపము కోపగించువానిని పొందుచున్నది అని అందురు.

**సాముద్రః శుల్కః॥** 13

సముద్ర మార్గమున వచ్చు వస్తువులపై పన్ను ఇట్లుండును.

**వరం రూపముద్ధృత్య దశపణం శతమ్॥** 14

సముద్ర మార్గమున వచ్చు వస్తువులలో మిక్కిలి విలువైన ఒక వస్తువును వదిలి మిగిలిన వానిలో నూరు పణములకు పది పణముల పన్నును రాజు తీసుకొనవలెను.

**అన్యేషామపి సారానురూప్యేణానుపహత్య ధర్మం ప్రకల్పయేత్॥** 15

ఇతర వస్తువులలో కూడ సారరూపమున ఉన్న వస్తువును వదలి యజమానిని పీడించకుండునట్లు ధర్మ రూపమైన పన్నులు తీసికొనవలెను.

**అబ్రాహ్మణస్య ప్రణష్టస్వామికం రిక్థం సంవత్సరం**
**పరిపాల్య రాజా హరేత్॥** 16

బ్రాహ్మణేతరునికి సంబంధించిన ఆస్తికి యజమాని లేనిచో, యజమాని కొరకు రాజు ఒక సంవత్సరము వరకు వేచి చూచి, తరువాత దానిని స్వాధీనము చేసికొనవలెను.

**అవధ్యో వై బ్రాహ్మణస్సర్వాపరాధేషు॥** 17

ఎన్ని అపరాధములు చేసినను బ్రాహ్మణుని చంపరాదు.

**బ్రాహ్మణస్య బ్రహ్మహత్యా గురుతల్పగమన స్వర్ణస్తేయ**
**సురాపానేషు కుసింధ భగ సృగాల సురాధ్వజాంస్తప్తేనాయసా**
**లలాటేంఽకయిత్వా విషయాన్నిర్ధమనమ్॥** 18

బ్రాహ్మణుడు బ్రహ్మహత్య, గురుపత్నీ గమనము, దొంగతనము, మద్యపానము అను మహాపాపములను చేసినప్పుడు అతని ముఖముపై మానవుని మొండెము, భగము, నక్క, సురాభాండ చిహ్నములను ముద్రించి రాజ్యమునుండి బహిష్కరింపవలెను.

**క్షత్రియాదీనాం బ్రాహ్మణవధే వధస్సర్వస్వహరణం చ॥** 19

క్షత్రియాదులు బ్రాహ్మణుని చంపినచో ఆ దోషిని వధించి అతని ఆస్తినంతయు రాజు స్వాధీనము చేసికొనవలెను.

**తేషామేవ తుల్యాపకృష్టవధే యథాబలమనురూపాన్ దండాన్**
**ప్రకల్పయేత్॥** 20

క్షత్రియాదులు తమతో సమానమైన వానిని తమకంటె తక్కువ వానిని చంపినప్పుడు అతడు చంపినవానిననుసరించి అనురూపమైన దండన విధింపవలెను.

ఇతి అష్టాదశః ఖండః

అథ ఏకోన వింశః ఖండః॥

**క్షత్రియవధే గోసహస్రమృషభైకాధికం రాజ్ఞ ఉత్సృజేత్ వైరనిర్యాతనమ్॥** 1

క్షత్రియుని చంపినచో ప్రాయశ్చిత్తముగా రాజునకు వేయి ఆవులను మరియు ఒక వృషభమును సమర్పించుకొనవలెను.

**శతం వైశ్యే దశ శూద్ర ఋషభశ్చాత్రాధికః** 2

వైశ్యుని చంపినచో ప్రాయశ్చిత్తముగా నూరు ఆవులను, శూద్రుని చంపినచో పది ఆవులను రాజుకు ఈయవలెను. ఆవులతోపాటు వృషభమును కూడా ఈయవలెను.

**శూద్రవధేన స్త్రీవధో గోవధశ్చ వ్యాఖ్యాతః॥** 3

స్త్రీవధ లేక గోవధ చేసినప్పుడు ప్రాయశ్చిత్తముగా శూద్రవధ చేసినప్పుడిచ్చినట్లు ఆవులను, ఎద్దును ఈయవలెను.

**అన్యత్రాత్రేయ్యా వధాత్॥** 4

ముట్టు ఐన నాల్గవనాడు స్నానము చేసిన స్త్రీని ఆత్రేయీ అని అందురు. అట్టి స్త్రీని కాక ఇతర స్త్రీని చంపినచో పై ప్రాయశ్చిత్తమును చేసికొనవలెను. ఆత్రేయీస్త్రీని చంపినచో చేయవలసిన ప్రాయశ్చిత్తము 7వ సూత్రమందు చెప్పబడును.

**ధేన్వనడుహోశ్చ॥** 5

పాలనిచ్చు గోవు, బండిని లాగు ఎద్దును వధించినచో శూద్రవధవలె ప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

**ధేన్వనడుహోరంతే చాంద్రాయణం చరేత్॥** 6

పాలిచ్చు ధేనువును, బండిని లాగు ఎద్దును చంపినప్పుడు ప్రాయశ్చిత్తము చేసికొని చాంద్రాయణ వ్రతమునాచరింపవలెను.

**ఆత్రేయ్యా వధః క్షత్రియవధేన వ్యాఖ్యాతః॥** 7

ముట్టు స్నానము చేసిన స్త్రీని చంపినచో క్షత్రియవధ చేసినప్పుడు చేసికొనవలసిన ప్రాయశ్చిత్తమును చేసికొనవలెను. ఆత్రేయీవధవలన సంతానము కలుగకుండా చేసినట్లగును కావున అధికప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

**హంస భాస బర్హిణ చక్రవాక ప్రచలాక కాకోలూక కంటక**
**డిడ్డిక మండూక దేరికాశ్వ బభ్రు నకులాదీనాం వధే శూద్రవత్॥** 8

హంస, భాసము, నెమలి, చక్రవాకపక్షి, ప్రచలాకము, కాకి, గూబ, కంటకము, డిడ్డికము, కప్ప, దేరిక, కుక్క, భభ్రువు, ముంగిస అను వాటిని చంపినచో శూద్రవధ చేసినప్పుడు చేసికొన్నట్లు ప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

**లోకసంగ్రహణార్థం యథాదృష్టం యథాశ్రుతం సాక్షీ బ్రూయాత్॥**

సాక్షియైనవాడు తాను చూచిన దానిని, తాను విన్న దానిని స్పష్టముగా చెప్పవలెను.

**పాదో ధర్మస్య కర్తారం పాదో గచ్ఛతి సాక్షిణమ్।**
**పాదస్సభాసదస్సర్వాన్ పాదో రాజానమృచ్ఛతి॥**
**రాజా భవత్యనేనాశ్చ ముచ్యంతే చ సభాసదః।**
**ఏనో గచ్ఛతి కర్తారం యత్ర నింద్యో హ నింద్యతే॥** 10

అపరాధిని విచారించునప్పుడు సరియగు విచారణ చేయనిచో అపరాధి చేసిన పాపమున నాలుగవవంతు తప్పు చేసినవానికి చెందును. నాలుగవ వంతు సాక్షికి చెందును. నాలుగవవంతు పరిషత్సభ్యులకు చెందును. మిగిలిన నాలుగవవంతు రాజునకు చెందును కావున అపరాధిని చక్కగా విచారించి శిక్షించినచో ఆ పాపమంతయు తప్పు చేసినవానికే పోవును.

**సాక్షిణం త్వేవముద్దిష్టం యత్నాత్పృచ్ఛేద్విచక్షణః॥** 11

అందువల్ల విద్వాంసుడైన న్యాయాధీశుడు సాక్షిని ఈ విధముగా ప్రశ్నింపవలెను.

**యాం రాత్రిమజనిష్ఠాస్త్వం యాం చ రాత్రిం మరిష్యసి।**
**ఏతయోరంతరా యత్తే సుకృతం సుకృతం భవేత్।**
**తత్సర్వం రాజగామి స్యాదనృతం బ్రువతస్తవ॥** 12

నీవు పుట్టిన నాటినుండి చనిపోవువరకు చేసిన పుణ్యమంతయు నీవు అబద్ధమాడినచో రాజునకు చెందును.

**త్రీనేవ చ పితౄన్ హంతి త్రీనేవ చ పితామహాన్॥** 13

**సప్త జాతానజాతాంశ్చ సాక్షీ సాక్ష్యం మృషా వదన్॥** 14

అబద్ధపుసాక్ష్యము చెప్పు సాక్షి తనకు ముందున్న పితృ, పితామహ, ప్రపితామహులు తన పుత్రుడు, పౌత్రుడు, ప్రపౌత్రుడు మరియు తాను అను ఏడు తరములవారిని నాశనము చేయుచున్నాడు.

**హిరణ్యార్థే నృతే హంతి త్రీనేవ చ పితామహాన్।**
**పంచ పశ్వనృతే హంతి దశ హంతి గవానృతే॥**
**శతమశ్వానృతే హంతి సహస్రం పురుషానృతే॥** 15

ధనముకొరకు అబద్ధపు సాక్ష్యము చెప్పినచో తన పితృ, పితామహ, ప్రపితామహులను ముగ్గురిని నాశనము చేయుచున్నాడు. పశువుల కొరకు అబద్ధమాడినచో ఐదుగురిని చంపిన పాపమునకు పోవును. గోవుకొరకు అబద్ధమాడినచో పదిమందిని చంపిన పాపము పొందుచున్నాడు. అశ్వము కొరకు అబద్ధమాడినచో వందమందిని చంపిన పాపమును, మనుష్యుని కొరకు అబద్ధమాడినచో వేయి మందిని చంపిన పాపమును పొందును. అట్లే భూమి కొరకు అబద్ధమాడినచో సమస్తమును నాశనము చేసికొన్నవాడగును.

**చత్వారో వర్ణాః పుత్రిణః స్యుః అన్యత్ర శ్రోత్రియ**
**రాజన్య ప్రవ్రజిత మనుష్యహీనేభ్యః॥** 16

శ్రోత్రియులు, రాజు, సన్యాసులు, ఎటువంటి చుట్టాలు లేనివారు తప్ప మిగిలిన వారిలోనూ సంతానమున్న వారే సాక్ష్యమునకు రావలెను.

**స్మృతౌ ప్రధానతః ప్రతిపత్తిః॥** 17

విషయస్మరణ ఉన్న ఇద్దరు సాక్షులున్నప్పుడు తపస్సు, విద్యా మొదలైన ఉన్నత గుణములున్నవాని మాటననుసరించి ధర్మమును నిశ్చయింపవలెను.

**అతోఽన్యథా కర్తపత్యమ్॥** 18

దీనికి భిన్నముగా విచారించి తీర్పు చెప్పినచో అతడు కర్తపత్యమను నరకమునకు పోవును.

**ద్వాదశరాత్రం తప్తం పయః పిబన్ కూష్మాండైర్వా జుహుయాత్**

**కుష్మాండైర్వా జుహుయాదితి॥** 19

తీర్పు చక్కగా చెప్పని ధర్మాధికారి పన్నెండు దినములు వేడి పాలు త్రాగుచు కూష్మాండహోమము చేయవలెను.

అధ్యాయ సమాప్తి సూచనముగా ఇచ్చట పదముల ఆవృత్తి జరిగినది

ఇతి ఏకోనవింశఃఖండః

## అథ వింశః ఖండః

**అష్టౌ వివాహాః॥**

వివాహములు ఎనిమిది విధములుగా ఉన్నవి.

**శ్రుతి శీలే విజ్ఞాయ బ్రహ్మచారిణేఽర్థినే కన్యా దీయతే స బ్రాహ్మః॥** 2

వరునియొక్క చదువు నడవడికను తెలిసికొని, వివాహము చేసికొనవలెనని కన్యకొరకు ప్రయత్నించుచున్న బ్రహ్మచారియైన వరునికి కన్యనిచ్చి వివాహము చేయవలెను. ఇది బ్రాహ్మ వివాహము.

**ఆచ్ఛాద్యాలంకృత్యైషా "సహ ధర్మం చర్యతా" మితి ప్రాజాపత్యః॥** 3

కన్యను వస్త్రాభరణములచే అలంకరించి ఈమెతో ధర్మ కార్యముల నాచరింపుము అనుచు చేయు వివాహము ప్రాజాపత్యము.

**పూర్వం లాజాహుతిం హుత్వా గోమిథునం కన్యావతే దత్వా గ్రహణమ్ ఆర్షః॥** 4

వివాహమునకు ముందే వరుడు లాజాహుతులు చేసికొని కన్య యొక్క తండ్రికి గోమిథునమును సమర్పించుకొని చేసికొను వివాహము ఆర్షము.

**దక్షిణాసు నీయమానాస్వంతర్వేది ఋత్విజే స దైవః॥** 5

యాగము పూర్తియైన తరువాత దక్షిణలనిచ్చునప్పుడు యోగ్యుడైన ఋత్విక్కునకు యజ్ఞవేదిక దగ్గర చేయు వివాహము దైవము.

**సకామేన సకామాయాం మిథస్సంయోగో గాంధర్వః॥** 6

పరస్పరము కోరికతో రహస్యముగా చేసికొను వివాహము గాంధర్వము.

**ధనేనోపతోష్య ఆసురః॥** 7

కన్యయొక్క తండ్రికి సమృద్ధిగా ధనమిచ్చి చేసికొను వివాహము ఆసురము.

**ప్రసహ్యా హరణాద్రాక్షసః॥** 8

బలవంతముగా కన్యనెత్తుకొనిపోయి చేసికొను వివాహము రాక్షస వివాహము.

**సుప్తాం మత్తాం ప్రమత్తాం వోపయచ్ఛేదితి పైశాచః॥** 9

నిద్రపోవుచున్నదానిని లేక మద్యమువలన మత్తులోనున్నదానిని లేక భయాదుల వలన నివ్వెరపోయి ఉన్న కన్యను బలవంతముగా అనుభవించి చేసికొను వివాహము పైశాచ వివాహము. ఆపస్తం బమహర్షి ప్రాజాపత్యము పైశాచ వివాహములు తప్ప మిగిలిన ఆరు వివాహములను మాత్రము పేర్కొనెను. (2-12-17 సూ).

**తేషాం చత్వారః పూర్వే బ్రాహ్మణస్య తేష్వపి పూర్వః పూర్వః శ్రేయాన్॥** 10

పై అష్ట వివాహములలో బ్రాహ్మణునకు తొలి నాలుగు వివాహములు (బ్రాహ్మ, ప్రాజాపత్య, ఆర్ష, దైవములు) తగినవి. వాటిలోను పూర్వ పూర్వ వివాహము ఉత్తరోత్తరముల కంటె మేలైనది.

**ఉత్తరేషాముత్తరతః పాపీయాన్॥** 11

అట్లే ఉత్తరోత్తర వివాహములు పూర్వ పూర్వ వివాహముల కంటె నింద్యములు.

**అత్రాపి షష్ఠ సప్తమౌ క్షత్ర ధర్మానుగతౌ తత్ప్రయత్వాత్ క్షత్రియస్యేతి॥ 12**

పై అష్టవిధ వివాహములలో ఆరవదగు ఆసుర వివాహము, ఏడవదగు రాక్షస వివాహము, ధన బలములు ప్రధానముగా కల క్షత్రియునకే తగినవి.

**పంచమాష్టమౌ వైశ్య శూద్రాణామ్॥** 13

ఐదవ వివాహమైన గాంధర్వము వైశ్యునకు, ఎనిమిదవ వివాహమగు పైశాచము శూద్రునకు తగినవి.

**అయంత్రిత కళత్రా హి వైశ్య శూద్రా భవంతి॥** 13

వైశ్య శూద్రుల భార్యలు నియమముల నెక్కువగా పట్టించుకొనరు.

**కర్షణ శుశ్రూషాధికృతత్వాత్॥** 15

వారు వ్యవసాయము, ఇతరుల శుశ్రూష చేయుచున్నందు వలన నియమానురక్తులు కారు.

**గాంధర్వమప్యేకే ప్రశంసంతి సర్వేషాం స్నేహానుగతత్వాత్॥** 16

ప్రేమను ఆశ్రయించియున్నందువలన అన్ని వర్ణముల వారు గాంధర్వ వివాహమును చేసికొనవచ్చునని కొందరు ఆచార్యులు చెప్పుచున్నారు.

ఇతి వింశః ఖండః

అథ ఏకవింశః ఖండః

**యథాయుక్తో వివాహస్తథాయుక్తా ప్రజా భవతీతి విజ్ఞాయతే॥** 1

ఎటువంటి వివాహము (ప్రశస్తము లేక అప్రశస్తము) చేసికొన్నచో వారికి కలుగు సంతానము అదే విధముగా ఉండునని చెప్పబడినది.

**అథాప్యుదాహరంతి**

**సాధవస్త్రిపురుషమార్షాత్ దశ దైవాత్ దశ ప్రాజాపత్యాత్ దశ పూర్వాన్ దశాపరాన్ ఆత్మానం చ బ్రాహ్మీపుత్ర ఇతి విజ్ఞాయతే॥** 2

ధర్మజ్ఞులు ఈ విషయమున ఈ క్రిందివానిని ఉదాహరించుచున్నారు.

ఆర్ష వివాహము వల్ల పుట్టిన సత్పురుషులు మూడు తరములవారిని, దైవ వివాహము వల్ల పుట్టిన సత్పురుషులు పది తరముల వారిని, అట్లే ప్రాజా పత్య వివాహమువల్ల పుట్టినవారు పది తరముల వారిని, బ్రహ్మ వివాహమువలన పుట్టిన వారు అటు పది తరములను, ఇటు పది తరములను తనను మొత్తము ఇర. ది యొక్క తరములవారిని పవిత్రము చేయుచున్నారు.

**వేదస్వీకరణ శక్తిరప్యేవం విధానామేవ పుత్రాణాం భవతీతి॥** 3

ఈ వివాహములవలన పుట్టిన వారికే వేదమును సులభముగా గ్రహించు శక్తి ఉండునని అందురు.

**క్రీతా ద్రవ్యేణ యా నారీ సా న పత్నీ విధీయతే।**
**సా న దైవేన సా పిత్ర్యే దాసీం తాం కశ్యపోఽబ్రవీత్॥** 4

ఆసుర వివాహమున వరుడు కన్య యొక్క తండ్రికి తగిన ధనమిచ్చి  ను స్వీకరించును. కావున ఆమెను కొన్నట్లే అగుచున్నది. ఇట్లు ధనముచే కొనబడిన స్త్రీ భార్యయొక్క స్థానమును పొందలేదు. ఆమె దాసివంటిది కావున దైవ కార్యములందు పితృకార్యములందు భర్త ప్రక్కన ఉండుటకు అనర్హురాలని కశ్యపుడు తెలిపెను.

**శుల్కేన యే ప్రయచ్ఛంతి స్వసుతాం లోభమోహితాః।**
**ఆత్మ విక్రయిణః పాపాః మహాకిల్బిషకారకాః॥**
**పతంతి నరకే ఘోరే ఘ్నంతి చాసప్తమం కులమ్।**
**గమనాగమనం చైవ సర్వం శుల్కే విధీయతే॥** 5

ధనాశవలన తమ కన్యను ధనము తీసికొని ఇచ్చినచో వారు ఆత్మను విక్రయించిన వారితో సమానులగుదురు. మహాపాతకమును పొంది భయంకరమైన నరకమునకు పోయెదరు. పైగా తమ ఏడు తరములవారిని నాశనము చేయుదురు. వారికి సమస్తము ధనము వలననే జరుగును కావున కూతురు ఇంటికి వచ్చినను, ఇంటినుండి పోయినను వారు ధనమునే ఆశింతురు.

**పౌర్ణమాస్యష్టకాఽమావాస్యాఽగ్న్యుత్పాత భూమికంప శ్మశాన**
**దేశపతి శ్రోత్రియైకతీర్థ ప్రాయణేష్వహోరాత్రమనధ్యాయః॥** 6

పౌర్ణమినాడు, పౌర్ణమి తరువాత వచ్చు అష్టమీతిథినాడు, అమావాస్యనాడు, అగ్ని దాహము సంభవించినప్పుడు, భూమి కంపించినప్పుడు, స్మశానము, రాజు, శ్రోత్రియుడు, సతీర్థుడు, చనిపోయినప్పుడు ఆ దినమంతయు (రాత్రి.పగలు) అనధ్యాయము.

**వాతే పూతిగంధే నీహారే నృత్తగీతవాదిత్ర రుదిత**
**సామశబ్దేషు తావంతం కాలమ్॥** 7

విపరీతమైన గాలి వీచునప్పుడు, దుర్గంధము వ్యాపించునప్పుడు, మంచు కురియునప్పుడు, నాట్యము గానము, వాద్యము, ఏడుపు, సామవేదము వీటి ధ్వని వినిపించుచున్నప్పుడు, అంతవరకే వేదాధ్యయనము చేయరాదు.

**స్తనయిత్ను వర్షవిద్యుత్సన్నిపాతే త్ర్యహమనధ్యాయః**
**అన్యత్ర వర్షాకాలాత్॥** 8

వర్షాకాలము కానప్పుడు వాన, ఉరుములు, మెరుపులు కలసి వచ్చినచో మూడు దినముల వరకు అనధ్యాయము.

**వర్షాకాలేఽపి వర్షవర్జమహోరాత్రయోశ్చ తత్కాలమ్॥** 9

వర్షకాలమందును వర్షము లేకుండా ఉరుములు మెరుపులు వచ్చినచో ఆ రాత్రి లేక దినమంతయు అనధ్యయనము.

**పిత్ర్య ప్రతిగ్రహ భోజనయోశ్చ తద్దివస శేషమ్॥** 10

శ్రాద్ధభోజనమున, దానమును స్వీకరింపుచు భోజనము చేసినప్పుడు, నాటి సాయంకాలము వేదాధ్యయనము చేయరాదు.

**భోజనేష్వాజరణమ్॥** 11

భోజనము చేసినప్పుడు ఆ అన్నము జీర్ణమగునంతవరకు వేదాధ్యయనము చేయరాదు.

**పాణిముఖో హి బ్రాహ్మణః॥** 12

ఆమ శ్రాద్ధమున భుజింపకున్నను భోజన పదార్థములను బ్రాహ్మణుడు చేతిచే పరిగ్రహించును. బ్రాహ్మణుని చేయి ముఖము వంటిది కావున అది భోజనముతో సమానమగుచున్నది.

**అథాప్యుదాహరంతి**

**భుక్తం పరిగృహీతం చ నిర్విశేషమితి శ్రుతిః॥** 13

ఈ విషయమున ఈ వేదవాక్యమునుదాహరించుచున్నారు.

తినుట, దానము తీసికొనుట సమానమైనవి అని వేదము చెప్పుచున్నది.

**పితర్యుపరతే త్రిరాత్రమ్॥** 14

తన తండ్రి చనిపోయినచో, గురుకులమందున్న బ్రహ్మచారి మూడు దినముల వరకు వేదాధ్యయనము చేయరాదు. ఇచ్చట వేదమును అధ్యాపనచేయు ఆచార్యుడే అతని తండ్రి అని భావింపవలెను.

**ద్వయము హ వై సుశ్రవసోఽనూచానస్య రేతో బ్రాహ్మణస్యోర్ధ్వం నాభేరధస్తాత్ అన్యత్స యదూర్ధ్వం నాభేః తేన హైతత్ ప్రజాయతే యద్బ్రాహ్మణానుపనయతి యదధ్యాపయతి యద్యాజయతి యత్ సాధు కరోతి సర్వాఽస్యైషా ప్రజా భవతి। అథ యదవాచీనం నాభేస్తేన హాస్యౌరసీ ప్రజా భవతి తస్మాచ్ఛ్రోత్రియమనూచానమప్రజోఽసీతి న వదంతి॥** 15

శుశ్రవాః అనగా వేదమును చక్కగా విని నేర్చుకొన్నవాడని అర్థము. అనూచానః అనగా వేదమును అర్థము, వేదాంగములతో కలిపి అధ్యయనము చేయువాడని అర్థము. ఇటువంటి బ్రాహ్మణ కుమారుని జన్మకు కారణము రెండు విధములుగా ఉన్నది. ఒకటి నాభికి ఊర్ధ్వమైనది. రెండవది నాభి క్రింద ఉండునది.

బ్రాహ్మణ కుమారులకుపనయనము చేయుట, వేదము చెప్పుట, యాగము చేయించుట వారిని చక్కగా తీర్చిదిద్దుట వలన వారు ఆచార్యునకు సంతానమగుచున్నారు. ఇది నాభికి ఊర్ధ్వముగా నున్న కారణము.

శరీరము వలన ఏర్పడిన సంతానమునకు నాభికి అధో భాగముననున్న రేతస్సు కారణమగుచున్నది.

వేదమును అర్థాదులతో శిష్యులకు బోధించు ఆచార్యుని ఎవ్వరు కూడా సంతానము లేనివాడని అనరు. అందువలన వేదమును బోధించు ఆచార్యుడు చనిపోయినచో తన తండ్రికి వలె అశౌచమును, అనధ్యయనము పాటింపవలెను.

**తస్మాత్ ద్వినామా ద్విముఖో విప్రో ద్విరేతా ద్విజన్మా చేతి॥** 16

అందువలన ద్విజునకు నక్షత్రనామము, వ్యవహార నామము అని రెండు పేర్లుండును. రెండు ముఖములుండును. ఒకటి అతని ముఖము. రెండవది ఇంతకు ముందు పేర్కొన్నట్లు అతని హస్తము. రెండు రేతస్సులు. ఒకటి శరీర సంబంధమైనది. రెండవది అధ్యయనాది సంబధమైనది. రెండు జన్మలు. ఒకటి తల్లిదండ్రుల వలన కలుగునది. రెండవది ఉపనయనము వల్ల ఏర్పడునది.

**శూద్రాపపాత్ర శ్రవణ సందర్శనయోశ్చ తావంతం కాలమ్॥** 17

శూద్రులను, అపాత్రులను చూచినను, వారి ధ్వని విన్నను అంతకాలము వరకు వేదాధ్యయనము చేయరాదు.

**నక్తం శివావిరావే నాధీయీత స్వప్నాంతమ్॥** 18

రాత్రిపూట నక్క కూసినచో తెల్లవారు వరకు వేదాధ్యయనము చేయరాదు.

**అహోరాత్రయోస్సంధ్యయోః పర్వసు చ నా ధీయీత॥** 19

సంధ్యాసమయములు అమావాస్య, పూర్ణిమలు, అష్టమీ తిథులు మరియు చతుర్దశీ ప్రతిపత్ తిథులందు వేదాధ్యయనము చేయరాదు.

**న మాంసమశ్నీయాన్న స్త్రియముపేయాత్॥** 20

ఈ పర్వ దినములందు, సంధ్యలందు, మాంస భక్షణ, స్త్రీ సంగమములు చేయరాదు.

**పర్వసు హి రక్షః పిశాచా వ్యభిచారవంతో భవంతీతి విజ్ఞాయతే॥** 21

ఈ సమయములందు రాక్షసులు పిశాచములు యథేచ్ఛగా సంచరించునని వేదములందు చెప్పబడినది కావున మానవులు పై పనులు చేయరాదు.

**అన్యేషు చాద్భుతోత్పాతేష్వహోరాత్రమనధ్యాయో౽న్యత్ర మానసాత్॥22**

అట్లే ఉత్పాతములు మొదలగునవి జరుగుచున్నప్పుడు ఆ దినమంతయు అనధ్యయనమే. కాని మనస్సులో వేదాధ్యయనమును చేయవచ్చును.

**మానసే౽పి జనన మరణయోరనధ్యాయః॥** 23

జనమరణముల వలన అశుచియేర్పడినప్పుడు వేదమును మనస్సులో సైతము పఠింపరాదు. స్వాధ్యాయ బ్రాహ్మణమున తాను, తానుండు స్థలము అశుచియైనప్పుడు అనధ్యయమని తస్యవా ఏతస్య యజ్ఞస్య ద్వావనధ్యాయౌ యదాత్మా అశుచిర్యద్దేశః అని చెప్పబడినది.

**అథాప్యుదాహరంతి**

**హంత్యష్టమీ హ్యుపాధ్యాయం హంతి శిష్యం చతుర్దశీ।**
**హంతి పంచదశీ విద్యాం తస్మాత్పర్వణి వర్జయేత్॥** 24

అష్టమీ తిథినాడు వేదాధ్యయనము చేసినచో త్వరలో ఆచార్యునకు మరణము సంభవించును. పూర్ణిమ, అమావాస్యలందు అధ్యయనము చేసినచో ఆ విద్య చక్కగా రాదు. చతుర్దశినాడు అధ్యయనము చేసినచో శిష్యుడు మరణించును. అందువలన ఆ దినములందు వేదాధ్యయనము చేయరాదు.

(ఇక ప్రశ్నభాగము పూర్తియైన తరువాత అధ్యయనము చేయు విద్యార్థి కొరకు ప్రాచీన సంప్రదాయముననుసరించి ఆయా ఖండముల యొక్క తొలి సూత్ర భాగములు ప్రతిలోమముగా క్రింద ఇవ్వబడినవి.)

**యథాయుక్తో వివాహః॥21॥ అష్టౌ వివాహాః ॥20॥ క్షత్రియవధగో సహస్రమ్ ॥19॥ షడ్భాగభృతో రాజా రక్షేత్ ॥18॥ తత్ర సవర్ణాసు సవర్ణాః ॥17॥ చత్వారో వర్ణాః॥16॥ ఉత్తరత ఉపచారో విహారః॥15॥ మృణ్మయానాం ప్రాతాణామ్॥14॥ శుచిమధ్వరం దేవాజుషంతే॥13॥ అభక్ష్యాః పశవో గ్రామ్యాః ॥12॥ సపిండేష్వాదశాహమ్॥11॥ గోచర్మమాత్రమ్॥10॥ నిత్యం శుద్ధః కారుహస్తః ॥9॥ అథాతశ్శౌ చాధిష్ఠానమ్॥8॥ కమండలుర్ ద్విజాతీనామ్॥7॥ అథ కమండలు చర్యాముపదిశంతి॥6॥ అథ స్నాతకస్య॥5॥ ధర్మార్థౌ యత్ర న స్యాతామ్॥4॥ అష్టాచత్వారింశద్వర్షాణి॥3॥ పంచధా విప్రతిపత్తిః॥2॥ ఉపదిష్టో ధర్మః ప్రతివేదమ్॥1॥**

**ఇతి ఏక వింశః ఖండః**

ప్రథమ ప్రశ్నశ్చ సమాప్తః

అద ద్వితీయః ప్రశ్నః

అధ ప్రథమః ఖండః

**అధాతః ప్రాయశ్చిత్తాని॥** 1

ఇక ప్రాయశ్చిత్తములను గూర్చి తెలిపెదను

**భ్రూణహా ద్వాదశసమాః॥** 2

బ్రాహ్మణుని చంపినచో పన్నెండు సంవత్సరములు ఈ క్రింది ప్రాయశ్చిత్తమును చేసికొనవలెను

**కపాలీ ఖట్వాంగీ గర్దభచర్మవాసాః అరణ్య నికేతనః శ్మశానే ధ్వజం శవశిరః కృత్వా కుటీం కారయేత్ తామావసేత్ సప్తాగారాణి భైక్షం చరేత్ స్వకర్మాచక్షాణః తేన ప్రాణాన్ధారయేత్ అలబ్ధోపవాసః॥** 3

బ్రాహ్మణ హత్య చేసినవాడు భిక్షకై కపాలమును, దండమునకై మంచపు కోఢును తీసికొని, గాడిదతోలు ధరించి ధ్వజముగా శవము యొక్క శిరస్సు నుంచుకొని శ్మశానమందు గుడిసె వేసికొని ఉండవలెను ప్రతిదినము తాను చేసిన కర్మను చెప్పికొనుచు ఏడిండ్లలో బిచ్చమెత్తుకొని ఆ బిచ్చము చేతనే జీవింపవలెను లేనిచో ఉపవాసముండవలెను

**అశ్వమేధేన గోసవేనా౽గ్నిష్టుతా వా యజేత॥** 4

లేనిచో అశ్వమేదమునైనా గోసవమునైనా ఇంకను అగ్నిష్టుత్ యాగమునైనను చేయవలెను

**అశ్వమేధావభృధే వా౽త్మానం ప్లావయేత్॥** 5

లేనిచో అశ్వమేధయాగాంతమున చేయు అవభృదమున తాను స్నానము చేయవలెను

**అధాప్యుదాహరంతి**

**అమత్యా బ్రాహ్మణం హత్వా దుష్టో భవతి ధర్మతః।**
**ఋషయో నిష్కృతిం తస్య వదంత్యమతిపూర్వకే॥**
**మతిపూర్వం ఘ్నతస్తస్య నిష్కృతిర్నోపలభ్యతే॥** 6

బ్రాహ్మణుడు తెలియక బ్రాహ్మణవధ చేసినప్పుడు అతడు తెలియక చేసినందువలన ఋషులు అతనికి ప్రాయశ్చిత్తమును తెల్పినారు కాని తెలిసి బ్రాహ్మణుని చంపినచో ప్రాయశ్చిత్తము లేదని అందురు

ఈ విధముగా ప్రాయశ్చిత్తము చంపిన వాని స్థితిననుసరించి, చనిపోయిన వానిననుసరించి మారును.

**అపగూర్య చరేత్కృచ్ఛ్రం అతికృచ్ఛ్రం నిపాతనే।**
**కృచ్ఛ్రం చాంద్రాయణం చైవ లోహితస్య ప్రవర్తనే॥**
**తస్మాన్నైవాపగురేత న చ కుర్వీత శోణితమ్॥** 7

బ్రాహ్మణుని కొట్టుటకు చేయి ఎత్తినచో కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును చేసికొనవలెను. బ్రాహ్మణునిపై చేయి పడినచో అతికృచ్ఛ్రప్రాయశ్చిత్తమును చేసికొనవలెను. అతని శరీరమునుండి రక్తము కారినచో కృచ్ఛ్రవ్రతమును ఇంకను చాంద్రాయణ వ్రతమును ఆచరింపవలెను. కావున బ్రాహ్మణుని కొట్టుటకు ప్రయత్నింపరాదు.

**నవ సమా రాజన్యస్య॥** 8

రాజు బ్రహ్మ హత్య చేసినచో తొమ్మిది సంవత్సరములు ఇంతకు ముందు పేర్కొన్న బ్రహ్మాహత్యా వ్రతమునాచరింపవలెను.

**తిస్రో వైశ్యస్య॥** 9

వైశ్యుడు బ్రహ్మాహత్య చేసినచో మూడు సంవత్సరములు బ్రహ్మాహత్యా వ్రతము నాచరింపవలెను.

**సంవత్సరం శూద్రస్య స్త్రియాశ్చ॥** 10

శూద్రుడు కాని స్త్రీ కాని తెలియక బ్రాహ్మణవధ చేసినచో ఒక సంవత్సరము బ్రహ్మాహత్యా వ్రతమును ఆచరింపవలెను.

**బ్రాహ్మణవదాత్రేయ్యాః॥** 11

ఋతుస్నాతయైన స్త్రీని పొరపాటున చంపినచో బ్రాహ్మణహత్య యందు చేసికొను ప్రాయశ్చిత్తమును చేసికొనవలెను.

**గురుతల్పగస్తప్తే లోహశయనే శయీత॥** 12

గురువుయొక్క భార్యతో సంగమించినవాడు బాగుగా మండుచున్న ఇనుపమంచమున పడుకొనవలెను.

**సూర్మిం జ్వలంతీం వా శ్లిష్యేత్॥** 13

లేక బాగుగా మండుచున్న ఇనుప స్త్రీ ప్రతిమను కౌగిలించుకొనవలెను.

**లింగం వా సవృషణం పరివాస్య అంజలావాధాయ దక్షిణా ప్రతీచ్యోః దిశోరంతరేణ గచ్ఛేదానిపాతనాత్॥** 14

లేక తన వృషణమును పురుషలింగమును ఛేదించుకొని దోసిలియందు వానిని ఉంచుకొని మృత్యువు కలుగునంత వరకు నైఋతి దిక్కునకు పోవుచుండవలెను.

ఈ పాతకమును మతిపూర్వకముగా చేయును కావున కఠినమైన ప్రాయశ్చిత్తములు విధింపబడినవి.

**స్తేనః ప్రకీర్య కేశాన్ సైద్రకం ముసలమాదాయ స్కంధేన రాజానం గచ్ఛేదనేన మాం జహీతి తేనైనం హన్యాత్ వధే మోక్షో భవతి॥** 15

దొంగతనము చేసినవాడు వెంట్రుకలను విరబోసికొని సైద్రకమను బలమైన రోకలిని భుజమున పెట్టుకొని రాజు దగ్గరకు పోయి తాను చేసిన తప్పును చెప్పి ఈ రోకలిచే నన్ను కొట్టి చంపుమని అడుగవలెను.

ఆ విధముగా రాజు దొంగతనము చేసినవానిని కొట్టి చంపినచో అతని పాపము పూర్తిగా తొలగును.

**అథాప్యుదాహరంతి**

**స్కంధేనాఽదాయ ముసలం స్తేనో రాజానమన్వియాత్।**
**అనేన శాధి మాం రాజన్ క్షత్ర ధర్మమనుస్మరన్॥**
**శాసనే వా విసర్గే వా స్తేనో ముచ్యేత కిల్బిషాత్।**
**అశాసనాత్తు తద్రాజా స్తేనాదాప్నోతి కిల్బిషమితి॥** 16

ఈ విషయమున ఈ క్రింది శ్లోకములనుదహరింతురు.

దొంగ తనభుజముపై రోకలిపెట్టుకొని రాజు దగ్గరకు పోయి మహారాజా! దుష్టులను దండింపవలసిన రాజ ధర్మముననుసరించి ఈ రోకలిచే నన్ను దండింపుము అని అనవలెను. అప్పుడు రాజతనిని దండించినా లేక వదలిపెట్టినా దొంగయొక్క పాపము తొలగును. కాని రాజతనిని దండింపనిచో దొంగయొక్క పాపము రాజునకు చెందునని చెప్పబడినది.

**సురాం పీత్వోష్ణయా కాయం దహేత్॥** 17

మద్యమును త్రాగినచో సలసలకాగుచున్న మద్యమును త్రాగి శరీరమును కాల్చుకోవలెను.

**అమత్యా పానే కృచ్ఛ్రాబ్దపాదం చరేత్ పునరుపనయనం చ॥** 18

ఇష్టము లేక బలవంతముగా మద్యము త్రాగినచో మూడు నెలలు కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము చేసికొనవలెను. తరువాత మరల ఉపనయన సంస్కారమును చేసికొనవలెను.

**వపన వ్రత నియమ లోపశ్చ పూర్వానుష్ఠితత్వాత్॥** 19

ఇట్లు రెండవమారు ఉపనయనము చేసికొనునప్పుడు ఉపనయన సంస్కారములైన తల గొరిగించుకొనుట, సావిత్రీ వ్రతము, భిక్షాచరణము వంటివాటిని అనుష్ఠింపక వదలి వేయవలెను.

**అథాప్యుదాహరంతి**

**అమత్యా వారుణీం పీత్వా ప్రాశ్య మూత్ర పురీషయోః।**
**బ్రాహ్మణః క్షత్రియో వైశ్యః పునస్సంస్కారమర్హతి॥** 20

బ్రాహ్మణుడు క్షత్రియుడు, వైశ్యుడు తెలియక మద్యము త్రాగినచో గోవుయొక్క మల మూత్రములను తీసికొనవలెను. తరువాత తిరిగి సంస్కారమును చేసికొనవలెనని చెప్పబడినది.

**సురాధానే తు యో భాండే అపః పర్యుషితాః పిబేత్।**
**శంఖపుష్పీవిపక్వేన షడహం క్షీరేణ వర్తయేత్॥** 21

మద్య పాత్రలో ఉన్న నీటిని త్రాగినచో ఆరు దినములు శంఖ పుష్పి అను తీగను పాలలో వేసి మరగించుకొని త్రాగి కాలము గడపవలెను.

**గురు ప్రయుక్తశ్చేన్మ్రియేత గురుస్త్రీన్ కృచ్ఛ్రాంశ్చరేత్॥** 22

గురువు చెప్పిన పని చేయుచు శిష్యుడు చనిపోయినచో ఆ గురువు మూడు కృచ్ఛ్రవ్రతములనాచరింపవలెను.

**ఏతదేవ అసంస్కృతే॥** 23

అట్లే గురువు విద్యా బోధన చక్కగా చేయనిచో మూడు కృచ్ఛ్రవ్రతముల నాచరింపవలెను.

**బ్రహ్మచారిణశ్శవకర్మణా వ్రతావృత్తిః అన్యత్ర మాతాపిత్రోరాచార్యాచ్చ॥24**

బ్రహ్మచారి తన తల్లి దండ్రులు ఆచార్యునికి తప్ప ఇతరులకు శవ సంస్కారము చేసినచో తిరిగి ఉపనయన వ్రతమును చేసికొనవలెను.

**స చేద్వ్యా ధీయీత కామం గురోరుచ్ఛిష్టం భైషజ్యార్థం సర్వం ప్రాశ్నీయాత్॥25**

బ్రహ్మచారి వ్యాధిగ్రస్తుడైనచో ఔషధముగా గురువు యొక్క ఉచ్ఛిష్టమును, అభోజ్య వస్తువులను కూడా తీసికొనవచ్చును. అప్పుడు దోషముండదు.

**యేనేచ్ఛేత్తేన చికిత్సేత॥** 26

నిషిద్ధపదార్థములైనను అవసరమైనచో ఔషధముగా ఆ పదార్థమును చికిత్సయందు ఉపయోగింపవచ్చును.

**స యది గదీ స్యాదుత్థాయాఽదిత్యముపతిష్ఠతే**
**"హగ్ంసశ్శుచిష" దిత్యేతయా॥** 27

బ్రహ్మచారి వ్యాధిపీడితుడై సంధ్యావందనము చేయలేని సమయమున లేచి "హగ్ంసశ్శుచిషత్" అను మంత్రముచేత సూర్యుని స్తుతింపవలెను.

**దివా రేతస్సిక్త్వా త్రిరపో హృదయంగమాః పిబేద్రేతస్యాభిః॥** 28

గృహస్థు పగటి పూట రేతస్సును వదలినచో పునర్మామైత్వింద్రియమ్, యన్మేఽద్యరేతః ప్రసిచ్యతే అను రేతః శబ్దమున్న వాక్యములతో హృదయమును చేరునట్లు సమృద్ధిగా తీర్థమును చేతిలోనికి తీసికొని మూడు పర్యాయములు ఆచమనము చేయవలెను.

**యో బ్రహ్మచారీ స్త్రియముపేయాత్సోఽవకీర్ణీ॥** 29

స్త్రీ సంగమము చేసిన బ్రహ్మచారిని అవకీర్ణియని అందురు.

**స గర్దభం పశుమాలభేత॥** 30

ఆ అవకీర్ణి, ప్రాయశ్చిత్తము చేసికొనప్పుడు గాడిదను, ఇంకొక పశువును బలిగా ఈయవలెను.

**నైర్ఋుతః పశుః పురోడాశశ్చ రక్షో దైవతో యమదైవతో వా॥** 31

ఈ యాగమున నైర్ఋుతి దేవతకు చెందిన పశువే పశువు, పురోడాశము కూడ. పురోడాశః అనునది యాగ పరిభాషననుసరించి చెప్పబడినది. ఇచ్చట, దేవత నైర్ఋుతి లేక యముడు.

**శిశ్నాత్ప్రాశిత్రమప్స్వవదాయైశ్చరంతీతి విజ్ఞాయతే॥** 32

గర్దభ శిశ్నమునుండి ప్రాశిత్రము చేయుదురు. తరువాత దానిని, ఇతరమైన అవయవములను నీటిలో అర్పింతురని తెలియుచున్నది.

**అపివాఽమావాస్యాయాం నిశ్యగ్నిముపసమాధాయ దార్విహోమికీం పరిచేష్టాం కృత్వా ద్వే ఆజ్యాహుతీ జుహోతి "కామావ కీర్ణోఽస్మ్యవకీర్ణోఽస్మి కామ కామాయస్వాహా కామాభి దృగ్ధోఽస్మ్యభిదృగ్ధోఽస్మి కామకామాయ స్వాహా ఇతి॥** 33

లేక అమావాస్య నాటి రాత్రియందు హోమాగ్నియందు "కామావకీర్ణోఽస్మి మరియు కామాభిదృగ్ధోఽస్మి అను రెండు మంత్రములచే రెండు ఆజ్యాహుతులను చేయవలెను.

**హుత్వా ప్రయతాంజలిః క్వాతిర్యఙ్ అగ్నిముపతిష్ఠేత "సం మా సించంతు మరుతస్సమింద్రస్సం బృహస్పతిః సం మా యమగ్ని స్సించత్వాయుషా చ బలేన చాఽయుష్మంతం కరోతు మే"తి॥** 34

ఆజ్యాహుతులనిచ్చిన తరువాత చేతులు కడుగుకొని అగ్నికి ఒక ప్రక్క నిలబడి "సం మా సించంతు" అను మంత్రము చదువుచు అగ్నిని స్తుతింపవలెను.

**అథ యస్య జ్ఞాతయః పరిషద్వ్యుదపాత్రం వినయేయురసావహమ్ ఇత్థం భూత ఇతి।చరిత్వాపః పయోఘృతం మధులవణమ్ ఇత్యారబ్ధవంతం బ్రాహ్మణా బ్రూయుశ్చరితం త్వమేతి॥** 35

హోమము తరువాత అందరు ఒక్కచోట ఉన్నప్పుడు అతని బంధువులు నీటి పాత్రను తీసికొని వచ్చి నీవు ఏమి చేసితివని అడుగగా దోషము చేసినవాడు నేను ఈ తప్పును చేసితినని చెప్పి నీరు, పాలు, నేయి, తేనె, ఉప్పును ముట్టుకొనవలెను. అప్పుడు బ్రాహ్మణులు నీవు ప్రాయశ్చిత్తమును చేసికొన్నావా? అని అడుగవలెను.

**ఓమితీతరః ప్రత్యాహ॥** 36

అప్పుడు దోషియైనవాడు ఓమ్ అని ప్రత్యుత్తరము నిచ్చును. అనగా ప్రాయశ్చిత్తము చేసికొన్నానని చెప్పును.

**చరిత నిర్వేశం సవనీయం కుర్యుః॥** 37

ఈ విధముగా ప్రాయశ్చిత్తము చేసికొన్నవాడు యజ్ఞయాగాదులకు అర్హుడైనాడని భావింతురు.

**సగోత్రాం చేదమత్యోపయచ్ఛేన్మాతృవదేనాం బిభృయాత్।**
**ప్రజాతా చేత్ కృచ్ఛ్రాబ్దపాదం చరిత్వా "యన్మ ఆత్మనోమిందాభూత్**
**పునరగ్నిశ్చక్షురదాది" త్యేతాభ్యాం జుహుయాత్॥** 38

తన గోత్రమునకే చెందిన కన్యను వివాహముచేసికొన్నచో ఆమెను తల్లివలె భావించి తన ఇంటిలోనే ఉంచుకొనవలెను. లేక ఆమెకు సంతానమైనచో మూడు నెలలు కృచ్ఛ్రవ్రతము నాచరించి "యన్మ ఆత్మనో" మొదలగు మంత్రములచేత హోమము కూడా చేయవలెను.

(పరివిత్తః పరివేత్తా యా చైనం పరివిందతి।
సర్వే తే నరకం యాంతి దాతృ యాజక పంచమాః॥)

**పరివిత్తః పరివేత్తా దాతా యశ్చాపి యాజకః।**
**కృచ్ఛ్రద్వాదశ రాత్రేణ స్త్రీ త్రిరాత్రేణ శుద్ధ్యతి॥** 39

తమ్మునికంటె ముందు వివాహము చేసికొనని అన్నను పరివిత్తుడందురు. అన్నకంటే ముందు వివాహము చేసికొన్న తమ్ముని పరివేత్త అని అందురు. పరివిత్తుడు, పరివేత్త, ఆతని వివాహమాడిన కన్య, ఆమె తండ్రి, పెండ్లి చేయించినవాడు ఈ ఐదుగురు నరకమునకు పోవుదురు.

పరివిత్త, పరివేత్త, అతనికి పిల్లనిచ్చినవాడు, పెండ్లి చేసినవాడు వీరు కృచ్ఛ్ర ద్వాదశరాత్రముతో పరిశుద్ధులగుదురు. అట్లే పెండ్లి చేసికొన్న స్త్రీ త్రిరాత్ర కృచ్ఛ్రముచే పరిశుద్ధురాలగును.

ఇతి ప్రథమః ఖండః

## అథ ద్వితీయః ఖండః

**అథ పతనీయాని॥** 1

ఇక పతనమునకు కారణమైన కర్మలను వివరింతును. ఇవి మహాపాతకములకంటే కొంచెము తక్కువ స్థాయిలో ఉండునవి.

**సముద్ర సంయానమ్। బ్రహ్మస్వ న్యాసాపహరణమ్।భూమ్యనృతమ్।**
**సర్వపణ్యైః వ్యవహరణమ్।శూద్రసేవనమ్। శూద్రాభిజననమ్।**
**తదపత్యత్వం చ। ఏషామన్యతమత్కృత్వా చతుర్థకాలాః**
**మితభోజినస్స్యుస్సవనానుకల్పమ్ స్థానాసనాభ్యాం విహరంతః**
**ఏతే త్రిభిర్వర్షైః తదపహంతి పాపమ్॥** 2

అవి సముద్ర ప్రయాణము, న్యాసముగా ఉంచిన బ్రాహ్మణ ధనము నపహరించుట, సమస్త పదార్థములను (నిషిద్ధమైన వాటిని) అమ్ముట, శూద్రుని సేవించుట, శూద్ర స్త్రీతో కలయుట, శూద్రునకు పుత్రుడుగా జన్మించుట అనునవి. వీటిలో దేనిని చేసినను చతుర్థకాలమందు మాత్రమే అల్పభోజనము చేయవలెను. మూడు సంధ్యలందు చన్నీటి స్నానము చేయవలెను. అట్లే మధ్యాహ్నమున నిలబడుచు, రాత్రిపూట కూర్చుండుచు మూడు సంవత్సరములు గడపవలెను. దానివలన పాపమంతయు పోవును.

**యదేకరాత్రేణ కరోతి పాపం కృష్ణం వర్ణం బ్రాహ్మణస్సేవ్యమానః।**
**చతుర్థకాల ఉదకాభ్యవాయీ త్రిభిర్వర్షైస్తదపహంతి పాపమ్॥** 3

బ్రాహ్మణుడు ఒక రాత్రి చండాలితోనో శూద్ర స్త్రీతోనో సంగమించినచో చతుర్థకాలమున మితాహారమును భుజించుచు మూడు సంవత్సరముల వరకు మూడు సంధ్యలందు చన్నీటి స్నానము చేయుచున్నచో ఆపాపము పోవును.

**అథ ఉపపాతకాని॥** 4

మహాపాపములతో సమానమైన పాపములగురించి చెప్పిన తరువాత ఉపపాతకములను వివరించుచున్నాడు.

**అగమ్యాగమనం గుర్వీసఖీం గురుసఖీమ్ అపపాత్రాం పతితాం చ**
**గత్వా భేషజకరణం గ్రామయాజనం రంగోపజీవనం నాట్యాచార్యతా**
**గోమహిషీ రక్షణం యచ్చాన్యదప్యేవంయుక్తం కన్యాదూషణమితి॥** 5

కూడని స్త్రీతో సంభోగించుట, గురు భార్య యొక్క స్నేహితురాలితో, గురువు యొక్క స్నేహితురాలితో, అవివాహితతో, పతితయైన స్త్రీతో సంగమించుట, బ్రతుకు దెరవునకై వైద్యవృత్తినవలంబించుట, అనేకులచే యాగము చేయించుట (అనేకుల ఇండ్లలో పూజలు సేయుట). నటనము లేక నాట్యమును వృత్తిగా స్వీకరించుట, నాట్యాచార్యుడుగా ఉండుట ఇంకను (బ్రాహ్మణుడు) ఆవులను, బఱ్ఱెలను పోషించుట మొదలైనవన్నియు ఉపపాతకములు.

**తేషాం తు నిర్వేశః పతితవృత్తిర్ద్వౌ సంవత్సరౌ॥** 6

పతితులవృత్తి అనగా బిచ్చమెత్తుకొనుట. అట్లు రెండు సంవత్సరములున్నచో ఉపపాతకములవలన కలుగు పాపములకు ప్రాయశ్చిత్తమగును.

**అథాశుచికరాణి॥** 7

ఇక అపవిత్రులుగా చేయు పాపములను వివరించుచున్నాడు. ఇవి ఉపపాతకములకంటె తక్కువ స్థాయివి.

**ద్యూతమభిచారో నాహితాగ్నేరుంఛ వృత్తితా సమావృత్తస్య**
**భైక్షచర్యా తస్య చైవ గురుకులే వాస ఊర్ధ్వం చతుర్భ్యో మాసేభ్యః**
**తస్య చాధ్యాపనం నక్షత్రనిర్దేశశ్చేతి॥** 8

జూదమాడుట, ఆభిచారకహోమములు చేయుట (చేతబడి చేయుట) ఆహితాగ్ని కాని వాని పొలమందు ఉన్న పరిగను (కోయుచున్నప్పుడు క్రింద పడగా వదలివేసిన ధాన్యము) ఏరుకొని ఆ ధాన్యముచే బ్రతుకుట, స్నాతక సంస్కారము చేసికొన్నవాడు బిచ్చమెత్తుకొనుట, ఆ స్నాతకుడు తిరిగి గురుకులమందు (నాల్గునెలలకంటే ఎక్కువగా) ఉండుట, నాలుగు నెలలకంటే ఎక్కువగా స్నాతకునికి విద్య నేర్పుట. జ్యోతిష్యమును వృత్తిగా పెట్టుకొనుట మొదలైనవి అశుచికరములైన పాపములు.

**తేషాం తు నిర్వేశో ద్వాదశమాసాన్ ద్వాదశ అర్ధమాసాన్ ద్వాదశ**
**ద్వాదశాహాన్ ద్వాదశ షడహాన్ ద్వాదశ త్ర్యహాన్ ద్వాదశాహం**
**షడహం త్ర్యహమహోరాత్రమేకాహామితి యథా కర్మాభ్యాసః॥** 9

అశుచికరములైన పాపములు చేసిన సమయమునననుసరించి పన్నెండు

మాసములు, పన్నెండు పక్షములు, పక్షములో పన్నెండు దినములు చొప్పున పన్నెండు మార్లు, పన్నెండు ఆరుదినములు, పన్నెండు మూడుదినములు, పన్నెండు దినములు,ఆరుదినములు, మూడుదినములు, ఒక పగలు ఇట్లు ప్రాజాపత్యయాగముచే ప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

**అధ పతితాస్సమవసాయ ధర్మాశ్చరేయుః ఇతరేతర యాజకాః ఇతరేతరాధ్యాపకాః మిథో వివహమానాః పుత్రాన్సన్నిష్పాద్య బ్రూయుర్విప్రవ్రజతాఽస్మత్త ఏవమార్యాన్ సంప్రతి యత్స్యధేతి। అథాపి న సేంద్రియః పతతి। తదేతేన వేదితవ్యమంగహీనోఽపి సాంగం జనయతీతి॥** 10

పతితులందరు కలసి ఒకే చోట ఉండి తమ పనులు చేసికొనవలెను. అట్లే తమ పూజలు, తామే చేసికొనవలెను. అదే విధముగా తమలో తాము పెండ్లిండ్లు చేసికొని పిల్లలను కనవలెను. అంగహీనుని సంతానము అంగహీనము కానట్లే పతితునియొక్క సంతానము పతనమైపోదు. కావున పతితులు తమ సంతానముతో మీరు పతితులమైన మమ్ము వదలిపెట్టినచో ఆర్యులతో కలసి యుందురని అనవలెను.

**మిథ్యైతదితి హారీతో దధిధానీసధర్మాః స్త్రియస్స్యుర్యో హి**
**దధిధాన్యామ్ అప్రయతం పయ ఆతచ్య మంథతి న తచ్ఛిష్టాః**
**ధర్మకృత్యేషూపయోజయంతి। ఏవమశుచి శుక్లం**
**యన్నివర్తతే న తేన సహ సంప్రయోగో విద్యతే॥** 11

పై అభిప్రాయము సరియైనది కాదని హారీతుడనెను. స్త్రీలు పెరుగు కుండవంటివారు. పెరుగు కుండలో అపవిత్రమైన పాలు పోసి తోడు వేసి చిలికినచో శిష్టులు దానిని అపవిత్రమైనట్లు భావించి పవిత్ర కార్యములందు ఉపయోగింపకున్నారు. అట్లే అపవిత్రుని రేతస్సువలన పుట్టినవాడు అపవిత్రుడు. కావున అతనితో సంబంధము పెట్టుకొనకూడదని అతని అభిప్రాయము.

**అశుచి శుక్లోత్పన్నానాం తేషామిచ్ఛతాం ప్రాయశ్చిత్తిః।**
**పతనీయానాం తృతీయాంశః స్త్రీణామంశస్తృతీయః॥** 12

పతితులవలన పుట్టినవారు పతిత ప్రాయశ్చిత్తమున మూడవవంతు ప్రాయశ్చిత్తము చేసికొన్నచో పవిత్రులగుదురు. పతితులతో పోయిన స్త్రీలు కూడా

పై ప్రాయశ్చిత్తమున మూడవవంతు ప్రాయశ్చిత్తమును (పతిత ప్రాయశ్చిత్తమున తొమ్మిదవవంతు) చేసికొన్నచో పునీతులగుదురని బోధాయనుని అభిప్రాయము.

**భోజనాభ్యంజనాద్దానాద్యదన్యత్కురుతే తిలైః**
**శ్వవిష్ఠాయాం క్రిమిర్భూత్వా పితృభిస్సహ మజ్జతి॥** 13

నూవులను ఆహారము, అభ్యంగనస్నానము, దానము మొదలగు కార్యక్రమములందు తప్ప ఇతర కార్యక్రమములలో ఉపయోగించినచో ఆతడు, పితృలోకముననున్న అతని పితరులు కూడా శునకము యొక్క మలమందలి పురుగులుగా పుట్టుదురు.

**పితౄన్వా ఏష విక్రీణీతే యస్తిలానేష విక్రీణీతే।**
**ప్రాణాన్వా ఏష విక్రీణీతే యస్తండులాన్ విక్రీణీతే॥** 14

నూవులనమ్మిన బ్రాహ్మణుడు తన తల్లిదండ్రులనమ్ముకొన్నవానితో సమానుడు. బియ్యమునమ్మువాడు తన ప్రాణములనమ్ముకొన్న వానితో సమానుడగును.

**నో దుహితరం దదాతి॥** 15

వరునినుండి ధనము తీసికొని తన కూతురునిచ్చి వివాహము చేయరాదు. అట్లు చేసినచో తన పుణ్యము యొక్క కొన్ని భాగములను అమ్ముకొన్న వానితో సమానుడగును.

**తృణం కాష్ఠమవికృతం విక్రేయమ్॥** 16

గడ్డిని, కట్టెలను, త్రాడు, చాప, కఱ్ఱ పాత్రలను మార్పులు చేయక (బ్రాహ్మణుడు) అమ్మవచ్చును.

**అథాప్యుదాహరంతి**

**పశవశ్చైకతో దంతా అశ్మా చ లవణోద్ధృతః।**
**ఏతద్ బ్రాహ్మణ తే పణ్యం తంతుశ్చారజనీకృతః॥** 17

ఈ విషయమున ఈ శ్లోకమును ఉదాహరణముగా చెప్పుచున్నారు.

ఒకే దౌడకు పండ్లున్న పశువులు, ఉప్పు తప్ప మిగిలిన రాళ్ళు, రంగువేయని త్రాడు వీటిని బ్రాహ్మణుడు అమ్మవచ్చును.

**పాతక వర్జం వా బభ్రుం పింగళాం గాం రోమశాం సర్పిషాఽ వసిచ్య కృష్ణైస్తిలైః అవకీర్య అనూచానాయ దద్యాత్॥** 18

పాప కార్యములు కాక చిన్న చిన్న దోషములు చేసినప్పుడు బభ్రు వర్ణము లేక పింగళ వర్ణముతో బాగుగా రోమములున్న ఆవును నేతితో తడిపి దానిపై నల్ల నువ్వులు చల్లి చక్కగా వేదాభ్యాసము చేసిన బ్రాహ్మణునకు దానమీయవలెను.

**కూష్మాండైర్వా ద్వాదశాహమ్॥** 19

పన్నెండు దినములు కూష్మాండమంత్రములను చదువుచు హోమమునైనా చేయవలెను.

**యదర్వాచీనమేనో భ్రూణహత్యాయాస్తస్మాన్ముచ్యతే॥** 20

పై విధముగా కూష్మాండహోమము చేసినచో బ్రహ్మహత్య కాక మిగిలిన పాపములన్నియు తొలగిపోవును.

**పాతకాభిశంసనే కృచ్ఛ్రః॥** 21

పాతకము చేసినట్లు పేర్కొన్నప్పుడు కృచ్ఛ్ర ప్రాయశ్చిత్త వ్రతము చేసిన చాలును.

**తదబ్దోఽభిశంసితుః॥** 22

వ్యర్థముగా తప్పుచేసినట్లు ఇతరుని ఆరోపించినచో ఒక సంవత్సరకాలము కృచ్ఛ్ర ప్రాయశ్చిత్త వ్రతమునాచరింపవలెను.

**సంవత్సరేణ పతతి పతితేన సమాచరన్।**

**యాజనాధ్యాపనాద్యౌన్నాన్న తు యానాసనాశనాత్॥** 23

పతితునిచే యాగము చేయించుట, అతనికి వేదమును చెప్పుట అతనితో వివాహ సంబంధము చేయుటవల్లసత్‌బ్రాహ్మణుడు కూడా ఒక సంవత్సరములో పతితుడగును. కాని ఒకే బండిలో పోవుట, ఒకే దగ్గర కూర్చొనుట, కలసి భోజనము చేయుట అనువాటివలన పతితుడు కాదు.

**అమేధ్యప్రాశనే ప్రాయశ్చిత్తం నైష్పురీష్యం తత్ సప్త రాత్రేణావాప్యతే।**

**అపః పయో ఘృతం పరాక ఇతి ప్రతిత్ర్యహముష్ణాని స తప్తకృచ్ఛ్రః॥** 24

అమేధ్యపదార్థములైన కుక్క, ఒంటె, గాడిద మొదలగువానిమాంసము, ఉల్లి, వెల్లుల్లి మొదలగువానిని తిన్నచో నైష్పురీషమునుచేయవలెను. అమేధ్యవస్తువు

సంపూర్ణముగా శరీరము నుండి బయలు వెడలుటకు ఏడు దినములు పట్టును. అనగా ఏడు దినములు ఉపవాసముండవలెను. ఇంకను తప్తకృచ్ఛ్ర వ్రతమును చేయవలెను. తప్త కృచ్ఛ్రమనగా మూడు దినములు వేడి నీటిని మాత్రమే తీసికొనుట, మూడు దినములు వేడి పాలను మాత్రమే తీసికొనుట ఇంకొక మూడు దినములు వేడి నేయిని మాత్రమే తీసికొనుట చివరి మూడు దినములు సంపూర్ణముగా ఉపవాసముండుట. ఇట్లు దీనిని పన్నెండు దినములు చేయవలెను.

**త్ర్యహం ప్రాతస్తథా సాయం త్ర్యహమన్యదయాచితమ్।**
**త్ర్యహం పరం తు నాశ్నీయాత్ స పరాక ఇతి కృచ్ఛ్రః॥ 25**

మూడు దినములు పగటిపూట మాత్రమే తినవలెను. మూడు దినములు రాత్రిపూట మాత్రమే తినవలెను. మూడు దినములు అయాచితమైన ఆహారమును మాత్రము తినవలెను. అట్లే మూడు దినములు సంపూర్ణముగా ఉపవాసము ఉండవలెను. దీనిని పరాకకృచ్ఛ్రవ్రతమందురు.

**ప్రాతస్సాయమయాచితం పరాక ఇతి త్రయశ్చతూరాత్రాః**
**సేష స్త్రీ బాల వృద్ధానాం కృచ్ఛ్రః॥ 26**

ఒక దినము ప్రాతఃకాలమున మాత్రము తినుట, ఒక దినము సాయంకాలమున తినుట, ఒక దినము అయాచితమైన ఆహారమును మాత్రము తినుట, ఒక దినము సంపూర్ణముగా ఉపవాసముండుట ఇట్లు మూడు మార్లు చేయుట కూడా కృచ్ఛ్రమే. ఇది అశక్తులైన స్త్రీలకు, బాలురకు, వృద్ధులకు విధింపబడినది.

**యావత్సకృదాదీత తావదశ్నీయాత్ పూర్వవత్సోఽ తికృచ్ఛ్రః॥ 27**

చేతిలో పట్టినంత అన్నమును దినమున ఒకేమారు తినవలెను. మిగిలినదంతయు పూర్వము వలెనే ఉండును. అనగా మూడు దినములు పగటిపూట మాత్రము తినుట, మూడు దినములు రాత్రిపూట మాత్రము తినుట, మూడు దినములు అయాచితమైన దానినే తినుట ఇట్లు తొమ్మిది దినములు తన చేతిలో పట్టినంత ఒక ముద్దను మాత్రమే తిని మిగిలిన మూడు దినములు ఏమియు తినకుండుట అతికృచ్ఛ్రము. ఇది వివరముగా పరాశరస్మృతిలో చెప్పబడినది.

"నవాహమతికృచ్ఛ్రీ స్యాత్ పాణిపూరాన్నభోజనః।

త్రిరాత్రముపవాసః స్యాత్ అతికృచ్ఛ్రః స ఉచ్యతే॥ 11-55

**అబ్భక్షస్తృతీయః స కృచ్ఛ్రాతి కృచ్ఛ్రః॥** 28

పన్నెండు దినములు నీటిని మాత్రమే తీసికొన్నచో అది కృచ్ఛ్రాతి కృచ్ఛ్రప్రాయశ్చిత్తము. ఇది మూడవ కృచ్ఛ్రము.

**కృచ్ఛ్రే త్రిషవణముదకోపస్పర్శనమ్॥** 29

కృచ్ఛ్ర ప్రాయశ్చిత్తమును చేయునప్పుడు మూడు సంధ్యలందు చన్నీటిస్నానము చేయవలెను.

**అధశ్శయనమ్॥** 30

ఇంకను భూమిపైననే పడుకొనవలెను.

**ఏక వస్త్రతా కేశ శ్మశ్రు లోమ నఖవాపనమ్॥** 31

ప్రాయశ్చిత్తము పూర్తి చేయు వరకు ఒకే ధోవతి, ఒకే ఉత్తరీయమును ధరింపవలెను. అట్లే వెంట్రుకలు తీసికొని గోళ్ళు కత్తిరించుకొనుట వ్రతాంతమున చేయవలెను.

**ఏతదేవ స్త్రీ కేశవపన వర్జం కేశవపన వర్జమ్॥** 32

స్త్రీలు కృచ్ఛ్రప్రాయశ్చిత్తము చేసికొనునప్పుడు వెంద్రుకలు తీయుట వదలి మిగిలిన ప్రాయశ్చిత్తమంతయు చేయవలెను.

అధ్యాయసమాప్తి సూచకముగా పదముల పునరుక్తి జరిగినది

ఇతి ద్వితీయః ఖండః

అథ తృతీయః ఖండః

**నిత్యోదకీ నిత్యయజ్ఞోపవీతీ నిత్యస్వాధ్యాయీ వృషలాన్నవర్జీ ఋతౌ చ గచ్ఛన్ విధివచ్చ జుహ్వన్ న బ్రాహ్మణశ్చ్యవతే బ్రహ్మలోకాత్॥** 1

గృహస్థుడైన బ్రాహ్మణుడు ఎల్లప్పుడు తనవెంట జలమును ఉంచు కొనవలెను. ఎల్లప్పుడు యజ్ఞోపవీతమును ధరింపవలెను. ప్రతి దినము వేదాధ్యయనము చేయుచుండవలెను. శూద్రుని అన్నమునెప్పుడు కూడా స్వీకరింపరాదు. అట్లే సత్ సంతానమునకై ఋతుకాలమున భార్య దగ్గరకు పోవలెను. శాస్త్రమర్యాదననుసరించి హోమములు చేయుచుండవలెను. ఇట్లు తన విధులను నిర్వర్తించు గృహస్థునకు ఊర్ధ్వలోకములు తప్పక లభించును.

**మనుః పుత్రేభ్యో దాయం వ్యభజదితి శ్రుతిః॥** 2

వేదమందు మనువు పుత్రులకు ఆస్తిని విభజించి ఇచ్చినట్లు చెప్పబడినది. అట్లే గృహస్థు కూడా తన ఆస్తిని పుత్రులకు విభజించి ఈయవలెను.

**సమశః సర్వేషామవిశేషాత్॥** 3

విశేషము లేనిచో పుత్రులందరకు సమానముగా భాగమునివ్వవలెను.

**వరం వా రూపముద్ధరేత్ జ్యేష్ఠః॥** 4

లేక జ్యేష్ఠ పుత్రుడు తండ్రి ఆస్తిలో ఉత్కృష్టమైన దానిని జ్యేష్ఠ భాగముగా స్వీకరింపవచ్చును. జ్యేష్ఠః పూజ్యతమో లోకే జ్యేష్ఠః సద్భిరగర్హితః॥ యో జ్యేష్ఠో జ్యేష్ఠవృత్తి స్స్యాత్ మాతేవ స పితేవ సః॥ యత్కించిదేవ దేయం తు జ్యాయసే మానవర్ధనం 19-109, 115 అంటూ మనుస్మృతి జ్యేష్ఠుని బాధ్యతలను కూడా తెలుపుతుంది.

**తస్మాత్ జ్యేష్ఠం పుత్రం ధనేన నిరవసాయయంతీతి శ్రుతిః॥** 5

అందువలన జ్యేష్ఠ పుత్రునకు అధిక ధనమునిచ్చి అతనిని వేరు చేయుచున్నారని తైత్తిరీయ సంహిత 2-5, 2-7 లలో చెప్పబడినది.

**దశానాం వైకముద్ధరేజ్జ్యేష్ఠః॥** 6

లేక తండ్రి ఆస్తిని పదిభాగములు చేసికొని అందు ఒక్క భాగమును జ్యేష్ఠున కీయవలెను.

**సమమితరే విభజేరన్॥** 7

మిగిలిన తండ్రి ఆస్తిని జ్యేష్ఠుడు కాక తక్కిన అన్న దమ్ములు సమానముగా విభజించి తీసికొనవలెను.

**పితురనుమత్యా దాయవిభాగస్సతి పితరి॥** 8

తండ్రి బ్రతికి యున్నప్పుడు అతని అనుమతి తీసికొని అన్నదమ్ములు తమ తండ్రి ఆస్తిని విభజించుకొనవచ్చును.

**చతుర్ణాం వర్ణానాం గోఽశ్వాజావయో జ్యేష్ఠాంశః॥** 9

బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రవర్ణములందు జ్యేష్ఠుడు ఆవులు అశ్వములు, మేకలు, గొఱ్ఱెలు వీటియందు జ్యేష్ఠాంశమును తీసికొనవచ్చును.

**నానావర్ణ స్త్రీ పుత్ర సమవాయే దాయం దశాంశాన్ కృత్వా**
**చతురః త్రీన్ ద్వావేకమితి యథాక్రమం విభజేరన్॥** 10

బ్రాహ్మణునకు అనేక వర్ణములకు చెందిన స్త్రీల పుత్రులున్నప్పుడు వారు తమ తండ్రి ఆస్తిని పదిభాగములు చేసి బ్రాహ్మణస్త్రీ పుత్రులు నాలుగు భాగములను, క్షత్రియ స్త్రీకి కల్గిన పుత్రులు మూడు భాగములను, వైశ్యస్త్రీకి కల్గిన పుత్రులు రెండు భాగములను, శూద్ర స్త్రీకి పుట్టినవాడు ఒక భాగమును తీసికొనవలెను.

**ఔరసే తూత్పన్నేఽ సవర్ణాః తృతీయాంశహరాః॥** 11

సవర్ణుడైన ఔరసుడు పుట్టినప్పుడు ఇతర వర్ణ స్త్రీలకు కలిగిన సంతానమునకు మూడవభాగమే ఈయవలెను. వారు కూడ తమ భాగమును ఆరు భాగములు చేసికొనవలెను.

**సవర్ణా పుత్రానంతరా పుత్రయోః అనంతరా పుత్రశ్చేద్గుణవాన్**
**స జ్యేష్ఠాంశం హరేత్॥** 12

సవర్ణ స్త్రీకి కల్గిన పుత్రుడు, అసవర్ణస్త్రీకి కలిగిన పుత్రులలో అసవర్ణ స్త్రీ పుత్రుడు గుణవంతుడైతే జ్యేష్ఠాంశమతనికే ఈయవలెను.

గుణవంతుడైన పుత్రుడే మిగిలిన తన అన్నదమ్ముల యొక్క పాలనాదికమును చూడవలెను.

**సవర్ణాయాం సంస్కృతాయాం స్వయముత్పాదితం ఔరసం పుత్రం విద్యాత్॥**

శాస్త్ర పద్ధతిననుసరించి వివాహము చేసికొన్న సవర్ణ స్త్రీకి తనవల్ల పుట్టిన పుత్రుడు ఔరసుడు.

**అభ్యుపగమ్య దుహితరి జాతం పుత్రికాపుత్రమ్ అన్యం దౌహిత్రమ్‌॥** 15

పుత్రసంతానములేనందువలన శ్రాద్ధాదులకై పుత్రుడు కావాలని కోరుకొన్నందు వలన కూతురుకు జన్మించినవాడు పుత్రికా పుత్రుడని అందురు. పుత్రికకు జన్మించిన ఇతర పుత్రులను దౌహిత్రులందురు.

**అథాప్యుదాహరంతి**

**ఆదిశేత్ప్రథమే పిండే మాతరం పుత్రికా సుతః।**
**ద్వితీయే పితరం తస్యాః తృతీయే చ పితామహమ్‌॥** 16

ఈ విషయమున ఈ క్రింది శ్లోకమును ఉదాహరించుచున్నారు.

పుత్రికా పుత్రుడు తొలి పిండమును తల్లికి, రెండవ పిండమును ఆమె తండ్రికి (మాతామహునికి) మూడవ పిండమును మాతామహుని తండ్రికి ఇవ్వవలెను. ఇచ్చట తల్లియే పితృస్థానమును స్వీకరించును. దీనిని మనువు కూడా అధ్యా 10-140 శ్లోకమున పేర్కొనెను.

**మృతస్య ప్రసూతో యః క్లీబ వ్యాధితయోర్వా**
**అన్యేనానుమతేన స్వే క్షేత్రే స క్షేత్రజః॥** 17

పుత్రులు లేక చనిపోయినవానికి, నపుంసకునకు, దీర్ఘ వ్యాధి పీడితునకు, పెద్దలు పితృకర్మాదులకై అనుమతించగా అతని భార్యయందు ఇతరునివలన పుట్టినవాడు క్షేత్రజుడు.

**స ఏష ద్విపితా ద్విగోత్రశ్చ ద్వయోరపి స్వధా రిక్థ భాగ్భవతి॥** 18

ఈ క్షేత్రజునకు తల్లి భర్త, మరియు తన తండ్రి ఇట్లు ఇద్దరు తండ్రులుందురు. అతడు ఇద్దరికి పిండ ప్రదానము చేయుటకు అర్హుడు. ఇంకను అతనికి ఇద్దరి ఆస్తిలో హక్కు ఉండును.

**అథాప్యుదాహరంతి**

**ద్విపితుః పిండదానం స్యాత్ పిండే పిండే చ నామనీ।**
**త్రయశ్చ పిండాష్షణ్ణాం స్యురేవం కుర్వన్న ముహ్యతి॥** 19

ఈ విషయమున ఈ శ్లోకమును ఉదాహరింతురు. ఇద్దరు తండ్రులున్న క్షేత్రజ్ఞుడు పిండ ప్రదానము చేయునప్పుడు ప్రతి పిండముపై అతని తల్లి భర్త మరియు అతని తండ్రి పేర్లు రెండు ఉండును. ఈ విధముగా మూడు పిండములపై ఆరుగురి పేర్లుండును. ఇట్లు ఆరుగురి పేర్లతో పిండ ప్రదానము చేసినచో ఎట్టి దోషముండదు.

**మాతృపితృభ్యాం దత్తో౽న్యతరేణ వా యో౽పత్యార్థే**
**పరిగృహ్యతే స దత్తః॥** 20

సంతానము లేనప్పుడు తల్లి దండ్రులు గాని ఇద్దరిలో ఎవ్వరైనను తమ పుత్రుని సంతాన రహితునకు పుత్రుడుగా ఇచ్చినచో అతనిని దత్తుడని అందురు.

**సదృశం యం సకామం స్వయం కుర్యాత్స కృత్రిమః॥** 21

తన వర్ణమునకే చెందిన అనాథయైన కుమారుని పుత్రుడుగా కోరుకొని స్వీకరించినచో ఆ పుత్రుడు కృత్రిమ పుత్రుడు.

**గృహే గూఢముత్పన్నో౽ంతే జ్ఞాతో గూఢః॥** 22

రహస్యముగా చేసిన వ్యభిచారము వలన పుట్టి కొంత కాలమునకావిషయము తెలిసినచో అతనిని గూఢ పుత్రుడని అందురు.

**మాతృ పితృభ్యాముత్సృష్టో౽న్యతరేణ వా యో అపత్యార్థే**
**పరిగృహ్యతే సో౽పవిద్ధః॥** 23

తన వర్ణమునకే చెందిన వారు ఎవ్వరైనను తమ పుత్రుని వదలిపెట్టినప్పుడు అట్టి బాలకునిగా స్వీకరించినచో ఆ పుత్రుడు అపవిద్ధుడు.

**అసంస్కృతామనతిసృష్టాం యాముపయచ్ఛేత్**
**తస్యాం యో జాతస్స కానీనః॥** 24

వివాహముకాక కన్యగా ఉన్నప్పుడు పుట్టినవాడు కానీనుడు. వివాహమైన స్త్రీకి రహస్యముగా పుట్టినవానిని ఇంతకు ముందు పేర్కొన్నట్లు గూఢ పుత్రుడని అందురు.

**యా గర్భిణీ సంస్క్రియతే విజ్ఞాతా వా౽విజ్ఞాతా వా తస్యాం యో**
**జాతః సహోఢః॥** 25

తెలిసి తెలియక గర్భిణీ స్త్రీని వివాహమాడినప్పుడు ఆమెకు కలిగిన పుత్రుడు సహోఢుడు.

**మాతాపిత్రోర్వాన్యతరేణ వా**
**యో అపత్యార్థే పరిగృహ్యతే స క్రీతః॥** **26**

తమకు సంతానము లేనందువలన బాలుని తల్లి దండ్రులలో, ఇద్దరికో, ఒక్కరికో ధనమిచ్చి పుత్రుడుగా కొన్నచో అతడు క్రీత పుత్రుడు.

**క్లీబం త్యక్త్వా పతితం వా యాఽన్యం పతిం విందేత్తస్యాం**
**పునర్భ్వాం యో జాతస్స పౌనర్భవః॥** 27

నపుంసకుడు, పతితుడైన భర్తను వదలి ఇంకొక పురుషుని వివాహము చేసికొన్నచో ఆ స్త్రీని పునర్భూ అని అందురు. ఆ స్త్రీకి పుట్టినవాడు పౌనర్భవుడు. వసిష్ఠుడు "మృతే వా సా పునర్భూర్భవతి" భర్త చనిపోవుట మొదలగు కారణములవలన ఇంకొక వివాహము చేసికొన్నచో ఆమెను పునర్భూ అని అనెను.

**మాతాపితృవిహీనో యః స్వయమాత్మానం దద్యాత్సస్వయందత్తః॥** 28

తల్లిదండ్రులు లేనందువలన తనను పుత్రుడుగా స్వయముగా సమర్పించుకొన్నచో అతడు స్వయం దత్తుడు.

**ద్విజాతి ప్రవరాచ్ఛూద్రాయాం జాతో నిషాదః॥** 29

బ్రాహ్మణునివలన శూద్ర స్త్రీయందు పుట్టినవాడు నిషాదుడు.

**కామాత్పారశవ ఇతి పుత్రః॥** 30

కామమువల్ల శూద్ర స్త్రీని వివాహము చేసికొన్నప్పుడు పుట్టిన ఇతని పారశవుడని అందురు. ఈ గ్రంథములోని 1-17- 2,3 సూత్రములలో చెప్పబడినది.

**అథాప్యుదాహరంతి**

**ఔరసం పుత్రికాపుత్రం క్షేత్రజం దత్త కృత్రిమౌ।**
**గూఢజం చాపవిద్ధం చ రిక్థభాజః ప్రచక్షతే॥** **31**
**కానీనం చ సహోఢం చ క్రీతం పౌనర్భవం తథా।**
**స్వయం దత్తం నిషాదం చ గోత్రభాజః ప్రచక్షతే॥** 32

పుత్రుల విషయమున ఈ శ్లోకములను ఉదహరించుచున్నారు.

ఔరసపుత్రుడు, పుత్రికా పుత్రుడు, క్షేత్రజుడు, దత్తుడు, కృత్రిముడు, గూఢజుడు, అపవిద్ధుడను ఏడుగురు తండ్రి ఆస్తికి అధికారులని చెప్పుదురు.

అట్లే కానీనుడు, సహోఢుడు, క్రీతుడు, పౌనర్భవుడు స్వయం దత్తుడు మరియు నిషాదుడనువారు తండ్రి గోత్రమునకు మాత్రమే చెందుచున్నారు. వీరికి తండ్రి ఆస్తిలో అధికారము లేదు.

పైన చెప్పిన వారిలో పుత్రికా పుత్రుడు మాతామహునికి పిండము పెట్టుచున్నందువల్ల మాతామహుని ఆస్తికి వారసుడని మనువు 10-136 శ్లోకమున పేర్కొనెను. పుత్రికా పుత్రుని కూడా పుత్రుడుగా అంగీకరించినచో పదముగ్గురు పుత్రులు కావలెను. మనువు , పుత్రికా పుత్రుడు కాక తక్కిన వారిని ద్వాదశ పుత్రులుగా పేర్కొనెను.

ఔరస క్షేత్రజశ్చైవ దత్తః కృత్రిమ ఏవ చ।
గూఢోత్పన్నోఽపవిద్ధశ్చ దాయాదా బాంధవాశ్చ షట్॥
కానీనశ్చ సహోఢశ్చ క్రీతః పౌనర్భవస్తథా।
స్వయం దత్తశ్చ శౌద్రశ్చ షడదాయాద బాంధవాః॥

మనుస్మృతి అధ్యా 10-159, 160

**తేషాం ప్రథమత ఏవేత్యాహ ఔపజంఘనిః॥** 33

పై పుత్రులలో ప్రథముడైన ఔరసుడు మాత్రము తండ్రి ఆస్తికి వారసుడని ఔపజంఘనియను ఆచార్యుడు పేర్కొనుచున్నాడు.

**ఇదానీమహమీర్ష్యామి స్త్రీణాం జనక!నో పురా।**
**యతో యమస్య సదనే జనయితుః పుత్రమబ్రువన్॥** 34

కృతయుగమున యముడు మహర్షులను పిలిచి ఇతరుల భార్యలందు పుట్టినవారు తమకు జన్మనిచ్చిన తండ్రికి చెందుదురా? లేక తల్లికి భర్తగా ఉన్నవారికి చెందుదురా అని అడుగగా ఆ మహర్షులు ఆ సంతానము జన్మనిచ్చిన తండ్రికే చెందునని అనిరి అందువలన నేను పూర్వము కంటె ఇప్పుడు చాలా జాగ్రత్త కలిగి ఉన్నానని జనకునితో ఆచార్యుడు పేర్కొనెను.

**రేతోధాః పుత్రం నయతి పరేత్య యమసాదనే।**
**తస్మాద్భార్యాం రక్షంతి బిభ్యంతః పరరేతసః॥** 35

తన వీర్యమువలన పుత్రుని కన్నందువలన అతడు చనిపోయిన తరువాత యమధర్మరాజు దగ్గర పుత్ర ఫలమును పొందుచున్నాడు. అందువలన ఇతరుడు

తన భార్య దగ్గరకు రాకుండ పురుషులు తమ భార్యను జాగ్రత్తగా రక్షించుకొనుచున్నారు.

ఈ రెండు శ్లోకములు వేదమున ఉన్నట్లు ఆపస్తంబధర్మ సూత్రము రెండవ ప్రశ్నలో 13-6 సూత్రము పేర్కొనుచున్నది.

**అప్రమత్తా రక్షథ తంతుమేతం మా వః క్షేత్రే పరబీజాని వప్సుః జనయితుః పుత్రో భవతి సాంపరాయే మోఘం వేత్తా కురుతే తంతుమేతమితి॥ 36**

తన వీర్యము వలన పుట్టినవాడే పుత్రుడగుచున్నాడు. ఇతరుడు ఆ బాలుని, అతని తల్లిని కాపాడుటవంటి పనులు చేసినచో అతడు పుత్రుని ఫలము పొందక పనులు చేసినవాడగుచున్నాడు. అందువలన మీ భార్యలు పరుల దగ్గరకు పోకుండ వారిని జాగ్రత్తగా రక్షించుకొనుడని ఔపజంఘని మహర్షి జనకునితో అనెను.

**తేషామప్రాప్తవ్యవహారాణామ్ అంశాన్ సోపచయాన్ సునిగుప్తాన్ నిదధ్యుః ఆవ్యవహార ప్రాపణాత్॥** 37

తండ్రి చనిపోయినప్పుడు ఇంటిలో ఉన్న పెద్దవారు యుక్తవయస్కులు (16 సంవత్సరములు) కాని వారి భాగములను వారు యుక్త వయస్కులగునంత వరకు జాగ్రత్తగా రక్షింపవలెను. పైగా వారి ధనమును వృద్ధి చేసి వారి కప్పగింపవలెను.

**అతీతవ్యవహారాన్ గ్రాసాచ్ఛాదనైర్బిభ్రుయుః॥ 38**

**అకర్మిణః॥ 40**

**పతిత తజ్జాత వర్జమ్॥** 41

తమ సంపదను జాగ్రత్తగా కాపాడుకొనలేని వారిని, గుడ్డివారిని, జడులను, నపుంసకులను, వ్యసనపరాయణులను దీర్ఘ వ్యాధి పీడితులను, ఏ పని చేయలేని వారిని ఇంటిలోనున్న పెద్దవారు ఆహారము తగిన వస్త్రముల నొసగుచు పోషింపవలెను. కాని పతితులు, వారి సంతానమును మాత్రము పోషింపనక్కరలేదు.

**న పతితైస్సంవ్యవహారో విద్యతే॥** 42

పతితులతో ఎట్టి వ్యవహారము చేయరాదు.

**పతితామపి తు మాతరం బిభృయాదనభిభాషమాణః॥** 43

తన తల్లి పతితయైనచో ఆమెతో మాట్లాడక ఆమెకు అన్న వస్త్రములనిచ్చి రక్షింపవలెను.

**మాతురలంకారం దుహితరః సాంప్రదాయికం లభేరన్ అన్యద్వా॥** 44

తల్లి యొక్క ఆభరణములను, ఆమెకు తన తల్లి అమ్మమ్మలు మొదలైన వారి వల్ల సాంప్రదాయముగా లభించిన ఆభరణములను ఇంకను తల్లి ధనమును (తల్లి గారి ఇంటి నుండి వచ్చిన స్త్రీ ధనమును) పుత్రికలు పొందవలెను.

**న స్త్రీ స్వాతంత్ర్యం విందతే॥** 45

ఆస్తి వ్యవహారమున స్త్రీకి స్వాతంత్ర్యంము లేదు కాని తనకు లభించిన ఆస్తిపై ఆమెకు సంపూర్ణాధికారము కలదు.

**అథాప్యుదాహరంతి**

**పితా రక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే।**

**పుత్రస్తు స్థావిరే భావే న స్త్రీ స్వాతంత్ర్యమర్హతీతి॥** 46

ఈ విషయమున ఈ క్రింది శ్లోకమును ఉదాహరణగా ఇచ్చుచున్నారు.

కుమారిగా ఉన్నప్పుడు ఆమె రక్షణ పోషణ బాధ్యతలను తండ్రి చూచును. వివాహమైన స్త్రీని ఆమె భర్త రక్షించును. అట్లే ముసలి తనమున పుత్రుడు ఆమె రక్షణ బాధ్యతలు వహించును. కాని స్త్రీ స్వతంత్రముగా అనగా ఒంటరిగా ఎప్పుడూ ఉండకూడదు.

ఈ శ్లోకము మనుస్మృతి 9-3లోనూ కన్పించుచున్నది.

**నిరింద్రియా హ్యదాయాశ్చ స్త్రియో మతాః ఇతి శ్రుతిః॥** 47

స్త్రీలు దుర్బలులు. వారికి ఆస్తిపై అధికారము లేదని వేదము తెలుపుచున్నది.

**భర్తృహితే యతమానాస్స్వర్గం లోకం జయేరన్॥** 48

భర్తయొక్క హితమును గోరి ప్రయత్నించు స్త్రీలు స్వర్గ ఫలమును పొందుదురు.

**వ్యతిక్రమే తు కృచ్ఛ్రః॥** 49

తద్విరుద్ధముగా ప్రయత్నించు స్త్రీలు నరకమునకు పోవుదురు.

**శూద్రే చాంద్రాయణం చరేత్॥** 50

శూద్రుని కోరు అసమాన జాతి స్త్రీ, ఆ పాపము తొలగుటకై చాంద్రాయణ వ్రతమును చేయవలెను.

**వైశ్యాదిషు ప్రతిలోమం కృచ్ఛ్రాతి కృచ్ఛ్రాదీంశ్చరేత్॥** 51

బ్రాహ్మణ స్త్రీ, వైశ్యునితో సంబంధము పె[illegible] కొన్నచో కృచ్ఛ్రవ్రతమును, క్షత్రియునితో సంబంధము పెట్టుకొన్నచో అతికృచ్ఛ్ర[illegible]మును క్షత్రియ స్త్రీ, వైశ్యునితో సంబంధము పెట్టుకొన్నచో కృచ్ఛ్రవ్రతము నాచరింపవలెను.

**పుంసాం బ్రాహ్మణాదీనాం సంవత్సరం బ్రహ్మచర్యమ్॥** 52

ఇట్లే బ్రాహ్మణుడు మొదలైన పురుషులు పర స్త్రీలతో అక్రమ సంబంధము కలిగియున్నచో ఒక సంవత్సరము బ్రహ్మచర్య నియమము కలిగి ప్రాజాపత్య వ్రతము నాచరింపవలెను.

**శూద్రం కటాగ్నినా దహేత్॥** 53

శూద్రుడు పరస్త్రీలతో అక్రమ సంబంధము కలిగియున్నచో అతనిని గడ్డిగాదెము మొదలగునవి వేసి తగులబెట్టవలెను.

ఇతి తృతీయః ఖండః

అథ చతుర్థః ఖండః

**అబ్రాహ్మణస్య శారీరో దండస్సంగ్రహణే భవేత్॥** 1

బ్రాహ్మణేతరుడు వ్యభిచరించినచో శరీరమునకు సంబంధించిన దండము విధింపవలెను.

**సర్వేషామేవ వర్ణానాం దారా రక్ష్యతమా ధనాత్॥** 2

అన్ని వర్ణములకు చెందినవారు తమ స్త్రీలను ధనముకంటె జాగ్రత్తగా వ్యభిచారమునుండి రక్షించుకొనవలెను.

**న తు చారణదారేషు న రంగావతారే వధః।**
**సంసర్జయంతి తాహ్యేతాన్నిగుప్తాంశ్చాలయంత్యపి॥** 3

చారణదార శబ్దమునకు గోవిందస్వామి దేవదాసియను అర్థమునిచ్చెను. రంగావతార యనగా వేశ్య వీరితో వ్యభిచరించినచో శారీరక దండన లేదు. ఎందువలన అనగా వీరు ధనము నాశించి ఎంతో మనోనిగ్రహమున్న వారితోనూ సంబంధము పెట్టుకొనుచున్నారు. అట్లే ధనహీనులను త్యజించుచున్నారు.

**స్త్రియః పవిత్రమతులం నైతా దుష్యంతి కర్హిచిత్।**

**మాసి మాసి రజో హ్యాసాం దురితాన్యపకర్షతి॥ 4**

స్త్రీలకు ప్రతినెల వచ్చు మైల వారు చేయు వ్యభిచార దోషమును తొలగించుచున్నది కావున వారికి శరీరమునకు సంబంధించిన దోషము లేదు. అందువలన వారు నిర్మలులగుచున్నారు. ఇది వ్యభిచార దోషమునకు మాత్రము సంబంధించినది.

**సోమశ్శౌచం దదత్తాసాం గంధర్వశ్శిక్షితాం గిరమ్।**

**అగ్నిశ్చ సర్వభక్ష్యత్వం తస్మాన్నిష్కల్మషాః స్త్రియః॥ 5**

ఇంకా స్త్రీలకు సోముడు శుచిత్వమును ప్రసాదింపగా గంధర్వుడు చక్కని మాటను, అగ్ని దేవుడు సర్వభోగ్యత్వమును వరముగా ప్రసాదించెను. అందువలన వారు దోషరహితలగుచున్నారు.

**అప్రజాం దశమే వర్షే స్త్రీప్రజాం ద్వాదశే త్యజేత్।**

**మృతప్రజాం పంచదశే సద్యస్త్వప్రియవాదినీమ్॥ 6**

ఐనప్పటికీ సంతానములేని స్త్రీని పదియవ సంవత్సరమున వదలిపెట్ట వచ్చును. స్త్రీ సంతానమున్న స్త్రీని పన్నెండు సంవత్సరముల వరకు చూచి వదలి పెట్టవచ్చును. సంతానము మరణించుచున్నచో పదునైదు సంవత్సరముల వరకు వేచియుండి వదలి వేయవచ్చును. కాని అప్రియములు పలుకు స్త్రీని వెంటనే వదలి వేయవలెను.

**సంవత్సరం ప్రేతపత్నీ మధు మాంస మద్య లవణాని వర్జయేదధశ్శయీత॥ 7**

భర్త చనిపోయినచో ఆ స్త్రీ సంవత్సరమువరకు భూమి పైననే పడుకొని బ్రహ్మచర్యవ్రతము నాచరింపవలెను.

**షణ్మాసానీతి మౌద్గల్యః॥ 8**

పై నియమములను ఆరు నెలలవరకు పాలించిన చాలునని మౌద్గల్యుడను మహర్షి తెలిపెను.

**అత ఊర్ధ్వం గురుభిరనుమతా దేవరాత్ జనయేత్పుత్రమపుత్రా॥ 9**

పైన పేర్కొన్న సంవత్సరము లేక ఆరు నెలల తరువాత పుత్రసంతానము లేని స్త్రీ పెద్దల అనుమతి తీసికొని మరది వలన పుత్ర సంతానమును కనవచ్చును.

కాని ఆపస్తంబుడు దేవరన్యాయమువలన స్త్రీ పురుషులకు మనోదౌర్బల్యము కలుగునని, వివాహ వ్యవస్థ గొప్ప తనమే చెడిపోవునని, దానిని అతిక్రమించిన వారికి నరకము లభించునని దేవరన్యాయమును వ్యతిరేకించెను. చూ.ఆప. ధ. సూ. 2-27-4-7 సూ.

**అథాప్యుదాహరంతి**

**వశా చోత్పన్నపుత్రా చ నీరజస్కా గతప్రజా।**
**నాకామా సన్నియోజ్యా స్యాత్ఫలం యస్యాం న విద్యతే॥** 10

గొడ్రాలు, పుత్రుడున్న స్త్రీ, ముట్లుడిగిన స్త్రీ, పుత్రులు చనిపోవుచున్న స్త్రీ, ఇంకను నియోగమునకు ఇష్టపడని స్త్రీ వీరికి నియోగము వలన ఫలము లేదు కావున నియోగము చేయరాదు.

**మాతుల పితృష్వసా భగినీ భాగినేయీ స్నుషా**
**మాతులానీ సఖి వధూరిత్యగమ్యాః॥** 11

మేనమామ సోదరి, మేనత్త, చెల్లెలు, మేనకోడలు, కోడలు, మేనమామభార్య, స్నేహితుని భార్య వీరు అగమ్యలు.

**అగమ్యానాం గమనే కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ చాంద్రాయణమితి ప్రాయశ్చిత్తిః॥**

అగమ్యలైన స్త్రీల దగ్గరకు పోయినచో కృచ్ఛ్రము లేక అతికృచ్ఛ్రము మరియు చాంద్రాయణ వ్రతమును ప్రాయశ్చిత్తముగా చేసికొనవలెను. మరి మేన సంబంధము చేసికొనువారికి ప్రాయశ్చిత్తమేమి కలదని గోవిందస్వామి తెలిపెను.

**ఏతేన చండాలీ వ్యవాయో వ్యాఖ్యాతః॥** 13

చండాల స్త్రీతో వ్యభిచరించినను పై ప్రాయశ్చిత్తమునే చేసికొనవలెను.

**అథాప్యుదాహరంతి**

**చండాలీం బ్రాహ్మణో గత్వా భుక్త్వా చ ప్రతిగృహ్య చ।**
**అజ్ఞానాత్పతితో విప్రో జ్ఞానాత్తు సమతాం వ్రజేత్॥** 14

బ్రాహ్మణుడు చండాల స్త్రీతో తెలియక వ్యభిచరించినను, వారి ఇంట తిన్నను, వారి దగ్గర దానము తీసికొన్నను, పతితుడగును. ఇక తెలిసి ఈ పనులు చేసినచో చండాలుడగును. అనగా అతనికి ఎట్టి ప్రాయశ్చిత్తము లేదని భావము.

మనుస్మృతిలో ఇట్టి శ్లోకమే 11-175 కనిపించును.

**పితుర్గురోర్నరేంద్రస్య భార్యాం గత్వా ప్రమాదతః।**
**గురుతల్పీ భవేత్తేన పూర్వోక్తస్తస్య నిష్కృతిః॥** 15

తండ్రి, గురువు, రాజు వీరి భార్యలతో తెలియక వ్యభిచరించినను, గురుతల్పగామి దోషమంటును కావున తన్నివారణకై పూర్వము తెల్పిన ప్రాయశ్చిత్తము చేసికొనవలెను.

**అధ్యాపనయాజన ప్రతిగ్రహైరశక్తః**
**క్షత్రధర్మేణ జీవేత్ ప్రత్యనంతరత్వాత్॥** 16

బ్రాహ్మణుడు వేదాధ్యాపనము, యాగము చేయించుట, దానము స్వీకరించుట చేయలేని సమయమున జీవనమునకై ప్రత్యనంతరమైన క్షత్రియ ధర్మమును స్వీకరింపవచ్చును.

**నైతి గౌతమోఽత్యుగ్రో హి క్షత్రధర్మో బ్రాహ్మణస్య॥** 17

క్షత్రియ ధర్మము మహాభయంకరమైనది. కావున బ్రాహ్మణునకిది పనికి రాదని గౌతముడు తెలిపెను.

**అథాప్యుదాహరంతి**

**గవార్థే బ్రాహ్మణార్థే వా వర్ణానాం వాఽపి సంకరే।**
**గృహ్ణీయాతాం విప్రవిశౌ శస్త్రం ధర్మవ్యపేక్షయా॥** 18

కాని ధర్మశాస్త్రవేత్తలు ఈ విషయమున ఈ క్రింది శ్లోకమును ఉదాహరించుచున్నారు. గోవులకు, బ్రాహ్మణులకు ఆపద సంభవించినప్పుడు, వర్ణసంకరము జరుగుచున్నప్పుడు ధర్మమును రక్షించుటకై బ్రాహ్మణుడు కాని వైశ్యుడు గాని ఆయుధమును చేతబట్టుకోవచ్చును.

**వైశ్యవృత్తిరనుష్ఠేయా ప్రత్యనంతరత్వాత్॥** 19

బ్రాహ్మణుడు ఆపత్కాలమందు క్షత్రియ వృత్తి తరువాత ఉన్న వైశ్యవృత్తిని కూడ స్వీకరింపవచ్చును.

**ప్రాక్ప్రాతరాశాత్ కర్షీ స్యాత్॥** 20

బ్రాహ్మణుడు ఆపత్కాలమున వ్యవసాయమును వృత్తిగా చేబట్టినప్పుడు మధ్యాహ్న భోజనమునకు ముందే దున్నవలెను.

**అస్యూత నాసికాభ్యాం సముష్కాభ్యాం అతుదన్నారయా ముహుర్ముహురభ్యుచ్ఛందయన్॥** 21

అట్లు దున్నుచున్నప్పుడు అతడు ఎద్దుల ముక్కులు కుట్టించరాదు. వృషణములను తీయరాదు. వాటికి వాతలు పెట్టరాదు. ఇంకను మాటి మాటికి నాగలికి తగులుచున్న మట్టిని తీసివేయుచు ఎద్దులను కష్టపెట్టక వాటిని లాలింపవలెను.

**భార్యాదిరగ్నిః తస్మిన్ కర్మ కరణం ప్రాగగ్న్యాధేయాత్॥** 22

వ్యవసాయము చేయుచున్నను బ్రాహ్మణ కర్మలైన అగ్న్యాధానమువంటి వాటిని వదల రాదు. అగ్న్యాధేయముకంటె ముందు గార్హపత్యాగ్నిలో శూలగవాది గృహ్య కర్మలనన్నిటిని చేయవలెను.

అగ్న్యాధేయ ప్రభృత్యథేమాన్యజస్రాణి భవంతి। యథైతదగ్న్యాధేయమ్ అగ్నిహోత్రం దర్శపూర్ణమాసావాగ్రయణముదగయన దక్షిణాయనయోః పశుః **చాతుర్మాస్యాని ఋతుముఖే షడ్ఢోతా వసంతే జ్యోతిష్టోమ ఇత్యేవం క్షేమప్రాపణమ్॥**

బ్రాహ్మణుడు అగ్న్యాధేయము చేసిన తరువాత ఈ క్రియలను అవిచ్ఛిన్నముగా చేయవలెను. అవి : -

అగ్న్యాధేయమునకు చెందిన అగ్నిహోత్రకర్మ, దర్శయాగము, పూర్ణ మాసయాగము, ఉత్తరాయణ దక్షిణాయనములందు పశుబంధయాగము, చాతుర్మాస్య వ్రతములు, ఋతుప్రారంభమున షడ్ఢోతృ యాగము, వసంతఋతువున జ్యోతిష్టోమ యాగము, వీటిని సక్రమముగా నిర్వర్తించినచో యజమానికి ఉత్తమలోకములు కలుగును.

అథాప్యుదాహరంతి

**న దివాస్వప్న శీలేన న చ సర్వాన్నభోజినా।**
**కామం శక్యం నభో గంతుమారూఢ పతితేన వా॥** 24

ఉత్తమ లోకముల గురించి ఈ క్రింది శ్లోకమునుదాహరింతురు. పగటి పూట నిద్ర పోవువాడు. ఎక్కడ పడితే అక్కడ అన్నము తినువాడు, తపోభ్రష్టుడు. వీరు ఎన్నడు ఊర్ధ్వ లోకములకు పోజాలరు.

**దైన్యం శాఠ్యం జైహ్మ్యం చ వర్జయేత్॥** 25

దీనముగా ఉండుట, శఠస్వభావము, కుటిల స్వభావము వీటిని సర్వదా పరిత్యజింపవలెను.

**అథాప్యత్రోశనసశ్చ వృషపర్వణశ్చ దుహిత్రోస్సంవాదేగాథా ముదా హరంతి॥**

పై స్వభావము గురించి శుక్రుని కుమార్తెయైన దేవయాని, వృషపర్వరాజు కుమార్తెయైన శర్మిష్ఠల సంవాదమునకు సంబంధించిన శ్లోకమును ఇట్లు తెలుపుచున్నారు.

**స్తువతో దుహితా త్వం వై యాచతః ప్రతిగృహ్ణతః॥**
**అతోఽహం స్తూయమానస్య దదతోఽప్రతిగృహ్ణతః॥**
**దదతోఽప్రతిగృహ్ణత ఇతి ॥**

శర్మిష్ఠ దేవయానితో నీవు స్తుతించుచు, యాచన చేయుచు, దానమును ప్రతి గ్రహించున్న శుక్రుని కుమార్తెవు. మరి నేను స్తుతులనందుకొనుచు, దానమిచ్చుచు, ప్రతిగ్రహము తీసికొనని వృషపర్వ మహారాజు కుమార్తెనని గర్వముతో పలికెను.

అధ్యాయసమాప్తిని తెలుపుచు పదములు ఆవృత్తి చేయబడినవి.

ఇతి చతుర్థః ఖండః

## అథ పంచమః ఖండః

**తపస్యమవగాహనమ్॥** 1

తపస్సు చేసికొనుటకై (శుద్ధి కొరకు) నీటిలో ప్రవేశించి స్నానము చేయవలెను.

**దేవతాస్తర్పయిత్వా పితృతర్పణమ్॥** 2

నీటిలో స్నానము చేసి దేవతా తర్పణము చేసిన తరువాత పితృతర్పణము చేయవలెను. దేవ పితృ తర్పణముల మధ్య ఋషి తర్పణము చేయవలెనని 9వ ఖండములో మహర్షియే చెప్పుచున్నాడు.

**అనుతీర్థమప ఉత్సించేత్ ఊర్జం వహంతీరితి॥** 3

"ఊర్జం వహంతీరమృతం ఘృతం పయః కీలాలం పరిస్రుతం స్వధాస్థ తర్పయత మే పితౄన్" అనుమంత్రము చదువుచు నదిలో నుండి ఒడ్డునకు వచ్చి నదీతీరమున నీరు చల్లవలెను.

**అథాప్యుదాహరంతి**

**స్రవంతీష్వనురుద్ధాసు త్రయో వర్ణా ద్విజాతయః।**
**ప్రాతరుత్థాయ కుర్వీరన్ దేవర్షి పితృతర్పణమ్॥** 4

స్నానాదుల విషయమున ఈ శ్లోకమునుదాహరించుచున్నారు.

బ్రాహ్మణుడు మొదలైన ద్విజాతులు (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు) ఉదయమే లేచి ప్రవహించుచున్న జలములందు స్నానము చేసి దేవ ఋషి పితృతర్పణములు చేయవలెను. దీనివలన చెరువులు బావులందు స్నానము చేయకూడదని తెలియుచున్నది.

**నిరుద్ధాసు న కుర్వీరన్ అంశభాక్తత్ర సేతుకృత్॥** 5

నిలువయున్న నీటిలో స్నానము చేసినచో స్నానాది పుణ్య కార్యములు చేయువాని పుణ్యమున కొంత భాగమును ఆనకట్ట మొదలైనవి కట్టించినవాడు పొందును.

**తస్మాత్పరకృతాన్సేతూన్ కూపాంశ్చ పరివర్జయేత్॥** 6

అందువలన ఇతరులు ఆనకట్ట కట్టిన నదులు, బావులలో స్నానము చేయరాదు.

**అథాప్యుదాహరంతి**

**ఉద్ధృత్య వాఽపి త్రీన్పిండాన్ కుర్యాదాపత్సు నో సదా॥**
**నిరుద్ధాసు తు మృత్పిండాన్ కూపాత్ త్రీనబ్ఘటాంస్తథేతి॥** 7

ఈ విషయమున ధర్మజ్ఞులు ఈ క్రింది శ్లోకమును ఉదహరించుచున్నారు.

ఆపత్కాలమందు ఆనకట్ట కట్టిన ప్రవాహమునుండి మూడు మట్టి ముద్దలను, బావినుండి మూడు చెంబుల నీటిని బయట పోసి స్నానము చేయవచ్చును.

**బహు ప్రతిగ్రాహ్యస్య ప్రతిగృహ్యాప్రతిగ్రాహ్యస్య వాఽ యాజ్యం యాజయిత్వాఽనాశ్యాన్నస్య వాఽ న్నమశిత్వా తరత్సమందీయం జపేత్॥** 8

మిక్కిలి ధనవంతుని దగ్గర లేక దానము తీసికొనతగని పతితుని దగ్గర దానము

తీసికొన్నప్పుడు, యాగార్హత లేనివానిచే యాగము చేయించినప్పుడు, తినకూడని వాని ఇంట తిన్నప్పుడు.

తరత్సమందీ ధావతి ధారాసుతస్యాంధసః తరత్సమందీ దావతి॥ 1

ఉస్రావేద వసూనాం మర్త్యస్య దేవ్యసవః తరత్సమందీ ధావతి॥ 2

ధ్వస్రయోః పురుషం త్యోరా సహస్రాణి దద్మహే। తరత్సమందీ ధావతి॥ 3

ఆయయోస్త్రింశతం తనా సహస్రాణి చ దద్మహే।తరత్సమందీ ధావతి॥ - 4

అను తరత్సమందీయ సూక్తమును చదువవలెను.

**అథాప్యుదాహరంతి**

**గురుసంకరిణశ్చైవ శిష్యసంకరిణశ్చ యే।**

**ఆహారమంత్ర సంకీర్ణా దీర్ఘం తమ ఉపాసతే** ఇతి॥ 9

చేయ కూడని పనుల గురించి ఈ క్రింది శ్లోకమును ఉదాహరించుచున్నారు.

గురువును చెడగొట్టువారు, శిష్యులను చెడగొట్టువారు, ఆహారమును కల్తీ చేయువారు మంత్రములను ఇటునటు కలుపువారు గొప్ప నరకమునకు పోయెదరు.

**అథ స్నాతక వ్రతాని॥** 10

ఇక స్నాతకుడు చేయవలసిన వ్రతములను తెలిపెదను.

**సాయం ప్రాతర్యదశనీయం స్యాత్తేనాన్నేన వైశ్వదేవం బలిముపహృత్య బ్రాహ్మణ క్షత్రియ విట్ఛూద్రావభ్యాగతాన్ యథాశక్తి పూజయేత్॥** 11

సాయంకాలము మరియు మధ్యాహ్నము తిను అన్న భాగముచే వైశ్వదేవ బలిని పూర్తి చేసి అప్పుడు అతిథులుగా వచ్చిన వారిని తన శక్తికొలది గౌరవింపవలెను.

**శూద్రశ్చేదాగతస్తం కర్మణి నియుంజ్యాత్॥** 14

శూద్రుడు ముందు వచ్చినచో అతనికి ఏదైన పని చెప్పి అతనిని గౌరవింపవలెను.

**శ్రోత్రియాయ వా౽గ్రం దద్యాత్॥** 15

లేక అనేకులు వచ్చినప్పుడు శ్రోత్రియునకు అగ్ర పూజ చేయవలెను. (నాలుగు ముద్దలు ఒక భైక్షము, 4 భైక్షములు ఒక పుష్కలము, 4 పుష్కలములు ఒక అగ్రము అనగా 64 ముద్దలతో పెట్టు అన్నము.)

**యే నిత్యభక్తికాస్స్యుః తేషామనుపరోధేన సంవిభాగో విహితః॥** 16

తన ఇంటనున్న పనివారు, కుటుంబ సభ్యులకు ప్రతి దినము అన్నము పెట్టుట గృహస్థ ధర్మము. వారికి ఇబ్బంది కలుగుకుండ అతిథి పూజ చేయవలెను.

**న త్వేవ కదాచిదదత్వా భుంజీత॥** 17

ఎప్పుడు కూడ అతిథి పూజ చేయక యజమాని తినరాదు.

**అథాప్యత్రాన్నగీతే శ్లోకావుదాహరంతి**

**యో మామదత్వా పితృదేవతాభ్యో భృత్యాతిథీనాం చ సుహృజ్జనస్య।**

**సంపన్నమశ్నన్ విషమత్తి మోహాత్ తమద్మ్యహం తస్య చ మృత్యురస్మి॥**

**హుతాగ్నిహోత్రః కృతవైశ్వదేవః పూజ్యాతిథీన్ భృత్యజనావశిష్టమ్।**

**తుష్టశ్శుచిశ్శ్రద్ధదత్తి యో మాం తస్యామృతం స్యాం స చ మాం భునక్తీతి॥18**

ఈ సందర్భము అన్న దేవత చదివిన రెండు శ్లోకములనుదహరింతురు.

నన్ను (అన్నమును) పితృదేవతలకు, భృత్యులకు, అతిథి జనమునకు, స్నేహితులకు పెట్టకుండా మూర్ఖత్వమువలన తానొక్కడే కడుపునిండ చక్కగా భుజించునో అతనిని మృత్యువునై కబళింతును.

అగ్నిహోత్ర హోమము చేసి వైశ్వదేవము చేసి భృత్యులకు అతిథులకు కూడ అన్నము పెట్టి సంతోషముతో శ్రద్ధగా నన్ను (అన్నమును) తినువానికి నేనమృతమునయ్యెదను. ఆ విధముగా అమృతరూపముననున్న నన్నే అతడు భుజించును.

**సుబ్రాహ్మణ శ్రోత్రియ వేదపారగేభ్యో గుర్వర్థ నివేశౌషధార్థ వృత్తిక్షీణ యక్ష్యమాణాధ్యయనాధ్వసంయోగ వైశ్వజితేషు ద్రవ్య సంవిభాగో యథాశక్తి కార్యో బహిర్వేది భిక్షమాణేషు ॥** 19

యజ్ఞ వేదికకు బయట ఉన్నప్పుడు సదాచారవంతుడైన బ్రాహ్మణుడు శ్రోత్రియుడు, వేదమును చక్కగా అధ్యయనము చేసినవారు వచ్చి గురుదక్షిణకై, ఇంటి కొరకు (వివాహము కొరకు) ఔషధముల కొరకు, జీవిక కొరకు, యాగము కొరకు, వేదాధ్యయనము కొరకు, తీర్థయాత్ర మొదలైన వాటి కొరకు యాచన చేసినచో యధాశక్తి దానము చేయవలెను.

**కృతాన్నమితరేషు॥** 20

ఇంకా ఇతరులెవ్వరైనను వచ్చి అడిగినచో వండిన అన్నమును పెట్టవలెను.

**సుప్రక్షాళిత పాదపాణిరాచాంతశ్శుచౌ సంవృతే దేశేఽన్నమ్ ఉపహృతముపసంగృహ్య కామక్రోధ ద్రోహలోభమోహాన్ అపహత్య సర్వాభిరంగులీభిః శబ్దమకుర్వన్ ప్రాశ్నీయాత్॥**

భోజనము చేయుటకు ముందు కాళ్ళు, చేతులు బాగుగా కడుగుకొని, ఆచమనము చేయవలెను. తరువాత ఇంటిలో పవిత్రమైన ప్రదేశమున కూర్చొని భార్య మొదలైనవారు వడ్డించిన అన్నమును క్రామక్రోధాది దుష్టభావములు లేక సంతోషముతో ఎట్టి శబ్దము చేయక, అన్ని వ్రేళ్ళతో కలిపి తినవలెను. తినునప్పుడు ఎట్టి శబ్దము చేయరాదు.

ఇతి పంచమః ఖండః

అథ షష్ఠః ఖండః

**న పిండశేషం పాత్ర్యాముత్సృజేత్॥** 1

భోజన పాత్రలో (భోజనము చేసిన విస్తరి మొ॥ వాటిలో) ఆహార పదార్థమును వదలిపెట్టరాదు. అందువలన మనకు ఎంత అవసరమో అంత మాత్రమే వడ్డించుకొనవలెను. "అన్నం న పరిచక్షీత" అని వేదము కూడా తెలుపుచున్నది.

మాంస మత్స్య తిలసంసృష్ట ప్రాశనేఽప ఉపస్పృశ్య అగ్నిమభిమృశేత్॥ 2

మాంసము లేక చేపలు లేక నూవులు కలసిన ఆహార పదార్థమును తెలియక తిన్నచో ప్రాయశ్చిత్తముగా చేతులకు జలస్పర్శ చేయవలెను తరువాత అగ్ని స్పర్శ కూడ చేయవలెను.

**అస్తమితే చ స్నానమ్॥** 3

**పాలాశమాసనం పాదుకే దంతధావనమితి వర్జయేత్॥** 4

సూర్యుడు అస్తమించిన తరువాత స్నానము చేయరాదు. అట్లే మోదుగాకులతో ఆసనమును, మోదుగ పుల్లతో పండ్లు తోముట వంటి పనులు చేయరాదు.

**నోత్సంగేఽన్నం భక్షయేత్॥** 5

**ఆసంద్యాం న భుంజీత॥** 6

అన్నమును ఒడిలో పెట్టుకొని లేక పీటపై పెట్టుకొని తినరాదు.

**వైణవం దండం ధారయేత్ ఋుక్మ కుండలే చ॥** 7

బ్రాహ్మణుడు చేతిలో వెదురు దండమును చెవులకు బంగారు కుండలములను ధరింపవలెను.

**పదా పాదస్య ప్రక్షాళనమ్ అధిష్ఠానం చ వర్జయేత్॥** 8

ఒక పాదముచే మరియొక కాలును రాచి కడుగుకొనరాదు. అట్లే కాలుపై కాలును వేసికొనకూడదు.

**న బహిర్మాలాం ధారయేత్॥** 9

అందరకు కనిపించునట్లు మాలను (జపమాల వంటిది) ధరింపరాదు.

**సూర్యముదయాస్తమయే న నిరీక్షేత॥** 10

ఉదయించుచున్న సూర్యుని, అస్తమించుచున్న సూర్యుని చూడరాదు.

**నేంద్రధనురితి పరస్మై బ్రూయాత్॥** 11

**యది బ్రూయాన్మణిధనురిత్యేవ బ్రూయాత్॥** 12

ఆకాశమున ఇంద్ర ధనుస్సు కనిపించినప్పుడు ఇతరునితో ఇది ఇంద్ర ధనుస్సు అని చెప్పరాదు. దానిని మణిధనుస్సనియే చెప్పవలెను.

**పురద్వారీంద్రకీల పరిఘావంతరేణ నాతీయాత్॥** 13

నగర ద్వారము దగ్గర స్థాపించిన ఇంద్రకీలమను కఱ్ఱ మరియు పరిఘమునకు మధ్యనుండి పోరాదు.

**ప్రేంఖయోరంతరేణ న గచ్ఛేత్॥** 14

అట్లే ఊయలల మధ్యనుండి పోరాదు.

**వత్సతంతీం నోపరి గచ్ఛేత్॥** 15

దూడను కట్టివేయు త్రాడు పైనుండి పోరాదు.

**భస్మాస్థి రోమ తుష కపాలాపస్నానాని నాధితిష్ఠేత్॥** 16

బూడిద, ఎముకలు, వెంట్రుకలు, వరి ఊక, కపాలము, స్నానము చేసినప్పుడు వచ్చిన మురికి నీటిపై నిలబడరాదు.

**గాం ధయంతీం న పరస్మై బ్రూయాత్॥** 17

తన దూడకు పాలు కుడుపుచున్న ఆవును ఇతరునికి చూపరాదు.

**నాధేనుమ్ అధేనురితి బ్రూయాత్॥** 18

**యది బ్రూయాద్ధేనుభవ్యేతి బ్రూయాత్॥** 19

పాలివ్వని ఆవును "పాలివ్వని ఆవు" అని చెప్పక ధేను భవ్య (తరువాత పాలిచ్చు ఆవు) అని చెప్పవలెను.

**శుక్తాః రూక్షాః పరుషా వాచో న బ్రూయాత్॥** 20

శోకమును కలిగించునవి, కఠినమైనవి, వెక్కిరించునవి అగుమాటలు మాట్లాడరాదు.

**నైకోఽధ్వానం వ్రజేత్॥** 21

ఒంటరిగా యాత్రాదులకు వెళ్ళరాదు.

**న పతితైర్న స్త్రియా న శూద్రేణ॥** 22

పతితులతో, స్త్రీతో (పర?) శూద్రునితో కలసి యాత్రకు పోరాదు.

**న ప్రతిసాయం వ్రజేత్॥** 23

సాయంకాలమున యాత్రకై పోరాదు.

**న నగ్నః స్నాయాత్॥** 24

**న నక్తం స్నాయాత్॥** 25

నగ్నముగా స్నానము చేయరాదు. అట్లే రాత్రి పూట స్నానము చేయరాదు.

**న నదీం బాహుకస్తరేత్॥** 26

ఈతకొట్టుచు మహానదిని దాటరాదు.

**న కూపమవేక్షేత॥** 27

సాధారణముగా బావిలోకి తొంగిచూడరాదు.

**న గర్తమవేక్షేత॥** 28

చాల లోతుగా ఉన్న గోతిలోకి తొంగిచూడకూడదు.

**న తత్ర ఉపవిశేత్ యత ఏనమన్య ఉత్థాపయేత్॥** 29

ఇతరులు అభ్యంతరము చెప్పి అచ్చటి నుండి లేపు స్థలమున కూర్చొనరాదు.

**పంథా దేయో బ్రాహ్మణాయ గవే రాజ్ఞే హ్యచక్షుషే।**
**వృద్ధాయ భార తప్తాయ గర్భిణ్యై దుర్బలాయ చ ॥** 30

తాను వెళ్ళుచున్నప్పుడు బ్రాహ్మణుడు, రాజు లేక ఆవు, గుడ్డివాడు, వృద్ధుడు, బరువు మోయచున్నవాడు, గర్భిణీ స్త్రీ, దుర్బలుడు ఎదురుగా వచ్చినప్పుడు తాను ప్రక్కకు తప్పుకొని వారికి త్రోవనివ్వవలెను.

**ప్రభూతైధోక యవస సమిత్కుశ మాల్యోపనిష్క్రమణమ్**
**ఆఢ్యజనాకులమనలససమృద్ధం ఆర్యజన భూయిష్ఠం**
**అదస్యు ప్రవేశ్యం గ్రామం ఆవసితుం యతేత ధార్మికః॥** 31

ధార్మికుడు కట్టెలు, నీరు, ధాన్యము, సమిధలు, దర్భలు, మాలలు సమృద్ధముగా లభించునది, ధనికులు నివసించుచున్నది, సోమరిపోతులు లేనిది, మంచివారున్నది, దుష్టులు ప్రవేశించుటకు వీలులేనిది యగు గ్రామమున నివసించుటకు ప్రయత్నింపవలెను.

సుమతి శతక కర్త అప్పిచ్చువాడు వైద్యుడు నెప్పుడునెడతెగక పారునేరును ద్విజుడు ఉన్న ఊరిలోనే ఉండుమని అనెను.

**ఉదపానోదకే గ్రామే బ్రాహ్మణో వృషలీపతిః।**
**ఉషిత్వా ద్వాదశసమాః శూద్రసాధర్మ్యమృచ్ఛతి॥** 32

ఉదపానమనగా బావి. బావి నీరు మాత్రమున్న గ్రామమున శూద్రస్త్రీని వివాహమాడిన బ్రాహ్మణుడున్న గ్రామమున, పన్నెండు సంవత్సరములున్నచో తన ధర్మమును చక్కగా అనుష్ఠింపలేక ధార్మికుడు కూడ శూద్రునితో సమానుడగుచున్నాడు.

**పురరేణు కుంఠిత శరీరః తత్పరిపూర్ణనేత్ర వదనశ్చ।**
**నగరే వసన్ సునియతాత్మా సిద్ధిమవాప్స్యతీతి న తదస్తి॥** 33

పట్టణములో ఉన్నవాని శరీరము, కండ్లు, ముఖము దుమ్ముతో నిండి పోవును. కావున ఎంత ఇంద్రియ నిగ్రహమున్నను అచ్చట సిద్ధి కలుగదు. అందువలన గ్రామ వాసమే శుభంకరమైనది.

**రధాశ్వగజ ధాన్యానాం గవాం చైవ రజశ్శుభమ్।**
**అప్రశస్తం సమూహన్యాః శ్వాజావి ఖరవాససామ్॥** 34

రధములు, గుఱ్ఱములు, ఏనుగులు, ఆవులవలన వచ్చు దుమ్ము, ధాన్యముయొక్క దుమ్ము అనునవి శ్రేష్ఠమైనవి. అట్లే కుక్క, మేక, గొఱ్ఱె, గాడిద, వస్త్రము మరియు చీపురుకట్టవలన వచ్చు దుమ్ము అనునవి అప్రశస్తమైనవి.

**పూజ్యాన్ పూజయేత్॥** 35

పెద్దవారిని గౌరవింపవలెను.

**ఋషి విద్వన్నృపవర మాతుల శ్వశురర్త్విజః**
**ఏతేఽ ర్ఘ్యాశ్శాస్త్రవిహితాః స్మృతాః కాలవిభాగశః॥** 36

ఋషులు, విద్వాంసులు, రాజు, మేనమామ, మామ, ఋత్విక్కు అనువారు ఆయాకాలవిభాగముననుసరించి శాస్త్రోక్తమైన అర్ఘ్యమునకు తగినవారు.

**ఋషి విద్వన్నృపాః ప్రాప్తాః క్రియారంభే వరర్త్విజౌ।**
**మాతులశ్వశురౌ పూజ్యౌ సంవత్సరగతావితి॥** 37

ఊరు, లేక పట్టణమునుండి వచ్చిన ఋషి, విద్వాంసుడు, రాజును శాస్త్రోక్తమర్యాదననుసరించి మధు పర్కాదులచేత గౌరవింపవలెను. అట్లే వరుడు, ఋత్విక్కులను వివాహము, యజ్ఞముయొక్క ప్రారంభమున గౌరవింపవలయును. మేనమామ, మామ ఒకసంవత్సరము తర్వాత వచ్చినచో వారిని శాస్త్రోక్త మర్యాదననుసరించి మధు పర్కాదులచే గౌరవింపవలెను.

**అగ్న్యగారే గవాం మధ్యే బ్రాహ్మణానాం చ సన్నిధౌ।**
**స్వాధ్యాయే భోజనే చైవ దక్షిణం బాహుముద్ధరేత్॥** 38

అగ్న్యాధానము చేయునప్పుడు, ఆవుల మధ్యలోనున్నప్పుడు, బ్రాహ్మణుల దగ్గర, వేదాధ్యయనము చేయుచున్నప్పుడు, భోజనము చేయునప్పుడు పెద్దలకు నమస్కారము చేయుటకై కుడి చేతిని ఎత్తిపట్టవలెను.

కాని ఆపస్తంబమహర్షి దక్షిణం బాహుగ్ం శ్రోత్రసమం ప్రసార్య బ్రాహ్మణోఽభివాదయీత 1-5-16 అని బ్రాహ్మణుడు తనకుడి చేతిని చెవి వరకు ఎత్తి నమస్కరింపవలెనని నమస్కార విధానమును తెలిపినాడు.

**ఉత్తరం వాసః కర్తవ్యం పంచస్వేతేషు కర్మసు।**
**స్వాధ్యాయోత్సర్గ దానేషు భోజనాచమనయోస్తథా॥** 39

ఉత్తరీయమును వేదాధ్యయనము, మలమూత్ర విసర్జనము, దానము, భోజనము, ఆచమనము అను ఐదు కర్మలు చేయునప్పుడు తప్పక ధరింపవలెను.

**హవనం భోజనం దానముపహారః ప్రతిగ్రహః।**
**బహిర్జాను న కార్యాణి తద్వదాచమనం స్మృతమ్॥** 40

హోమము చేయుట, భోజనము చేయుట, దానమిచ్చుట, దేవతలకు బలి ఇచ్చుట లేక పెద్ద వారికి ఉపహారమిచ్చుట, దానము, ఆచమనము చేయుట అనుకార్యములు చేయునప్పుడు కుడి చేయి మోకాళ్ళకు బయట ఉండరాదు.

**అన్నే శ్రితాని భూతాని అన్నం ప్రాణమితి శ్రుతిః।**
**తస్మాదన్నం ప్రదాతవ్యం అన్నం హి పరమం హవిః॥** 41

అన్నమునాశ్రయించుకొని సమస్త ప్రాణులుండును. అన్నమే ప్రాణమని వేదము చెప్పుచున్నది. అన్నము అన్నిటికంటె గొప్ప హవిస్సు. కావున అన్నదానము చేయుట చాలా శ్రేష్ఠము.

**హుతేన శామ్యతే పాపం హుతమన్నేన శామ్యతి।**
**అన్నం దక్షిణయా శాంతిం ఉపయాతీతి నశ్శ్రుతిః॥** 42

హోమము చేయుట వలన పాపము నశించును. అన్నదానముచే ఆ హోమము పరిపూర్ణమగును. అట్లే అన్నదానము దక్షిణవల్ల పరిపూర్ణమగునని వేదము చెప్పుచున్నది.

ఇతి షష్ఠః ఖండః

## అథ సప్తమః ఖండః

**అథాతస్సంధ్యోపాసనవిధిం వ్యాఖ్యాస్యామః॥** 1

ఇక సంధ్యోపాసనా పద్ధతిని వివరింతును. ఇచ్చట అథ శబ్దము మంగళార్థమున ఉపయోగింపబడినది.

ఓంకారశ్చాథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా।
కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ॥

బ్రహ్మదేవుని కంఠమునుండి ఓంకారము, అధ అను పదము తొలుత వచ్చినందువలన ఇవి మంగళప్రదములని సంప్రదాయజ్ఞులు చెప్పుదురు.

**తీర్థం గత్వా ప్రయతోఽభిషిక్తః ప్రయతో వాఽనభిషిక్తః**

**ప్రక్షాళితపాదపాణిః అప ఆచమ్య సురభిమత్యా అబ్లింగాభిః**

**వారుణీభిః హిరణ్యవర్ణాభిః పావమానీభిః వ్యాహృతిభిః**

**అన్యైశ్చ పవిత్రైః ఆత్మానం ప్రోక్ష్య ప్రయతో భవతి॥** 2

స్నానము చేసినను, ఇతర విధములుగా పవిత్రుడై ఉన్నను సంధ్యావందనము చేయుటకు ముందు నదికి వెళ్ళి కాళ్ళు చేతులు కడుగుకొని ఆచమనము చేయవలెను. తరువాత "సురభి" శబ్దమున్న దధిక్రావ్ణ్ణో ఇత్యాది మంత్రముల చేత "అప్" శబ్దమున్న ఆపోహిష్ఠా ఇత్యాది మంత్రముల చేత, వరుణ దేవతాకములైన ఇమం మే వరుణ ఇత్యాది మంత్రములచేత హిరణ్యా వర్ణాశ్శుచయః పావకాః ఇత్యాది మంత్రములచేత పవమానసూక్త మంత్రములచేత తనను ప్రోక్షించుకొన్నందువలన అతడు పవిత్రుడగుచున్నాడు.

అనగా స్నానాదులవలన పవిత్రమైనవాడు కూడ ఆచమనము చేసి పవిత్రుడై మరల మంత్రస్నానముచే పవిత్రుడు కావలెను.

**అథాప్యుదాహరంతి**

**అపోఽ వగాహనం స్నానం విహితం సార్వవర్ణికమ్।**
**మంత్రవత్ ప్రోక్షణం చాపి ద్విజాతీనాం విశిష్యతే॥** 3

అన్ని వర్ణముల వారు నదిలోకి పోయి స్నానము చేయుదురు. కాని బ్రాహ్మణాది ద్విజాతులకు మంత్రములచే చేయు ప్రోక్షణము ప్రత్యేక స్నానముగా కనిపించును.

**సర్వ కర్మణాం చైవాఽరంభేషు ప్రాక్సంధ్యోపాసనకాలాచ్చ**

**ఏతేనైవ పవిత్ర సమూహేన ఆత్మానం ప్రోక్ష్య ప్రయతో భవతి॥** 4

శ్రుతి స్మృతి సిద్ధమైన సమస్త కర్మలు ప్రారంభించునప్పుడు, సంధ్యావందనమునకు పూర్వము, పైన చెప్పిన మంత్రములచేత తనను ప్రోక్షించుకొని పవిత్రుడు కావలయును.

**దర్భేష్వాసీనో దర్భాన్ ధారయమాణః సోదకేన పాణినా**

**ప్రత్యఙ్ముఖః సావిత్రీం సహస్ర కృత్వ ఆవర్తయేత్॥** 5

సంధ్యావందనము చేయునపుడు దర్భాసనముపై కూర్చొని కుడి చేతిలో దర్భలను ధరించి తడితోనున్న చేతిచే వేయిపర్యాయములు గాయత్రీ మంత్రమును పశ్చిమాభిముఖుడై జపింపవలెను.

గాయత్రీమంత్రమును సాయంకాలమున పశ్చిమాభిముఖుడై, ఉదయమున తూర్పునకు తిరిగి జపింపవలెను. అనగా సూర్యునికి ఎదురుగా ఉండి జపము చేయవలెను. జపమును ఋషి ఛందోదేవతా వినియోగము లేక చేయరాదు. కావున గాయత్రీ మంత్రములోని ఓంకారమునకు, వ్యాహృతులకు వామదేవుడు ఋషి గాయత్రీ ఛందస్సు ఓంకారము సమస్త దేవతా రూపము. ఇక వ్యాహృతులకు అగ్ని, వాయు సూర్యులు దేవతలు. గాయత్రీ మంత్రమునకు విశ్వామిత్రుడు ఋషి, గాయత్రీ ఛందస్సు, సవిత దేవత సంధ్యోపాసనమున వినియోగము.

**ప్రాణాయామో వా శతకృత్వః॥** 6

లేక ప్రాణాయామము నూరు మార్లైనా చేయవచ్చును.

**ఉభయతః ప్రణవాం ససప్త వ్యాహృతికాం మనసా వా దశకృత్వః॥** 7

ఆద్యంతములలో ఓంకారము మరియు సప్త వ్యాహృతులతో నున్న గాయత్రీ మంత్రమును పది మార్లైనా మానసికముగా జపము చేయవచ్చును.

కాని అనుష్ఠానమున ఓం భూః ఓం భువః, ఓగ్ం సువః, ఓం మహః ఓం జనః అన్నట్లు సప్త వ్యాహృతులకు ప్రారంభమున మాత్రము ఓంకారము కనిపించుచున్నది.

**త్రిభిశ్చ ప్రాణాయామైః తాంతో బ్రహ్మహృదయేన॥** 8

గాయత్రీ జపము చేయుచు అలసి పోయినవాడు మూడు ప్రాణాయామములు, ఓం భూః ఓం భువః అను బ్రహ్మహృదయానువాకముచే (తైత్తిరీయ సంహితలో ఇది కన్పించును.) చేయవలెను.

ప్రాణాయామమును ప్రణవము, వ్యాహృతులు, ఓమాపోజ్యోతీరసో అను గాయత్రీ శిరస్సుతో నున్న గాయత్రీ మంత్రముచే చేయవలెను.

సవ్యాహృతిం సప్రణవాం గాయత్రీం శిరసా సహ।

త్రిః పఠేదాయత-ప్రాణః ప్రాణాయామస్స ఉచ్యతే॥

**వారుణీభ్యాం రాత్రిముపతిష్ఠత ఇమం మే వరుణ తత్త్వాయామీతి ద్వాభ్యామ్॥**

సాయంకాలమున సూర్యోపస్థానమును "ఇమం మే వరుణ" "తత్త్వాయామి" అను రెండు మంత్రములచేత చేయవలెను. సాయంకాలమున కూర్చొనియే సూర్యోపస్థానమును చేయవలెను.

**ఏవమేవ ప్రాతః ప్రాఙ్ముఖస్తిష్ఠన్॥** 10

ప్రాతః కాలమున తూర్పు ముఖముగా నిలబడి సూర్యోపస్థానమును చేయవలెను.

**మైత్రీభ్యామహరుపతిష్ఠేతే మిత్రస్య చర్షణీ ధృతో,**
**మిత్రజనాన్ యాతయతీతి ద్వాభ్యామ్॥** 11

ప్రాతస్సంధ్యయందు మిత్ర దేవతాకములైన "మిత్రస్య చర్షణీధృత" "మిత్రోజనాన్ యాతయతి" అను రెండు మంత్రములచే సూర్యుని నమస్కరింపవలెను.

**సుపూర్వామపి పూర్వాముపక్రమ్యోదిత ఆదిత్యే సమాప్నుయాత్॥** 12

ప్రాతః కాల సంధ్యను నక్షత్రములు కనిపించుచున్నప్పుడు ప్రారంభించి, సూర్యుడు ఉదయించిన తరువాత పూర్తి చేయవలెను.

**అనస్తమిత ఉపక్రమ్య సుపశ్చాదపి పశ్చిమామ్॥** 13

సాయం సంధ్యను సూర్యుడు అస్తమించక ముందు ప్రారంభించి నక్షత్రములు కనిపించిన తరువాత పూర్తి చేయవలెను.

**సంధ్యయోశ్చ సంపత్తౌ అహోరాత్రయోశ్చ సంతతిః॥** 14

రెండు సంధ్యలు చక్కగా పూర్తి చేసినచో రాత్రింబగళ్ళు అవిచ్ఛిన్నముగా ఉండును. అనగా ఆయుర్ వృద్ధి జరుగును.

**ఋషయో దీర్ఘ సంధ్యత్వాద్దీర్ఘమాయురవాప్నుయుః।**

**ప్రజ్ఞాం యశశ్చ కీర్తిం చ బ్రహ్మవర్చసమేవ చ॥**

ఋషులు సంధ్యావందనమును చాలా కాలమాచరించి దీర్ఘాయుస్సును, ప్రజ్ఞను, యశస్సును, కీర్తిని, బ్రహ్మ వర్చస్సును పొందిరని పెద్దలందురు.

**అపి చాత్ర ప్రజాపతిగీతౌ శ్లోకౌ భవతః॥**

**అనాగతాం తు యో పూర్వామ్ అనతీతాం తు పశ్చిమామ్।**

**సంధ్యాం నోపాసతే విప్రాః కథం తే బ్రాహ్మణాః స్మృతాః॥**

**సాయం ప్రాతస్సదా సంధ్యాం యే విప్రా నో ఉపాసతే।**

**కామం తాన్ ధార్మికో రాజా శూద్రకర్మసు యోజయేదితి॥** 15

సంధ్యావందనముగూర్చి ప్రజాపతి చెప్పిన శ్లోకములిట్లున్నవి.

సాయంప్రాతస్సంధ్యలను సక్రమమైన కాలమున ఉపాసించని వారు బ్రాహ్మణులెట్లగుదురు? అట్టి విప్రులను ధార్మికుడైన రాజు శూద్రుడు చేయు కర్మలందు నియోగింపవలెను. అని అనెను.

**తత్ర సాయమతిక్రమే రాత్ర్యుపవాసః ప్రాతరతిక్రమేఽహరుపవాసః**

సాయంకాల సంధ్యను సక్రమమైన కాలమున చేయనిచో రాత్రిపూట ఉపవాసముండవలెను. అట్లే ప్రాతః కాలసంధ్యనాచరించుటలో కాలాతీతమైనచో పగటిపూట ఉపవాసముండవలెను.

**స్థానాసన ఫలమవాప్నోతి॥** 17

పై విధముగా ప్రాయశ్చిత్తము చేసికొనినచో ఉదయ సంధ్యను నిలుచుండి చేసిన ఫలమును, సాయంసంధ్యను కూర్చొని నిష్ఠగా చేసిన ఫలితమును పొందును.

**అథాప్యుదాహరంతి**

**యదుపస్థకృతం పాపం పద్భ్యాం వా యత్కృతం భవేత్।**

**బాహుభ్యాం మనసా వాఽపి వాచా వా యత్కృతం భవేత్।**

**సాయంసంధ్యాముపస్థాయ తేన తస్మాత్ప్రముచ్యతే।** 18

ఈ విషయమున క్రింది శ్లోకమునుదాహరించుచున్నారు. పురుషుడు సాయంసంధ్యను చేసినచో పగటిపూట తన జననేంద్రియముచేత, పాదములచేత, చేతులచే, మనస్సుచే, వాక్కుచేత చేసిన పాపమునంతయు పోగొట్టుకొనును.

**రాత్ర్యా చాపి సంధీయతే॥** 19

రాత్రితో సంబంధము కలిగియుండును. అనగా ఆయుస్సు పెరుగునని భావము.

**న చైనం వరుణో గృహ్ణాతి॥** 20

సాయంసంధ్య సక్రమముగా ఆచరించువానిని వరుణుడు జలోదరమువంటి రోగములు కల్గింపకుండా చూచును. లేక జలమరణమును కల్గింపదు.

**ఏవమేవ ప్రాతరుపస్థాయ రాత్రికృతాత్ పాపాత్ ప్రముచ్యతే॥** 21

ఈ విధముగా ప్రాతః కాలసంధ్యను సకాలమున చేసినచో రాత్రిపూట చేసిన పాపములన్నియు నశించును.

**అహ్నా చాపి సంధీయతే॥** 22

పగటితో అతనికి సంబంధమేర్పడును.

**మిత్రశ్చైనం గోపాయత్యాదిత్యశ్చైనం స్వర్గం లోకమున్నయతీతి॥** 23

ప్రాతస్సంధ్య చక్కగా చేసిన వానిని మిత్ర దేవత ఎల్లప్పుడు రక్షించును. ఆదిత్యుడతనికి స్వర్గఫలము నిచ్చును.

**స ఏవమేవ అహరహరహోరాత్రయోః సంధిషూపతిష్ఠమానో బ్రహ్మపూతో బ్రహ్మభూతో బ్రాహ్మణః శాస్త్రమనువర్తమానో బ్రహ్మ లోకమభిజయతీతి విజ్ఞాయతే బ్రహ్మలోకమభిజయతీతి విజ్ఞాయతే॥** 24

ఈ విధముగా ప్రతి దినము సంధ్యోపాసన చక్కగా చేయువాడు ఓంకారము వలన పవిత్రుడై బ్రహ్మైక్యము చెందును. అట్లే శాస్త్రమునననుసరించి ప్రవర్తించువాడు బ్రహ్మలోకమును తప్పక పొందును.

అధ్యాయసమాప్తిని సూచించు పదావృత్తి ఇచ్చట కనిపించును.

ఇతి సప్తమః ఖండః

అథ అష్టమః ఖండః

**అథ హస్తౌ ప్రక్షాళ్య కమండలుం మృత్పిండం చ గృహ్య**
**తీర్థం గత్వా త్రిః పాదౌ ప్రక్షాళయతే త్రిరాత్మానమ్॥** 1

తొలుత హస్తములను కడుగుకొని కమండలువును, మట్టి ముద్దను తీసికొని నదికి పోయి మూడు మార్లు మట్టి ముద్దచే కమండలు జలముచే పాదములను కడుగుకొనవలెను. అట్లే తన శరీరమును మూడు పర్యాయములు ప్రక్షాళన చేసికొనవలెను. దానివలన పరిశుద్ధుడగుచున్నాడు.

**అథహైకే బ్రువతే - శ్మశానమాపో దేవగృహం గోష్ఠం**
**యత్ర చ బ్రాహ్మణా అప్రక్షాళ్య చ పాదౌ తన్న ప్రవేష్టవ్యమితి॥** 2

శ్మశానమునకు, తీర్థమునకు, దేవాలయమునకు, ఆవులుండు కొట్టమునకు పాదములు కడుగుకొనక పోరాదని కొందరందురు.

**అథాఽపోఽభిప్రపద్యతే-హిరణ్యశృంగం వరుణం ప్రపద్యేతీర్థం**
**మే దేహి యాచితః। యన్మయా భుక్తమసాధూనాంపాపేభ్యశ్చ**
**ప్రతిగ్రహః।యన్మేమనసా వాచా కర్మణా వా దుష్కృతంకృతమ్।**
**తన్న ఇంద్రో వరుణో బృహస్పతిస్సవితా చ పునంతు పునః పునరితి॥3**

కాళ్ళు చేతులు కడుగుకొన్న తర్వాత నదిలోనికి పోవునప్పుడు "హిరణ్య శృంగం" అనుమంత్రమును చదువవలెను.

**అథాంజలినా ఉపహంతి సుమిత్రా న ఆప ఓషధయస్సంత్వితి॥** 4

తరువాత దోసిలిలోనికి నీరు తీసికొనునప్పుడు "సుమిత్రా న ఆప" అను మంత్రమును చదువవలెను.

**తాం దిశం నిరుక్షతి యస్యామస్య దిశి ద్వేష్యో భవతి "దుర్మిత్రాస్తస్మై**
**భూయాసుర్యోస్మాన్ ద్వేష్టి యం చ వయం ద్విష్మ" ఇతి॥** 5

తన దోసిలిలోనికి తీసికొన్న జలమును "దుర్మిత్రాస్తస్మై" ఇత్యాదిమంత్రము చదువుచు తన శత్రువులున్న దిక్కునకు చల్లవలెను.

**అథాఽప ఉపస్పృశ్య త్రిః ప్రదక్షిణముదకమావర్తయతి**

**యదపాం క్రూరం యదమేధ్యం యదశాంతం తదపగచ్ఛతాదితి॥** 6

తరువాత చేతులు కడుగుకొని "యదపాం క్రూరం" అను మంత్రము చదువును ప్రదక్షిణ విధానముగా మూడు మార్లు నీటిలో చేతిని త్రిప్పవలెను. ఇదియంతయు నదీతీరమున ఉండే చేయవలెను.

**అప్సు నిమజ్జ్యోన్మజ్జ్య॥** 7

నీటిలో మునుగుచు లేచుచు స్నానము చేయవలెను.

**నాప్సు సతః ప్రయమణం విద్యతే న వాసః పల్పూలనం నోపస్పర్శనమ్॥ 8**

నీటిలో ఉన్నప్పుడు ఆచమనము చేయరాదు. బట్టలు ఉతుకరాదు. ఉదకోపస్పర్శనము చేయరాదు.

**యద్యుపరుద్ధాస్స్యురేతేనోపతిష్ఠతే-నమోఽగ్నయేఽప్సుమతే నమ**

**ఇంద్రాయ నమో వరుణాయ నమో వారుణ్యై నమోఽద్భ్య ఇతి॥** 9

స్నానముచేయు నీటికి నాల్గువైపులా కట్టడమున్నచో (బావిలో) నమోఽ గ్నయే అను మంత్రముచే జలప్రార్థన చేయవలెను.

**ఉత్తీర్యాఽచమ్య అచాంతః పునరాచమేత్॥** 10

తీరమునకు వచ్చిన తరువాత ఆచమనము చేసి మరల రెండవ పర్యాయము ఆచమనము చేయవలెను. అందువల్లనే స్మార్త కర్మలందు "ద్విరాచమ్య" అని రెండు మార్లు ఆచమనమును చెప్పుచున్నారు.

**ఆపః పునంతు పృథివీం పృథివీ పునాతు మామ్।పునంతు బ్రహ్మణస్పతిర్ బ్రహ్మ పూతా పునాతు మామ్। యదుచ్ఛిష్టమభోజ్యం యద్వా దుశ్చరితం మమ।సర్వం పునంతు మామాపోఽసతాం చ ప్రతిగ్రహగ్గ్ స్వాహేతి॥ 11**

ఈ మంత్రముచే ఆచమనము చేయవలెను.

**పవిత్రే కృత్వా అద్భిర్మార్జయతి "ఆపోహిష్ఠా మయోభువః" ఇతి తిసృభిః "హిరణ్య వర్ణాశ్శుచయః పావకాః" ఇతి చతసృభిః "పవమానస్సువర్చన" ఇత్యేతేనానువాకేన మార్జయిత్వా అంతర్జలగతోఽఘమర్షణేన త్రీన్ ప్రాణయామాన్ ధారయిత్వా ఉత్తీర్య వాసః పీడయిత్వా ప్రక్షాళితోపవాతాన్యక్లిష్టాని వాసాంసి పరిధాయ అప ఆచమ్య దర్భేష్వాసీనో దర్భాన్ ధారయమాణః ప్రాఙ్ముఖస్సావిత్రీం సహస్రకృత్వ ఆవర్తయేత్ శతకృత్వోఽ పరిమితకృత్వో వా దశావరమ్॥** 12

తరువాత దర్భ పవిత్ర ధరించి ఆపోహిష్ఠా మయోభువః ఇత్యాది మూడు మంత్రముల చేత, "హిరణ్య వర్ణాశ్శుచయః మొదలైన నాలుగు మంత్రములచేత "పవమానస్సువర్చనః" అనుమంత్రానువాకముచేత మార్జనము చేసికొనవలెను. తరువాత నీటిలోకి ప్రవేశించి "ఋతం చ సత్యం చ" అను అఘమర్షణానువాకము చేత మూడు ప్రాణాయామములు చేసి తీరమునకు వచ్చి ఉతికి ఆరవేసినవి మెత్తనివి ఐన వస్త్రములు ధరించి స్నానము చేయునప్పుడు ధరించిన తడి వస్త్రములను విప్పి ఉతుకవలెను. తరువాత ఆచమనము చేసి దర్భలను చేతిలో పట్టుకొని (ఉదయమున, తూర్పునకు ముఖము పెట్టి వేయి మార్లు లేక వందమార్లు లేక అపరిమితముగా, వీలుకానిచో పదిమార్లకు తగ్గకుండా గాయత్రీ జపము చేయవలెను.

**అథాదిత్యముపతిష్ఠతే - ఉద్వయం తమసస్పరి।**

**ఉదుత్యమ్। చిత్రమ్। య ఉదగాదితి॥** 13

గాయత్రీ మంత్రజపానుష్ఠానము తరువాత ఉద్వయం తమస్పరి, ఉదుత్యమ్ జాతవేదసమ్ చిత్రం దేవానాం, యు ఉదగాత్ అను మంత్రముల చేత సూర్యోపస్థానమును చెప్పవలెను.

**అథాప్యుదాహరంతి**

**ప్రణవో వ్యాహృతయస్సావిత్రీ చేత్యేతే పంచబ్రహ్మయజ్ఞా**

**అహరహర్బ్రాహ్మణం కిల్బిషాత్ పావయంతి॥** 14

ఈ విషయమున ఈ క్రింది వాక్యమునుదాహరించుచున్నారు.

ఓంకారము, మూడు వ్యాహృతులు, గాయత్రీ మంత్రము అను ఐదు బ్రహ్మయజ్ఞములు బ్రాహ్మణుని పాపమునుండి రక్షించును.

**పూతః పంచభిర్బ్రహ్మయజ్ఞైః అథోత్తరం దేవతాస్తర్పయతి॥** 15

పై బ్రహ్మయజ్ఞములచే పవిత్రమైన తరువాత దేవతా తర్పణము చేయవలెను.

ఇతి అష్టమః ఖండః

అథ నవమః ఖండః

**అగ్నిః ప్రజాపతిస్సోమో రుద్రోఽదితిర్బృహస్పతిః సర్పా**
**ఇత్యేతాని ప్రాగ్ద్వారాణి దైవతాని సనక్షత్రాణి సగ్రహాణి సాహో**
**రాత్రాణి సముహూర్తాని తర్పయామి।ఓం వసూంశ్చ తర్పయామి॥** 1

తూర్పు ద్వార దేవతలైన అగ్ని ప్రజాపతి ఇత్యాది దేవతలకు, నక్షత్రములు, గ్రహములు, అహోరాత్రములు, ముహూర్తములతో కలిపి తర్పణ చేయుచున్నాను. అట్లే వసు దేవతలకు కూడా తర్పణము చేయుచున్నానని తర్పణములు చేయవలెను.

**పితరోఽర్యమా భగస్సవితా త్వష్టా వాయుః ఇంద్రాగ్నీ ఇత్యేతాని**
**దక్షిణద్వారాణి దైవతాని సనక్షత్రాణి సగ్రహాణి సాహోరాత్రాణి**
**సముహూర్తాని తర్పయామి। ఓం రుద్రాంశ్చ తర్పయామి॥** 2

దక్షిణ ద్వార దేవతలైన పితరులు, అర్యమ, భగుడు మొదలైన దేవతలకు నక్షత్రాదులతో కలిపి పై మంత్రమును చదువుచు తర్పణ చేయవలెను. అట్లే రుద్రులకు కూడ తర్పణము చేయవలెను.

**మిత్ర ఇంద్రో మహాపితర ఆపో విశ్వేదేవా బ్రహ్మో విష్ణురిత్యేతాని**
**ప్రత్యగ్ద్వారాణి దైవతాని సనక్షత్రాణి సగ్రహాణి సాహోరాత్రాణి**
**సముహూర్తాని తర్పయామి। ఓం ఆదిత్యాంశ్చ తర్పయామి॥** 3

పశ్చిమ ద్వార దేవతలైన మిత్రుడు, ఇంద్రుడు, మహా పితరులు మొదలైన దేవతలకు నక్షత్రాదులతో కలిపి పై మంత్రమును చదువుచు తర్పణ చేయవలెను. అట్లే ఆదిత్యులకు కూడా తర్పణ చేయవలెను.

వసవో వరుణోఽజ ఏకపాదహిర్బుధ్న్యః పూషా అశ్వినౌ యమ
ఇత్యేతాని ఉదగ్ద్వారాణి దైవతాని సనక్షత్రాణి సగ్రహాణి
సాహోరాత్రాణి సముహూర్తాని తర్పయామి॥ 4

ఉత్తర ద్వార దేవతలైన వసువులు, వరుణుడు, అజుడు మొదలైన దేవతలకు నక్షత్ర గ్రహాదులతో కలిపి పై మంత్రమును చదువుచు తర్పణము చేయవలెను.

ఓం విశ్వాందేవాంస్తర్పయామి। సాధ్యాంస్తర్పయామి। బ్రహ్మాణం
తర్పయామి। ప్రజాపతిం తర్పయామి। చతుర్ముఖం తర్పయామి।
పరమేష్ఠినం తర్పయామి। హిరణ్యగర్భం తర్పయామి। స్వయంభువం
తర్పయామి।బ్రహ్మాపార్షదాంస్తర్పయామి। బ్రహ్మాపార్షదీంశ్చ తర్పయామి।
అగ్నిం తర్పయామి।వాయుం తర్పయామి।వరుణం తర్పయామి।
సూర్యం తర్పయామి। చంద్రమసం తర్పయామి।నక్షత్రాణి
తర్పయామి। జ్యోతీంషి తర్పయామి ।సద్యోజాతం తర్పయామి।
ఓం భూః పురుషం తర్పయామి। ఓం భువః పురుషం తర్పయామి।
ఓం సువః పురుషం తర్పయామి। ఓం భూర్భువస్వః పురుషం
తర్పయామి। ఓం భూః తర్పయామి। ఓం భువస్తర్పయామి।
ఓం సువస్తర్పయామి। ఓం మహస్తర్పయామి।ఓం జనః
తర్పయామి। ఓం తపస్తర్పయామి।ఓం సత్యం తర్పయామి।
ఓం భవం దేవం తర్పయామి। ఓం శర్వం దేవం తర్పయామి।
ఓమీశానం దేవంతర్పయామి। ఓం పశుపతిందేవం తర్పయామి।
ఓం రుద్రం దేవం తర్పయామి। ఓముగ్రం దేవం తర్పయామి।

ఓం భీమం దేవం తర్పయామి। ఓం మహాంతందేవం తర్ప

యామి। ఓం భవస్యదేవస్య పత్నీం తర్పయామి। ఓం శర్వస్య దేవస్య

పత్నీం తర్పయామి।ఓమీశానస్య దేవస్య పత్నీం తర్పయామి।ఓం

పశుపతేర్దేవస్య పత్నీం తర్పయామి।ఓం రుద్రస్య దేవస్య

పత్నీం తర్పయామి।ఓముగ్రస్య దేవస్య పత్నీం

తర్పయామి। ఓం భీమస్య దేవస్య పత్నీం తర్పయామి॥

ఓం మహతో దేవస్య పత్నీం తర్పయామి ॥ 5

పై మంత్రములను చదువుచు విశ్వే దేవతలు మొదలగు దేవతలకు, దేవతా పత్నులకు తర్పణములు వదలవలెను.

ఓం భవస్య దేవస్య సుతం తర్పయామి। ఓం శర్వస్య దేవస్య

సుతం తర్పయామి। ఓమీశానస్య దేవస్య సుతం తర్పయామి।

ఓం పశుపతేర్దేవస్య సుతం తర్పయామి। ఓం రుద్రస్య దేవస్య

సుతం తర్పయామి। ఓముగ్రస్య దేవస్య సుతం తర్పయామి।

ఓం భీమస్య దేవస్య సుతం తర్పయామి। ఓం మహతో దేవస్య

సుతం తర్పయామి।ఓంరుద్రాంస్తర్పయామి।

ఓం రుద్రపార్షదాంస్తర్పయామి। రుద్ర పార్షదీశ్చతర్పయామి॥ 6

భవుడు మొదలగు దేవతల పుత్రులకు, రుద్రులకు, రుద్రపార్షదులకు, వారి భార్యలకు ఆయా మంత్రములు చదువుచు తర్పణములు చేయవలెను.

ఓం విఘ్నం తర్పయామి। వినాయకం తర్పయామి।

వీరం తర్పయామి। శూరం తర్పయామి। వరదం తర్పయామి।

హస్తిముఖం తర్పయామి। వక్రతుండం తర్పయామి।ఏకదంతం

తర్పయామి। లంబోదరం తర్పయామి। గణపతిం తర్పయామి।

విఘ్నపార్షదాంస్తర్పయామి। విఘ్నపార్షదీశ్చ తర్పయామి॥ 7

విఘ్నుడు మొదలగు పేర్లతోనున్న విఘ్నాధిపతికి, అతని సేవకులకు, వారి భార్యలకు పైన చెప్పిన ఆయా మంత్రములు చదువుచు తర్పణములు చేయవలెను

**ఓం సనత్కుమారం తర్పయామి। స్కందం తర్పయామి। ఇంద్రం తర్పయామి। షష్ఠీం తర్పయామి। షణ్ముఖంతర్పయామి। విశాఖం తర్పయామి। జయంతం తర్పయామి। మహాసేనం తర్పయామి। స్కంద పార్షదాంస్తర్పయామి।స్కందపార్షదీశ్చ తర్పయామి॥** 8

సనత్కుమారుడు మొదలగు పేర్లతోనున్న కుమారస్వామికి అతని పరివారమునకు, వారి భార్యలకు పైన పేర్కొన్న ఆయా మంత్రములచే తర్పణలీయవలెను.

**ఓమాదిత్యంతర్పయామి। సోమంతర్పయామి। అంగారకంతర్పయామి। బుధం తర్పయామి। బృహస్పతిం తర్పయామి। శుక్రం తర్పయామి। శనైశ్చరం తర్పయామి। రాహుంతర్పయామి। కేతుం తర్పయామి॥** 9

ఆదిత్యాది నవగ్రహములకు పైన పేర్కొన్న మంత్రములచే తర్పణముల నీయవలెను.

**ఓం కేశవం తర్పయామి। నారాయణం తర్పయామి। మాధవం తర్పయామి। గోవిందం తర్పయామి। విష్ణుం తర్పయామి। మధుసూదనం తర్పయామి। త్రివిక్రమం తర్పయామి। వామనం తర్పయామి। శ్రీధరం తర్పయామి। హృషీకేశం తర్పయామి। పద్మనాభం తర్పయామి।దామోదరం తర్పయామి। శ్రియం దేవీం తర్పయామి। సరస్వతీం దేవీం తర్పయామి। పుష్టిం దేవీం తర్పయామి। తుష్టిం దేవీం తర్పయామి। వైనతేయం తర్పయామి। విష్ణు పార్షదాంస్తర్పయామి। విష్ణుపార్షదీశ్చ తర్పయామి॥** 10

కేశవాది నామములతోనున్న శ్రీమన్నారాయణునకు, అతని ధర్మపత్నులగు శ్రీదేవి సరస్వతి ఇత్యాదులకు, (సరస్వతి శ్రీమన్నారాయణుని భార్యగా బ్రహ్మావైవర్త పురాణమున చెప్పబడినది.) అతని పరిచారకులగు వైనతేయాదులకు, వారి భార్యలకు పైన చెప్పిన మంత్రములచే తర్పణములనీయవలెను.

**ఓం యమం తర్పయామి। యమరాజం తర్పయామి।**

**ధర్మం తర్పయామి। ధర్మరాజంతర్పయామి। కాలం తర్పయామి।**

**నీలం తర్పయామి। మృత్యుం తర్పయామి। అంతకం తర్పయామి।**

**చిత్రం తర్పయామి। చిత్రగుప్తం తర్పయామి। ఔదుంబరం**

**తర్పయామి। వైవస్వతం తర్పయామి। వైవస్వత పార్షదాం-**

**స్తర్పయామి। వైవస్వత పార్షదీశ్చ తర్పయామి॥**

యముడు మొదలగు పేర్లతోనున్న యమ ధర్మరాజునకు, అతని సేవకులకు, వారి భార్యలకు, పైన చెప్పిన మంత్రములచే తర్పణములీయవలెను.

**భరద్వాజం తర్పయామి। గౌతమం తర్పయామి। అత్రిం**

**తర్పయామి। ఆంగిరసం తర్పయామి। విద్యాం తర్పయామి।**

**దుర్గాం తర్పయామి। జ్యేష్ఠాం తర్పయామి। ధాన్వంతరిం**

**తర్పయామి। ధాన్వంతరిపారిషదాంస్తర్పయామి।**

**ధాన్వంతరిపారిషదీశ్చ తర్పయామి॥** 12

భరద్వాజుడు, గౌతముడు మొదలగు ఆయుర్వేద శాస్త్ర ప్రవర్తకులకు? ధన్వంతరి సేవకులకు, వారి భార్యలకు పైన చెప్పిన మంత్రములచే తర్పణము లీయవలెను.

భరద్వాజుడు మొదలగువారు వైద్యశాస్త్ర ప్రవర్తకులైనందువలన ధన్వంతరితో కలిపి చెప్పబడినారు. అట్లే వైద్యమను పదము విద్యా అను వ్యక్తి చేత చెప్పబడినది అను అర్థమును సూచించును. ఈ దేవతా తర్పణములన్నియు ఉపవీతిగనే చేయవలెను.

అధ నివీతీ॥ 13

దేవతాతర్పణములను చేసిన తరువాత యజ్ఞోపవీతమును నివీతిగా (మెడలో మాత్రము) ఉంచుకొని ఋషితర్పణములను చేయవలెను.

ఓమృషీంస్తర్పయామి। పరమర్షీంస్తర్పయామి।మహర్షీంస్తర్పయామి। బ్రహ్మర్షీంస్తర్పయామి।దేవర్షీంస్తర్పయామి। రాజర్షీంస్తర్పయామి। శ్రుతర్షీంస్తర్పయామి। జనర్షీంస్తర్పయామి। తపర్షీంస్తర్పయామి।సత్యర్షీంస్తర్పయామి। సప్తర్షీంస్తర్పయామి।కాండర్షీంస్తర్పయామి।ఋషికాంస్తర్పయామి। ఋషిపత్నీస్తర్పయామి।ఋషిపుత్రాంస్తర్పయామి। ఋషిపౌత్రాంస్తర్పయామి। కాణ్వం బౌధాయనం తర్పయామి। ఆపస్తంబంసూత్రకారం తర్పయామి। సత్యాషాఢం హిరణ్యకేశినం తర్పయామి। వాజసనేయినం యాజ్ఞవల్క్యం తర్పయామి। ఆశ్వలాయనం శౌనకం తర్పయామి। వ్యాసంతర్పయామి। వసిష్ఠం తర్పయామి। ప్రణవంతర్పయామి। వ్యాహృతీస్తర్పయామి। సావిత్రీం తర్పయామి। గాయత్రీం తర్పయామి। ఛందాంసితర్పయామి। ఋగ్వేదం తర్పయామి। యజుర్వేదం తర్పయామి।సామవేదం తర్పయామి। అధర్వవేదం తర్పయామి। అధర్వాంగిరసం తర్పయామి। ఇతిహాస పురాణాదీని తర్పయామి।సర్వవేదాంస్తర్పయామి। సర్వదేవ జనాంస్తర్పయామి। సర్వభూతాని తర్పయామి॥ 14

పై మంత్రములచే ఋషి తర్పణములను చేయవలెను. అట్లే మహర్షులచే కనుగొనబడిన వేదములకు, తదా ధారమైన సప్రణవ, సవ్యాహృతికమైన గాయత్రీమంత్రమునకు, నానావిధ సూత్రకారులకు, ఋషి సంబంధమున్న వారికి తర్పణములనివ్వవలెను.

ఇతి నవమః ఖండః

అథ దశమః ఖండః

అథప్రాచీనావీతీ - ఓం పితౄన్ స్వధానమస్తర్పయామి। పితా
మహాన్ స్వధానమస్తర్పయామి।ప్రపితామహాన్ స్వధానమస్తర్ప
యామి। మాతౄః స్వధానమస్తర్పయామి। పితామహీస్స్వధా
నమస్తర్పయామి। ప్రపితామహీస్స్వధానమస్తర్పయామి।మాతా
మహాన్ స్వధానమస్తర్పయామి। మాతుః పితామహాన్ స్వధా
నమస్తర్పయామి।మాతుః ప్రపితామహాన్ స్వధానమస్తర్పయామి।
మాతామహీస్స్వధా నమస్తర్పయామి।మాతుః పితామహీః స్వధా
నమస్తర్పయామి। మాతుః ప్రపితామహీస్స్వధా నమస్తర్పయామి॥ 1

యజ్ఞోపవీతమును అపసవ్యముగా చేసికొని తన పితరులకు, తల్లి సంబంధమున్న వారికందరకు పైన చెప్పిన మంత్రములచే తర్పణములు చేయవలెను.

ఓమాచార్యాన్ స్వధా నమస్తర్పయామి।ఆచార్యపత్నీః స్వధా
నమస్తర్పయామి। గురూన్ స్వధా నమస్తర్పయామి।
గురుపత్నీస్స్వధానమస్తర్పయామి। సఖీన్స్వధా నమస్తర్పయామి।
సఖిపత్నీః స్వధానమస్తర్పయామి। జ్ఞాతీన్ స్వధా నమస్తర్పయామి।
జ్ఞాతి పత్నీస్స్వధానమస్తర్పయామి। అమాత్యాన్ స్వధానమస్తర్పయామి।
అమాత్యాః స్వధా నమస్తర్పయామి। సర్వాన్స్వధానమస్తర్పయామి।
సర్వాస్స్వధానమస్తర్పయామి॥ 2

పై మంత్రములచే గతించిన ఆచార్యాదులకు తర్పణములీయవలెను.

అనుతీర్థమప ఉత్సించతి - ఊర్జంవహంతీరమృతం ఘృతం
పయః కీలాలం పరిస్రుతం స్వధాస్థ తర్పయత మే పితౄన్।
తృప్యత తృప్యత తృప్యతేతి॥ 3

ఊర్జం వహంతీరను మంత్రమును చదువుచు దోసిలిచే నీటిని తీసికొని పైకెత్తి

వదలవలెను. తృప్యత, తృప్యత, తృప్యత అని పితృదేవతలపైనున్న మిక్కిలి గౌరవముచే మూడుమార్లు చెప్పబడినది.

**నైకవస్త్రో నార్ద్రవాసా దైవాని కర్మాణ్యనుసంచరేత్।**
**పితృసంయుక్తాని చేత్యేకేషాం పితృసంయుక్తాని చేత్యేకేషాం॥** 4

దేవతా సంబంధమైన కార్యములను ఒంటి వస్త్రమును ధరించి, తడి బట్ట ధరించి చేయరాదు. పితృకార్యములందు కూడ ఏకవస్త్రమును, ఆర్ద్రవస్త్రమును ధరింపరాదని కొందరందురు.

కొందరందురు అని అన్నందు వలన ఇది బోధాయనునకు సమ్మతము కాదని తెలియుచున్నది.

అధ్యాయసమాప్తిని తెలుపుచు ఇచ్చట కొన్ని పదములు పునరుక్తమైనవి.

ఇతి దశమః ఖండః

అథ ఏకాదశః ఖండః

**అథేమే పంచమహాయజ్ఞాస్తాన్యేవ మహాసత్రాణి దేవయజ్ఞః**
**పితృయజ్ఞో భూత యజ్ఞో మనుష్యయజ్ఞో బ్రహ్మయజ్ఞ ఇతి॥** 1

దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము, బ్రహ్మయజ్ఞము అను పంచమహాయజ్ఞములే మహాసత్రములని పిలువబడుచున్నవి.

**అహరహస్స్వాహా కుర్యాదాకాష్ఠాత్ తథైతం దేవయజ్ఞం సమాప్నోతి॥** 2

గృహస్థు ప్రతిదినము హోమము చేయవలెను. ఈ హోమమున అన్నము మొదలుకొని చిన్న కట్టెవరకు హోమద్రవ్యముండవచ్చును. ఇట్టి దేవయజ్ఞమునతడు ప్రతిదినము చేయవలెను.

**అహరహస్స్వధాకుర్యాదోదపాత్రాత్ తథైతం పితృయజ్ఞం సమాప్నోతి।** 3

స్వధాకారముతో చేయునది పితృయజ్ఞము. ఈ పితృయజ్ఞమున నేయి, అన్నము

మొదలుకొని ఉదక పాత్ర వరకు పూజాద్రవ్యములుండును. ఇట్టి పితృయజ్ఞమును ప్రతిదినము అనుష్ఠింపవలెను.

**అహరహర్నమస్కుర్యాదాపుష్పేభ్యః తథైతం భూతయజ్ఞంసమాప్నోతి॥**

భూతేభ్యోనమః ఇత్యాది మంత్రములచే నమస్కార విధానమున చేయునది భూతయజ్ఞము. ఈ యజ్ఞమున ఆహారము మొదలుకొని పుష్పము వరకు యజ్ఞ ద్రవ్యముండును. ఈ భూతయజ్ఞమును ప్రతిదినము చేయవలెను.

**అహరహర్బ్రాహ్మణేభ్యోఽన్నం దద్యాదామూల**
**ఫలశాకేభ్యః తథైతం మనుష్యయజ్ఞం సమాప్నోతి॥** 5

అతిథులుగా వచ్చిన బ్రాహ్మణులకు అన్నము పెట్టుటను మనుష్యయజ్ఞమందురు. ఈ యజ్ఞమున కందమూలము పండ్లు, ఆకుకూరల వరకుండవచ్చును. ఇట్టి మనుష్య యజ్ఞమును ప్రతిదినము చేయవలెను.

**అహరహస్స్వాధ్యాయం కుర్యాదాప్రణవాత్ తథైతం**
**బ్రహ్మయజ్ఞం సమాప్నోతి॥** 6

ప్రణవముతో ప్రారంభించి చేయు వేదాధ్యయనమును బ్రహ్మయజ్ఞమందురు. ఈ బ్రహ్మ యజ్ఞమును ప్రతిదినము చేయవలెను.

**స్వాధ్యాయో వై బ్రహ్మయజ్ఞః॥** 7

బ్రహ్మయజ్ఞమనగా వేదాధ్యయనమే.

**తస్య హ వా ఏతస్య బ్రహ్మయజ్ఞస్య వాగేవ జుహూః మన**
**ఉపభృత్ చక్షుర్ధ్రువా మేధా స్రువః సత్యమవభృథః స్వర్గో లోక**
**ఉదయనం యావంతం హ వా ఇమాం విత్తస్య పూర్ణాం**
**దదత్స్వర్గం లోకం జయతి భూయాంసం చాఽక్షయ్యం చ**
**అపపునర్మృత్యుం జయతి య ఏవం విద్వాన్ స్వాధ్యాయమధీతే॥** 8

ఈ బ్రహ్మయజ్ఞమున వాక్కే జుహువను యజ్ఞ సాధనము. మనస్సు ఉపభృత్. కండ్లు స్రుక్కు (ధ్రువ). మేధ స్రువము. సత్యము అవభృథ స్నానము వంటిది.

ఉదయనము (పూర్తి చేయుట) అనునది స్వర్గ ఫలము. ఈ బ్రహ్మయజ్ఞము వలన తన ధనమునంతయు దానము చేసి పొందు స్వర్గ ఫలముకంటె ఎక్కువ ఫలితము లభించును. పైగా దీనివలన అక్షయలోకములు కలుగును. అపమృత్యువు తొలగిపోవును. పునః అపమృత్యుం అనుటకు అప పునర్మృత్యుమనుట ఆర్ష ప్రయోగముగా కన్పించును.

**తస్మాత్ స్వాధ్యాయోఽ ధ్యేతవ్య ఇతి హి బ్రాహ్మణమ్॥** 9

వేదాధ్యయనము వలన చాలా ప్రయోజనములున్నందువల్లనే వేదాధ్యయనమును తప్పక చేయవలెనని వేదము చెప్పుచున్నది.

**అథాప్యుదాహరంతి**

**స్వభ్యక్తస్సుహితః సుఖే శయనే శయానః యం యం క్రతుమధీతే**
**తేన తేనాస్యేష్టం భవతీతి॥** 10

ఈ విషయమున ధర్మజ్ఞులీ వాక్యమును ఉదాహరించుచున్నారు.

చక్కగా అభ్యంగన స్నానమాచరించి, చక్కని భోజనము వలన తృప్తి చెంది సుఖముగా శయ్యపై పడుకొని ఏఏయజ్ఞములకు సంబంధించిన మంత్రములను అధ్యయనము చేయునో ఆ యజ్ఞముల ఫలితమతనికి లభించునని అందురు. అనగా వేదమును ఎట్లు అధ్యయనము చేసినను సత్ఫలితము లభించునని భావము.

**తస్య హ వా ఏతస్య ధర్మస్య చతుర్ధా భేద మేక ఆహుః**
**అదృష్టత్వాత్ యే చత్వార ఇతి కర్మవాదః॥** 11

ఈ ధర్మము నాలుగు విధములుగా ఉండునని కొందరాచార్యులందురు. కాని దీనికి ఆధారము కనిపించదు. ఈ మంత్రము కర్మభేదమును మాత్రమే సూచించుచున్నది.

**ఐష్టిక పాశుక సౌమిక దార్వీహోమానామ్॥** 12

ఇష్టియజ్ఞము, పశుయజ్ఞము, సోమయజ్ఞము, దర్వీహోమమని కర్మ నాలుగు విధములుగా నుండును.

**తదేషాఽ భివదతి - "యే చత్వారః పథయో దేవయానా**

**అంతరా ద్యావాపృథివీ వియంతి। తేషాం యో అజ్యానిమజీతిమ్**

**ఆవహత్తస్మై నో దేవాః పరిదత్తేహ సర్వ" ఇతి॥** 13

తైత్తిరీయ సంహితలోని ఈ ఋక్కు ఓ దేవతలారా! దేవలోకమునకు సంబంధించిన నాలుగు మార్గములు భూమ్యాకాశముల మధ్య ఉన్నవి. వాటిలో నిరంతరము సమృద్ధిని కలిగించు మార్గమును మాకు చూపుదని అనును.

**బ్రహ్మచారీ గృహస్థో వానప్రస్థః పరివ్రాజక ఇతి॥** 14

బ్రహ్మచారి, గృహస్థు, వానప్రస్థు, సన్యాసి అని నాలుగు ఆశ్రమములు.

**బ్రహ్మచారీ గురుశుశ్రూష్యామరణాత్॥** 15

పై నలుగురిలో బ్రహ్మచారి (నైష్ఠిక) చనిపోవు వరకు గురుశుశ్రూషలో ఉండును.

**వానప్రస్థో విఖనసశాస్త్రసముదాచారః॥** 16

వానప్రస్థుడు విఖనసమహర్షి ఉపదేశించిన శాస్త్రముననుసరించి ఆచరించును.

**వైఖానసో వనే మూలఫలాశీ తపశ్శీలః**

**సవనేషూదకముపస్పృశన్ శ్రామణకేన అగ్నిమాధాయ**

**అగ్రామ్యభోజీ దేవపితృభూత మనుష్యర్షిపూజకః సర్వాతిథిః**

**ప్రతిషిద్ధ వర్జం భైక్షమప్యుపయుంజీత న ఫాలకృష్ణమధితిష్ఠేద్**

**గ్రామం చ న ప్రవిశేజ్జటిలశ్చీరాజినవాసా నాతిసంవత్సరం భుంజీత॥**

వైఖానసుడు (వానప్రస్థుడు) అడవిలో పండు కందమూలాదులను, ఫలములను తినవలెను. నిరంతరము తపస్సు చే[illegible]వలెను. త్రిసంధ్యలందు స్నానము చేయవలెను. వైఖానసశాస్త్రములో చెప్పినట్లు శ్రామణకాగ్నిని ఆధానము చేయవలెను. గ్రామములందు పండు ఆహారమును తీసికొనరాదు. పంచయజ్ఞముల నాచరింపవలెను. అందరకు ఆతిథ్యమునీయవలెను. నిషేధములేని వారి దగ్గర భిక్షతీసికొనవచ్చును. దున్నగా పండిన వాటిని స్వీకరింపరాదు. గ్రామమునకు కూడ పోరాదు. తాను జడలను నారచీరలను ధరించి సంవత్సరమునకు మించి ఉన్న పదార్థములననుభవింపరాదు.

**పరివ్రాజకః పరిత్యజ్య బంధూన్ అపరిగ్రహః పరివ్రజేద్యథావిధి॥** 18

సన్యాసి తల్లి దండ్రులు తప్ప మిగిలినవారినందరను త్యజించి ఎట్టి సంపదను వెంట తీసికొనక శాస్త్ర మర్యాదననుసరించి సన్యాసాశ్రమమును స్వీకరింపవలెను.

**అరణ్యం గత్వా॥** 19

అతడు అరణ్యమున నివాసముండవలెను.

**శిఖాముండః॥** 20

శిఖను వదలి తలనంతా ముండనము చేయించుకొనవలెను?

**కౌపీనాచ్ఛాదనః॥** 21

గోచిని మాత్రము ధరింపవలెను.

**వర్షాస్వేకస్థః॥** **22**

వర్షకాలమునమాత్రము ఒకేచోట ఉండవలెను.

**కాషాయవాసాః॥** 23

కాషాయ వస్త్రమును ధరింపవలెను.

**సన్నముసలే వ్యంగారే నివృత్త శరావ సంపాతే భిక్షేత॥** 24

రోకలి శబ్దము వినబడనప్పుడు, (వడ్లు దంచుట పూర్తియైన తరువాత) పొయ్యిలోని నిప్పు చల్లారిన తరువాత, భోజన పాత్రలనన్నిటిని కడిగిన తరువాత, (గృహస్థు భోజనాదికములన్నిటిని పూర్తిచేసిన తరువాత) భిక్షకు పోవలెను.

**వాఙ్మనః కర్మ దండైర్భూతానామద్రోహీ॥** 25

దండమనగా దమనము. సన్యాసి తన వాక్కును మనస్సును కర్మను నియంత్రించుకొని ప్రాణులకు ఎట్టి అపకారమును చేయరాదు.

**పవిత్రం బిభృయాత్ శౌచార్థమ్॥** 26

తానెల్లప్పుడు పవిత్రముగానుండుటకై సదా పవిత్రను ధరింపవలెను. (భగవద్రామానుజులు సదా పవిత్రను ధరించేవారు.)

**ఉద్ధృత పరిపూతాభిరద్భిః కార్యం కుర్యాత్॥** 27

బావి లేక చెరువులోనుండి తీసికొన్న నీటిని వడియగట్టుట ద్వారా పరిశుద్ధము చేసికొనిన తరువాతనే వాటిని ఉపయోగింపవలెను

**అపవిధ్య వైదికాని కర్మాణ్యుభయతఃపరిచ్ఛిన్నా**

**మధ్యమం పదం సంశ్లిష్యామహే ఇతి వదన్తః॥** 28

సన్న్యాసులు వైదిక కర్మలనన్నిటిని వదలి పితృ, దేవ లోకములను రెండిటిని వదలుకొని మధ్యమ స్థానమైన భగవత్సంబంధమును మాత్రము పెట్టుకొందుమని అనవలెను.

**ఐకాశ్రమ్యం త్వాచార్యా అప్రజననత్వాదితరేషామ్॥** 29

కొందరు పూర్వాచార్యులు బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములందు సంతానమును పొందుట అనునది లేనందువలన గృహస్థాశ్రమమొక్కటే ఆశ్రమమని అనిరి.

**తత్రోదాహరంతి -ప్రాహ్లాదిర్హ వై కపిలో నామాసుర ఆస। స**

**ఏతాన్భేదాంశ్చకార దేవైస్సహ స్పర్ధమానస్తాన్ మనీషీ నాద్రియేత॥**30

పూర్వము ప్రహ్లాదుని వంశమున కపిలుడను రాక్షసుడుండెను. అతడు దేవతలతో వివాదము పెట్టుకొని బ్రహ్మచర్యము మొదలైన ఆశ్రమములను సృష్టించెను. కాని బుద్ధిమంతుడైనవాడు ఈ ఆశ్రమభేదమును అంగీకరింపకూడదని కొందరు ధర్మజ్ఞులందురు.

**అదృష్టత్వాత్। యే చత్వార ఇతి కర్మవాద ఐష్టిక**

**పాశుక సౌమిక దార్వీహోమానామ్॥** 31

గృహస్థాశ్రమమే గొప్పదనుటకు ఆధారము కనపడుట లేదు "యే చత్వార" అను తైత్తిరీయ మంత్రమున ఇష్టి హోమ, పశుహోమ, సోమ యజ్ఞ, దర్వీ హోమములను స్వీకరింప వలెను. ఈ కర్మలు మోక్షమును కలిగించుననుటకంటె జ్ఞానమే మోక్షదాయకమనుటకు అనేక వేదవచనములు ప్రమాణముగా [illegible] వి.

**తదేషా అభ్యనూచ్యతే - ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య।**

**న కర్మణా వర్ధతే నో కనీయాన్।తస్యైవాత్మా పదవిత్తం**

**విదిత్వా న కర్మణా లిప్యతే పాపకేనేతి॥** 32

మహిమ అనగా గొప్పవాడు అంతట ఉండువాడు అనగా ఆత్మయని అర్థము. ఆత్మ నిత్యుడు అతనికి అగ్ని హోత్రాది పుణ్య కర్మలవలన పుణ్యము కలుగదు. నికృష్ట కర్మలవల్ల పాపము కలుగదు. ఆ ఆత్మ, గమ్యస్థానమును తెలిసికొన్నందువల్ల కర్మలవలన కలుగు పాపములు అతనిని చేరవు అని చెప్పుదురు.

**స యత్ బ్రూయాత్ - యేన సూర్యస్తపతి తేజసేద్ధః పితా**

**పుత్రేణ పితృమాన్ యోని యోనౌ। నావేదవిన్మనుతే తం**

**బృహంతం సర్వానుభుమాత్మానం సాంపరాయే ఇతి॥** **33**

**ఇమే యే నార్వాఙ్న పరశ్చరంతి న బ్రాహ్మణా సో న**

**సుతే కరాసః। త ఏతే వాచమభిపద్య పాపయా**

**సిరీస్తంత్రం తన్వతే అప్రజజ్ఞయ ఇతి॥** 34

యేన సూర్యస్తపతి అనుమంత్రము తైత్తిరీయ బ్రాహ్మణములోని కాఠక భాగమునకు 12-3-9 సంబంధించినది. ఇమే యే అనునది ఋక్సంహితకు 2-24-4 చెందినది. ఈ రెండు మంత్రములు జ్ఞాన ప్రాధాన్యమును తెలుపుచున్నవి.

**ప్రజాభిరగ్నే అమృతత్వమశ్యామ్। జాయమానో వై బ్రాహ్మణస్త్రిభిర్ ఋణవా జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యః యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్య ఇతి। ఏవమృణ సంయోగాదీన్యసంఖ్యేయాని భవంతి॥** 35

ఓ అగ్ని దేవుడా! సంతానముచే నేను అమృతత్వమును పొందుదును. బ్రాహ్మణుడు మూడు ఋణములచే జన్మించుచున్నాడు. బ్రహ్మచర్యము వలన ఋషి ఋణమును, యజ్ఞము (పూజ) చేత దేవతా ఋణమును, సత్సంతానము చేత పితృ ఋణమును పోగొట్టుకొనుచున్నాడు. ఈ విధముగా ఉన్నవి.

**త్రయీం విద్యాం బ్రహ్మచర్యం ప్రజాతిం శ్రద్ధాం తపోయజ్ఞమను ప్రదానమ్। య ఏతాని కుర్వతే తైరిత్సహ స్మో రజో భూత్వా ధ్వంసతేఽన్యత్ ప్రశంసన్నితి ప్రశంసన్నితి॥** 36

వేదాధ్యయనము, బ్రహ్మచర్యము, సంతానోత్పత్తి, తపస్సు, యజ్ఞములు చేయువారు మాత్రమే మా పక్షమున ఉందురు. ఇతర విషయములను ప్రశంసించువారు పాపులై నాశనము పొందుదురని వేదము ప్రశంసించుచున్నది.

ఇచ్చట అధ్యాయ పరిసమాప్తిని తెలుపుటకై పదములు ఆ వృత్తి చేయబడినవి.

ఇతి ఏకాదశః ఖండః

అథ ద్వాదశః ఖండః

**అథ శాలీన యాయావరాణామ్ ఆత్మయాజినాం ప్రాణాహుతీర్వ్యాఖ్యాస్యామః॥** 1

ఆత్మయందు యాగము చేయు గృహస్థులు మరియు యాయావరులు (వీరు కూడ గృహస్థులే. కాకపోతే వీరు ఇంటిలో ఉండక సంసార పోషణమునకై ఊరూరూ తిరుగుదురు.) చేయు ప్రాణాహుతులను వివరించెదను.

**సర్వావశ్యకావసానే సంమృష్టోపలిప్తే దేశే ప్రాఙ్ముఖ ఉపవిశ్య తద్భూతమాహ్రియమాణం భూర్భువస్సువరోమిత్యుపాస్థాయ వాచం యచ్ఛేత్॥** 2

ఉదయము సంధ్యావందనము మొదలుకొని వైశ్వదేవము అతిథి పూజవంటి కార్యక్రములన్నియు పూర్తి చేసిన తరువాత అనగా మధ్యాహ్నమున చక్కగా శుద్ధిచేసి అలికిన ప్రదేశమున తూర్పుముఖముగా కూర్చొని వడ్డించిన అన్నమును 'భూర్భువస్సువరోమ్' అనుచు నమస్కరించిన తరువాత మౌనముగా ఉండవలెను.

"పూర్వాహ్ణో వై దేవానాం మధ్యందినే మనుష్యాణామపరాహ్ణో పితౄణామ్" అను వేదవాక్యమునసరించి మధ్యాహ్నముననే భోజనము చేయవలెను.

**న్యస్తమన్నం మహావ్యాహృతిభిః ప్రదక్షిణముదకం పరిషిచ్య సవ్యేన పాణినాఽ విముంచన్ "అమృతోఽ పస్తరణమసీ"తి పురస్తాదపః పీత్వా పంచాన్నేన ప్రాణాహుతీర్జుహోతి ప్రాణే నివిష్టోఽమృతం జుహోమి శివో మాఽవిశాప్రదాహాయ ప్రాణాయ స్వాహేతి॥** 3

అన్నమును వడ్డించిన తరువాత భూరగ్నయే చ పృధివ్యై చ మొదలైన మహావ్యాహృతులను చదువుచు ప్రదక్షిణముగా పరిషేచనము చేసి ఎడమ చేతిచే భోజన పాత్రను పట్టుకొని అమృతోపస్తరణమసి అనుచు నీటిని ప్రాశనము చేయవలెను. (నేయి వడ్డించిన) తరువాత ప్రాణే నివిష్టం ఇత్యాది మంత్రములను చదువుచు ఐదు ప్రాణాహుతులను చేయవలెను.

**పంచాన్నేన ప్రాణాహుతీర్హుత్వా తూష్ణీం భూయో వ్రతయేత్ప్రజాపతిం మనసా ధ్యాయన్॥** 4

ఐదు ప్రాణాహుతులను తీసికొన్న తరువాత ప్రజాపతిని మనస్సులో స్మరించుకొనుచు మంత్రమేమియు చదువకుండ మరియొక ప్రాణాహుతి తీసికొనవలెను.

**నాంతరా వాచం విసృజేత్ యదంతరా వాచం విసృజేద్ భూర్భువస్సువరోమితి జపిత్వా పునరేవ భుంజీత॥** 5

భోజనము చేయునప్పుడు మధ్యలో మాట్లాడరాదు. భోజనము మధ్యలో మాట్లాడినచో "భూర్భువస్సువరోమ్" అని అనిన తర్వాతనే తినవలెను.

**త్వక్కేశనఖ కీటాఖు పురీషాణి దృష్ట్వా తం దేశం పిండముద్ధృత్య అద్భిః అభ్యుక్ష భస్మావకీర్య పునరద్భిః ప్రోక్ష్య వాచా చ ప్రశస్తముపయుంజీత॥** 6

అన్నములో చర్మము, వెంట్రుక, గోరు, పురుగు, ఎలుక మలము వచ్చినచో అది ఉన్నంత భాగమును తీసి నీరు ప్రోక్షింపవలెను. తరువాత భస్మమును చల్లి తిరిగి నీరు ప్రోక్షింపవలెను. అప్పుడు ఆహారము పరిశుద్ధముగానున్నదని భార్య మొదలగు వారన్నప్పుడు ఆ ఆహారమును భుజింపవలెను.

అథాప్యుదాహరంతి

**ఆసీనః ప్రాఙ్ముఖోఽశ్నీయాత్ వాగ్యతోఽన్నమకుత్సయన్।**

**అస్కందయన్తస్తన్మనాశ్చ భుక్త్వా చాగ్నిముపస్పృశేదితి॥** 7

ఈ విషయమున క్రింది శ్లోకమును ధర్మజ్ఞులుదాహరించుచున్నారు.

తూర్పునకు ముఖము పెట్టి కూర్చొని, తాను తిను ఆహారమును నిందింపక, ఆహారము భూమిపై పడకుండ, మౌనముగా భోజనము చేయవలెను. భోజనమును శ్రద్ధగా చేసిన తరువాత ఆచమనము చేసి, చేతులకు అగ్ని స్పర్శ కలిగింపవలెను.

**సర్వ భక్ష్యాపూప కందమూల ఫల మాంసాదీని దంతైర్నావద్యేత్॥** 8

అపూపములు, కందమూలములు, పండ్లు మొదలగు వానిని దంతములతో కొరికి తినరాదు.

**నాతిసుహితః॥** 9

రుచిగా ఉన్నదని అతిగా భోజనము చేయకూడదు.

**"అమృతాపిధానమసి" ఇత్యుపరిష్టాదపః పీత్వాఽచాంతః**

**హృదయదేశమభిమృశతి ప్రాణానాం గ్రంథిరసి రుద్రో**

**మా విశాంతకస్తేనాన్నేనాఽప్యాయస్వేతి॥** 10

భోజనానంతరము "అమృతాపిధానమసి" అని అనుచు ఉత్తర పరిషేచనముతో తీర్థమును తీసికొని ముఖము, కాళ్ళు చేతులు కడుగుకొని, ఆచమనము చేయవలెను. అటు పిమ్మట హృదయ ప్రదేశమును ముట్టుకొని "ప్రాణానాం గ్రంథిరసి" ఇత్యాది మంత్రమును చదువవలెను.

**పునరాచమ్య దక్షిణే పాదాఙ్గుష్ఠే పాణీ నిస్రావయతి అంగుష్ఠమాత్రః**

**పురుషోఽంగుష్ఠం చ సమాశ్రితః। ఈశస్సర్వస్య జగతః ప్రభుః**

**ప్రీణాతి విశ్వభుగితి॥** 11

హృదయ ప్రదేశమును తగిలిన తరువాత మరల ఆచమనము చేసి 'అంగుష్ఠమాత్రః పురుషః" అను మంత్రమును చదువుచు తన కుడి కాలు పెద్దవ్రేలిపైన కుడిచేతిచే తీర్థమును పోసికొనవలెను.

**హుతానుమంత్రణమూర్ధ్వహస్తస్సమాచరేత్ శ్రద్ధాయాం ప్రాణే**

**నివిశ్యామృతం హుతమ్। ప్రాణమన్నేనాఽప్యాయస్వేతి పంచ॥** 12

భోజనానంతరము చేతులు పైకెత్తి "శ్రద్ధాయాం ప్రాణే నివిశ్య" ఇత్యాది ఐదు మంత్రములను చదువుచు ప్రాణాహుతులకు అనుమంత్రణము చేయవలెను.

**బ్రహ్మణి మ ఆత్మాఽమృతత్వాయ ఇత్యాత్మానమ్॥** 13

బ్రహ్మణి మ ఆత్మాఽమృతత్వాయ। అనుచు తనను అనుమంత్రణము చేయవలెను.

**అక్షరేణ చాఽత్మానం యోజయేత్॥** 14

ఏకాక్షరమైన ఓంకారముతో తనను అనుసంధానించి ధ్యానము చేయవలెను.

**సర్వక్రతుయాజినామ్ ఆత్మయాజీ విశిష్యతే॥** 15

సమస్త యాగములు చేసినవానికన్న ఆత్మయాజి (ప్రతిదినము ప్రాణాహుతులు తీసికొనువాడు) చాలా గొప్పవాడు.

ఇతి ద్వాదశః ఖండః

## అథ త్రయోదశః ఖండః

**అథాప్యుదాహరంతి**

**యథా హి తూలమైషీకమ్ అగ్నౌ ప్రోతం ప్రదీప్యతే।**

**తద్వత్సర్వాణి పాపాని దహ్యంతే హ్యాత్మయాజినః॥** 1

ప్రత్తి, ఎండినగడ్డి అగ్నిలో వేసినచో ఏ విధముగా దగ్ధమగునో అట్లే ప్రాణాహుతులను ప్రతిదినము తీసికొనువాని పాపములన్నియు దగ్ధమగును.

**కేవలాఘో భవతి కేవలాదీ। మోఘమన్నం విందతే ఇతి॥** 2

ఇది వేద మంత్రమే. భగవంతునికి నివేదింపక తోటి ప్రాణికి పెట్టక తన కడుపుకు మాత్రము తినువాడు వ్యర్థముగా భుజించువాడగును పైగా అతడు పాపమును మాత్రము సంపాదించుకొనును

**స ఏవమేవాహరహస్సాయం ప్రాతర్జుహుయాత్॥** 3

అందువలన ప్రతి దినము రాత్రిపూట, పగటిపూట ప్రాణాహుతులను చేయవలెను.

**అద్భిర్వా సాయమ్॥** 4

ధనము లేనందువల్ల ఆహార పదార్థములను సమకూర్చుకొనలేనివాడు రాత్రిపూట జలముచేతనే ప్రాణాహుతులను చేయవలెను.

**అథాప్యుదాహరంతి**

**అగ్రే భోజయేదతిథీన్ అంతర్వత్నీరనంతరమ్।**

**బాలవృద్ధాంస్తథా దీనాన్ వ్యాధితాంశ్చ విశేషతః॥** 5

భోజన విషయమున ధర్మజ్ఞులిట్లు చెప్పుచున్నారు. గృహస్థు తొలుత అతిథులకు భోజనము పెట్టి, తరువాత గర్భిణీ స్త్రీలకు భోజనము పెట్టవలెను. తరువాత బాలురు, వృద్ధులు, దీనులు, రోగగ్రస్తులు మొదలగు వారికి భోజనము పెట్టవలెను.

**అదత్వా తు య ఏతేభ్యః పూర్వం భుంక్తే యథావిధి।**

**భుజ్యమానో న జానాతి న స భుంక్తే స భుజ్యతే॥** 6

పూర్వము పేర్కొన్నట్లు అతిథులకు, గర్భిణీ స్త్రీలకు, బాలురకు, వృద్ధులకు, ఇంకా ఇతరులకు భోజనము పెట్టక తాను మాత్రము భుజించువాడు ఆహారమును భుజింపక కర్మను అనుభవించువాడగుచున్నాడు.

**పితృ దైవత భృత్యానాం మాతాపిత్రోర్గురోస్తథా।**

**వాగ్యతో విఘసమశ్నీయాత్ ఏవం ధర్మో విధీయతే॥** 7

అట్లే పితరులకు, దేవతలకు, భృత్యులకు తల్లిదండ్రులకు, గురువునకు భోజనము పెట్టిన తరువాత గృహస్థు మౌనముగా భోజనము చేయవలెను. ఇదే గృహస్థ ధర్మము.

**అథాప్యుదాహంతి**

**అష్టౌ గ్రాసా మునేర్భక్ష్యాః షోడశారణ్యావాసినః।**

**ద్వాత్రింశతం గృహస్థస్య అపరిమితం బ్రహ్మచారిణః॥** 8

భోజన విషయమున పెద్దలిట్లు చెప్పుదురు. సన్యాసి ఎనిమిది ముద్దలను, (కబళములను) వానప్రస్థుడు పదునారు ముద్దలను, గృహస్థు ముప్పది రెండు ముద్దలను తినవలెను. కాని బ్రహ్మచారి మాత్రము అమితముగా తినవచ్చును.

**ఆహితాగ్నిరనడ్వాంశ్చ బ్రహ్మచారీ చ తే త్రయః।**

**అశ్నంత ఏవ సిద్ధ్యంతి నైషాం సిద్ధిరనశ్నతామ్॥** 9

ఆహితాగ్ని, బ్రహ్మచారి, వృషభము యధేచ్ఛగా తిన్నప్పుడే కర్మచేయగలుగుదురు. వారు ఉపవాసమున్నచో చేయవలసిన కార్యములను చేయజాలరు.

**గృహస్థో బ్రహ్మచారీ వా యోఽనశ్నంస్తు తపశ్చరేత్।**

**ప్రాణాగ్నిహోత్ర లోపేన హ్యవకీర్ణీ భవేత్తు సః॥** 10

గృహస్థుడుగాని బ్రహ్మచారి గాని ఉపవాసముండి తపస్సు చేసినచో ప్రాణాహుతులకు లోపము సంభవించును కావున ఉపవాసముండి తపస్సు చేయరాదు. పైగా అట్లు ఉపవాసమున్నచో అవకీర్ణి ప్రాయశ్చిత్తమును చేసికొనవలెను.

**అన్యత్ర ప్రాయశ్చిత్తాత్ ప్రాయశ్చిత్తే తదేవ విధానమ్॥** 11

ఉపవాసమున్నచో ప్రాయశ్చిత్తము చేసికొనవలెనని చెప్పినచోట తప్ప ఇతర ప్రాయశ్చిత్తములందు ఉపవాసముండవచ్చును.

**అథాప్యుదాహరంతి**

**అంతరా ప్రాతరాశం చ సాయమాశం తథైవ చ।**

**సదోపవాసీ భవతి యో న భుంక్తే కదాచన॥** 12

ఈ విషయమున ధర్మజ్ఞులిట్లు పేర్కొనుచున్నారు. మధ్యాహ్న భోజనమునకు రాత్రి భోజనమునకు మధ్య ఏమియు తినకుండ ఉండువాడు సదోపవాసి యనబడును.

**ప్రాణాగ్నిహోత్ర మంత్రాంస్తు నిరుద్ధే భోజనే జపేత్।**

**త్రేతాగ్నిహోత్రమంత్రాంస్తు ద్రవ్యాలాభే యథా జపేత్॥** 13

ప్రతి దినము చేయవలసిన యజ్ఞ ద్రవ్యములు లభింపని సమయమున ఆపత్కాల ధర్మముగా త్రేతాగ్నిహోత్ర మంత్రములనెట్లు చదువునో అట్లే వ్యాధి మొదలైన కారణములవలన భోజనము చేయలేని సమయమున ప్రాణాహుతి మంత్రములను చదువవలెను.

**ఏవమేవాఽచరన్ బ్రహ్మభూయాయ కల్పతే**

**బ్రహ్మభూయాయ కల్పత ఇతి॥** 14

ఈ విధముగా ఆచరించువాడు ఉత్తమలోకములను పొందును.

అధ్యాయసమాప్తి సూచకముగా పదావృత్తి చేయబడినది.

ఇతి త్రయోదశః ఖండః

## అథ చతుర్దశః ఖండః

**పిత్ర్యమాయుష్యం స్వర్గ్యం ప్రశస్యం పుష్టికర్మ చ॥** 1

పితృదేవతలకు శ్రాద్ధము పెట్టినచో దీర్ఘాయుస్సు, స్వర్గము, కీర్తి, సమృద్ధి కలుగును.

**త్రిమధుః త్రిణాచికేతః త్రిసుపర్ణః పంచాగ్నిః షడంగవిత్**

**శీర్షకో జ్యేష్ఠ సామికః స్నాతక ఇతి పంక్తిపావనాః॥** 2

మధు వాతా ఋతాయతే మొదలగు మూడు మధు మంత్రములను, నాచికేత వ్రతమును మూడు మార్లు ఆచరించినవాడు, బ్రహ్మమేతు మామ్ మొదలైన త్రిసుపర్ణమంత్రములనధ్యయనము చేయువాడు, పంచాగ్నులమధ్య తపస్సు చేసినవాడు, ఆరు వేదాంగములు అధ్యయనము చేసినవాడు, అధర్వవేదమునందలి శిరోవ్రతమునాచరించినవాడు, మూర్ధానం దివో అను జ్యేష్ఠ సామను అధ్యయనము చేసినవాడు, మరియు స్నాతకుడు, వీరందరు పంక్తిని పావనము చేయుదురు.

**తదభావే రహస్యవిత్॥** 3

పైన పేర్కొన్నవారు లభింపని సమయమున రహస్య విద్య అనబడు ఆరణ్యక భాగమును అర్థపూర్వకముగా అధ్యయనము చేసినవాడు పంక్తి పావనుడు. అనగా శ్రాద్ధమున భోక్తగా అర్హుడు.

**ఋచో యజూంషి సామానీతి శ్రాద్ధస్య మహిమా**

**తస్మాదేవం విదం సపిండమప్యాశయేత్॥** 4

ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదములకు చెందిన మంత్రములు శ్రాద్ధమును మహిమాన్వితముగా చేయును కావున ఈ వేదమంత్రముల నధ్యయనము చేసినవాడు సపిండుడైనను, శ్రాద్ధమున భోక్తగా నియమింపవలెను.

**రక్షోఘ్నాని చ సామాని స్వధావంతి యజూంషి చ।**

**మధ్వృచోऽథ పవిత్రాణి శ్రావయేదాశయంచనైః॥** 5

శ్రాద్ధమున బ్రాహ్మణులు భోజనము చేయుచున్నప్పుడు "అగ్నే రక్షహాణో అంహస ఇత్యాది రక్షోఘ్న మంత్రములు సామాయ పితృపీతాయ స్వధా నమః ఇత్యాది మంత్రములు, లేక పవమానస్సువర్జనః ఇత్యాది పవిత్రీకరణ మంత్రములను శ్రాద్ధకర్త మెల్లగా వారికి వినిపింపవలెను.

**చరణవతోఽనూచానాన్ యోని గోత్ర మంత్రాసంబంధాన్**

**శుచీన్ మంత్రవతః త్ర్యవరాన్ అయుజః పూర్వేద్యుః**

**ప్రాతరేవ వా నిమంత్ర్య సదర్భోపక్లప్తేష్వాసనేషు**

**ప్రాఙ్ముఖానుపవేశయతి ఉదఙ్ముఖాన్వా॥** **6**

చరణమనగా ఆచారము. సదాచార సంపన్నులు, వేదాంగముల నధ్యయనము చేసినవారు, శ్రాద్ధకర్తతో తల్లివైపు, తండ్రివైపు, ఆచార్యునివైపు సంబంధము లేనివారు, పవిత్రముగా ఉండువారు, వేదములనభ్యసించినవారు అగు బ్రాహ్మణులను భోక్తలుగా నియమింపవలెను. వీరు బేసి సంఖ్యలో ముగ్గురికంటె మించరాదు. వారిని శ్రాద్ధమునకు ముందు దినమున కాని, శ్రాద్ధమునాడు ప్రాతః కాలమునగాని నిమంత్రణ చేయవలెను. వారిని శ్రాద్ధమున దర్భాసనములపై తూర్పునకు లేక ఉత్తరమునకు అభిముఖముగా నుండునట్లు కూర్చొనబెట్టవలయును.

**అథైనాంస్తిలమిశ్రా అపః ప్రతిగ్రాహ్య గంధైర్మాల్యైశ్చ**

**అలంకృత్య అగ్నౌ కరిష్యామీత్యనుజ్ఞాతోఽగ్నిముపసమాధాయ**

**సంపరిస్తీర్య అగ్నిముఖాత్ కృత్వా ఆజ్యస్యైవ తిస్ర**

**ఆహుతీర్జుహోతి – సోమాయ పితృపీతాయ స్వధా నమస్స్వాహా।**

**యమాయాంగిరస్వతే పితృమతే స్వధా నమస్స్వాహా।**

**అగ్నయే కవ్యవాహనాయ స్విష్టకృతే స్వధా నమస్స్వాహేతి॥** **7**

తరువాత వారికి నూవులతోనున్న నీరు చేతికిచ్చి గంధము, పుష్పమాలలు మొదలగు వానిచే అలంకరింపవలెను. తరువాత అగ్నిలో హోమము చేయుదుననగా భోక్తలు తమ సమ్మతిని తెలిపిన తరువాతో అగ్నిముఖము వరకు చేసి "సోమాయ పితృపీతాయ" ఇత్యాది మంత్రములచే మూడు ఆజ్యాహుతులను చేయవలెను.

**తచ్ఛేషేణాన్నమభిఘార్య అన్నస్త్యైతా ఏవ తిస్ర ఆహుతీర్జుహుయాత్॥8**

ఆజ్యాహుతులు చేసిన తరువాత మిగిలిన నేయిని అన్నముపై వేసి ఆ అన్నము చేత పై మంత్రములనే చదువుచు మూడు అన్నాహుతులను చేయవలెను.

**వయసాం పిండం దద్యాత్॥ 9**

ఇచ్చట వయః (పక్షి) శబ్దము కాకులు అను అర్ధమున వాడబడినది. కావున కాకులకు పిండము పెట్టవలయును.

**వయసాం హి పితరః ప్రతిమయా చరంతీతి విజ్ఞాయతే॥ 10**

వేదమున పితృదేవతలు కాకుల రూపమున సంచరింతురని చెప్పబడినది.

**అథేతరత్ సాంగుష్ఠేన పాణినాఽభిమృశతి॥ 11**

కాకుల పెట్టిన పిండముకాక భోక్తలకు పెట్టిన అన్నమును భోక్త ఐన బ్రాహ్మణుని కరాంగుష్ఠమును తన చేతిచే పట్టుకొని ముట్టింపవలెను.

**పృథివీ సమం తస్యతేఽ గ్నిరుపద్రష్టర్చస్తే మహిమా**

**దత్తస్యాప్రమాదాయ పృథివీ తే పాత్రం ద్యౌరపిధానం**

**బ్రాహ్మణస్త్వా ముఖే జుహోమి బ్రాహ్మణానాం త్వా**

**విద్యావతాం ప్రాణాపానయోర్జుహోమ్యక్షితమసి**

**మా పితౄణాం క్షేష్ఠా అముత్రాముష్మిన్ లోక ఇతి।**

**అంతరిక్ష సమం తస్య తే వాయురుపశ్రోతా యజూంషి తే**

**మహిమా దత్తస్యాప్రమాదాయ పృథినీ తే పాత్రం**

**ద్యౌరపిధానం బ్రాహ్మణస్త్వా ముఖే జుహోమి**

**బ్రాహ్మణానాం త్వా విద్యావతాం ప్రాణాపానయోర్జుహోమి**

**అక్షితమ.. మా పితామహోనాం క్షేష్ఠా అముత్రాముష్మిన్**

**లోక ఇతి। ద్యౌసమం తస్య త ఆదిత్యోఽనుఖ్యాతా సామాని**

**తే మహిమా దత్తస్యాప్రమాదాయ పృథివీ తే పాత్రం**

**ద్యౌరపిధానం బ్రాహ్మణస్త్వా ముఖే జుహోమి**

**బ్రాహ్మణానాం త్వా విద్యావతాం ప్రాణాపానయోః**

**జుహోమ్యక్షితమసి మా ప్రపితామహానాం క్షేష్ఠా**

**అముత్రాముష్మిన్ లోక ఇతి॥** **12**

ఈ మంత్రములను చదువుచు భోజన ద్రవ్యములను భోక్తల అంగుష్ఠముచే ముట్టింపవలెను.

ఇతి చతుర్దశః ఖండః

అథ పంచదశః ఖండః

**అథ వై భవతి ॥** **1**

**అగ్నౌ కరణశేషేణ తదన్నమభిఘారయేత్।**

**నిరంగుష్ఠం తు యద్దత్తం న తత్ప్రీణాతి వై పితౄన్॥** **2**

అగ్నిలో హోమము చేసిన తరువాత మిగిలిన నేయిచేత శ్రాద్ధాన్నమును అభిఘారము చేయవలెను. అట్లే భోక్తయొక్క అంగుష్ఠ స్పర్శలేక పెట్టిన భోజనము పితృ దేవతలను సంతోషపెట్టదు.

**ఉభయోశ్శాఖయోర్ముక్తం పితృభ్యోఽన్నం నివేదితమ్।**

**తదంతరముపాసంతేఽసురా వై దుష్టచేతసః॥** **3**

శ్రాద్ధ కర్త మరియు శ్రాద్ధ భోక్త ఈ ఇరువురి హస్త స్పర్శలేక పితృదేవతలకు (శ్రాద్ధ బ్రాహ్మణులకు) పెట్టిన ఆహారమును దుష్టులైన రాక్షసులు మధ్యలో ప్రవేశించి అరగింతురు కావున శ్రాద్ధ కర్త మరియు భోక్తల హస్త స్పర్శ శ్రాద్ధాన్నమునకు తప్పక కావలెను.

**యాతుధానాః పిశాచాశ్చ ప్రతిలుంపంతి తద్ధవిః।**

**తిలదానేహ్యదాయాదాస్తథా క్రోధవశేఽసురాః॥** 4

భోజన పాత్రనుంచు స్థలమున భోక్తయొక్క ఆసనముపై నూవులు చల్లినచో ఆ భోజనమును పిశాచములు, రాక్షసులు ముట్టజాలరు. అట్లే శ్రాద్ధ సమయమున శ్రాద్ధ కర్త కోపించినచో మాత్రము ఆ భోజనము రాక్షసులవశమగును.

**కాషాయవాసా యాన్కురుతే జపహోమప్రతిగ్రహాన్।**

**న తద్దేవగమం భవతి హవ్యకవ్యేషు తద్ధవిః॥** 5

కషాయ రంగున్న వస్త్రము ధరించి జపము, హోమము, దానస్వీకారము చేయరాదు. అట్లు చేసినచో అవి దేవతలకు చెందవు. అట్లే పితృకార్యములందు, దేవకార్యములందు ఇచ్చిన హవిస్సు పితృదేవతలకు, దేవతలకు చెందదు.

**యచ్చ దత్తమనంగుష్ఠం యచ్చైవ ప్రతిగృహ్యతే।**

**ఆచామతి చ యస్తిష్ఠన్ న స తేన సమృధ్యతే॥** 6

అంగుష్ఠ స్పర్శ లేకుండా ఇచ్చిన దానము, అట్లే స్వీకరించిన దానము, నిలబడి చేసిన ఆచమనము, ఫలితమునీయవు.

**ఆద్యంతయోరపాం ప్రదానం సర్వత్ర॥** 7

శ్రద్ధగా దానము చేయువాడు దానమునకు ముందు, మరియు తరువాత జలస్పర్శ తప్పక చేయవలెను.

**జయప్రభృతి యధా విధానమ్॥** 8

జయాది హోమములను యదావిధిగా శ్రాద్ధమున చేయవలెను.

**శేషముక్తమష్టకహోమే॥** 9

మిగిలిన హోమముల వివరణము అష్టక హోమముల సందర్భమున చెప్పబడినది

**ద్వౌ దేవే పితృకార్యే త్రీన్ ఏకైకముభయత్ర వా।**

**భోజయేత్సుసమృద్ధోఽపి న ప్రసజ్జేత విస్తరే॥** 10

శ్రాద్ధమున విశ్వేదేవతా స్థానమున ఇద్దరిని, పితృస్థానమున ముగ్గురిని భోక్తలుగా నియమింపవలెను. లేనిచో రెండు చోట్ల ఒక్కొక్కరినే నియమింపవలెను. కాని తాను ధనవంతుడైనందువలన ఎక్కువ మంది బ్రాహ్మణులను నియోగించు శక్తి ఉన్నను ఎక్కువమందిని మాత్రము శ్రాద్ధమున నియోగింపరాదు.

**సత్క్రియాం దేశకాలౌ చ శౌచం బ్రాహ్మణ సంపదమ్।**

**పంచైతాన్ విస్తరో హంతి తస్మాత్తం పరివర్జయేత్॥** 11

శ్రాద్ధమున అధిక సంఖ్యలో బ్రాహ్మణులను నియోగించినచో శ్రాద్ధకర్త చేసిన సత్కారము, దేశము మరియు సమయముల ఔచిత్యము, పవిత్రత, యోగ్యులైన బ్రాహ్మణులను నియోగించుట వలన కలిగి ఫలితము ఇవన్నియు నాశనమగును కావున అధిక సంఖ్యలో బ్రాహ్మణులను నియోగింపరాదు.

**ఉరస్తః పితరస్తస్య వామతశ్చ పితామహః।**

**దక్షిణతః ప్రపితామహః పృష్ఠతః పిండతర్కకాః॥** 12

శ్రాద్ధము చేయునప్పుడు శ్రాద్ధకర్తకు ఎదురుగా పితరులుందురు ఎడమ వైపున పితామహుడుండును. కుడివైపున ప్రపితామహుడుండును. అట్లే అతని వెనక పిండమును కోరు మాతామహుడు మొదలగువారుందురు.

ఇతి పంచదశః ఖండః

## అథ షోడశః ఖండః

**ప్రజాకామస్య ఉపదేశః ॥** 1

ఉత్తమ సంతానము కావలెననువాడు ఈ నియముల పాటింపవలెను.

**ప్రజననిమిత్తా సమాఖ్యేత్యశ్వినావూచతుః॥** 2

సంతానమువలననే కీర్తి లభించునని ఆశ్వినీ దేవతలు తెలిపిరి.

ఆయుషా తపసా యుక్తః స్వాధ్యాయేజ్యాపరాయణః।
ప్రజాముత్పాదయేద్యుక్తః స్వే స్వే వంశే జితేంద్రియః ॥ 3

చక్కని ఆయుస్సు కలిగి, తపస్సు చేయువాడు, వేదాధ్యయన సంపన్నుడు, నిరంతరము యాగములుచేయువాడు, తన ఇంద్రియములను జయించినవాడు అగు మానవుడు విధిగా తన భార్యయందు సంతానమును పొందవలెను.

బ్రాహ్మణస్యర్ణసంయోగస్త్రిభిర్భవతి జన్మతః।
తాని ముచ్యాఽఽత్మవాన్భవతి విముక్తో ధర్మసంశయాత్॥ 4

బ్రాహ్మణుడు మూడు ఋణములతో జన్మించుచున్నాడు. ఆ ఋణములను తొలగించుకొని అతడు స్వతంత్రుడగును. పైగా ధర్మసంశయమునుండి కూడ విముక్తుడగుచున్నాడు.

స్వాధ్యాయేన ఋషీన్పూజ్య సోమేన చ పురందరమ్ ।
ప్రజయా చ పితౄన్పూర్వాన్ అనృణో దివి మోదతే ॥ 5

బ్రాహ్మణుడు వేదాధ్యయనమువలన ఋషి ఋణమును సోమాదియాగముల వలన దేవతా ఋణమును, సంతానమువలన పితృఋణమును తీర్చుకొని ఋణరహితుడై స్వర్గసుఖమును పొందుచున్నాడు.

పుత్రేణ లోకాన్జయతి పౌత్రేణాఽఽమృతమశ్నుతే।
అథ పుత్రస్య పౌత్రేణ నాకమేవాధిరోహతి ॥ 6

అతడు పుత్రుని వలన ఉత్తమలోకములను, పౌత్రుని వలన అమృతమును పుత్రుని పౌత్రుని వలన స్వర్గమునకంటే ఉన్నతమైన లోకమును పొందుచున్నాడు.

విజ్ఞాయతే చ-జాయమానో వై బ్రాహ్మణస్త్రిభిర్ ఋణవా
జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా
పితృభ్య ఇతి । ఏవమృణసంయోగం వేదో దర్శయతి ॥ 7

బ్రాహ్మణుడు పుట్టగానే మూడు ఋణములతో పుట్టుచున్నాడు. బ్రహ్మచర్య వ్రతము చక్కగా అనుష్ఠించినందువలన ఋషిఋణమును, యాగములచే దేవతాఋణమును, సంతానముచే పితృఋణమును, తీర్చుకొనుచున్నాడని వేదము తెలుపుచున్నది. ఈ విధముగా బ్రాహ్మణునకు పుట్టుకతోనే ఋణములుండునని వేదమే తెల్పుచున్నది.

**సత్పుత్రముత్పాద్య ఆత్మానం తారయతి ॥** 8

సత్పుత్రుని కన్నందువలన తాను గొప్పలోకములను పొందును.

**సప్తావరాన్ సప్తపూర్వాన్ షడన్యానాత్మసప్తమాన్ ।**
**సత్పుత్రమధిగచ్ఛానః తారయత్యేనసో భయాత్ ॥** 9

సత్పుత్రుని పొందినవాడు తనకు పూర్వమున్న పదితరములను, తరువాతి పది తరములను తనను ఉత్తమలోకములకు చేర్చును. లేక ముందు ఏడు తరములు తరువాత ఏడు తరములు, తాను ,అట్లే ముందుమూడు తరములు తరువాత మూడు తరములు తాను,ఇట్లు ఇరువదియొక్క తరములను,పదునైదు తరములను, లేక ఏడుతరములను ఉద్ధరించును.

**తస్మాత్ప్రజా సంతానముత్పాద్య ఫలం ప్రాప్నోతి ॥** 10

అందువలన పుత్రునిగని సత్ఫలితమును పొందుచున్నాడు

**తస్మాద్యత్నవాన్ ప్రజాముత్పాదయేత్॥** 11

అందువలన ప్రయత్నించి పుత్రుని పొందవలెను.

**ఔషధ మంత్ర సంయోగేన ॥** 12

పుత్రసంతానముకొరకు ఔషధములను వాడవచ్చును.సంతానసిద్ధిలో ఉన్న విఘ్నములను తొలగించుకొనుటకు మంత్రములయొక్క సహాయమును తీసికొనవచ్చును.

**తస్యోపదేశః శ్రుతిసామాన్యేనోపదిశ్యతే ॥** 13

పుత్రులను, ఔషధములు మంత్రములవలన పొందవచ్చునని వేదమే ఉపదేశించుచున్నది.

**సర్వవర్ణేభ్యః ఫలత్వాదితి ఫలత్వాదితి ॥** 14

సత్పుత్రుడు అన్ని వర్ణములవారికిని మేలు కలిగించును.

అధ్యాయసమాప్తి సూచకముగా ఇచ్చట పదావృత్తి చేయబడినది.

ఇతి షోడశః ఖండః

అథ సప్తదశః ఖండః

**అథాతస్సన్న్యాసవిధిం వ్యాఖ్యాస్యామః ॥** 1

ఇక సన్న్యాసి అనుసరింపవలసిన విధులను వివరింతును.

**సోఽత ఏవ బ్రహ్మచర్యవాన్ ప్రవ్రజతీత్యేకేషామ్ ॥** 2

బ్రహ్మచర్యవ్రతమును చక్కగా అనుష్ఠించినవాడు, బ్రహ్మచర్యమునుండియే సన్న్యాసమును స్వీకరించుచున్నాడని కొందరాచార్యులందురు. ప్రవ్రజనమనగా వెనకకు తిరిగి రాకుండ దీక్షను స్వీకరించుట.

**అథ శాలీన యాయవరాణామ్ అనపత్యానామ్॥** 3

మరికొందరు సంతానము లేని శాలీనులు యాయవరులు (గృహస్థులు) మాత్రమే సన్న్యాస దీక్షను తీసికొనవలెనని అందురు.

**విధురో వా ॥** 4

భార్య చనిపోయినవానిని విధురుడందురు. అనగా భార్య చనిపోయిన తరువాతనైనా సన్న్యాసదీక్ష తీసికొనవచ్చునని అందురు.

**ప్రజాః స్వధర్మే ప్రతిష్ఠాప్య వా ।** 5

లేనిచో తన సంతానమును యోగ్యులనుగా చేసిన తరువాతనైనా సన్న్యాసమును స్వీకరింపవచ్చును.

**సప్తత్యా ఊర్ధ్వం సన్న్యాసముపదిశంతి ॥** 6

మరికొందరు డెబ్బది సంవత్సరముల వృద్ధుడైన తరువాత సన్న్యాసమును తీసికొనవచ్చునని అందురు.

**వనప్రస్థస్య వా కర్మవిరామే ॥** 7

వానప్రస్థాశ్రమము స్వీకరించి తన కర్మలనన్నిటిని పూర్తి చేసిన తరువాత సన్న్యాసాశ్రమమును తీసికొనవచ్చునని మరికొందరందురు.

**ఏష నిత్యో మహిమా బ్రాహ్మణస్య న కర్మణా**
**వర్ధతే నో కనీయాన్ । తస్యైవ్యాత్మా పదవిత్తం**
**విదిత్వా న కర్మణా లిప్యతే పాపకేన ॥** 8

బ్రాహ్మణునకు సన్న్యాసము నిత్యము. అది మహిమాన్వితమైనది. సన్న్యాసి వేదోక్త కర్మలు చేసినందువలన కీర్తిగాని, చేయనందువలన అపకీర్తిగాని, కలుగదు.

అతడు ఆత్మజ్ఞానమును సంపాదించుకొనినందువలన కర్మ బంధములను, పాపములను దూరము చేసికొనవచ్చును.

**అపునర్భవం నయతీతి నిత్యః ॥** 9

పై సూత్రమున నిత్యశబ్దమునకు పునర్జన్మ కలుగకుండ చేయునది అని అర్థము.

**మహదేనం గమయతీతి మహిమా ॥** 10

అట్లే మహిమయనగా ఉన్నత స్థానమును కలిగించునది యని అర్థము.

**కేశ శ్మశ్రు లోమనఖాని వాపయిత్వా ఉపకల్పయతే॥** 11

సన్న్యాసము తీసికొనుటకు ముందు గడ్డము వెంట్రుకలు, గోళ్ళు తీయించుకొనవలెను.

**యష్టయశ్శిక్యం జలపవిత్రం కమండలుం పాత్రమితి॥** 12

మూడు దండములు, భిక్షాపాత్రము పెట్టుకొను ఉట్టి, నీటిని వడగట్టు గుడ్డ, కమండలువు, భిక్షాపాత్రము, పాదుకలు తప్పక ఉండవలెను.

**ఏతత్సమాదాయ గ్రామాంతే గ్రామసీమాంతే అగ్న్యగారే**
**వాఽఽజ్యం పయో దధీతి త్రివృత్ప్రాశ్య ఉపవసేదపో వా।** 13

అతడు దండములు మొదలగు వానిని తీసికొని, గ్రామము చివర లేక ఊరి పొలిమేర దగ్గర, లేక అగ్న్యాధానము చేసిన చోట, (ఆవు) నెయ్యి, పాలు, పెరుగు అనుమూడింటిని కలిపి పుచ్చుకొని ఉపవాసముండవలెను. లేక ఉపవాస సమయమున నీరైనను తీసికొనవచ్చును.

**ఓం భూస్సావిత్రీం ప్రవిశామి తత్సవితుర్వరేణ్యమ్।**
**ఓం భువస్సావిత్రీం ప్రవిశామి భర్గో దేవస్య ధీమహి। ఓగ్ం**
**సువస్సావిత్రీం ప్రవిశామి ధియోయోనః ప్రచోదయాదితి।**
**పచ్ఛోఽర్థశస్తతస్సమస్తయా చ వ్యస్తయా చ ॥** 14

పాలు పెరుగు మొదలగు వానిని ప్రాశనము చేయునప్పుడు ఈ మంత్రమును పైన పేర్కొన్నట్లు ఏ పాదమునకాపాదమును, మరియు పూర్వార్థము ఉత్తరార్థములను తరువాత పూర్తి మంత్రమును కలిపి, మరియు విడివిడిగాను చదువవలెను.

**అశ్రమాదాశ్రమముపనీయ బ్రహ్మపూతో భవతీతి విజ్ఞాయతే ॥** 15

బ్రహ్మచర్యాది ఆశ్రమమునుండి సన్యాసాశ్రమమును స్వీకరించినవాడు పరమ పవిత్రుడగునని తెలియుచున్నది.

**అథాప్యుదాహరంతి:-**

**ఆశ్రమాదాశ్రమం గత్వా హుతహోమో జితేంద్రియః**
**భిక్షా బలి పరిశ్రాంతః పశ్చాద్భవతి భిక్షుకః** 16

హోమములను చేసి, ఇంద్రియములను జయించినవాడు భిక్ష మరియు బలికర్మవలన (బ్రహ్మచర్య, గృహస్థాశ్రమముల వలన) అలసిపోయి, ఒక ఆశ్రమము నుండి (బ్రహ్మచర్య గృహస్థ ఆశ్రమములనుండి)సన్న్యాసాశ్రమము స్వీకరించి సన్న్యాసియగుచున్నాడు.

**స ఏష భిక్షురానంత్యాయ ॥** 17

ఈ విధముగా సన్న్యాసియైనచో అతనికి మోక్షము లభించును.

**పురాఽఽదిత్యస్యాస్తమయాద్గార్హపత్యముపసమాధాయ**
**అన్వాహార్యపచనమాహృత్య జ్వలంతమావహహనీయమ్**
**ఉద్ధృత్య గార్హపత్యే ఆజ్యం విలాప్య ఉత్పూయ స్రుచి**
**చతుర్గృహీతం గృహీత్వా సమిద్వత్యాఽఽహవనీయే**
**పూర్ణాహుతిం జుహోతి ఓం స్వాహేతి ॥** 18

సన్న్యాసము తీసికొనువాడు సూర్యాస్తమనమునకు ముందు గార్హపత్యాగ్నిని ఉపసమాధానము చేసి, అచ్చటికి అహవనీయాగ్నిని తెచ్చి జ్వలింపజేసి, దానిని గార్హపత్యాగ్నిస్థానమున ఉంచవలెను. తరువాత అజ్యవిలాపమును తరువాత ఉత్పవనమును చేసి స్రుక్కునందు నేతిని నాలుగు పర్యాయములు (ఏకం, ద్వి, త్రీణి, చత్వారి అనుచు) తీసికొని 'ఓం స్వాహా' అనుచు సమిధను స్రుక్కు పైన ఉంచి పూర్ణాహుతి హోమమును చేయవలెను.

**ఏతద్బ్రహ్మాన్వధానమితి విజ్ఞాయతే ॥** 19

ఈ క్రియను బ్రహ్మాన్వధానమని అందురు.

**అథ సాయం హుతేஉగ్నిహోత్ర ఉత్తరేణ గార్హపత్యం తృణాని సంస్తీర్య తేషు ద్వంద్వం న్యంచి పాత్రాణి దర్భాన్ సంస్తీర్య తేషు కృష్ణాజినం చాంతర్ధాయ ఏతాం రాత్రిం జాగర్తి॥** 20

ఈ విధముగా సాయంకాలమున హోమము చేసిన తరువాత గార్హపత్యాగ్నికి ఎడమవైపున ~ర్భలను పరవవలెను స్రుక్స్రువాది పాత్రలను, జతగా (రెండేసి) బోర్లించు ~దనము చేయవలెను. (పెట్టవలెను) తరువాత ఆహవనీయాగ్నికి కుడివైపున ఉన్న బ్రహ్మస్థానమున దర్భలను పరచి, ఆదర్భలపై కృష్ణాజినమును కప్పి, ఆ రాత్రిపూట అంతయు మేల్కొనియే యుండవలెను

**య ఏవం విద్వాన్ బ్రహ్మ రాత్రిముపోష్య అగ్నీన్ సమారోప్య ప్రమీయతే సర్వం పాప్మానం తరతి తరతి బ్రహ్మహత్యామ్ ॥** 21

జ్ఞాన సంపన్నుడైనవాడు ఈ విధముగా ఆ బ్రహ్మరాత్రియందు ఉపవాసముండి తనయందు అగ్నులను ఆరోవణము చేసికొన్నట్లు భావించినచో బ్రహ్మహత్యాపాపముతో సహ సమస్తపాపములను పోగొట్టుకొనుచున్నాడు

**అథ బ్రాహ్మే ముహూర్త ఉత్థాయ కాలే ఏవ ప్రాతరగ్నిహోత్రం జహుయాత్ ॥** 22

పైన పేర్కొన్నట్లు బ్రహ్మరాత్రియందు ఉపవాసముండి మరుసటి దినము బ్రాహ్మముహూర్తమున నిద్ర లేచి కాలానుగుణముగా ప్రాతఃకాల హోమముచేయవలెను బ్రాహ్మముహూర్తమనగ రాత్రియందు చివరి ఐదు ఘడియలు. కొందరు ఉషఃకాలము మొదలు కొని సూర్యోదయమువరకని అందురు

**అథపృష్ట్యాస్తీర్త్వా అపః ప్రణీయ వైశ్వానరం ద్వాదశ కపాలం నిర్వపతి సా ప్రపిద్ధేష్టిస్సంతిష్ఠతే ॥** 23

ప్రాతః సవనము తరువాత పృష్ట్యా? అను వేది యొక్క భాగమునుండి నీరు తెచ్చి ద్వాదశ కపాలహోమమును (ఆహోమమున పన్నెండు మూకుళ్ళు ఉండును ) చేయవలెను ప్రసిద్ధమైన ఈ ఇష్టియే పూర్వాశ్రమమున చివరి హోమమగుచున్నది.

**ఆహవనీయేఽగ్నిహోత్ర పాత్రాణి ప్రక్షిపేత్**

**అమృణ్మయాన్యనాయసాని ॥** 24

ఆ హోమాగ్నియందు మట్టివి, ఇనుపవి కాని ఇతరములైన అగ్ని హోత్ర పాత్రలన్నిటిని పడవేయవలెను.

**గార్హపత్యే అరణీ భవంతం నస్సమనసావితి ॥** 25

భవంతం నస్సమనసావను మంత్రమును చదువుచు గార్హపత్యాగ్నియందు అరణులను (హోమాగ్నిని పుట్టించు సాధనములను) పడవేయవలెను.

**అథాఽత్మన్యగ్నీన్సమారోపయతే యా తే అగ్నే**

**యజ్ఞియా తనూ"రితి త్రిస్త్రిరేకైకం సమాజిఘ్రతి ॥** 26

'యాతే అగ్నే యజ్ఞియా' అను మంత్రమును చదువుచు ఆహవనీయాగ్ని మొదలైన మూడగ్నులను ఒక్కొక్క దానిని వాసన చూచి ఆ అగ్నులను తనయందు ఆరోపించుకొనవలెను.

**అథాంతర్వేది తిష్ఠన్ 'ఓం భూర్భువస్సువః సంన్యస్తం**

**మయా సంన్యస్తం మయా సంన్యస్తం మయేతి**

**త్రిరుపాంశు ఉక్త్వా త్రిరుచ్చైః ॥** 27

అగ్నులను ఆత్మ సమారోపణము చేసికొన్న తరువాత యజ్ఞవేదిమధ్య నిలబడి "ఓం భూర్భువస్సువః సంన్యస్తం మయా" అని తక్కువ స్వరముతో మూడు మార్లు, పెద్ద గొంతుతో మూడుమార్లు పలుకవలెను.

**త్రిషత్యా హి దేవా ఇతి విజ్ఞాయతే ॥** 28

మూడు మార్లు పలికినదే సత్యమైన మాట అని దేవతలనుకొందురని వేదము తెలుపుచున్నది.

**అభయం సర్వభూతేభ్యో మత్తః ఇతి చాపాం**

**పూర్ణమంజలిం నినయతి ॥** 29

నావలన ఎవ్వరికిని భయముండదు అని పలుకుచు దోసిలిలో నీరు తీసికొని క్రింద పోయవలెను.

అథాప్యుదాహరంతి:-

**అభయం సర్వభూతేభ్యో దత్వా యశ్చరతే మునిః**
**న తస్య సర్వభూతేభ్యో భయం చాపి హ జాయతేతి ॥** 30

సమస్త ప్రాణులకు అభయమునిచ్చి సంచరించు సన్న్యాసికి ఏ ప్రాణియు కీడు కలిగించదు అని ధర్మజ్ఞులందురు.

**స వాచంయమో భవతి ॥** 31

తరువాత అతడు (వీలైనంతవరకు) మౌనముగా ఉండవలెను.

**'సఖా మే గోపాయేతి దండమాదత్తే' యదస్య పారే రజస ఇతి శిక్యం గృహ్ణాతి 'యేన దేవాః పవిత్రే' తి జలపవిత్రం గృహ్ణాతి 'యేన దేవా జ్యోతిషోర్ధ్వా ఉదాయన్ని'తి కమండలుం గృహ్ణాతి సప్తవ్యాహృతిభిః పాత్రం గృహ్ణాతి ॥** 32

తరువాత "సఖా మే గోపాయ" అను మంత్రము చదువుచు దండములను, "యదస్య పారే రజసః" అను మంత్రమును చదువుచు భిక్షాపాత్రనుంచు జోలెను?, (శిక్యము) యేన దేవాః పవిత్రేణ అను మంత్రమును చదువుచు నీటిని వడగట్టు వస్త్రమును, యేన దేవా జ్యోతిషోర్ధ్వా అను మంత్రమును చదువుచు కమండలువును, ఓం భూః ఓం భువః అను ఏడు వ్యాహృతులచే భిక్షాపాత్రను తీసికొనవలెను. ఇంతకు ముందు 12 వ సూత్రమున ఈ వస్తువులను గురించి చెప్పినను ఇచ్చట ఆయామంత్రములు తెలుపబడినవి.

**యష్టయశ్శిక్యం జలపవిత్రం కమండలుం పాత్రమిత్యే తత్సమాదాయ యత్రాపస్తద్గత్వా స్నాత్వా అప ఆచమ్య సురభిమత్యా అబ్లింగాభిః వారుణీభిః హిరణ్యవర్ణాభిః పావనీభిః ఇతి మార్జయిత్వా అంతర్జలగతో అఘమర్షణేన షోడశ ప్రాణాయామాన్ ధారయిత్వా ఉత్తీర్య వాసః పీడయిత్వా అన్యత్ ప్రయతం వాసః పరిధాయ అప ఆచమ్య ఓం భూర్భువస్సువరితి జలపవిత్రమాదాయ తర్పయతి - ఓం భూస్తర్పయామి ఓం భువ**

**స్తర్పయామి ఓం సువస్తర్పయామి ఓం మహస్తర్పయామి ఓం జనస్తర్పయామి ఓం తపస్తర్పయామి ఓం సత్యం తర్పయామీతి ॥** 33

సన్న్యాసి తాను నూతనముగా గ్రహించిన దండాదులను అన్నిటిని తీసికొని నదీ తీరమునకు పోయి అక్కడ స్నానము చేయవలెను. తరువాత తీరమునకు వచ్చి కూర్చొని ఆచమనముచేసి సురభి శబ్దమున్న దధిక్రావ్ణో ఇత్యాది మంత్రములచేత 'అప్' శబ్దమున్న 'అపోహిష్ఠామయోభువః' ఇత్యాది మంత్రములచేత వరుణ దేవతాకములైన 'ఇమంమేవరుణ' ఇత్యాది మంత్రములచేత "హిరణ్య వర్ణాశ్శుచయః పావకాః" ఇత్యాది మంత్రములచేత,ఏ పవమానసూక్త మంత్రములచేత, తనను ప్రోక్షించుకొనవలెను. తరువాత నీటిలోనికి పోయి అఘమర్షణ మంత్రములచేత పదునారు ప్రాణాయామములను చేయవలెను. తరువాత తీరమునకు వచ్చి ఉదికిన వస్త్రమును ధరించి, స్నానము చేసిన వస్త్రమును పిండి ఆరవేయవలెను. తరువాత మరల ఆచమనము చేసి 'ఓం భూర్భువస్సువః అనుచు నీటిని వడగట్టు గుడ్డను తీసికొనవలెను. అటు పిమ్మట ఓం భూస్తర్పయామి ఇత్యాది మంత్రములచే వడగట్టిన వస్త్రమునుండి వచ్చిన నీటిచేత తర్పణములను చేయవలెను.

పితృభ్యోఽఞ్జలిముపాదాయ ఓం భూః స్వధా ఓం భువః స్వధా ఓం సువః స్వధా ఓం భూర్భువస్సువర్మహర్నమ ఇతి ॥ 34

తరువాత సవ్యముగానే యజ్ఞోపవీతమును వేసికొని దోసిలిలో నీరు తీసికొని ఓం భూః స్వధా ఇత్యాది మంత్రముల చేత పితృతర్పణములను చేయవలెను. గోవిందస్వామి వ్రాసిన వ్యాఖ్యలో దేవవత్ అను పదము కన్పించుచున్నది. అందువలన సవ్యముగా ఈ తర్పణములను చేయవలెనని చెప్పబడినది.

**అథోదుత్యం చిత్రమితి ద్వాభ్యామాదిత్యముపతిష్ఠతే॥** 35

తరువాత ఉదుత్యం జాతవేదసం, చిత్రం దేవానాముదగాదనీకం అను రెండు మంత్రములచేత సూర్యుని నమస్కరింపవలెను.

**ఓమితి బ్రహ్మ బ్రహ్మ వా ఏష జ్యోతిః య ఏష జ్యోతిః య ఏష తర్పయత్యేష వేదా య ఏవ తర్పయతి వేద్యమేవ**

**ఏతద్య ఏష తర్పయతి ఏవమేవైష ఆత్మానం తర్పయతి**
**ఆత్మనే నమస్కరోత్యాత్మా బ్రహ్మాఽఽత్మా జ్యోతిః ॥** 36

ఓం కారము బ్రహ్మస్వరూపము. ఆ పరబ్రహ్మ జ్యోతిస్వరూపుడు. జ్యోతి స్వరూపుడే తర్పణము చేయుచున్నాడు. అట్లే తర్పణము చేయువాడు వేదరూపుడు ఇంకను తెలిసికొనతగిన వాడు కూడ అతడే. ఆ జ్యోతీ రూపుడు తనకే తర్పణము చేసికొనును. తనకే నమస్కారము చేసికొనును. అందువల్ల ఆ ఆత్మయే బ్రహ్మ. ఆ ఆత్మయే జ్యోతిస్సు. ఇట్లు ఆత్మను ఇచ్చట ప్రశంసించుచున్నాడు.

**సావిత్రీం సహస్రకృత్వ ఆవర్తయేచ్ఛతకృత్వోఽ**
**పరిమితకృత్వో వా॥** 37

సన్న్యాసి గాయత్రీ జపమును వేయిమార్లు లేక నూరు పర్యాయములు ఇంకను అపరిమితముగానైనను చేయవలెను.

**ఓం భూర్భువస్సువరితి పవిత్రమాదాయ అపో గృహ్ణాతి ॥**38

అతడు 'ఓం భూర్భువస్సువః' అనుచు నీటిని వడగట్టు గుడ్డ తీసికొని దాని ద్వారా నీటిని తీసికొనవలెను.

**న చాత ఊర్ధ్వమనుద్ధృతాభిరద్భిరపరిస్రుతాభిః**
**పరిపూతాభిర్వాఽఽచామేత్ ॥** 39

సన్న్యాసాశ్రమమును స్వీకరించిన నాటినుండి బావినుండి చేదిన నీటిని తీసికొనక, ప్రవహించుచున్న నీటిని జలపవిత్రముచే శుద్ధి చేసికొని ఆచమనము చేయవలెను.

**న చాత ఊర్ధ్వం శుక్లం వాసో ధారయేత్ ॥** 40

అట్లే ఆనాటి నుండి తెల్లని వస్త్రములనతడు ధరింపరాదు.

ఇతి సప్తదశః ఖండః

## అష్టాదశః ఖండః

**ఏకదండీ త్రిదండీ వా ॥** 1

సన్న్యాసి ఒక దండము లేక త్రి దండములను ధరింప వచ్చును. గడచిన ఖండములో 'యష్టయః' అని త్రిదండముల గురించి చెప్పినప్పటికీ యతి సర్వ

ధర్మములకు సన్నిహితుడు కావున దండసంఖ్యగురించి పట్టించుకొన రాదని ఈ సూత్రమువలన తెలియచున్నది.

**అథేమాని వ్రతాని భవంతి – అహింసా సత్యమస్తైన్యం**
**మైథునస్య చ వర్జనం త్యాగ ఇత్యేవ ॥** 2

సన్న్యాసి ఇతర ప్రాణులను హింసింపకుండుట, సత్యమును పలుకుట, ఇతరుల ధనమును వంచనతో సంపాదింపకుండుట, స్త్రీసంగమము చేయకుండుట, త్యాగము చేయుట అను వ్రతములను ఆచరింపవలెను.

**పంచైవోపవ్రతాని భవంతి – అక్రోధో గురు**
**శుశ్రూషాఽ ప్రమాదశ్శౌచమాహారశుద్ధిరితి ॥** 3

అట్లే ఎవ్వరిని కోపగింపకుండ ఉండుట, పెద్దవారిని గౌరవించుట , ఆలోచించి చేయుట, పవిత్రముగా ఉండుట, దుష్టమైన ఆహారమును తీసికొనక పోవుట, అను ఉపవ్రతములను కూడ ఆచరింపవలెను.

**అథ భైక్షచర్యా–బ్రాహ్మణానాం శాలీన**
**యాయవరాణామపవృత్తే వైశ్యదేవే భిక్షాం లిప్సేత ॥** 4

వైశ్వదేవమును పూర్తి చేసిన తరువాత బ్రాహ్మణ గృహస్థులయింటికి భిక్షకై పోవలెను.

**భవత్పూర్వాం ప్రచోదయాత్ ॥** 5

భిక్షను అడుగునప్పుడు తొలుత భవచ్ఛబ్దమును ఉపయోగింపవలెను.

**గోదోహనమాత్రమాకాంక్షేత్ ॥** 6

అతడు భిక్షకై గోదోహనకాలము మాత్రము ఎదురు చూడవలెను. ఆవు పాలను పితుకుటకు పట్టు సమయము గోదోహన కాలము.

**అథ భైక్షచర్యాదుపావృత్తః శుచౌ దేశే న్యస్య హస్తపాదాన్**
**ప్రక్షాళ్య ఆదిత్యస్యాగ్రే నివేదయేత్ ఉదుత్యం చిత్రమితి**
**బ్రహ్మణే నివేదయతే బ్రహ్మజజ్ఞానమితి ॥** 7

అతడు భిక్ష తీసుకొని ఆ భిక్షను పరిశుద్ధమైన ప్రదేశమున ఉంచవలెను. తరువాత కాళ్ళు చేతులు కడుగుకొని ఉదుత్యం జాతవేదసమ్ చిత్రం దేవానామ్

అనురెండు మంత్రములను చదువుచు సూర్యునకు'బ్రహ్మాజజ్ఞానమ్' అను మంత్రముచే పరబ్రహ్మకు తాను తెచ్చిన భిక్షను నివేదింపవలెను.

**విజ్ఞాయతే - ఆధాన ప్రభృతి యజమాన ఏవ అగ్నయో**
**భవంతి తస్య ప్రాణో గార్హపత్యః అపానోఽన్వాహార్యపచనః**
**వ్యాన ఆహవనీయః ఉదాన సమానౌ సభ్యావసథ్యౌ ॥** 8

సన్న్యాసి అగ్నులను ఆత్మసమారోపణము చేసికొన్నప్పటినుండి అగ్నులన్నియు అతనియందే ఉండునని వేదమువలన తెలియుచున్నది. అందువలన సన్న్యాసి చేయు ప్రాణాహుతులు ఆ అగ్నులయందే ఆహుతి చేసినట్లగుచున్నది. అతడు చేయు ప్రాణాహుతియే గార్హపత్యాగ్ని. అపానాహుతి అన్వాహార్య పచనము. వ్యానాహుతి ఆహవనీయము. ఉదానసమానాహుతులు సభ్యాగ్ని అవసథ్యాగ్ని. కావున పై ఆహుతులు ఈ అగ్నులను చేరును.

**పంచ వా ఏతేఽగ్నయ ఆత్మస్థాః॥** 9

ఈ ఐదగ్నులు సన్న్యాసియందే ఉండును.

**ఆత్మన్యేవ జుహోతి ॥** 10

అందువలననే అతడు చేయు ప్రాణాహుతుల సమర్పణ అతని యందుండు అగ్నులయందే చేయబడుచున్నది.

**స ఏష ఆత్మయజ్ఞః ఆత్మనిష్ఠః ఆత్మప్రతిష్ఠః ఆత్మనం**
**క్షేమం నయతీతి విజ్ఞాయతే ॥** 11

ఈ విధముగా సన్న్యాసిచేయు ఆత్మయజ్ఞము ఆత్మనిష్ఠయై ఆత్మయందే ప్రతిష్ఠితమై ఆ ఆత్మకు మేలు కలిగించుచున్నది అని వేదమువలన తెలియుచున్నది.

**భూతేభ్యో దయాపూర్వం సంవిభజ్య శేషమద్భిః**
**సంస్పృశ్య ఔషధవత్ ప్రాశ్నీయాత్ ॥** 12

పక్షులు చీమలు మొదలైన ప్రాణులకు తాను తెచ్చిన భిక్షనుండి కొంత దయతో తీసిపెట్టవలెను. మిగిలిన దానిపై నీరు ప్రోక్షించి, కూరలు మొదలైనవి లేకుండ కేవలము అన్నమునే ఔషధమును మ్రింగినట్లు మ్రింగవలెను. అనగా సన్న్యాసి రుచులను కోరరాదు.

ప్రాశ్యాప ఆచమ్య 'వాఙ్మ ఆసన్నసోః ప్రాణః' ఇతి జపిత్వా
జ్యోతిష్మత్యాఽఽదిత్యముపతిష్ఠతే ఉద్వయం తమసస్పరీతి ॥ 13

ఆ విధముగా భిక్షాన్నమును తిన్న తరువాత కాళ్ళు చేతులు కడుగుకొని ఆచమనము చేసి 'వాఙ్మ ఆసన్' అను మంత్రమును చదివి జ్యోతిష్మతీ మంత్రముచేత ఉద్వయం తమసస్పరి అను మంత్రముచేత సూర్యుని స్తుతించవలెను

ఆయాచితమసంక్లుప్తముపపన్నం యదృచ్ఛయా।
ఆహారమాత్రం భుంజీత కేవలం ప్రాణయాత్రికమ్ ॥ 14

ఆ సన్యాసి యాచన చేయక లభించిన భిక్షనే స్వీకరించవలెను. ఈ భిక్ష పలానావారి దగ్గర లభించునని మనస్సులోపల కూడ అనుకొనకూడదు యదృచ్ఛయా లభించినది కావలెను అటువంటి ఆహారమును ప్రాణయాత్రకొరకు మాత్రమే తీసికొనవలెను.

అథాప్యుదాహరంతి:-

అష్టౌ గ్రాసా మునేర్భక్ష్యాః షోడశారణ్యావాసినః।
ద్వాత్రింశతం గృహస్థస్య అపరిమితం బ్రహ్మచారిణః॥ 15

సన్న్యాసి ఎనిమిది ముద్దలను, వానప్రస్థుడు పదునారు ముద్దలను, గృహస్థు ముప్పది రెండు ముద్దలను మాత్రము తినవలెను. కాని బ్రహ్మచారి యథేచ్ఛగా తినవచ్చును ఈ శ్లోకము పదమూడవ ఖండమున కూడ వచ్చినది (13-8)

భైక్షం వా సర్వవర్ణేభ్యః ఏకాన్నం వా ద్విజాతిషు।
అపి వా సర్వవర్ణేభ్యః న చైకాన్నం ద్విజాతిషు॥ 16

అతడు అన్ని వర్ణముల వారి నుండి భిక్షను స్వీకరింపవచ్చును. ఒకే అన్నమైనచో బ్రాహ్మణుని నుండి స్వీకరింపవలెను. (ఇచ్చట ద్విజాతి శబ్దమునకు ద్విజాతి ముఖ్యుడని అర్థము చెప్పుకొనవలెను) లేక సమస్త వర్ణముల వారినుండి తీసి కొనవచ్చును

అథ యత్రోపనిషదమాచార్యా బ్రువతే తత్రోదాహరంతి స్థాన మౌన వీరాసన సవనోపస్పర్శన చతుర్థషష్ఠాష్టమ కాలవ్రతయుక్తస్య॥ 17

ఉపనిషత్తులలోని రహస్యములు తెలిసిన ఆచార్యులు ఈ విషయమును తెలుపుచున్నారు

సన్న్యాసి ఎల్లప్పుడు నిలబడి యుండుట, మౌనముగా ఉండుట, రాత్రిపూట వీరాసనమున ఉండుట, త్రిసంధ్యలందు స్నానముచేయుట, చతుర్థ, షష్ఠ, అష్టమ కాలములలో మాత్రము భోజనము చేయుట అనువానిని వ్రతముగా స్వీకరింపవలెను.

**కణ పిణ్యాక యావక దధి పయోవ్రతత్వం చేతి॥** 18

నూకలు, నూవులతో చేసిన పిణ్యాకము, యవలతో చేసిన యావకము, పెరుగు, పాలు, అను వానిని వ్రతముగా స్వీకరించి భక్షింపవలెను.

**తత్ర మౌనే యుక్తః త్రైవిద్యవృద్ధైరాచార్యైర్మునిభిః అన్యైర్వా**
**శ్రమిభిర్బహుశ్రుతైర్దంతాన్ సంధాయఅంతర్ముఖ ఏవ**
**యావదర్థం సంభాషీత న యత్ర లోపో భవతీతి విజ్ఞాయతే ।** 19

అతడు మౌనముగా ఉన్నప్పుడు త్రైవిద్యవృద్ధులు, ఆచార్యులు, మునులు, బాగుగా చదువుకొన్న ఇతర ఆశ్రమ వాసులతో (నైష్ఠిక బ్రహ్మచారి మొదలగువారు) దంతములను బిగబట్టి అంతర్ముఖుడై అవసరమున్నంత వరకు మాత్రము మాట్లాడవచ్చును. దాని వలన మౌన వ్రతమునకు ఎట్టి లోపము కలుగదని పెద్దలు చెప్పుదురు.

**స్థాన మౌన వీరాసనానామ్ అన్యతమేన సంప్రయోగః**
**న త్రయం సన్నిపాతయేత్॥** 20

ఎల్లప్పుడు నిలబడియుండుట, మౌనముగా ఉండుట, రాత్రివేళల వీరాసనమున కూర్చొనుట అను వ్రతములందు ఒక్క వ్రతమునే అనుష్ఠింపవలెను. కాని ఈ మూడింటిని కలిపి అనుష్ఠింపరాదు.

**యత్ర గతశ్చ యావన్మాత్రమనువ్రతయేత్**
**ఆపత్సు న యత్ర లోపో భవతీతి విజ్ఞాయతే॥** 21

ఇతర స్థలములకు పోయినప్పుడు? వ్రతమును అచ్చటి పరిస్థితులననుసరించి పరిపాలింపవలెను. ఆపత్కాలమున వీలైనంతవరకు మాత్రమే చేయవచ్చును. అందువలన వ్రతలోపము జరుగదని ఆపత్కాలమున యథేష్టముగా తిన్నచో తరువాత కాలమున ఏమియు తినరాదని పెద్దలు చెప్పుదురు.

**స్థాన మౌన వీరాసన సవనోపస్పర్శన చతుర్థ షష్ఠాష్టమకాల**
**వ్రతయుక్తస్య అష్టౌ తాన్యవ్రతఘ్నాని ఆపో మూలం ఘృతం**
**పయః హవిః బ్రాహ్మణకామ్యా చ గురోర్వచనమ్ ఔషధమితి॥** 22

ఎల్లప్పుడు నిలబడియుండుట, మౌనముగా ఉండుట, రాత్రివేళ వీరాసనమున ఉండుట, త్రిసంధ్యలందు చన్నీటి స్నానము చేయుట, నాలుగు లేక ఆరు ఎనిమిది కాలములందు మాత్రము భుజించుట,అను వ్రతమును పాలించు సన్న్యాసి నీరు,కందమూలములు, నేయి, పాలు, హవిస్సు, బ్రాహ్మణుని ప్రార్థన, గురువు ఆజ్ఞ, ఔషధము అను ఎనిమిదింటిని స్వీకరించినను వ్రత భంగము కాదు.

**సాయం ప్రాతరగ్నిహోత్ర మంత్రాన్ పఠేత్ ॥** 23

సాయంకాలమున ఉదయమున అగ్నికార్యమున చదువవలసిన మంత్రములను పఠింపవలెను. ఇది ఆహితాగ్ని మాత్రము చేయవలెను.

**వరుణాభిస్సాయం సంధ్యాముపతిష్ఠతే మైత్రీభిః ప్రాతః॥** 24

అతడు సాయంకాలసంధ్యను వరుణ మంత్రములచేత "యచ్చిద్ధితే విశోయధా ఇత్యాదివరుణ మంత్రములచేత, ప్రాతస్సంధ్యను మిత్రస్య చర్షణీ" ఇత్యాది మిత్ర దేవతాకమంత్రములచేత చేయవలెను.

**అనగ్నిరనికేతస్స్యాదశర్మాஉశరణో మునిః॥** 25

సన్న్యాసికి హోమాగ్నులుండరాదు. గృహముండరాదు. ఇతరుల దగ్గర ప్రతిగ్రహము చేయరాదు. ఇంకను ఎవ్వరిని శరణు వేడరాదు ఇతరులకు శరణమీయరాదు. ఇదే సూత్రము అపస్తంబ ధర్మసూత్రమందును 2-21-10 కన్పించును.

**భైక్షార్థీ గ్రామమన్విచ్ఛేత్॥** 26

అతడు భిక్షకొరకు గ్రామమునకు పోవచ్చును.

**స్వాధ్యాయే వాచముత్సృజేత్॥** 27

అతడు వేదాధ్యయనము చేయునప్పుడు మౌనమును వదలి పెట్టవచ్చును.

**విజ్ఞాయతే చ-పరిమితా వా ఋచః పరిమితాని సామాని**
**పరిమితాని యజూంషి అథైతస్యైవాంతో నాస్తి యద్బ్రహ్మ**
**తత్ప్రతిగృణత ఆచక్షీత స ప్రతిగర ఇతి ॥** 28

ఋక్కుల సంఖ్య పరిమితముగా ఉన్నట్లు సామమంత్రములసంఖ్య పరిమితముగా ఉన్నట్లు యజుర్వేదమంత్రములసంఖ్య కూడా పరిమితముగా ఉన్నట్లు తెలియుచున్నది కాని చతుర్హోత అను బ్రహ్మయొక్క అంతముమాత్రము కనపడదు అందువలన అధ్వర్యులు దానినే ఓం హోతః అని అందురు. అట్లే ఆ ఓంకారమే ప్రతిగరమని వేదములవలన తెలియుచున్నది అందువలన సన్న్యాసి ఓంకారమును జపించుట వేదాధ్యయనముగా భావింపవలెను.

**ఏవమేవైష ఆశరీర విమోక్షణాత్ వృక్షమూలికో వేద సంన్యాసికః॥ 29**

ఈ విధముగా సన్న్యాసి చనిపోవువరకు వేదవృక్షమూలికుడై ఉండవలెను అతనిని వేద సన్యాసి అని అందురు.

**వేదో వృక్షః తస్య మూలం ప్రణవః॥** 30

వేదమను వృక్షమునకు ఓం కారము మూలము వంటిది అందువలన ఓం కారమునాశ్రయించిన సన్యాసి వృక్షమూలికుడగుచున్నాడు.

**ప్రణవాత్మకో వేదః॥** 31

**ప్రణవో బ్రహ్మ ప్రణవం ధ్యాయేత్॥** 32

వేదము ఓంకారరూపము.ఆ ఓంకారము బ్రహ్మ స్వరూపము కావున సన్న్యాసి ఓంకారమును ఎల్లప్పుడు ధ్యానింపవలెను.

**ప్రణవో బ్రహ్మభూయాయ కల్పతే ఇతి హోవాచ ప్రజాపతిః॥** 33

ఆ ఓంకారమే ఉత్తమ లోకములను కల్పించునని ప్రజాపతి పేర్కొనెను

**సప్తవ్యాహృతిభిర్బ్రహ్మ భాజనం ప్రక్షాళయేత్ ప్రక్షాళయేదితి॥** 34

ఓం భూః ఓం భువః ఇత్యాది సప్తవ్యాహృతులనుచ్చరించుచు భోజనము చేసిన తరువాత భిక్షా పాత్రను తానే కడుగుకొనవలెను.

(విద్యార్థి సంప్రదాయమునుసరించి ఆయాఖండములలోని తొలిసూత్ర భాగములు ప్రతిలోమముగా క్రింద ఇవ్వబడినవి.)

**ఏకదండీ త్రిదండీ వా॥18॥అథాతస్సంన్యాసవిధిమ్॥ 17॥ప్రజాకామస్యోప దేశః॥ 16॥అథ వై భవతి అగ్నౌకరణశేషేణ॥15॥పిత్ర్యమాయుష్యమ్॥ 14॥ యదా హి తూలమైషీకమ్ ॥ 13 ॥ అథ శాలీనయాయావరాణామ్ ॥ 12 ॥అద్వైతే పంచ**

మహాయజ్ఞాః ॥ 11 ॥ అథ ప్రాచీనావీతీ ॥ 10 ॥అగ్నిః ప్రజాపతిః ॥ 9 ॥ అథ హస్తౌ ప్రక్షాళ్య ॥ 8 ॥ అథాతస్సంధ్యోపాసనవిధిం వ్యాఖ్యాస్సామః ॥ 7 ॥ న పిండ శేషమ్ ॥ 6 ॥ తపస్యమవగాహనమ్॥ 5 ॥ అబ్రాహ్మణస్య శారీరో దండః ॥ 4 ॥ నిత్యోదకీ నిత్యయజ్ఞోపవీతీ ॥3॥ అథ పతనీయాని॥2 ॥ అథాతః ప్రాయశ్చిత్తాని॥ 1॥

ఇతి అష్టాదశః ఖండః

## ద్వితీయ ప్రశ్నశ్చ సమాప్తః

## అథ తృతీయ ప్రశ్నః

### అథ ప్రథమః ఖండః

**అథ శాలీన యాయావర చక్రచర ధర్మకాంక్షిణాం**
**నవభిర్వృత్తిభిర్వర్తమానానామ్॥** 1

ఇక శాలీనులు, యాయవరులు, చక్రచరుల ధర్మమును అనుష్ఠించుచు తొమ్మిది విధములైన వృత్తులలో ఉండు వారి గురించి వివరింపబడుచున్నది.

**తేషాం తద్వర్తనాత్ వృత్తిరిత్యుచ్యతే ॥** 2

శాలీనులు మొదలగువారు జీవనోపాధికై ఎంచుకొన్న ప్రవృత్తిని వృత్తి యని పిలుచుచున్నారు.

**శాలాశ్రయత్వాచ్ఛాలీనత్వమ్। వృత్త్యా వరయా యాతీతి**
**యాయావరత్వమ్ । అనుక్రమ చరణాత్ చక్రచరత్వమ్ ॥** 3

గృహమందుండువాడు శాలీనుడు. అట్లే శ్రేష్ఠమైన వృత్తిననుసరించువాడు యాయావరుడు, వారిని అనుసరించినవాడు చక్రచరుడు అనగా బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య గృహస్థులు.

**తా అనువ్యాఖ్యాస్యామః॥** 4

వారి వృత్తులను వరుసగా వివరింతును.

**షణ్ణివర్తినీ కోద్దాలీ ధ్రువా సంప్రక్షాలనీ సమూహా**
**పాలినీ శిలోంఛా కాపోతా సిద్ధేచ్ఛా ఇతి నవైతాః॥** 5

షణ్ణివర్తినీ, కోద్దాలీ, ధ్రువా, సంప్రక్షాలనీ, సమూహా, పాలినీ, శిలోంఛా,

కాపోతా, సిద్ధేచ్ఛా అను తొమ్మిది వృత్తులను బ్రాహ్మణాది గృహస్థులు అనుసరింపవలెను. షణ్ణివర్తినీ ఇత్యాది వృత్తులు రాబోవు ఖండములో (3-2) వివరింపబడినవి.

**తాసామేవ వాన్యాఽపి దశమీ వృత్తిర్భవతి॥** 6

వాన్యా అను పదియవ వృత్తి కూడ ఉన్నది

**అనవవృత్తేః॥** 7

ఈ తొమ్మిది వృత్తులవరకు వృత్తిగ్రహణవిధానము ఈ విధముగా ఉండును.

**కేశ శ్మశ్రు లోమ నఖాని వాపయిత్వోపకల్పయతే కృష్ణాజినం**
**కమండలుం యష్టిం వీవధం కుధహారిమితి ॥** 8

పై వృత్తులను స్వీకరించునపుడు ప్రారంభమున గోళ్ళు తీసికొనవలెను. అట్లే కృష్ణాజినము కమండలువు, యష్టి, వీవధము(కావడి) కుధహారి? అను వస్తువులను సంపాదించుకొనవలెను.

**త్రేధాతవీయేనేష్ట్వా ప్రస్థాస్యతి వైశ్వానర్యా వా ॥** 9

తరువాత త్రేధాతవి లేక వైశ్వానరీయ ఇష్టిని పూర్తి చేయవలెను. ఆ తరువాత పై వృత్తులననుష్ఠించుటకు ఇంటినుండి బయలు దేరవలెను.

**ప్రాతరుదిత ఆదిత్యే యథాసూత్రమగ్నీన్ప్రజ్వాల్య గార్హపత్య ఆజ్యం**
**విలాప్య ఉత్పూయ స్రుక్స్రువం నిష్టప్య సమ్మృజ్య, స్రుచి**
**చతుర్గృహీతంగృహీత్వా ఆహవనీయే వాస్తోష్పతీయం జుహోతి॥**

వపనాదులను చేసికొని కృష్ణాజినాదులను సిద్ధము చేసికొని మరుసటి దినము ప్రాతఃకాలమున సూర్యుడు ఉదయించిన తరువాత తమ తమ గృహ్యా సూత్రముననుసరించి అగ్న్యా ధానము చేయవలెను. తరువాత గార్హపత్యాగ్నిదగ్గర ఆజ్యవిలాపమును, ఉత్పవనమును చేసి స్రుక్ స్రువములను అగ్నికి చూపవలెను. (వేడి చేయవలెను) తరువాత వాటిని తుడిచి స్రుక్కునందు ఏకం ద్వి త్రి చత్వారి అనుచు నాలుగు పర్యాయములు ఆజ్యమును తీసికొని ఆహవనీయాగ్నియందు వాస్తోష్పతీయ హోమము చేయవలెను.

**'వాస్తోష్పతే ప్రతిజానీహ్యాస్మానితి' పురోనువాక్యామ్ అనూచ్య**
**వాస్తోష్పతే శగ్మయా సగ్ంసదా తే'ఇతి యాజ్యయా జుహోతి॥** 11

"వాస్తోష్పతే ప్రతి' అనుపురోనువాకమును చెప్పి 'వాస్తోష్పతే శగ్మయా' అను యాజ్యమంత్రముచే తమ తమ గృహ్యసూత్ర విదానమునననుసరించి వాస్తోష్పతీయ హోమమును చేయవలెను.

**సర్వ ఏవాఽహితాగ్నిరిత్యేకే॥** 12

ఆహితాగ్నియైన వారందరు ఈ వాస్తోష్పతీయ హోమముచేయవలెనని కొందరు ఆచార్యులందురు.

**యాయావర ఇత్యేకే॥** 13

మరికొందరాచార్యులు ఈ హోమమును యాయావరీయుడు మాత్రమే చేయవలెనని అందురు.

**నిర్గత్య గ్రామాంతే గ్రామసీమాంతే వాఽవతిష్ఠతే తత్ర**
**కుటీం మఠం వా కరోతి కృతం వా ప్రవిశతి॥** 14

హోమము చేసి గ్రామమునుండి బయలు దేరి గ్రామముయొక్క చివర లేక ఊరి పొలిమెర లోపల పర్ణశాలనో లేక మఠమునో నిర్మించుకొని దానిలోనికి పోవలెను. లేక ఇంతకు ముందే నిర్మించిన దానిలోనికి కూడా ప్రవేశింప వచ్చును.

**కృష్ణాజినాదీనాముపక్లృప్తానాం యస్మిన్ యస్మిన్నర్థే**
**యేన యేన యత్ప్రయోజనం తేన తేన తత్కుర్యాత్।**
**ప్రసిద్ధమగ్నీనాం పరిచరణమ్। ప్రసిద్ధం దర్శపూర్ణమాసాభ్యాం**
**యజనమ్। ప్రసిద్ధం పంచానాం మహతాం యజ్ఞానామ్**
**అనుప్రయోగః।ఉత్పన్నానామోష ధీనాం నిర్వాపణం దృష్టం భవతి॥** 15

తాను సంపాదించుకొనిన కృష్ణాజినము మొదలగు ఉపకరణములను ఉపయోగింపవలసిన స్థలమున మాత్రమే ఉపయోగింపవలెను. అగ్ని పరిచర్య, దర్శపూర్ణమాసయాగములు చేయుపద్ధతి, పంచమహాయజ్ఞములాచరించు పద్ధతి చాలా ప్రసిద్ధమైనవి, అట్లే ఆ దినము సంపాదించుకొనిన ఔషధులను ఉపయోగించుకొను విదానము కూడ అందరకు తెలిసినదే

**విశ్వేభ్యో దేవేభ్యో జుష్టం నిర్వపామీతి వా తూష్ణీం వా**
**తాః సంస్కృత్య సాధయతి ॥** 16

"విశ్వేభ్యో దేవేభ్యో" అను మంత్రము చదువుచు లేక మంత్రములేవియు చదువకుండ తాను సంపాదించిన ఓషదులను కడిగి లేక దంచుట మొదలైన సంస్కారము చేసి వండవలెను

**తస్యాధ్యాపనయాజన ప్రతిగ్రహాః నివర్తంతే॥** 17

ఈ వృత్తులనవలంబించినవాడు అధ్యాపనము, యజ్ఞము చేయించుట, దానము స్వీకరించుట అను వానిని చేయరాదు

**అన్యే చ యజ్ఞ క్రతవః॥** 18

ఇట్లే ఇతరములైన యజ్ఞములు, క్రతువులు సేయించుట అను దానిని కూడ పరిత్యజింపవలెను.

**హవిష్యం చ వ్రతోపాయనీయం దృష్టం భవతి॥** 19

హోమమున ఉపయోగించు హవిస్సునే వ్రతమునాచరించునపుడు తీసికొనవలసిన ఆహారముగా భుజింపవలెను.

**సర్పిమిశ్రం దధిమిశ్రమక్షారలవణమపిశితమపర్యుషితమ్॥** 20

ఉప్పు కారము లేనిది, మాంసము కానిది, చద్దిది కానిది ఐన ఆహారమును పెరుగు లేక నేయ్యి కలుపుకొని తినవచ్చును.

**బ్రహ్మచర్యమృతౌ వా గచ్ఛతి॥** 21

వ్రతము స్వీకరించిన గృహస్థు బ్రహ్మచర్యమునైనా పాటింపవలెను. లేనిచో ఋతుకాలమున మాత్రము(ముట్టు ఐన నాలుగవనాడు) భార్యను పొందవచ్చును.

**పర్వణి పర్వణి కేశ శ్మశ్రు లోమ నఖ వాపనం శౌచవిధిశ్చ॥** 22

ప్రతి పర్వదినమున వెంద్రుకలు గోళ్ళు తీయించుకొనవలెను. అట్లే శుద్ధికి సంబంధించిన నియమములను పాటింపవలెను.

**అథాప్యుదాహరంతి:-**

**శ్రూయతే ద్వివిధం శౌచం యచ్ఛిష్టైః పర్యుపాసితమ్।**
**బాహ్యం నిర్లేపనిర్గంధమ్ అంతశ్శౌచమహింసనమ్॥** 23

శిష్టులు ఆచరించు శౌచము రెండు విధములుగా ఉండును. ఒకటి బాహ్యము రెండు అంతరంగికము. వీటిలో గంధములేని వస్తువులను శరీరమునకు లేపనము చేయకుండుట బాహ్యశౌచము. ప్రాణులకెవ్వరికిని బాధ కలిగింపకుండుట అంతః శౌచము అని అందురు.

**అద్భిశ్శుధ్యంతి గాత్రాణి బుద్ధిర్ జ్ఞానేన శుద్ధ్యతి ।**
**అహింసయా చ భూతాత్మా మనస్సత్యేన శుద్ధ్యతి॥** 24

శరీరము స్నానముచే పవిత్రమగును. జ్ఞానము వలన బుద్ధి, అహింస వలన ఆత్మ, సత్యము పలుకుటచే మనస్సు పవిత్రమగును.

ఇతి ప్రథమః ఖండః

## అథ ద్వితీయః ఖండః

**యథో ఏతత్ షణ్ణివర్తనీతి॥** 1

ఇంతకుముందు పేర్కొన్న నవవృత్తులలో షణ్ణివర్తినీయను వృత్తి ఇట్లుండును.

**షడేన నివర్తనాని నిరుపహతాని కరోతి స్వామినే భాగముత్సృజతి**
**అనుజ్ఞాతం వా గృహ్ణాతి। ప్రాక్ప్రాతరాశాత్కర్షీ స్యాదస్యూత**
**నాసికాభ్యామ్ సముష్కాభ్యామ్ ముహూర్ముహుః అభ్యుచ్ఛందయన్।**
**ఏతేన విధినా షణ్ణివర్తనాని కరోతీతి షణ్ణివర్తనీ॥** 2

యజమానియొక్క అనుజ్ఞతీసికొని తనకుటుంబముయొక్క బ్రతుకుదెరువునకు ఆరు నివర్తనముల (సుమారు ఆరు ఎకరముల) భూమిని మాత్రము తీసికొని పొలమును దున్నుకొనువానిని షణ్ణివర్తనియని అందురు. అతడాపొలమును మధ్యాహ్నము భోజనము చేయుటకు ముందే దున్నవలెను. అట్లే భూమిని దున్నునపుడు వృషభముల ముక్కుకు త్రాడు వేయరాదు. వాటి వృషణములను కొట్టరాదు. ముల్లు కట్టితో బాధపెట్టరాదు. పైగా మాటి మాటికి ఆ వృషభములను దువ్వుచు సంతోషపెట్టవలెను. ఇతరుల పొలమును తీసికొన్నప్పుడు మాత్రమే యజమాని అనుజ్ఞ మొదలైన వాటిని తీసికొనవలెను. తన పొలమున ఇవి అక్కరలేదు.

**కౌద్దాలీతి జలాభ్యాశే కుద్దాలేన వా ఫాలేన వా**
**తీక్ష్ణకాష్ఠేన వా ఖనతి బీజాన్యావపతి కందమూల**
**శాకౌషధీర్నిష్పాదయతి। కుద్దాలేన కరోతీతి కౌద్దాలీ॥** 3

కౌద్దాలియనువాడు జలాశయము దగ్గర పలుగు, పార, లేక వాడియైన కట్టె వంటి వాటిచే భూమిని తవ్వి గింజలు వేసి కందమూలములు ఆకుకూరలు, ఓషధులు అను వానిని పండించి బ్రతుకును. పలుగు మొదలగు వాని సహాయముచే పంట పండించుటచే అతనిని కౌద్దాలియని అందురు.

**ధ్రువాయాం వర్తమానః శుక్లేన వాససా శిరో**
**వేష్టయతి 'భూత్యై త్వా శిరోవేష్టయామీతి ॥** 4

ధ్రువా వృత్తియనగా భిక్షావృత్తి. ధ్రువా వృత్తిని స్వీకరించు బ్రాహ్మణుడు ""భూత్యై త్వా" అను మంత్రమును చదువుచు శిరస్సునకు తెల్లని వస్త్రమును చుట్టుకొనవలెను.

**బ్రహ్మవర్చసమసి బ్రహ్మవర్చసాయ త్వేతి కృష్ణాజినమాదత్తే।**
**అబ్లింగాభిః పవిత్రమ్। బలమసి బలాయత్వేతి కమండలుమ్॥** 5

అట్లే "బ్రహ్మవర్చసమను మంత్రమును చదువుచు కృష్ణాజినమును, అపోహిష్ఠా మొదలైన మంత్రములచే జలమును వడబోయు వస్త్రమును బలమసి బలాయ అను మంత్రమును చదువుచు కమండలువును స్వీకరింపవలెను.

**ధాన్యమసి పుష్ట్యైత్వేతి వీవధమ్।సఖా మే గోపాయేతి**
**దండమ్।అథోపనిష్క్రమ్య వ్యాహృతీర్జపిత్వా దిశామనుమంత్రణం**
**జపతి పృథివీ చాంతరిక్షం చ ద్యౌశ్చ నక్షత్రాణి చ యా దిశః।**
**అగ్నిర్వాయుశ్చ సూర్యశ్చ పాంతు మాం పథి దేవతాః ఇతి ।**
**మానస్తోకీయం జపిత్వా గ్రామం ప్రవిశ్య గృహద్వారే గృహద్వార**
**ఆత్మానం వీవధేన సహ దర్శనాత్సందర్శనీత్యాచక్షతే॥** 6

ఇంకను "ధాన్యమసి" అను మంత్రముచే భిక్షాపాత్రను సఖామే గోపాయ" అను మంత్రముచే చేతి కట్టను స్వీకరింపవలెను. తరువాత వ్యాహృతులను చదువుచు ఇంటినుండి బయటకు వచ్చి పృథివీ చాంతరిక్షం చ" అను మంత్రముచే దిగను

మంత్రణమును చేయవలెను అట్లే మానస్తోకీయ మంత్రములు చదువుచు గ్రామములో ప్రతి ఇంటి ముందు నిలబడి భిక్షాటనము చేయవలెను ఈ విదముగా ప్రతి ఇంటి ముందు భిక్షాపాత్రతో తాను కనిపించుచున్నందువలన ఈ వృత్తిని సందర్శనీ అని కూడ అందురు

**వృత్తేర్వృత్తేరవార్తాయాం తయైవ తస్య ధ్రువం**
**వర్తనాత్ ధ్రువేతి పరికీర్తితా॥** 7

తాను జీవించుటకు ఎటువంటి వృత్తి లభింపక పోవుటచే భిక్షాటనముచే జీవించుటకు స్థిరముగా నిశ్చయించుకొన్నందువలన దీనిని ధ్రువా అని అందురు.

**సంప్రక్షాళనీతి। ఉత్పన్నానామోషధీనాం ప్రక్షేపణం నిక్షేపణం**
**నాస్తి నిచయో వా భాజనాని సంప్రక్షాళ్య న్యుబ్జతీతి సంప్రక్షాళనీ॥** 8

ధాన్యముగింజలను తెచ్చుట, దాచుట, పారవేయుట అనునవి లేకుండ పాత్రలనన్నింటిని కడిగి బోర్లించి పెట్టుట జరుగును అవసరమైన వాటిని అవసరమైనంతవరకే ఉపయోగించుకొని ఉపయోగించిన పాత్రలను కడిగి పెట్టుటచే ఈ వృత్తిని సంప్రక్షాళని అని అందురు

**సమూహేతి। అవారితస్థానేషు పథిషు వా క్షేత్రేషు వాఽప్రహితా**
**వకాశేషు వా యత్ర యత్రౌషధయో విద్యంతే తత్ర తత్ర**
**సమూహన్యా సమూహ్య తాభిర్వర్తయతీతి సమూహా॥** 9

రైతు తన పంటనంతా కోసికొని కళ్ళము చేసికొన్న తరువాత ఎవ్వరు కూడ అడ్డు చెప్పని పొలములలో ఉన్న ధాన్యపు గింజలను చీపురు కట్టచే ఊడ్చి అచ్చట లభించిన గింజలతోనే జీవన వృత్తి గడుపు వాని వృత్తిని సమూహా అని యందురు.

**పాలనీత్యహింసకేత్యేవేదముక్తం భవతి। తుషవిహీనాన్**
**తండులానిచ్ఛతి సజ్జనేభ్యో బీజాని వా పాలయతీతి పాలనీ॥** 10

పాలనీ వృత్తిని అహింసికా వృత్తి యని కూడ అందురు. బియ్యము, ఇతర ధాన్యములను సజ్జనుల దగ్గర తీసికొని వాటిని రక్షించినందువలన లభించిన దానిచే జీవించుచున్నందువలన ఈ వృత్తిని పాలనీ వృత్తియని అందురు

**సిలోంఛేతి। అవారితస్థానేషు పథిషు వా క్షేత్రేషు**
**వాఽప్రతిహతావకాశేషు వా యత్ర యత్రౌషధయో**
**విద్యంతే తత్ర తత్రైకైకం కణిశముంఛయిత్వా**
**కాలే కాలే సిలైర్వర్తయతీతి సిలోంఛా॥** 11

ఎవ్వరు కూడ అభ్యంతరము చెప్పని పొలములనుండి ఇతరస్థలములనుండి ఒక్కొక్క గింజను ఏరుకొని ఆ ధాన్యముచే జీవించు వృత్తిని సిలోంఛ వృత్తియందురు.

**కాపోతేతి। అవారితస్థానేషు పథిషు క్షేత్రేషు**
**వాఽప్రతిహతావకాశేషు వా యత్ర యత్రౌషధయో**
**విద్యంతే తత్ర తత్రాంగుళిభ్యామేకైకామోషధిముంఛయిత్వా**
**సందంశనాత్ కపోతవదితి కాపోతా॥** 12

ఎవ్వరు కూడ అడ్డుచెప్పని ప్రదేశములందు పొలములందు పడిపోయిన ధాన్యపు గింజలను ఒక్కొక్క దానిని పావురమువలె చేతిచే ఏరుకొని తిను వృత్తిని కాపోతా వృత్తియని అందురు. ఈ వృత్తిని అవలంబించిన వారు వండుకొనక ఆ గింజలను అదేరూపమున భుజింతురు.

**సిద్ధేచ్ఛేతి। వృత్తిభిశ్శ్రాంతో వృద్ధత్వాద్ధాతుక్షయాద్వా**
**సజ్జనేభ్యః సిద్ధమన్నమిచ్ఛతీతి సిద్ధేచ్ఛా॥** 13

ముసలితనమువలన లేక బలమంతయు ఉడుగుట వలన ఏ వృత్తి చేయలేక సజ్జనులు వండి పెట్టిన ఆహారమును కోరి భుజించుటవలన ఈ వృత్తిని సిద్ధేచ్ఛావృత్తియని అందురు.

**తస్యాత్మసమారోపణం విద్యతే సంన్యాసివదుపచారః**
**పవిత్ర కాషాయవర్జమ్॥** 14

సిద్ధేచ్ఛా వృత్తి నవలంబించువాడు సన్న్యాసి వలె అగ్నులను ఆత్మ సమారోపణము చేసి కొనవలెను. కాషాయ వస్త్రములు, పవిత్రలేని సన్న్యాసి వలె ప్రవర్తింపవలెను.

**వాన్యాఽపి వృక్షలతా వల్ల్యోషధీనాం చ తృణౌషధీనాం చ**
**శ్యామాకజ తిలాదీనాం వాన్యాభిర్వర్తయతీతి వాన్యా॥** 15

వృక్షములు, తీగలు మొదలైన వాటి ఫలములు, తృణములు మొదలగు వానినుండి పుట్టిన ధాన్యములు శ్యామాకము, నూవులు మొదలగు అడవిలో పండు పదార్థములచే జీవితము గడుపుకొను పద్ధతిని వాన్య వృత్తి యందురు.

అధాప్యుదాహరంతి:-

**మృగైస్సహపరిస్పందః సంవాసస్తైభిరేవ చ। తైరేవ సదృశవృత్తిః**
**ప్రత్యక్షం స్వర్గలక్షణం॥ ప్రత్యక్షం స్వర్గలక్షణమితి॥** 16

ఈ వాన్య వృత్తి గురించి పెద్దలిట్లు చెప్పుదురు.

వాన్యవృత్తిలో ఉండువాడు మృగములతో కలసితిరుగవలెను. మృగములతో కలసి యుండవలెను. ఇంకను మృగముల వలెనే యుండవలెను. ఇట్టి వాన్య వృత్తి వలన స్వర్గమున ప్రత్యక్షముగా ఉన్నట్లుండును.

అధ్యాయ పరిసమాప్తిని సూచించుచు పదములపునరావృత్తి చేయబడినది.

ఇతి ద్వితీయః ఖండః

## అథ తృతీయః ఖండః

**అథ వానప్రస్థస్య ద్వైవిధ్యమ్॥** 1

ఇంతవరకు గృహస్థునకు సంబంధించిన వృత్తులగురించి చెప్పబడినవి. ఇక వానప్రస్థుని వృత్తి రెండు విధములుగా ఉండును.

**పచమానకా అపచమానకాశ్చేతి॥** 2

వండుకొని తినువారు, వంట చేయక తినువారని వాన ప్రస్థుని వృత్తి రెండు విధములు.

**తత్ర పచమానకాః పంచవిధాః సర్వారణ్యకా వైతుషికాః**
**కందమూలభక్షాః ఫలభక్షాశ్శాకభక్షాశ్చేతి॥** 3

వండుకొని తిను వానప్రస్థులు ఐదు విధములుగానుందురు. సర్వారణ్యకులు అనగా అడవిలో లభించు వస్తువులను వండి తినువారు. వైతుషికులు అనగా పొట్టు తీయక అడవిలో దొరకు వస్తువులను వండి తినువారు. కందమూలాదులను ఉడికించి తినువారు కందమూలభక్షులు. మరికొందరు అడవిలో లభించు పండ్లను తిందురు. ఇంకను కొందరు అడవిలో లభించు ఆకుకూరలను తిందురు.

**తత్ర సర్వారణ్యకా నామ ద్వివిధాః ద్వివిధమరణ్య -**
**మాశ్రయంతః ఇంద్రావసిక్తాః రేతోవసిక్తాశ్చేతి॥** 4

పచమానకులలోని సర్వారణ్యకులు రెండు విధములుగా ఉందురు. ఒకరు ఇంద్రునివలన అనగా వర్షమువల్ల పుట్టిన పదార్ధములను , రెండవవారు వీర్యమువలన పుట్టిన మృగములు మొదలగువాని మాంసమును వండుకొనితిందురు.

**తత్ర ఇంద్రావసిక్తా నామ వల్లీగుల్మలతావృక్షాణామానయిత్వా**
**శ్రపయిత్వా సాయంప్రాతరగ్నిహోత్రం హుత్వా**
**యత్యతిప్రవతేభ్యశ్చ దత్వాఽథేతరచ్ఛేషభక్షాః॥** 5

ఇంద్రావసిక్తులనగా తీగలు మొదలైన వృక్షములకు సంబంధించిన ఫలములను (ఇంద్రుడు కురిపించిన వర్షము వలన ఏర్పడునవి). తెచ్చి సంస్కరించి సాయం, ప్రాతః కాలములందు చేయు అగ్ని హోత్రమున హోమము చేయుదురు. తరువాత మునులు, బ్రహ్మచారులు మొదలగు అతిథులు రాగా వారిని పూజించి వారికి వన్యములైన ఆ పండ్లను తినుటకై ఇచ్చి మిగిలినవానిని మాత్రమే భక్షింతురు.

**రేతోవసిక్తా నామ మాంస వ్యాఘ్ర వృక్ణ్యేనాదిభిరన్యతమేన**
**వా హతమానయిత్వా శ్రపయిత్వా సాయం ప్రాతరగ్నిహోత్రం**
**హుత్వా యత్యతిథిభ్యశ్చ దత్వా ఇతరచ్ఛేష భక్షాః॥** 6

రేతోవసిక్తులనగా వీర్యమువలన పుట్టిన వ్యాఘ్రము తోడేలు మొదలైన జంతువులు చంపిన మాంసము తీసికొని వచ్చి వండి సాయం ప్రాతర్ హోమములు చేసి హోమాంతమున, వండిన దానిని అతిథులకు పెట్టి మిగిలిన దానిని భుజించువారు.

**వైతుషికాస్తుషధాన్య వర్జం తండులానానయిత్వా**
**శ్రపయిత్వా సాయం ప్రాతరగ్నిహోత్రం హుత్వా**
**యత్యతిథి ప్రతిభ్యశ్చ దత్వాఽథేతరచ్ఛేషభక్షాః॥** 7

వైతుషికులనగా పొట్టు లేని బియ్యము వంటి వాటిని తెచ్చి వండి సాయం, ప్రాతరగ్నిహోత్ర హోమము చేసి యతులు బ్రహ్మచారులు మొదలైన అతిథులకు పెట్టి మిగిలిన దానిని భక్షించువారు.

**కందమూల ఫల శాక భక్షాణామప్యేవమేవ॥** 8

కందమూలభక్షులు, శాక భక్షులనగా పూర్వము పేర్కొన్నట్లే అడవిలో లభించిన కందమూలములములను, శాకములను తెచ్చి వండి హెూమము చేసిన తరువాత అతిథులకు పెట్టి మిగిలిన దానిని భక్షించువారు అని అర్థము.

**పంచైవాఽపచమానకాః- ఉన్మజ్జకాః ప్రవృత్తాశినో ముఖేనాదాయినః తోయాహారా వాయుభక్షాశ్చేతి॥** 9

వండని పదార్థములను తినువారు కూడ ఉన్మజ్జకులు, ప్రవృత్తాశనులు, ముఖేనాదాయినులు, తోయాహారులు, వాయు భక్షకులని ఐదు విధములుగా ఉన్నారు.

**తత్రోన్మజ్జకా నామ లోహాశ్మకరణ వర్జమ్॥** 10

అపచమానకులలో ఉన్మజ్జకులనగా లోహము, రాతి ఉపకరణముల సహాయములేక కందమూలములు,పండ్లు మొదలగువానిని తినువారు.

**హస్తేనాదాయ ప్రవృత్తాశినః॥** 11

ప్రవృత్తాశినులు అడవిలో లభ్యమైన పదార్థములను చేతితో తీసికొని తిందురు.

**ముఖేనాదాయినః ముఖేనాఽదత్తే॥** 12

అడవిలో లభ్యమైన పదార్థములను పశువులవలె ముఖముతోనే తీసికొని తినువారు ముఖేనాదాయినులు.

**తోయాహారాః కేవలం తోయాహారాః॥** 13

నీరు మాత్రమే త్రాగి జీవించువారు తోయాహారులు.

**వాయుభక్షా నిరాహారాశ్చ॥** 14

ఏ విధమైన ఆహారము తీసికొనక గాలిని పీల్చిజీవించువారు వాయు భక్షకులు.

**వైఖానసానాం విహితా దశ దీక్షాః॥** 15

వానప్రస్థాశ్రమమున ఉన్నవారికి ఈ పది నియమములు చెప్పబడినవి.

**యశ్శాస్త్రమభ్యుపేత్య దండం చ మౌనం చాప్రమాదం చ॥** 16

విఖనసశాస్త్రముననుసరించి దండధారణము చేయవలెను. మౌనముగా ఉండవలెను. అప్రమాదముగా ఉండవలెను. (ఆలోచించక ఏపని చేయరాదు)

**వైఖానసాశ్శుధ్యంతి నిరాహారాశ్చేతి॥** 17

ఆహారమేమియు తీసికొనక జీవించు వానప్రస్థులు పాపరహితులై ఉందురు.

**శాస్త్ర పరిగ్రహస్సర్వేషాం బ్రహ్మవైఖానసానామ్॥** 18

వాన ప్రస్థాశ్రమమున ఉన్న బ్రాహ్మణులు వైఖానస శాస్త్రమునసరించి ఉండవలెను.

**న ద్రుహ్యేద్దంశ మశకాన్ హిమవాన్ తాపసో భవేత్।**
**వానప్రతిష్ఠస్సంతుష్టశ్చీరచర్మ జలప్రియః॥** 19

వానప్రస్థాశ్రమములో ఉన్నవాడు ఈగలను దోమలను చంపరాదు. చలిని సహింపవలెను. తపస్సును చేయవలెను. అతడు నారబట్టలు లేక చర్మమును ధరించుచు సదా సంతోషముతో ఉండవలెను. ఇంకను శుచిగా ఉండుటకు అతడు జలపాత్రయైన కమండలువును ఎల్లప్పుడు ధరించియుండవలెను.

**అతిథీన్పూజయేత్పూర్వం కాలే త్వాశ్రమమాగతాన్।**
**దేవ విప్రాగ్నిహోత్రే చ యుక్తస్తపసి తాపసః॥** 20

అతడు భోజన సమయమున ఆశ్రమమునకు వచ్చిన అతిథులను తొలుత పూజింపవలెను. దేవతా పూజ, బ్రాహ్మణ పూజ చేయుచు ప్రతి దినము హోమము చేయవలెను. ఇంక తపస్సును కూడ నియమముతో చేయవలెను.

**కృచ్ఛ్రాం వృత్తిమసంహార్యాం సామాన్యాం మృగపక్షిభిః।**
**తదహర్జనసంభారాం కషాయ కటుకాశ్రయామ్॥** **21**
**పరిగృహ్య శుభాం వృత్తిమేతాం దుర్జనవర్జితామ్।**
**వానవాసముపాశ్రిత్య బ్రాహ్మణో నావసీదతి॥** 22

వానప్రస్థము మిక్కిలి కఠినమైనది భరింపరానిది. మృగపక్షులతో కలసియుండవలెను. అతడు ఒకే దినమునకు సరివడు వస్తువులను సంపాదించుకొనవలెను. దుర్జనులకు దూరముగా ఉండవలెను. ఇట్టి ఉత్తమ వృత్తిని స్వీకరించి వనవాసము చేయు బ్రాహ్మణుడు ఎల్లప్పుడు సుఖముగానుండును.

**మృగైస్సహ పరిస్పందః సంవాసస్తైభిరేవ చ।తైరేవ సదృశీ**

**వృత్తిః ప్రత్యక్షం స్వర్గలక్షణమ్॥ప్రత్యక్షం స్వర్గలక్షణమితి॥** 23

వానప్రస్థాశ్రమమున ఉండువాడు మృగములతో కలసి తిరుగవలెను. కలసియుండవలెను. ఇంకను మృగముల వలె జీవితమును గడపవలెను. అట్టి వాన ప్రస్థము ప్రత్యక్ష స్వర్గమువలె ఉండును.

అధ్యాయ పరిసమాప్తిని సూచించుచు పదములు పునరావృత్తి చేయబడినవి.

ఇతి తృతీయః ఖండః

అథ చతుర్థః ఖండః

**అథ యది బ్రహ్మాచార్యవ్రత్యమివ చరేత్॥** 1

ఇంతవరకు వానప్రస్థుని విధులు చెప్పి బ్రహ్మాచారిగురించి చెప్పుచున్నాడు. బ్రహ్మాచారి వ్రతభంగమును చేసినచో ఈ నియమములను పాటించవలెను.

**మాంసమశ్నీయాత్ స్త్రియం వోపేయాత్ సర్వాస్వేవాఽర్తిషు॥** 2

బ్రహ్మాచర్య వ్రతమునకు మాంసభక్షణము, స్త్రీ గమనము తీవ్ర భంగమును కలిగించును. ఈ విధముగా వ్రతభంగమై బాధపడినప్పుడు క్రింద పేర్కొన్నట్లు ప్రవర్తింపవలెను.

**అంతరాఽగారేఽగ్నిముపసమాధాయ సంపరిస్తీర్య**

**అగ్నిముఖాత్ కృత్వా అథాజ్యాహుతీరుపజుహోతి॥** 3

బ్రహ్మాచారి గురువుయొక్క ఇంటిలో అగ్నిని జ్వలింపజేసి ఆ అగ్ని చుట్టు పరిస్తరణ చేసి (పరచి) అగ్ని ముఖమువరకుండు కర్మలనన్నిటిని చేసి క్రింద చెప్పబోవు మంత్రములచే ఆజ్యాహుతులనీయవలెను.

**కామేన కృతం కామః కరోతి కామాయైవేదం సర్వం యో మా**

**కారయతి తస్మై స్వాహా। మనసాకృతం మనః కరోతి మనస**

**ఏవేదం సర్వం యో మా కారయతి తస్మై స్వాహా। రజసా**

**కృతం రజః కరోతి రజస ఏవేదం సర్వం యో మా కారయతి**

**తస్మై స్వాహా। తమసాకృతం తమః కరోతి తమస ఏవేదం సర్వం యో మా కారయతి తస్మై స్వాహా। పాప్మనాకృతం పాప్మా కరోతి పాప్మన ఏవేదం సర్వం యో మా కారయతి తస్మై స్వాహా। మన్యునా కృతం మన్యుః కరోతి మన్యవ ఏవేదం సర్వం యో మా కారయతి తస్మై స్వాహేతి॥** 4

పై ఆరు మంత్రములచే ఆరు ఆజ్యాహుతులనివ్వవలెను.

**జయప్రభృతి సిద్ధమాధేను వరప్రదానాత్।** 5

తరువాత జయాది హోమములను చేసి,ఆచార్యునకు గోదానము ఇవ్వవలెను. ఈ విధానమంతయు ప్రసిద్ధమైనది.

**అపరేణాగ్నిం కృష్ణాజినేన ప్రాచినగ్రీవేణ ఉత్తరలోమ్నా వసతి॥** 6

పడమరదిక్కున తల, పైకి వెంద్రుకలుండు కృష్ణాజినమును అగ్నికి పశ్చిమ భాగమున (వెనక) పరచుకొని రాత్రియంతయు దానిపై కూర్చుండవలెను.

**అథ వ్యుష్టాయాం జఘనార్ధాదాత్మానమపకృష్య తీర్థం గత్వా ప్రసిద్ధం స్నాత్వా అంతర్జలగతో అఘమర్షణేన షోడశ ప్రాణాయామాన్ ధారయిత్వా ప్రసిద్ధమ్ ఆదిత్యోపస్థానాత్ కృత్వా ఆచార్యస్య గృహానేతి॥** 7

ఈ విధముగా రాత్రియంతయు కూర్చొనియుండి తెల్లవారిన తరువాత తన శరీరము క్రింది భాగమునుండి తన ఆత్మను బయటకు లాగినట్లు,దానిని మరల తన శరీరమున చేర్చినట్లు భావించుకొని నదికి పోయి స్నానము చేయవలెను. స్నానవిధియంతయు ప్రసిద్ధమైనది.( ఇంతకు ముందే చెప్పబడినది) తరువాత జలాశయములో నిలుచుండి అఘమర్షణ మంత్రములచేత పదునారు ప్రాణాయామములను చేసి సూర్యోపస్థానమును కూడా చేయవలెను. ప్రాణాయామ పద్ధతి ,(ప్రాతఃకాల) సూర్యోపస్థాన విధానము, రెండు కూడ ప్రసిద్ధమైనవి. తరువాత అతడు ఆచార్యునియొక్క ఇంటికి పోవలెను.

**యథాఽశ్వమేధావభృథమేవైతద్విజానీయాదితి॥** 8

ఈ విధముగా బ్రహ్మచారి ప్రాయశ్చిత్తమును చేసికొన్నచో అది అశ్వమేధయాగమున అవభృథస్నానము చేసికొన్న ఫలితము నిచ్చునని తెలియునది.

ఇతి చతుర్థః ఖండః

అథ పంచమః ఖండః

**అథాతః పవిత్రాతిపవిత్రస్యాఘమర్షణస్యకల్పం వ్యాఖ్యాస్యామః॥**

ఇక మిక్కిలి పవిత్రమైన అఘమర్షణసూక్త విధానమును వివరింతును.

**తీర్థం గత్వా స్నాతః శుచివాసా ఉదకాంతేస్థండిలముద్ధృత్య సకృత్ క్లిన్నేన వాససా సకృత్పూర్ణేన పాణినా ఆదిత్యాऽభిముఖో అఘమర్షణం స్వాధ్యాయమధీయీత॥** 2

తొలుత జలాశయమునకు పోయి, ఆచమనాదులతో మంత్రములచే మార్జన చేసికొనుచు స్నానమును ఆచరించిన తరువాత, ఉదికిన వస్త్రమును కట్టుకొనవలెను. తరువాత తీరమందు సూర్యునివలె గుండ్రముగానుండు స్థండిలమును సిద్ధము చేసికొనవలెను. తరువాత ఒకసారి మాత్రమే తడిపిన వస్త్రము ద్వారా జలమును (వడగట్టిన) చేతిలోనికి ఒక పర్యాయము తీసికొని సూర్యునకు ఎదురుగా (స్థండిలమునకు వెనక) నిలబడి అఘమర్షణ సూక్తమును అధ్యయనము చేయవలెను.

**ప్రాతశ్శతం మధ్యాహ్నే శతం అపరాహ్ణే శతం అపరిమితం వా॥**

ఈ విధముగా ప్రాతఃకాలమున నూరు పర్యాయములు, మధ్యాహ్నము నూరు పర్యాయములు, సాయంకాలము నూరు పర్యాయములు లేక అపరిమితముగానైనను అఘమర్షణ మంత్రములను చదువవలెను.

**ఉదితేషు నక్షత్రేషు ప్రసృతయావకం ప్రాశ్నీయాత్॥** 4

నక్షత్రములు వచ్చువరకు అఘమర్షణ సూక్తమును పారాయణము చేసి రాబోవు అధ్యాయములో చెప్పు ప్రసృత యావకమును భుజింపవలెను.

**జ్ఞానకృతేభ్యో అజ్ఞానకృతేభ్యశ్చోపపాతకేభ్యః సప్తరాత్రాత్ ప్రముచ్యతే॥** 5

ఈ విధముగా ఏడు దినములు నియమముతో అఘమర్షణ సూక్త పారాయణమును, రాత్రిపూట ప్రసృతయావకమును భుజించినచో తెలిసి లేక తెలియక చేసిన ఉపపాతకములన్నీ తొలగిపోవును.

**ద్వాదశ రాత్రాత్ భ్రూణహననం గురుతల్పగమనం సువర్ణ స్తైన్యం సురాపానమితి చ వర్జయిత్వా॥** 6

ఇట్లే పన్నెండు దినములు నిష్ఠతో పారాయణము చేసినచో బ్రహ్మహత్యాది మహాపాపములు తప్ప తక్కిన పాపములన్నియు నశించును.

**ఏక వింశతి రాత్రాత్ తాన్యపి తరతి తాన్యపి జయతి॥** 7

ఇరువది యొక్క దినములు పారాయణము చేసినచో బ్రహ్మహత్యాది మహాపాపములు నశించి సమస్త పుణ్యములు లభించును.

**సర్వం తరతి సర్వం జయతి సర్వక్రతుఫలమవాప్నోతి**
**సర్వేషు తీర్థేషు స్నాతో భవతి సర్వేషు వేదేషు చీర్ణవ్రతో**
**భవతి సర్వైర్దేవైర్ జ్ఞాతో భవతి ఆచక్షుషః పంక్తిం**
**పునాతి కర్మాణి చాస్య సిధ్యంతీతి బౌధాయనః॥** 8

అఘమర్షణసూక్తమును ఈ విధముగా నియమముతో పారాయణము చేసినచో సమస్త పాపములు నశించును. సమస్త పుణ్యములు లభించును. సమస్త యాగములు చేసిన ఫలము కలుగును. సమస్త పుణ్యతీర్థములందు స్నానము చేసిన ఫలితము లభించును. సమస్త వేదములనధ్యయనము చేసిననవాడగును. సమస్త దేవతలు అతనిని అనుగ్రహింతురు. అతడు చూచినంత మాత్రమున పంక్తి పావనమగును. అతడు చేసిన కర్మలన్నియు సిద్ధించును అని బౌధాయనుడనెను.

ఇచ్చట బౌధాయన శబ్దముచ్చరించుట వలన ఈ గ్రంథమును బోధాయనుని శిష్యుడు రచించినట్లు తోచుచున్నది. లేక వేదవ్యాసుని జయాఖ్య సంహితను వైశంపాయనుడు, తరువాతి కాలమున సూతమహర్షి చెప్పినట్లు, రామాయణమును కుశలవులు గానము చేసినట్లు, బోధాయన మహర్షి చెప్పిన సూత్రములను అతని శిష్యుడు గ్రంథస్థము చేసియుండవచ్చును. 2-9 ఖండములోని 14 వ సూత్రమున కాణ్వుడను బౌధాయనుడు కనిపించును. కాని ధర్మసూత్రము బోధాయనుని పేరుతోనే ఉన్నది.

ఇతి పంచమః ఖండః

అథ షష్ఠః ఖండః

**అథ కర్మభిరాత్మకృతైర్గురుమివాత్మానం మన్యేతాఽఽత్మార్థే ప్రసృత యావకం శ్రపయేదుదితేషు నక్షత్రేషు॥** 1

తాను చేసిన తప్పుడు పనులచే పరితాపము పొంది, తాను పాపాత్ముడైనట్లు భావించినప్పుడు రాత్రిపూట నక్షత్రములు ఉదయించువేళ ప్రసృతయావకమును వండవలెను. ప్రసృతమనగా ఒకచేతిలో పట్టునవి. చారెడు కాబోలు. చారెడు యవలను తెచ్చి చేయునది ప్రసృతయావకము,

**న తతోఽగ్నౌ జుహుయాన్న చాత్ర బలికర్మ॥** 2

ప్రసృత యావకమును వండి దానిచే హోమము చేయరాదు. అట్లే బలికర్మ కూడా చేయరాదు.

**అశ్రుతం శ్రప్యమాణం శృతం చాభిమంత్రయేత్॥** 3

ప్రసృత యావకమును వండుటకు ముందు, వండుచున్నప్పుడు దానిని వండిన తరువాత కూడ ఈ మంత్రము చేత అభిమంత్రింపవలెను.

**యవోఽసి ధాన్యరాజోఽసి వారుణో మధుసంయుతః।**
**నిర్ణోదస్సర్వపాపానాం పవిత్రమృషిభిస్స్మృతమ్॥** 4

ఓయవ ధాన్యమా! నీవు ధాన్యరాజువు. నిన్ను వరుణునికి సంబంధించిన కార్యములలో ఎక్కువగా వినియోగింతురు. తేనెతో కలసి యున్న నీవు పరమ పవిత్రమైనదానివని సమస్త పాపములను తొలగింతువని మహర్షులు అందురు అని ఈ మంత్రముయొక్క అర్థము.

**ఘృతం యవా మధు యవా ఆపో యవా అమృతం యవాః।**
**సర్వం పునథ మే పాపం యన్మయా దుష్కృతం కృతమ్॥** 5

ఓయవలారా! మీరు నేయివంటివారు, తేనె వంటివారు, జలముల వంటి వారు, చివరకు మీరే అమృత స్వరూపులు. అందువలన నేను చేసిన పాపమునంతయు మీరు తొలగించుడు

**వాచాకృతం కర్మ కృతం మనసా దుర్విచింతితమ్।**
**అలక్ష్మీం కాళరాత్రీం చ సర్వం పునథ మే యవాః॥** 6

నేను మనోవాక్కాయములచే చేసిన పాపములను మహాభయంకరమైన నా భాగ్యరాహిత్యమును అంతయు తొలగించి నన్ను మీరు పవిత్రము చేయుడు.

**శ్వ సూకరావధూతం యత్కాకోచ్ఛిష్టోపహతం చ యత్।**
**మాతా పిత్రోరశుశ్రూషాం సర్వం పునథ మే యవాః॥ 7**

కుక్కలు, పందులు, ముట్టుకొన్న వాటిని కాకులు తిన్నదానిని తిన్నందువలన, తల్లిదండ్రులకు సేవచేయనందువలన కలుగు పాపమునంతయు మీరు తొలగించుడు.

**మహాపాతక సంయుక్తం దారుణం రాజకిల్బిషమ్।**
**బాలవృత్తమధర్మం చ సర్వం పునథ మే యవాః॥ 8**

యవలారా! నేను చేసిన మహాపాపమును భయంకరమైన రాజకిల్బిషమును, (రాజ సేవ చేయునప్పుడు చేసిన పాపము) అజ్ఞానముచే నేను చేసిన పాపమునంతయు మీరు తొలగించుడు.

**సువర్ణస్తైన్యమవ్రత్యమ్ అయాజ్యస్య చ యాజనమ్।**
**బ్రాహ్మణానాం పరీవాదం సర్వం పునథ మే యవాః॥ 9**

దొంగతనమువలన, వ్రత భంగము చేసినందువలన, యాగార్హత లేని వానిచే యాగము చేయించుటవలన, బ్రాహ్మణులను నిందించుటవలన కలిగిన పాపమునంతయు ఓయవలారా! మీరు తొలగింపుడు.

**గణాన్నం గణికాన్నం చ శూద్రాన్నం శ్రాద్ధసూతకమ్।**
**చోరస్యాన్నం నవశ్రాద్ధం సర్వం పునథ మే యవాః॥ 10**

యవలారా! అనేకులకు పెట్టు అన్నమును తిన్నందువలన, వేశ్యాన్నమును తిన్నందువలన, శూద్రుని అన్నమును తిన్నందువలన, ఇతరుల జనన మరణ సూతకములందలి అన్నమును తిన్నందువలన, దొంగ ఇంట్లో అన్నము తిన్నందువలన, నవ శ్రాద్ధములకు సంబంధించిన అన్నమును తిన్నందువలన కలుగు పాపమును మీరు తొలగించుడు.

**శ్రపయ్యమాణే రక్షాం కుర్యాత్॥ 11**

ఈ ప్రస్తుత యావకమును వండుచున్నప్పుడు ఈ క్రింది మంత్రములచేత దానిని రక్షింపవలెను.

**"నమో రుద్రాయ భూతాధిపతయే ద్యౌశ్శాంతా"॥** 12

**'కృణుష్వపాజః ప్రసితిం పృథివ్యాః యే దేవాః**
**పురస్సదోఽగ్ని నేత్రా రక్షోహణ' ఇతి పంచభిః**
**పర్యాయైః॥ 'మానస్తోకే' బ్రహ్మాదేవానామితి ద్వాభ్యామ్॥** 13

నమో రుద్రాయ అను మంత్రమును, ద్యౌశ్శాంతా అను మంత్రమును "కృణష్వపాజ" అను తైత్తిరీయ సంహితలోని అనువాకమును'యే దేవా' పురస్సదో అను అనువాకమును ఐదుపర్యాయములు, 'మానస్తోకే' అను మంత్రము మరియు బ్రహ్మాదేవానామ్ అను రెండు మంత్రములను, రక్షోఘ్న మంత్రములుగా యావకమును వండునప్పుడు చదువవలెను.

**శృతం చ లఘ్వశ్నీయాత్ ప్రయతః పాత్రే నిషిచ్య॥** 14

ఈ యావకమును వండిన తరువాత ఇంకొక పాత్రలోకి తీసికొని, తాను ఆచమనాదులచేత పరిశుద్ధుడై, కొంచెము యావకమును మాత్రము తినవలెను.

**యే దేవా మనోజాతా మనోయుజస్సుదక్షా దక్ష**
**పితారస్తే నః పాంతు తే నోఽవంతు తేభ్యో**
**నమస్తేభ్యస్స్వాహేత్యాత్మని జుహుయాత్ ॥** 15

'యే దేవా మనోజాతా' అను మంత్రమును చదువుచు వండిన యావకాన్నమును తినవలెను.

**త్రిరాత్రం మేధార్థే॥** 16

మేధాసంపన్నుడు కావలెనని భావించినచో ఈ ప్రస్తుతయావకాన్నమును మూడు రాత్రులు వండుకొని తినవలెను.

**షడ్రాత్రం పీత్వా పాపకృచ్ఛుద్ధో భవతి॥** 17

ఈ విధముగా ఆరు రాత్రులు తిన్నచో సామాన్య పాపములు చేసినవాడు పరిశుద్ధుడగును.

**సప్తరాత్రం పీత్వా భ్రూణహననం గురుతల్పగమనం**
**సువర్ణస్తైన్యం సురాపానమితి చ పునాతి ॥** 18

ఈ విధముగా మంత్ర పూర్వకముగా యావకాన్నమును వండి

మంత్రపూర్వకముగా ఏడు రాత్రులు తీసికొన్నచో బ్రహ్మహత్య మొదలైన మహాపాపములు కూడా పటాపంచలైపోవును.

**ఏకాదశరాత్రం పీత్వా పూర్వపురుషకృతమపి పాపం నిర్ణుదతి॥** 19

ఈ విధముగా పదకొండు రాత్రులు ప్రస్తుత యావకాన్నమును తీసికొన్నచో అతని పూర్వీకులు చేసిన పాపము కూడ తొలగును.

**అపి వా గోనిష్క్రాంతానాం యవానామేకవింశతిరాత్రం**
**పీత్వా గణాన్ పశ్యతి గణాధిపతిం పశ్యతి విద్యాం పశ్యతి**
**విద్యాధిపతిం పశ్యతీత్యాహ భగవాన్ బౌధాయనః॥** 20

అట్లే ఆవులు దాటిన యవలు తీసికొని ప్రస్తుత యావకాన్నమును పై నియమములచే వండి ఇరువది ఒక్క రాత్రులు తీసికొన్నచో గణములను, గణాధిపతిని మరియు విద్యను, విద్యాధిపతిని దర్శింపగలడని బౌధాయనుడు పేర్కొనెను.

ఇతి షష్ఠః ఖండః

## అథ సప్తమః ఖండః

**అథ కూష్మాండైర్జుహుయాద్యోఽపూత ఇవ మన్యేత॥** 1

తాను అపవిత్రుడైనట్లు భావించువాడు కూష్మాండ మంత్రములచే హోమముచేయవలెను.

**యథా స్తేనో యథా భ్రూణహైవమేష భవతి**
**యో యోనౌ రేతస్సించతి॥** 2

బ్రాహ్మణుని ధనమును దొంగిలించుట, బ్రాహ్మణుని హత్య చేయుట, పొందకూడని స్త్రీని పొందుట అనునవి అపవిత్రతను కలిగించును.

**యదర్వాచీనమేనో భ్రూణహత్యాయాస్తస్మాన్ముచ్యత ఇతి॥** 3

బ్రాహ్మణ హత్యకంటే చిన్న పాపము ఈ కూష్మాండహోమమువలన పోవునని వేదము చెప్పుచున్నది.భ్రూణుడనగా బ్రాహ్మణుడని ఈ గృహ్యసూత్రమే (1-7-6) తెలుపుచున్నది.

**అయోనౌ రేతస్సిక్త్వాఽన్యత్ర స్వప్నాత్** 4

**అరేపా వా పవిత్ర కామో వా॥** 5

స్వప్నమున పరస్త్రీ గమనము చేసినట్లు వచ్చినచో తప్పులేదు కాని నిజముగా ఇతర స్థలములందు వీర్య స్థలనము చేసినచో రేప అను పాపము కలుగును అట్టి పాపము, ఇంకను ఇతర పాపములు తొలగి పవిత్రుడు కావలెనని అనుకొన్నచో ఈ కూష్మాండ మంత్రములచే హెూమము చేయవలెను.

4 వ సూత్రములోని "అన్యత్ర స్వప్నాత్" అనునది వేదమున కనిపించదని గోవిందస్వామి తన వ్యాఖ్యలో పేర్కొనెను.

**అమావాస్యాయాం పౌర్ణమాస్యాం వా కేశ శ్మశ్రు లోమ**
**నఖాని వాపయిత్వా బ్రహ్మచారికల్పేన వ్రతముపైతి॥** 6

అమావాస్య లేక పౌర్ణమినాడు వెంట్రుకలు గోళ్ళు అన్ని తీయించుకొని బ్రహ్మచారి అనుష్ఠించు వ్రతమునవలంబింపవలెను.

**సంవత్సరం మాసం చతుర్వింశత్యహెూ ద్వాదశ**
**రాత్రీః షట్ తిస్రో వా॥** 7

ఈ వ్రతమును ఒక సంవత్సరమువరకు, లేక ఒక నెలవరకు, లేక ఇరువది నాలుగు దినములు లేక పన్నెండు దినములు కానిచో ఆరు దినములు లేక మూడు దినములు కూడ చేయవచ్చును.

**న మాంసమశ్నీయాన్న స్త్రియముపేయాన్నో**
**పర్యాసీత జుగుప్సేతానృతాత్॥** 8

ఈ వ్రతముచేయునప్పుడు మాంసమును తినరాదు. భార్య దగ్గరకు కూడ పోరాదు. ఎత్తైన వాటిపైన కూర్చొనరాదు. అట్లే అబద్ధమాడరాదు.

**పయో భక్షః ఇతి ప్రథమః కల్పః॥** 9

పాలను మాత్రము తీసికొని వ్రతము నాచరించుట ఉత్తమమైనది

**యావకం వోపయుంజానః కృచ్ఛ్రద్వాదశరాత్రం చరేత్**
**భిక్షేద్వా తద్విధేషు యవాగూం రాజన్యః వైశ్య ఆమిక్షామ్॥** 10

ఆ సమయమున యావకాన్నమును మాత్రముపయోగించుచు కృచ్ఛ్ర ద్వాదశ

రాత్రమునవలంబింపవలెను. లేనిచో భిక్షమెత్తుకొనియైనను జీవింపవలెను. ఇదే స్థితియందు రాజు యవాగును భుజింపవలెను. వైశ్యుడు ఆమిక్ష(మీగడ) తినవలెను.

**పూర్వాహ్ణే పాకయజ్ఞిక ధర్మేణ అగ్నిముపసమాధాయ సంపరిస్తీర్య అగ్నిముఖాత్ కృత్వా 'యద్దేవా దేవహేలనమ్', యదదీవ్యన్నృణమహం బభూవ, 'ఆయుష్టే విశ్వతో దధదిత్యేతైః త్రిదిత్యనువాకైః ప్రత్యృచమాజ్యస్య హుత్వా సింహే వ్యాఘ్రే ఉత యా పృదాకావితి చతస్రస్స్రువాహుతీః జుహోతి। అగ్నేఽభ్యావర్తిన్', అగ్నే అంగిరః, పునరూర్జా, సహరయ్యేతి చతస్రోఽభ్యావర్తినీర్హుత్వా సమిత్పాణిః యజమానలోకేఽవస్థాయ వైశ్వానరాయ ప్రతివేదయామ ఇతి ద్వాదశర్చేన సూక్తేనోపస్థాయ యన్మే మనసా వాచా కృతమేనః కదాచన। సర్వస్మాన్మేళితో మోగ్ధి త్వం హి వేత్థ యథాతథగ్ స్వాహేతి సమిధమాదాయ వరం దదాతి॥** 11

పూర్వాహ్ణమున పాకయజ్ఞ ధర్మమననుసరించి అగ్నిని జ్వలింపజేయవలెను. తరువాత దర్భలు పరచి(పరిస్తీర్ణము చేసి) అగ్ని ముఖము వరకు హోమము చేసి యద్దేవాదేవ హేలనమ్ ఇత్యాది మూడు అనువాకములతో ఒక్కొక్క ఋక్కునకు ప్రత్యేకముగా ఆజ్యాహుతులనీయవలెను. తరువాత "సింహే వ్యాఘ్రే" ఇత్యాది నాలుగు మంత్రములచే స్రువముచే నాలుగు ఆహుతులనీయవలెను. తరువాత "అగ్నేఽభ్యావర్తిన్" ఇత్యాది నాలుగు మంత్రములచేత నాలుగు అభ్యావర్తినీ ఆహుతులను ఇచ్చి యజమాని ఆసమున కూర్చొని, చేతిలో సమిధ పట్టుకొని వైశ్వానరాయ ప్రతివేదయామ" అను పన్నెండు ఋక్కులున్న అనువాకముచే అగ్నిహోత్రుని స్తుతించి యన్మే మనసా అనుదానిని చదువుచు సమిధను అగ్నిలో వేయవలెను. తరువాత ఆచార్యునకు వరరూపమైన గోవును దక్షిణగా ఇవ్వవలెను.

**జయప్రభృతి సిద్ధమాధేను వరప్రదానాత్॥** 12

జయాది హోమముమొదలు ఆచార్యునకు గోవును దక్షిణగా ఇచ్చునంతవరకున్న ప్రక్రియ యజ్ఞములు చేయువారందరకును తెలిసినదే.

**ఏక ఏవాగ్నౌ పరిచర్యాయామ్॥** 13

బ్రహ్మచారి వ్రతమున అగ్ని పరిచర్య చేయునప్పుడు (హోమము చేయునప్పుడు) ఇతరుల సహాయము తీసికొనక తానొక్కడే చేయవలెను.

**అగ్న్యాధేయే "యద్దేవో దేవహేళనమ్। యదదీవ్యన్నృణమహం**
**బభూవ। ఆయుష్టే విశ్వతో దధది"తి పూర్ణాహుతిమ్॥** 14

అగ్న్యాధేయమున "యద్దేవో దేవహేళనమ్' ఇత్యాది మంత్రములచే పూర్ణాహుతినీయవలెను.

**హుత్వాగ్నిహోత్రమారప్స్యమానో దశహోత్రా**
**హుత్వా దర్శపూర్ణమాసావారప్స్యమానశ్చతుర్హోత్రా**
**హుత్వా చాతుర్మాస్యాన్యారప్స్యమానః పంచహోత్రా**
**హుత్వా పశుబంధే షడ్ఢోత్రా సోమే సప్తహోత్రా॥** 15

పూర్ణాహుతి చేసిన తరువాత తిరిగి హోమము చేయుటకుముందు "చిత్తిస్స్రుక్" అను దశహోతృ మంత్రములచే హోమము చేయవలెను. తరువాత దర్శపూర్ణమాసములను చేయుటకు ముందు "పృథివీ హోతా" అను చతుర్హోతృమంత్రములచే హోమము చేయవలెను. తరువాత చాతుర్మాస్యములను ఆరంభించునప్పుడు "అగిర్హోతా" అను పంచహోతృమంత్రములచే హోమము చేయవలెను. అట్లే పశుబంధహోమము చేయునప్పుడు "వాగ్ఘోతా" ఇత్యాది షడ్ఢోతృమంత్రములచే సోమయజ్ఞము చేయునప్పుడు 'మహాహవిర్హోతా' ఇత్యాది సప్తహోతృమంత్రములచే, హోమము చేయవలెను.

**విజ్ఞాయతే కర్మాదిష్వేతైర్జుహుయాత్ పూతో దేవలోకాన్**
**సమశ్నుతే ఇతి హి బ్రాహ్మణమితి హి బ్రాహ్మణమ్॥** 16

కర్మ ప్రారంభమున ఈ కూష్మాండ మంత్రములచే హోమము చేయవలెను. కూష్మాండ హోమము చేసినచో పవిత్రుడై దేవలోకమునకు పోవును. అని వేదమందు చెప్పబడినది.

ఇతి సప్తమః ఖండః

## అథ అష్టమః ఖండః

**అధాతశ్చాంద్రాయణకల్పం వ్యాఖ్యాస్యామః॥** 1

ఇక చాంద్రాయణ వ్రతవిధానమును వివరింతును.

**శుక్ల చతుర్దశీముపవసేత్॥** 2

చాంద్రాయణవ్రతమునుచేయసంకల్పించిన మాసమందు శుద్ధ చతుర్దశినాడు ఉపవాసముండవలెను.

**కేశ శ్మశ్రు లోమ నఖాని వాపయిత్వా అథవా శ్మశ్రూణ్యేవ॥** 3

పాపములకు ప్రాయశ్చిత్తముగా చాంద్రాయణ వ్రతమును చేయునప్పుడు ఒకరోజు ముందు వెంద్రుకలు, గోళ్ళు అన్నీ తీయించుకొనవలెను. లేక గడ్డమును మాత్రము తీసికొనవచ్చును.

**అహతం వాసో వసానః సత్యం బ్రువన్నావసథమభ్యుపేయాత్॥** 4

వెంద్రుకలు తీయించుకొన్న తరువాత నూతన వస్త్రములను ధరించి సత్యమునే పలుకుచు ఇంటికి రావలెను.

**తస్మిన్నస్య సకృత్ప్రణీతోఽగ్నిరరణ్యోర్నిర్మంథ్యో వా॥** 5

చాంద్రాయణ వ్రతము చేస్తున్నంతవరకు అగ్ని ఇంటిలో తప్పక ఉండవలెను. కావున ఏదేని ఒక ప్రయోజనమునకై తెచ్చిన లౌకికాగ్ని లేక అరణులను మథించి చేసిన అగ్నియైన కావలెను.

**బ్రహ్మచారీ సుహృత్త్రైషాయోపకల్పీ స్యాత్॥** 6

అగ్నిమథనాది కార్యములను ఒక్కడే చేసికొనలేనందువలన సహాయకుడుగా బ్రహ్మచారి మరియు సహాయపడు స్నేహితుని తీసికొనవలెను. ఒకనిని సహాయకుడెప్పుడు అతని దగ్గరనే ఉండవలెను.

**హావిష్యం చ వ్రతోపాయనమ్॥** 7

చాంద్రాయణ వ్రతము చేయునప్పుడు అతడు ఉప్పుకారము లేని ఆహారమునే తీసికొనవలెను.

**అగ్నిముపసమాధాయ సంపరిస్తీర్య**
**అగ్నిముఖాత్కృత్వా పక్వాజ్జుహోతి॥** 8

అగ్నిని జ్వలింపజేసి దాని చుట్టు దర్భలు పరచి అగ్నిముఖమువరకు హెూమము చేసి అన్నముచే హెూమము చేయవలెను.

**అగ్నయే యా తిథిస్స్యాత్ నక్షత్రాయ సదైవతాయ**
**"అత్రాహ గోరమన్వత" ఇతి చాంద్రమసీం పంచమీం**
**ద్యావాపృథివీభ్యాం షష్ఠీం అహెూరాత్రాభ్యాం సప్తమీం**
**రౌద్రీమష్టమీం సౌరీం నవమీం వారుణీం దశమీం**
**ఐంద్రీం ఏకాదశీం వైశ్వదేవీం ద్వాదశీమితి॥ 9**

ఈ హెూమమున పన్నెండు ఆహుతులుండును. మొదటి ఆహుతి అగ్నికి, రెండవ ఆహుతి నాటి తిథికి, మూడవ ఆహుతి నాటి నక్షత్రమునకు, నాలుగవ ఆహుతి ఆ నక్షత్ర దేవతకు, "అత్రాహ గోరమన్వత" అని ఐదవ ఆహుతి చంద్రునకు, ఆరవ ఆహుతి ద్యావాపృథివికి, ఏడవ ఆహుతి ఆహెూరాత్రులకు, ఎనిమిదవ ఆహుతి రుద్రునకు, తొమ్మిదవ ఆహుతి సూర్యునకు, పదవ ఆహుతి వరుణునకు, పదకొండవ ఆహుతి ఇంద్రునకు, వైశ్వదేవులకు పన్నెండవ ఆహుతిని ఈయవలెను.

**అథాఽపరాస్సమామనంతి- దిగ్భ్యశ్చ సదైవతాభ్యః ఉరోరం -**
**తరిక్షాయ సదైవతాయ నవోనవో భవతి జాయమాన ఇతి॥ 10**

ఇంకను "నవో నవో భవతి" అను మంత్రము చదువుచు నాలుగు దిక్కులకు ఆ దిగ్దేవతలకు, ఉరవేఽంతరిక్షాయస్వాహా అనుచు అంతరిక్షమునకు, అట్లే అంతరిక్ష దేవతయగు వాయువునకు ఆహుతులనీయవలెను.

**సౌవిష్టకృతీం హుత్వా అథైతద్ధవిరుచ్ఛిష్టం కంసే వా**
**చమసే వా వ్యుద్ధృత్య హవిష్యైర్వ్యంజనైరుపసిచ్య**
**పంచదశ పిండాన్ ప్రకృతిస్థాన్ ప్రాశ్నాతి॥ 11**

తరువాత స్విష్టకృద్ధోమమును చేసి హెూమము చేయగా మిగిలిపోయిన హవిస్సులను కంచమున లేక చమసమను పాత్రలోనికి తీసికొని ఉప్పుకారము లేక సాధారణరూపమున ఉన్న పదునైదు ముద్దలను తినవలెను.

**ప్రాణాయ త్వేతి ప్రథమమ్। అపాన త్వేతి ద్వితీయమ్।వ్యానాయ త్వేతి**
**తృతీయమ్। ఉదానాయ త్వేతి చతుర్థమ్।సమానాయ త్వేతి పంచమమ్॥12**

"ప్రాణాయ త్వా" అనుచు మొదటి ముద్దను" అపానాయ త్వా" అనుచు రెండవముద్దను వ్యానాయ త్వా అనుచు మూడవముద్దను ఉదానాయ త్వా అనుచు నాలుగవ ముద్దను సమానాయ త్వా అనుచు ఐదవముద్దను తినవలెను.

**యది చత్వారో ద్వాభ్యాం పూర్వమ్॥** 13

మంత్రములతో నాలుగు ముద్దలు మాత్రమే తినునప్పుడు మొదటి రెండు ముద్దలను పూర్వ మంత్రమైన "ప్రాణాయ త్వా" అనుచు తినవలెను.

**యదా త్రయో ద్వాభ్యాం ద్వాభ్యాం పూర్వౌ॥** 14

మూడుముద్దలు మాత్రము తినుచున్నప్పుడు మొదటి ముద్దను "ప్రాణాయ త్వా" అపానాయ త్వా అను మంత్రముల చేత, తరువాతి ముద్దను "వ్యానాయ త్వా" ఉదానాయత్వా అను మంత్రముల చేత తరువాత ముద్దను తరువాతి మంత్రమును చదువుచు తినవలెను.

**యదా ద్వౌ ద్వాభ్యాం పూర్వం త్రిభిరుత్తరమ్॥** 15

రెండుముద్దలు మాత్రమే తినునప్పుడు మొదటిముద్దను మొదటి రెండు మంత్రములచేత తరువాతి ముద్దను తరువాతి మూడు మంత్రములను చదువుచు తినవలెను.

**ఏకం సర్వైః ॥** 16

మంత్రములతో ఒకే ముద్దను తినునప్పుడు అన్ని (ఐదు) మంత్రములను చదువుచు తినవలెను.

**"నిగ్రాభ్యాస్థ" ఇత్యపః పీత్వా అథాఽజ్యాహుతీరుపజుహోతి॥** 17

అమృతాపి ధానమసి అను మంత్రమును చదువవలసిన చోట "నిగ్రాభ్యాస్థ దేవశ్రుత ఆయుర్మేతర్పయత" ఇత్యాది తైత్తిరీయ సంహితలోని 3-1-8-1 మంత్రమును చదువుచు ఉత్తరపరిషేచన తీర్థమును తీసికొనవలెను. తరువాత చెప్పబోవు మంత్రములచే ఆజ్యాహుతులనివ్వవలెను.

**ప్రాణాపాన వ్యానోదాన సమానామే శుద్ధ్యంతాం**
**జ్యోతిరహం విరజా విపాప్మాభూయాసగ్ంస్వాహా।**
**శిరః పాణి త్వక్చర్మ శబ్ద స్పర్శ పృథివీ అన్నమయ**

**ప్రాణమయ ఇత్యేతైస్సప్తభిరనువాకైః॥** 18

"ప్రాణాపాన వ్యానోదాన సమానా మే శుద్ధ్యంతామ్" ఇత్యాది ఏడు అనువాకములచే ఏడు ఆజ్యాహుతులను చేయవలెను.

ఈ మంత్రములు తైత్తిరీయ మహానారాయణోపనిషత్తున కనిపించును. ఆంధ్రపాఠమున ఇవి మంత్రములుగా చెప్పబడగా ద్రావిడ పాఠమున అను వాకములుగా కనిపించును.

**జయప్రభృతి సిద్ధమాధేనువరప్రదానాత్॥** 19

జయాది హెూమము మొదలుకొని ఆచార్య దక్షిణగా గోవును దానము చేయుటవరకున్న భాగమంతయు యాజ్ఞికులకు బాగా తెలిసియున్నది. (అందువలన వివరింపలేదు)

**సౌరీభిరాదిత్యముపతిష్ఠతే చంద్రమసీభిశ్చంద్రమసమ్ ॥** 20

సూర్యునకు సంబంధించిన "ఉద్వయం తమసస్పరి" "ఉదుత్యం" "చిత్రం దేవానామ్" అను మూడు మంత్రములచేత సూర్యుని, చంద్రునకు సంబంధించిన" నవోనవోభవతి" "సచిత్ర చిత్రమ్" "అత్రా హ గోరమన్వత" అను మూడు మంత్రములచేత చంద్రుని ప్రార్థింపవలెను.

**"అగ్నే త్వగ్ం సుజాగృహీ"తి సంవిశన్ జపతి।**
**త్వమగ్నే వ్రతపా అసీతి ప్రబుద్ధః॥** 21

రాత్రిపూట పడుకొనుటకు ముందు "అగ్నే త్వగ్ం సుజాగృహి" అను మంత్రమును, ఉదయమున నిద్రనుండి లేవగానే "త్వమగ్నే వ్రతపా అసి " అను మంత్రమును చదువవలెను.

**స్త్రీ శూద్రైర్నాభిభాషేత మూత్రపురీషే నావేక్షేత॥** 22

వ్రతమునాచరించుచున్నప్పుడు స్త్రీలతో, శూద్రులతో మాట్లాడరాదు. అట్లే మల మూత్రములను చూడరాదు.

**అమేధ్యం దృష్ట్వా జపత్యబద్ధం మనో దరిద్రం**
**చక్షుస్సూర్యో జ్యోతిషాగ్ం శ్రేష్ఠో దీక్షే మా మాహాసీరి'తి ।**

**అథ యద్యేనమభివర్షత్యుందతీర్బలం ధత్తేతి॥** 23

పొరపాటున అమేధ్యమును చూచినచో అబద్ధం మనోదరిద్రం అను మంత్రమును చదువవలెను అట్లే దానిపై నీరు పోసినచో "ఉందతీర్బలం" అను మంత్రమును చదువవలెను

**ప్రథమాయామపరపక్షస్య చతుర్దశగ్రాసాన్॥** 24

కృష్ణపక్షమందలి పాడ్యమినాడు పదునాలుగు ముద్దలను తినవలెను.

**ఏవమేకాపచయేనా౽మావాస్యాయాః॥** 25

ఈ విధముగా అమావాస్య వరకు ప్రతి దినము ఒక్కొక్క ముద్దను తగ్గించవలెను.

**అమావాస్యాయాం గ్రాసో న విద్యతే॥** 26

అమావాస్యనాడు ఉపవాసముండవలెను.

**ప్రథమాయాం పూర్వపక్షస్యైకః॥** 27

**ద్వౌ ద్వితీయస్యామ్॥** 28

అట్లే శుక్ల పక్ష ప్రతిపదనాడు ఒక ముద్దను తినవలెను విదియనాడు రెండు ముద్దలు తినవలెను.

**ఏవమేకోపచయేనా౽పౌర్ణమాస్యాః॥** 29

అదే విధముగా పౌర్ణమి వరకు ప్రతిదినము ఒక్కొక్క ముద్దను పెంచవలెను.

**పౌర్ణమస్యాం స్థాలీపాకస్య జుహోతి॥** 30

పౌర్ణమినాడు స్థాలీపాక హోమమును చేయవలెను.

**అగ్నయే యా తిథిస్స్యాత్॥** 31

అగ్నిదేవతాకమైన తిథినాడు హోమము చేయవలెను.

**నక్షత్రేభ్యశ్చ సదైవతేభ్యః॥** 32

నక్షత్రములకు నక్షత్రసంబంధి దేవతలకు నక్షత్రేష్ఠియందున్న మంత్రములచే హోమము చేయవలెను.

**పురస్తాచ్ఛ్రోణాయా అభిజితస్సదైవతస్య**

**హుత్వా గాం బ్రాహ్మణేభ్యో దద్యాత్॥** **33**

శ్రవణానక్షత్రమునకు పూర్వము అషాఢానక్షత్రముల తర్వాత ఉందు అభిజిన్నక్షత్రమునకు, నక్షత్రాధి దేవతయగు బ్రహ్మకు హెూమము చేసిన తరువాత ఆచార్యునకు గోవును దక్షిణగా ఈయవలెను.

**తదేతచ్చాంద్రాయణం పిపీలికామధ్యమ్॥** 34

దీనిని పిపీలికా మధ్య చాంద్రాయణమని అందురు. అనగా చీమకు నడుము సన్నగా ఉన్నట్లే ఈ వ్రతముయొక్క మధ్య భాగము కూడ సన్నగా ఉండును.

**విపరీతం యవమధ్యమ్ ॥** 35

పై పద్ధతికి విరుద్ధముగా నున్న దానిని (అమావాస్య నాడు ఉపవాసముతో ప్రారంభించి తరువాతి అమావాస్య నాడు పూర్తి చేయు చాంద్రాయణవ్రతమును) యవమధ్యమని అందురు.

**అతోఽన్యతరచ్చరిత్వా సర్వేభ్యః పాతకేభ్యః**
**పాపకృచ్ఛుద్ధో భవతి॥** 36

పై వ్రతములలో దేనినాచరించినను పాపములన్నియు తొలగి అతడు పరిశుద్ధుడగును.

**కామాయ కామాయైతదాహార్యమిత్యాచక్షతే॥** 37

ఇంకను తాను కోరుకొన్న కోరికలు తీరుటకై ఈ వ్రతమునాచరింపవలెననియు అందురు.

**యం కామం కామయతే తమేతేనాప్నోతి॥** 38

పై విషయమునే తిరిగి చెప్పుచున్నాడు. ఈ వ్రతమునాచరించుట వలన కోరుకొన్న కోరికలన్నియు తీరును.

**ఏతేన వా ఋషయ ఆత్మానం శోధయిత్వా పురా కర్మాణ్యసాధయన్॥ 39**

ఋషులు ఈ చాంద్రాయణవ్రతమునాచరించి ఆత్మశుద్ధి చేసికొని కర్మలనన్నిటిని పూర్తి చేయగలిగిరి.

**తదేతద్ధన్యం పుణ్యం పుత్ర్యం పౌత్ర్యం పశవ్యం**

**ఆయుష్యం స్వర్గం యశస్యం సార్వకామికమ్॥** 40

ఈ చాంద్రాయణ వ్రతము వలన ధన్యుడగుచున్నాడు. సంపద, ఆయుస్సు, కీర్తి, స్వర్గము మొదలైన కోరికలన్నియు తీరును

**నక్షత్రాణాం ద్యుతిం సూర్యాచంద్రమసోః**
**సాయుజ్యం సలోకతామాప్నోతి॥** **41**

**య ఉచ్చైనదధీతే య ఉచ్చైనదధీతే॥** 42

ఈ వ్రత విధానమును చక్కగా అధ్యయనము చేసినచో నక్షత్రముల వంటి కాంతిని పొంది చంద్రసూర్యుల లోకమునకు పోయి అక్కడ నివసించును.

ఇతి అష్టమః ఖండః

అథ నవమః ఖండః

**అథాతోనశ్నత్పారాయణవిధిం వ్యాఖ్యాస్యామః॥** 1

ఇక ఉపవాసముండి వేదపారాయణము చేయు పద్ధతిని వివరింతును.

**శుచివాసాః స్యాచ్చీరవాసా వా॥** 2

అనశ్నద్ వేద పారాయణమును చేయునపుడు పరిశుభ్రమైన (ఉదికిన) వస్త్రమునైనను, నారవస్త్రమునైనను ధరింపవలెను.

**హవిష్యమన్నమిచ్ఛేదపః ఫలాని వా॥** 3

యాగమందుపయోగించు హవిష్యాన్నమునైనను, నీరు లేక పండ్ల నైనను ఆహారముగా తీసికొనవలెను.

**గ్రామాత్ప్రాచీం వోదీచీం వా దిశముపనిష్క్రమ్య**
**గోమయేన గోచర్మ మాత్రం చతురశ్రం స్థండిలముపలిప్య**
**ప్రోక్ష్య లక్షణముల్లిఖ్య అద్భిరభ్యుక్ష్య అగ్నిముపసమాధాయ**
**సంపరిస్తీర్య ఏతాభ్యో దేవతాభ్యో జుహుయాత్॥** 4

గ్రామమునుండి తూర్పు లేక ఉత్తరమునకు వచ్చి ఒకచోట చదరముగా ఉన్న గోచర్మమాత్ర స్థలమునెన్నుకొని ఆవుపేడచే స్థండిలమును సిద్ధము చేయవలెను.

ఆ స్థండిలముపై పద్మాది చిహ్నామును ముగ్గుపెట్టి దానిపై నీటిని చల్లవలెను. ఆ స్థండిలముపై అగ్నిని జ్వలింపజేసి దర్భలను చుట్టు పరవవలెను. తరువాత ఈ క్రింది మంత్రములచే ఆయాదేవతల కొరకు హెూమము చేయవలెను.

**అగ్నయే స్వాహా సోమాయ స్వాహా ప్రజాపతయే**
**స్వాహా విశ్వేభ్యో దేవేభ్యః స్వయంభువ ఋగ్భ్యో**
**యజుర్భ్యః సామభ్యోఽథర్వభ్యశ్శ్రద్ధాయై ప్రజ్ఞాయై**
**మేధాయై శ్రియై హ్రియై సవిత్రే సావిత్ర్యై సదసస్పతయే**
**అనుమతయే చ వ్యాహరేన్న చాంతరా విరమేత్॥** 5

అగ్నయే స్వాహా ఇత్యాది మంత్రములచేత అగ్నికి సోమునకు, ప్రజాపతికి, విశ్వేదేవతలకు, స్వయంభువునకు, ఋగ్వేదాది వేదములకు, శ్రద్ధకు, ప్రజ్ఞకు, మేధకు, శ్రీదేవికి, హ్రీదేవికి, సవితకు, సావిత్రికి, సదసస్పతికి, అనుమతికి ఆహుతులిచ్చుచు వేద పారాయణము చేయవలెను. పారాయణమును మధ్యలో ఆపరాదు. ఆసమయమున మాట్లాడరాదు.

**అథాంతరా వ్యాహరేదథాంతరా విరమేత్ త్రీన్**
**ప్రాణానాయమ్య వృత్తాంతాదేవాఽరభేత॥** 6

పారాయణము చేయుచు మధ్యలో ఇతరులతో మాట్లాడినను, ఆపినను మూడు ప్రాణాయామములు చేసి ఆగినచోటినుండియే ప్రారంభింపవలెను.

**అప్రతిభాయాం యావతా కాలేన న వేద తావంతం**
**కాలం తదధీయీత స యజ్ఞానీయాత్॥** 7

పారాయణము చేయునప్పుడు మంత్రములు జ్ఞప్తికి రాకపోయినచో జ్ఞాపకము వచ్చువరకు చదివిన మంత్రములను తిరిగి చదువవలెను.

**ఋక్తో యజుష్టస్సామత ఇతి॥** 8

ఈ విధముగా ఋగ్వేదపారాయణమున ఋఙ్మంత్రములను, యజుర్వేద పారాయణమున యజుర్వేదమంత్రములను, సామవేద పారాయణమున సామవేద మంత్రములను జ్ఞాపకమునకు వచ్చువరకు పారాయణము చేయవలెను.

**తద్బ్రాహ్మణం తచ్ఛందసం తద్దైవతమధీయీత॥** 9

లేక మరచిపోయిన మంత్రములకు సంబంధించిన బ్రాహ్మణభాగమునో, తత్సంబంధమైన ఛందస్సునో దేవతా విషయమునో అధ్యయనము చేయవలెను.

**ద్వాదశ వేదసంహితా అధీయీత యదనేన అనధ్యయేఽధీత యద్గురవః కోపితా యాన్యకార్యాణి భవంతి తాభిః పునీతే శుద్ధమస్య పూతం బ్రహ్మ భవతి** 10

ఈ విధముగా వేదసంహితను పన్నెండు పర్యాయములు అధ్యయనము చేయవలెను. దానివలన అనధ్యయకాలమున వేదాధ్యయనము చేసిన పాపము గురువు యొక్క కోపమునకు గురియగుట, అకార్యములు చేయుట వలన కలుగు పాపము తొలగిపోవును. అట్లే వేదము కూడా చక్కగా వచ్చును.

**అత ఊర్ధ్వం సంచయః॥** 11

ఈ అనశ్నద్ వేదపారాయణ పన్నెండు పర్యాయములకంటె ఎక్కువ పర్యాయములు చదివినచో పుణ్యమధికమగును.

అపరా ద్వాదశ వేదసంహితా అధీత్య తాభిరుశనసో లోకమవాప్నోతి॥ 12

ఇంకను పన్నెండు పర్యాయములు ఈ వేద సంహితలనధ్యయమును చేసినచో శుక్రుడుండు లోకమును పొందగలరు.

అపరా ద్వాదశ వేదసంహితా అధీత్య తాభిర్బృహస్పతేర్లోకమవాప్నోతి॥ 13

ఇంక ఎక్కువగా పన్నెండు పర్యాయములు వేదసంహితలనధ్యయనము చేసినచో బృహస్పతియొక్క లోకమును పొందుదురు.

అపరా ద్వాదశ వేదసంహితా అధీత్య తాభిః ప్రజాపతేర్లోకమవాప్నోతి॥ 14

ఇంకను ఎక్కువగా పన్నెండు పర్యాయములు వేదసంహితలనధ్యయనము చేసినచో ప్రజాపతి లోకము లభించును.

అనశ్నన్ సంహితాస్సహస్రమధీత్య బ్రహ్మభూతో విరాజో బ్రహ్మభవతి॥ 15

ఈ అనశ్నద్వేద పారాయణమును వేయి పర్యాయములుధ్యయనము చేసినచో తాను బ్రహ్మసారూప్యమును పొందును.

**సంవత్సరం భైక్షం ప్రయుంజానో దివ్యచక్షుర్లభతే॥** 16

బిక్షాచరణ చేయుచు ఒక సంవత్సరము వరకు వేద సంహితలనధ్యయనము చేసినచో అతనికి దివ్యదృష్టి కలుగును.

**షణ్మాసాన్యావకభక్షః చతురో మాసానుదకసక్తుభక్షో ద్వౌ మాసౌ ఫలభక్షో మాసమబ్భక్షః ద్వాదశరాత్రం వా అప్రాశ్నన్ క్షిప్రమంతర్ధీయతే జ్ఞాతీన్పునాతి సప్తావరాన్ సప్తపూర్వానాత్మానం పంచదశం పంక్తిం చ పునాతి॥** 17

యావకమును మాత్రము తినుచు ఆరు నెలలు, సత్తుపిండి నీరు కలుపుకొని తినుచు నాలుగు నెలలు, పండ్లు మాత్రము తినుచు రెండు నెలలు, నీరు మాత్రము త్రావుచు ఒక నెల, పన్నెండు దినములు ఎట్టి ఆహారమును తీసికొనక వేదసంహితలనధ్యయనము చేసినచో వెంటనే అంతర్ధానమగు శక్తి లభించును. అట్లే తన పదునైదు తరములవారిని, (తనకంటె ముందు ఏడు తరములు, తన తరువాత ఏడు తరములు మరియు తాను) తనతో కలసి భోజనము చేయుచున్న పంక్తినంతయును అతడు పవిత్రము చేయును.

**తామేతాం దేవనిశ్శ్రయణీత్యాచక్షతే॥** 18

ఈ విధముగా వేదపారాయణము చేసినందువలన దేవలోకమునకు సులభముగా పోయెదరని అందురు.

**ఏతయా వై దేవా దేవత్వమగచ్ఛన్నృషయ ఋషిత్వమ్॥** 19

ఈ వేదపారాయణమువలననే దేవతలు దేవత్వమును, ఋషులు ఋషిత్వమును పొందిరి.

**తస్య హ వా ఏతస్య యజ్ఞస్య త్రివిధ ఏవారంభకాలః - ప్రాతస్సవనే మాధ్యందినే సవనే బ్రాహ్మే న అపరరాత్రే॥** 20

ఈ అనశ్నత్పారాయణమను యజ్ఞమును ప్రాతస్సవనకాలమున, మాధ్యందిన సవన కాలమున, బ్రాహ్మముహూర్తమున ప్రారంభింపవలెను. అపరరాత్రియందు మాత్రము ప్రారింభింపరాదు .

**తం వా ఏతం ప్రజాపతిస్సప్తఋషిభ్యః ప్రోవాచ సప్తర్షయో మహాజజ్ఞవే మహాజజ్ఞుః బ్రాహ్మణేభ్యో బ్రాహ్మణేభ్యః॥** 21

ఈ అనశ్నత్పారాయణమను యజ్ఞమును ప్రజాపతి సప్తర్షులకు ఉపదేశింపగా వారు మహాజజ్ఞువను ఋషికి బోధించిరి. మహాజజ్ఞువు బ్రాహ్మణులకు మాత్రమే బోధించెను.

అధ్యాయ సమాప్తిని సూచించుచు ఇచ్చట పదపునరావృత్తి చేయబడినది.

ఇతి నవమః ఖండః

అథ దశమః ఖండః

**ఉక్తో వర్ణధర్మశ్చాఽఽశ్రమధర్మశ్చ॥** 1

ఇంతవరకు బ్రాహ్మణాది వర్ణముల ధర్మము, బ్రహ్మచర్యాది ఆశ్రముల ధర్మము వివరింపబడినది.

**అథ ఖల్వయం పురుషో యాప్యేన కర్మణా॥** 2

మానవుడు తాను చేసిన కర్మ ఫలమును తప్పక అనుభవించును. యాప్యమను పదము ఇచ్చట పాపమను అర్థమున ఉపయోగించబడింది.

**మిథ్యా వా చరత్యయాజ్యం వా యాజయతి అప్రతిగ్రాహ్యస్య వా ప్రతిగృహ్ణాతి అనాశ్యస్యాన్నస్య వాఽ న్నమశ్నాత్యచరణీయేన వా చరతి॥**

యాప్యకర్మలివి - అసత్యమాడుట, యాగర్హతలేని వానిచేత యాగము చేయించుట, దానము స్వీకరించుటకు, తగని వాని దగ్గర దానమును తీసికొనుట, తినకూడని వస్తువును తినుట, తిరుగరాని వారితో కలసి తిరుగుట అనునవి.

**తత్ర ప్రాయశ్చిత్తం కుర్యాన్న కుర్యాదితి॥** 4

ఈ పాప కర్మల విషయమై ప్రాయశ్చిత్తము చేసికొనవలెనని, చేసికొనకూడదని కూడ అనుచున్నారు.

**న హి కర్మ క్షీయతే ఇతి॥** 5

కర్మ ఫలమును అనుభవింపక కర్మ క్షీణించదు కావున ప్రాయశ్చిత్తమక్కరలేదని కొందరందురు.

**కుర్యాత్త్వేవ॥** 6

కాని ప్రాయశ్చిత్తము వలన కర్మ ఫలము తప్పక క్షీణించుచున్నది. కావున ప్రాయశ్చిత్తమును తప్పక చేసికొనవలెను అని సూత్రకారుని అభిప్రాయము.

**పునస్తోమేన యజేత పునస్సవనమాయంతీతి విజ్ఞాయతే॥** 7

పునస్తోమమను యాగమును చేయవలెను. పునస్సవనమును చేయవలెనని వేదమున చెప్పబడినది. పునస్తోమము పాపహరణమున్నకై చేయు ఒకానొక యాగము.

**సర్వం పాప్మానంతరతి తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజత ఇతి ॥**

ఈ విషయమున వేదమందలి వాక్యములను ఉదాహరణగా తెలుపుచున్నారు.

అశ్వమేధయాగమును చేసినచో సమస్త పాపములు నశించును. బ్రహ్మహత్యాపాతకము నశించును. అని తైత్తిరీయసంహిత 3-12-2లో కలదు.

**అథాప్యుదాహరంతి**

**అగ్నిష్టుతా వాఽభిశస్యమానో యజేతేతి చ ॥** 9

ఘోరపాపము చేసినట్లు ఆరోపింపబడినవాడు అగ్నిష్టుత్ అను సోమయాగమును చేయవలెను.

**తస్య నిష్క్రయణాని జపస్తపో హోమ ఉపవాసో దానమ్॥** 10

వేదమంత్ర జపము, తపమాచరించుట, హోమము, ఉపవాసము, దానము చేయుట అనునవి దుష్టకర్మ ఫలితమైన పాపమును తొలగించుచున్నవి.

**ఉపనిషదో వేదాదయః వేదాంతాః సర్వచ్ఛందస్సు సంహితా మధూన్యఘమర్షణమథర్వశిరో రుద్రాః పురుషసూక్తం రాజనరౌహిణే సామనీ బృహద్రథంతరే పురుషగతిర్మహానామ్న్యో మహావైరాజం మహాదివాకీర్త్యం జ్యేష్ఠసామ్నామన్యతమం బహిష్పవమానం కుశ్మాండ్యః పావమాన్యః సావిత్రీ చేతి పావనాని॥** 11

ఉపనిషత్తులు, నాలుగు వేదముల యొక్క మొదటి మంత్రములు, వేదాంతములు (రహస్య మంత్రములు, బ్రాహ్మణ భాగములు) నాలుగు వేదములకు చెందిన సంహితలు. "మధువాతా" అను అనువాక్యము, అఘమర్షణ మంత్రములు మూడు, అధర్వణ వేదమంత్రములు, "నమస్తే రుద్రమన్యవ" అను రుద్రమంత్రములు, పురుషసూక్తమంత్రములు, "ఇద్రం నరః" అను ఋక్కున కనిపించు రాజనము రౌహిణము అను సామ మంత్రములు, బృహద్రథంతరమంత్రములు, "అహమస్మి" అను పురుషగతిమంత్రము, విదామఘవన్ అను మహానామ్నీ ఋక్కులు, "పిబా

సోమమ్" అను మహావైరాజ మంత్రములు "విభ్రాట్ బృహత్ పిబంతు" అను మహాదివాకీర్త్య మంత్రము, "శంనో దేవీ" "చిత్రం దేవానామ్" అను జ్యేష్ఠ సామమంత్రములలో నొక్కటి, ఉపాస్మై అను బహిష్పవమాన మంత్రము, యద్దేవాః అను కూష్మాండ్యమంత్రములు, పవమాన మంత్రములు. సావిత్రీ మంత్రము, మొదలగునవి పవిత్రమైనవి.

**ఉపసన్న్యాయేన పయోవ్రతతా శాకభక్షతా ఫలభక్షతా మూలభక్షతా ప్రసృతయావకో హిరణ్యప్రాశనం ఘృతప్రాశనం సోమపానమితి మేధ్యాని॥**

సోమయాగమున ఉపసత్తను ఇష్టిలో దీక్షితుడైనవాడు వ్రతమును చేబట్టినట్లు పయోవ్రతము, శాకవ్రతము, ఫలవ్రతము, కంద మూలములు తినుట, ప్రసృతయావకమును వ్రతముగా తినుట, సువర్ణప్రాశనము, ఘృతప్రాశనము, సోమ పానము వంటివి పాపములు నశింపజేసి పవిత్రునిజేయును.

**సర్వే శిలోచ్చయాః సర్వాః స్రవంత్యః సరితః పుణ్యహ్రదాః**
**తీర్థాని ఋషినికేతనాని గోష్ఠ క్షేత్ర పరిష్కందా ఇతి దేశాః॥** 13

సమస్త పర్వతములు, సమస్త నదీనదములు, పుష్కరిణులు, ఋష్యాశ్రమములు, గోవులుండు ప్రదేశములు, పుణ్య క్షేత్రములు, దేవాలయములు, గుహలు మొదలైన ప్రదేశములు పవిత్రమైనవి.

అహింసా సత్యమస్తైన్యం సవనేషూదకోపస్పర్శనం గురుశుశ్రూషా
బ్రహ్మచర్యమధశ్శయనం ఏకవస్త్రతా అనాశక ఇతి తపాంసి॥ 14

ఏప్రాణిని హింసింపకుండుట, సత్యము పల్కుట, దొంగతనము చేయకుండుట మూడు సంధ్యలందు స్నానము చేయుట, గురుశుశ్రూష, బ్రహ్మచర్యము నవలంబించుట, భూమిపైన పడుకొనుట, ఒకే వస్త్రమును (వ్రతముగా ) ధరించుట మొదలగునవి తపస్సులు.

**సంవత్సరః షణ్మాసాశ్చత్వారస్త్రయో ద్వావేకశ్చతుర్వింశత్యహో**
**ద్వాదశాహష్షడ హస్త్ర్యహో౽హోరాత్రమేకాహ ఇతి కాలాః॥ 16**

తపస్సు చేసికొనుటకు సంవత్సరము, ఆరు నెలలు, నాలుగు నెలలు, మూడు నెలలు, రెండు నెలలు, ఒక నెల, ఇరువది నాలుగు దినములు, పన్నెండు దినములు,

అరు దినములు, మూడు దినములు, ఒక దినమంతయు, ఒక పగలు, అనునట్లు కాలముండును.

**ఏతాన్యనాదేశే క్రియేరన్ ఏనస్సు గురుషు గురూణి లఘుషు లఘూని॥17**

చేసిన పాపమునకు ప్రాయశ్చిత్తముగా ప్రత్యేకమైన తపస్సును చెప్పక పోయినచో పైన పేర్కొన్న అహింసాది తపస్సులను చేయవలెను. అట్లే పాపము అధికముగానున్నచో అధిక కాలము, తక్కువగానున్నచో తక్కువ కాలము తపస్సు చేయవలెను.

**కృచ్ఛ్రాతికృచ్ఛ్రౌ చాంద్రాయణమితి సర్వప్రాయశ్చిత్తిః సర్వప్రాయశ్చిత్తిః॥18**

కృచ్ఛ్రప్రాయశ్చిత్తము, అతికృచ్ఛ్ర ప్రాయశ్చిత్తము చాంద్రాయణ వ్రతమనునవి సమస్త పాపములకు ప్రాయశ్చిత్తములగుచున్నవి.

అధ్యాయసమాప్తి సూచకముగా పదములఆవృత్తి చేయబడినది.

**ఉక్తోవర్ణధర్మశ్చాఽఽశ్రమధర్మశ్చ॥10॥ అథాఽతోఽనశ్నత్పారాయణ విధిమ్॥9॥ అథాతశ్చాంద్రాయణ కల్పమ్॥8॥ అథ కూష్మాండైర్జుహుయాత్॥7॥ అథ కర్మభిరాత్మకృతైః॥6॥ అథాతః పవిత్రాతి పవిత్రస్య॥5॥ అథ యతి బ్రహ్మాచార్య వ్రత్యమివ చరేత్॥4॥ అథ వానప్రస్థద్వైవిధ్యమ్॥3॥ యథో ఏతత్ షణ్ణివర్తనీతి॥2॥ అథ శాలీనయాయావర చక్రచర ధర్మకాంక్షిణామ్॥1॥**

ఇతి దశమః ఖండః

తృతీయ ప్రశ్నశ్చ సమాప్తః॥

## అథ చతుర్థః ప్రశ్నః

### అథ ప్రథమః ఖండః

ప్రాయశ్చిత్తాని వక్ష్యామో నానార్థాని పృథక్ పృథక్

**తేషు తేషు చ దోషేషు గరీయాంసి లఘూని చ॥** 1

ఇక ఆయాపాపములు, (పెద్దవి చిన్నవి) దేశము, కాలాదులను అనుసరించి చేయతగిన ప్రాయశ్చిత్తములను విడివిడిగా తెలిపెదను.

**యద్యత్ర హి భవేద్యుక్తం తద్ధి తత్రైవ నిర్దిశేత్।**
**భూయో భూయో గరీయస్సు లఘుష్వల్పీయసస్తథా॥** 2

చేసిన దోషమునకు తగిన ప్రాయశ్చిత్తమునే చెప్పవలెను. దోషము పెద్దదైనప్పుడు ప్రాయశ్చితము కూడా పెద్దదియే కావలెను. అట్లే దోషము చిన్నదైనచో చిన్న ప్రాయశ్చిత్తమునే చేసికొనవలెను.

**విధినా శాస్త్రదృష్టేన ప్రాణాయామాన్ సమాచరేత్॥** 3

చిన్న చిన్న దోషములను చేసినప్పుడు శాస్త్రమర్యాదననుసరించి ప్రాణాయామములను చేయవలెను.

**యదుపస్థకృతం పాపం పద్భ్యాం వా యత్కృతం భవేత్।**
**బాహుభ్యాం మనసా వాచా శ్రోత్ర త్వగ్ఘ్రాణ చక్షుషా॥** 4

జననేంద్రియముచే, పాదములచే, చేతులచేత, మనస్సుచేత, వాక్కుచేత, చెవులచేత, త్వగింద్రియముచేత, నాసికచేత, కండ్లచేత చేసిన చిన్న చిన్న పాపములను, ప్రాణాయామములచే తొలగింపవచ్చును.

**అథ వాచా చక్షుశ్శ్రోత్రత్వగ్ఘ్రాణ మనోవ్యతిక్రమేషు**
**త్రిభిః ప్రాణాయామైః శుద్ధ్యతి॥** 5

వాక్కు, కండ్లు, చెవులు, త్వగింద్రియము, నాసిక, మనస్సు చేసిన పాపములు, మూడు ప్రాణాయామములను చక్కగా చేసినచో నశించును.

**శూద్రాన్న స్త్రీగమన భోజనేషు కేవలేషు పృథక్ పృథక్**
**సప్తాహం సప్త సప్త ప్రాణాయామాన్ ధారయేత్॥** 6

శూద్రుని ఇంట తినుట, శూద్ర స్త్రీతో కలయుట వంటి దోషములను చేసినప్పుడు తన్నివారణకై ఒక్కొక్క దానికి వేరు వేరుగా ఏడు ప్రాణాయామములను ఏడు దినములు చేయవలెను.

**అభక్ష్యాభోజ్యాపేయానాద్య ప్రాశనేషు తథాఽపణ్య విక్రయేషు మధుమాంసఘృత తైల క్షార లవణావరాన్న వర్జేషు యచ్చాన్యదప్యేవం యుక్తం ద్వాదశాహం ద్వాదశ ద్వాదశ ప్రాణాయామాన్ ధారయేత్॥** 7

మధువు, మాంసము, నేయి, నూనె, ఉప్పు, కారము తనకంటె తక్కువ వాని ఇంట భోజనము అను వాటిని వదలి, తినకూడనివి తినుట, త్రాగకూడనివి త్రాగుట, తినకూడని వాని దగ్గరభోజనముచేయుట అట్లే అమ్మకూడని వానిని అమ్ముట వంటి పాపకర్మలు చేసినప్పుడు ప్రతియొక్క దానికి ప్రత్యేకముగా పన్నెండు ప్రాణాయామములను పన్నెండు దినములు చేయవలెను.

**పాతక పతనీయోపపాతక వర్జేషు యచ్చాన్యదప్యేవం యుక్తమర్ధమాసం ద్వాదశ ద్వాదశ ప్రాణాయామాన్ ధారయేత్॥**

మహా పాతకములు, పతనీయములు, ఉపపాతకములు కాక ఇతర పాపములు చేసినచో ఒక్కొక్క దానికి వేరు వేరుగా పన్నెండు ప్రాణాయామములను పక్షము దినములు చేయవలెను.

**పాతక పతనీయవర్జేషు యచ్చాన్యదప్యేవం యుక్తం ద్వాదశ ద్వాదశాహాన్ ద్వాదశ ద్వాదశ ప్రాణాయామాన్ ధారయేత్॥** 9

అట్లే మహాపాపములు, పతనీయములు కాక అంతటి పాపములను చేసినచో ప్రతి పాపమునకు ప్రత్యేకముగా పన్నెండు ప్రాణాయామములను పన్నెండు దినములు చేయవలెను.

**పాతకవర్జేషు యచ్చాన్యదప్యేవం యుక్తం ద్వాదశార్ధమాసాన్ ద్వాదశ ద్వాదశ ప్రాణాయామాన్ ధారయేత్॥** 10

మహా పాతకములు కాక వాటితో సమానమైన పాపములను చేసినచో ఒక్కొక్క దానికి ప్రత్యేకముగా పన్నెండు ప్రాణాయామములను పన్నెండు పక్షముల వరకు చేయవలెను.

**అథ పాతకేషు సంవత్సరం ద్వాదశ ద్వాదశ ప్రాణాయామాన్ ధారయేత్॥** 11

ఇక మహాపాతకములు చేసినప్పుడు సంవత్సరము వరకు పన్నెండు ప్రాణాయామములను ప్రతిదినము చేయవలెను.

**దద్యాద్గుణవతే కన్యాం నగ్నికాం బ్రహ్మచారిణే।**
**అపి వా గుణహీనాయ నోపరుంధ్యాద్రజస్వలామ్॥** 12

సద్గుణ సంపన్నుడగు బ్రహ్మచారికి సిగ్గు పడుట కూడ తెలియని కన్యకనిచ్చి వివాహము చేయవలెను. గుణవంతుడు దొరకనిచో గుణహీనునకైనను ఇవ్వవలెను. కాని గుణవంతుని కొరకు రజస్వలయగునంత వరకు పుత్రికను తన ఇంటిలో ఉంచుకొనరాదు.

**త్రీణి వర్షాణ్యృతుమతీం యః కన్యాం న ప్రయచ్ఛతి।**
**స తుల్యం భ్రూణహత్యాయై దోషమృచ్ఛత్యసంశయమ్॥** 13

రజస్వలయైన కన్యకు వివాహము చేయక తన ఇంటిలో మూడు సంవత్సరములుంచుకొన్నచో అతడు బ్రహ్మహత్యా పాతకమును తప్పక పొందును.

**న యాచతే చేదేవం స్యాత్ యాచతే చేత్పృథక్పృథక్।**
**ఏకకస్మిన్ ఋతౌ దోషం పాతకం మనురబ్రవీత్॥** 14

రజస్వలయైన కన్యను వివాహము చేసికొనుటకు ఎవ్వరూ ముందునకు రాని పక్షమున పై విధమైన దోషము కలుగును. ఆ కన్యను వివాహము చేసికొనుటకు వరుడు వచ్చినచో దోషము భిన్న భిన్నముగానుండును. రజస్వలయైన కన్యకు వివాహము చేయనిచో ఒక్కొక్క ఋతువునకు పాపము పెరిగిపోవునని మనువు పేర్కొనెను.

**త్రీణి వర్షాణ్యృతుమతీ కాంక్షేత పితృశాసనమ్।**
**తతశ్చతుర్థే వర్షే తు విందేత సదృశం పతిమ్॥** 15

రజస్వలయైన మూడు సంవత్సరములవరకు కన్య తండ్రి యాజ్ఞలోనుండి అతడు తెచ్చిన వరుని వివాహమాడవలెను. నాలుగవ సంవత్సరమున ఆమె స్వతంత్రించి తనకు నచ్చిన వరుని వివాహము చేసికొనవచ్చును. మనువు కూడ ఇదే అభిప్రాయమును మనుస్మృతి అధ్యా. 9-90 న తెల్పెను.

**అవిద్యమానే సదృశే గుణహీనమపి శ్రయేత్॥** 16

రజస్వలయైన కన్య నాలుగవ సంవత్సరమువరకు తనకు తగిన వరుడు

లభింపకపోయినచో గుణహీనునైనను వివాహము చేసికొనవచ్చును.

**బలాచ్చేత్ప్రహృతా కన్యా మంత్రైర్యది న సంస్కృతా।**
**అన్యస్మై విధివద్దేయా యథా కన్యా తథైవ సా॥** 17

వివాహ సంస్కారము చేయని కన్యను బలవంతముగా ఎత్తుకొని పోయినప్పుడు ఆమెను తిరిగి తీసికొని వచ్చి, కన్యగా భావించి, తండ్రి తగిన వరునకిచ్చి వివాహసంస్కారము చేయవలెను.

**నిసృష్టాయాం హుతే వాఽపి యస్యై భర్తా మ్రియేత సః।**
**సా చేదక్షతయోనిస్స్యాద్గతప్రత్యాగతా సతీ।**
**పౌనర్భవేన విధినా పునస్సంస్కారమర్హతి॥** 18

మంత్ర పూర్వకముగా వివాహము చేసికొని అత్తవారి ఇంటికి పోయిన తరువాత ఆమెభర్త ఏదేని కారణమువలన చనిపోయినచో ఆమెను తండ్రి తన ఇంటికి తీసికొని వచ్చి, పునర్భూ వివాహమును (మారు మనువు) చేయవచ్చును.

**త్రీణి వర్షాణ్యృతుమతీం యో భార్యాం నాధిగచ్ఛతి।**
**స తుల్యం భ్రూణహత్యాయై దోషమృచ్ఛత్యసంశయమ్॥** 19

తన భార్య రజస్వలయైనను ఏదేని కారణము చెప్పి భార్యను పొందక పోయినచో అతడు భ్రూణహత్య చేసినంత పాపమును తప్పక పొందును.

**ఋతుస్నాతాం తు యో భార్యాం సన్నిధౌ నోపగచ్ఛతి।**
**పితరస్తస్య తన్మాసం తస్మిన్ రజసి శేరతే॥** 20

ఋతు స్నాతయైన భార్య ఇంటిలోనున్నప్పుడు (ఆరోగ్యము చక్కగానున్నప్పటికీ కోపముతో) భార్యా సంగము చేయక పోయినచో, అతని పితృదేవతలు ఆమె రజస్సునందు ఆ నెలయంతయు పడి ఉందురు.

**ఋతౌ నోపైతి యో భార్యామనృతౌ యశ్చ గచ్ఛతి।**
**తుల్యమాహుస్తయోర్దోషమయోనౌ యశ్చ సించతి॥** 21

భార్య రజస్వలయై స్నానము చేసిన తర్వాత ఆమెను పొందనివాడు, ఋతుకాలము దాటిన తరువాత ఆమెను పొందినవాడు అప్రాకృతికపద్ధతులలో వీర్యపతనము చేయువాడు అను ఈ ముగ్గురు సమానమైన పాపమును పొందుదురు.

**భర్తుః ప్రతినివేశేన యా భార్యా స్కందయేద్రుతుమ్।**
**తాం గ్రామమధ్యే విఖ్యాప్య భ్రూణఘ్నీం నిర్ధమేద్గృహాత్॥** 22

భర్తపై కోపగించి (ఔషధాదులచే) రజోహాని జరుగునట్లు చేయు భార్యను గ్రామమధ్యలో నిలబెట్టి భ్రూణహత్య చేయుచున్నట్లు పేర్కొని ఆమెను ఇంటినుండి బయటకు పంపవలెను.

**ఋతుస్నాతాం న చేద్గచ్ఛేత్ నియతాం ధర్మచారిణీమ్।**
**నియమాతిక్రమే తస్య ప్రాణాయామశతం స్మృతమ్॥** 23

భార్య రజస్వలానంతరస్నానము చేసినప్పుడు ఆమెను పొందవలెనను నియమము కలదు. అట్టి నియమమును అతిక్రమించిన పాపమునకు ప్రాయశ్చిత్తముగా భర్త నూరు ప్రాణాయామములను చేసికొనవలెను.

**ప్రాణాయామాన్ పవిత్రాణి వ్యాహృతీః ప్రణవం తథా।**
**పవిత్రపాణిరాసీనో బ్రహ్మ నైత్యకమభ్యసేత్॥** 24.

ప్రాణాయామములను చేయునపుడు, పురుష సూక్తాది పవిత్రమంత్రములను చదువునప్పుడు, వ్యాహృతులను, ఓంకారమును జపము చేయుచున్నప్పుడు, వేదాధ్యయనము చేయునప్పుడు దర్భ పవిత్రను చేతికి ధరించి కూర్చొనియుండవలెను.

**ఆవర్తయేత్సదాయుక్తః ప్రాణాయామాన్పునః పునః।**
**ఆకేశాంతాన్నఖాగ్రాచ్చ తపస్తప్యత ఉత్తమమ్॥**
**నిరోధాజ్జాయతే వాయుః వాయోరగ్నిశ్చ జాయతే।**
**తాపేనాఽపోఽధిజాయంతే తతోఽంతశ్శుద్ధ్యతే త్రిభిః॥** 25

ప్రాణాయామములను మాటి మాటికి చేయుచున్నచో అది ఉత్తమ తపస్సగును. ప్రాణాయామమందు ప్రాణవాయువును నిరోధించుటవలన శరీరమందు వాయువు ఉత్పన్నమగును. ఆ వాయువు అగ్నిని కలిగించును. ఆ అగ్నివల్ల జలము పుట్టును. ఈ మూడిటివల్ల అంతశ్శరీరమంతయు పవిత్రమగుచున్నది.

**యోగేనావాప్యతే జ్ఞానం యోగో ధర్మస్య లక్షణమ్।**
**యోగమూలా గుణాస్సర్వే తస్మాద్యుక్తస్సదా భవేత్॥** 26

యోగము తత్వజ్ఞానమును కలిగించుచున్నది ధర్మమునకు కారణమగుచున్నది అట్టి యోగమును సమస్త గుణములాశ్రయించియుండుటచే మానవుడెల్లప్పుడు యోగాభ్యాసమును చేయుచుండవలెను

**ప్రణవాద్యాస్తథా వేదాః ప్రణవే పర్యవస్థితాః।**
**ప్రణవో వ్యాహృతయశ్చ నిత్యం బ్రహ్మ సనాతనమ్॥**
**ప్రణవే నిత్యయుక్తస్య వాహృతీషు చ సప్తసు।**
**త్రిపదాయాం చ గాయత్ర్యాం న భయం విద్యతే క్వచిత్॥** 27

వేదములు ఓంకారముతో ప్రారంభమగును. ఆ ఓంకారముతోనే అంతమగును. వేదమునభ్యసించునప్పుడు ఆద్యంతములందు ఓంకారమును తప్పక చదువవలెనని స్రవత్యనోం కృతం పూర్వం పరస్తాచ్చ విశీర్యతే మనుస్మృతి 2-74 తెలుపుచున్నది. ప్రణవవ్యాహృతులే సనాతన బ్రహ్మరూపములు. అట్టి ప్రణవము సప్తవ్యాహృతులు, త్రిపదయుక్తయైన గాయత్రిని జపించువానికి ఎట్టి భయముండదు.

**సవ్యాహృతికాం సప్రణవాంగాయత్రీం శిరసా సహ।**
**త్రిః పఠేదాయతప్రాణః ప్రాణాయామస్స ఉచ్యతే॥** 28

ఓంకారము సప్తవ్యాహృతులు,'ఓమాపోజ్యోతీః ఇత్యాది శిరోమంత్రముతోనున్న గాయత్రీమంత్రమును మూడు మార్లు చదువుచు ప్రాణాయామమును చేయవలెను.

**సవ్యాహృతికాస్సప్రణవాః ప్రాణాయామాస్తు షోడశ।**
**అపి భ్రూణహనం మాసాత్పునంత్యహరహః కృతాః॥** 29

ప్రతిదినము ఓంకారము మరియు వ్యాహృతులతోనున్న గాయత్రిని చదువుచు పదునారు ప్రాణాయామములను చేయుచుండినచో భ్రూణహత్యాపాపము కూడ ఒక్కనెలలోనే నశించును.

**ఏతదాద్యం తపశ్శ్రేష్ఠమ్ ఏతద్ధర్మస్య లక్షణమ్।**
**సర్వదోషోపఘాతార్థమేతదేవ విశిష్యతే ఏతదేవ విశిష్యత ఇతి॥** 30

ప్రాణాయామము చేయుటయే ఉత్తమతపస్సు. ఉత్తమ ధర్మాచరణమునకు ఇదే కారణమగుచున్నది. సమస్త పాపములను నశింప చేయుటలో ఇదే విశిష్టమైనది.

ఇతి ప్రథమః ఖండః

అథ ద్వితీయః ఖండః

**ప్రాయశ్చిత్తాని వక్ష్యామో నానార్థాని పృథక్ పృథక్।**
**తేషు తేషు చ దోషేషు గరీయాంసి లఘూని చ॥** 1

ప్రస్తుతము ఆయా పాపకర్మలు చేసినప్పుడు చేయవలసిన ప్రాయశ్చిత్తములను విడివిడిగా చెప్పెదను. అట్లే దోషములననుసరించి చేయవలసిన గురు ప్రాయశ్చిత్తములను, లఘు ప్రాయశ్చిత్తములను కూడ తెల్పెదను.

**యద్యత్ర హి భవేద్యుక్తం తద్ధి తత్రైవ నిర్దిశేత్।**
**భూయో భూయో గరీయస్సు లఘుష్వల్పీయసస్తథా॥** 2

ఏ పాపమునకు ఏ ప్రాయశ్చిత్తము తగినదో దానిని మాత్రమే అక్కడ చెప్పవలెను. పెద్ద పాపములకు పెద్ద ప్రాయశ్చిత్తములను, చిన్న పాపములకు చిన్న పాపములను వివరింపవలెను.

**విధినా శాస్త్ర దృష్టేన ప్రాయశ్చిత్తాని నిర్దిశేత్॥** 3
**ప్రతిగ్రహీష్యమాణస్తు ప్రతిగృహ్య తథైవ చ॥**
**ఋచస్తరత్సమంద్యస్తు చతస్రః పరివర్తయేత్॥** 4

ప్రాయశ్చిత్తములను శాస్త్ర సమ్మతమైన రీతిలోనే చెప్పవలెను.

అట్లే దానము తీసికొనువాడు తత్పాప నివారణకై తరత్సమంది అను ఋజ్మంత్రములను నాలుగు పర్యాయములు చదువవలెను.

**అభోజ్యానాం తు సర్వేషామ్ అభోజ్యాన్నస్య భోజనే।**
**ఋగ్భిస్తరత్సమందీయైః మార్జనం పాపశోధనమ్॥** 5

తినకూడని పదార్థములను తిన్నా, తినకూడని వాని ఇంట భోజనము చేసినను తరత్సమందీయ ఋక్కులను చదువుచు తనను మార్జనము చేసికొన్నచో పాపము తొలగిపోవును.

**భ్రూణహత్యా విధిస్త్వన్యః తం తు వక్ష్యామ్యతః పరమ్।**
**విధినా యేన ముచ్యంతే పాతకేభ్యోఽపి సర్వశః॥** 6

ఇక బ్రాహ్మణహత్య చేసినప్పుడు చేయవలసిన ప్రాయశ్చిత్త విధానమును వివరింతును. ఆ విధానముననుష్ఠించినందువలన బ్రాహ్మణహత్యవలన కలిగిన పాపమంతయు నశించును.

**ప్రాణాయామాన్ పవిత్రాణీ వ్యాహృతీః ప్రణవం తథా।**

**జపేదఘమర్షణం యుక్తః పయసా ద్వాదశ క్షపాః॥** 7

ప్రాణాయామములను, పవిత్రమొనరించు పురుషసూక్తాది మంత్రములను, సప్తవ్యాహృతులను, ఓంకారమును, అఘమర్షణసూక్తమును పాలను మాత్రము ఆహారముగా తీసికొనుచు పన్నెండు దినములు పారాయణము చేయవలెను.

**త్రిరాత్రం వాయుభక్షో వా క్లిన్నవాసాఽ ఽ ప్లుతశ్శుచిః॥** 8

నీటిలో మునిగి పవిత్రుడై తడి బట్టలతో వాయువును మాత్రము భక్షించుచు (ఎట్టి ఆహారమును తీసికొనక) పైనపేర్కొన్న మంత్రములను మూడు దినములు జపించినను పాపరహితుడై పవిత్రుడగును.

**ప్రతిషిద్ధాంస్తథాఽ చారాన్ అధ్యస్యాపి పునః పునః।**
**వారుణీభిరుపస్థాయ సర్వ పాపైః ప్రముచ్యతే॥** 9

నిషిద్ధమైన కర్మలను చేసినప్పుడు వరుణ దేవతాకమైన మంత్రములను అనేక పర్యాయములు చదివినచో ఆ పాపమంతయు నశించును.

**అథావకీర్ణ్యమావాస్యాయాం నిశ్యగ్నిముపసమాధాయ**
**దార్విహోమికీం పరిచేష్టాం కృత్వా ద్వే ఆజ్యాహుతీ జుహోతి**
**కామావకీర్ణోఽ స్మ్యవకీర్ణోఽ స్మి కామ కామాయ స్వాహా।**
**కామాభిద్రుగ్ధోఽ స్మ్యభిద్రుగ్ధోఽ స్మి కామకామాయ స్వాహేతి॥** 10

బ్రహ్మచర్య వ్రతమును భంగము చేసికొన్నవాడు అమావాస్యనాటి రాత్రిపూట అగ్నిని జ్వాల చేసి దర్వీహోమము ప్రారంభించుటకు చేయవలసిన కర్మలన్నియు చేసి "కామావకీర్ణోఽస్మి" "కామాభిద్రుగ్ధోఽస్మి" అను మంత్రములచే రెండు ఆజ్యాహుతులను చేయవలెను.

**హుత్వా ప్రయతాంజలిః కవాతిర్యఙ్ అగ్నిముపతిష్ఠేత**
**"సం మా సించంతు మరుతస్సమింద్రస్సం**
**బృహస్పతిః। సం మా యమగ్నిస్సించత్వాయుషా చ**
**బలేన చాఽ యుష్మంతం కరోతు మే"తి। ప్రతిహాఽ స్మై**
**మరుతః ప్రాణాన్ దధాతి ప్రతీంద్రో బలం ప్రతి**
**బృహస్పతిర్బ్రహ్మవర్చసం ప్రత్యగ్నిరితరత్సర్వం**

**సర్వతనూర్భూత్వా సర్వమాయురేతి। త్రిభిరభి**

**మంత్రయేత। త్రిషత్యా హి దేవా ఇతి విజ్ఞాయతే॥** 11

పైన చెప్పిన రెండు ఆజ్యాహుతులిచ్చిన తరువాత చేతులు జోడించుకొని ఒక ప్రక్కకు ఒదిగి కూర్చొని "సం మా సించంతు" అను మంత్రముచేత అగ్నిని ప్రార్థింపవలెను. అప్పుడు మరుద్దేవతలతనికై ప్రాణములను, ఇంద్రుడు బలమును, బృహస్పతి బ్రహ్మవర్చస్సును, అగ్నిదేవుడు శరీరమందంతటను వ్యాపించి పూర్ణాయుస్సును ఇంకను సమస్తమైన కోరికలను ఇచ్చుచున్నారు. ఇట్లు అగ్నిని మూడు మార్లు అభిమంత్రింపవలెను. మూడు పర్యాయములు చెప్పినప్పుడు మాత్రమే దేవతలు గ్రహింతురని వేదములలో చెప్పబడినది.

**యోఽ పూత ఇవ మన్యేత ఆత్మానముపపాతకైః**

**స హుత్వైతేన విధినా సర్వస్మాత్పాపాత్ప్రముచ్యతే॥** 12

ఉపపాతకములు చేసినందువలన అపవిత్రమైనట్లు భావించు బ్రాహ్మణుడు పైన పేర్కొన్నట్లు హోమము చేసినచో అతని పాపములన్నియు నశించును.

**అపి వాఽనాద్యాపేయప్రతిషిద్ధ భోజనేషు దోషవచ్ఛ కర్మ**

**కృత్వాఽపి సంధిపూర్వమనభిసంధిపూర్వం వా శూద్రాయాం**

**చ రేతస్సిక్త్వాఽయోనౌ వా అబ్లింగాభిర్వారుణీభిశ్చోప**

**స్పృశ్య ప్రయతో భవతి॥** 13

ఇంకను తినకూడని పదార్థములను తినుట, త్రాగకూడని వస్తువులను త్రాగుట, తినకూడని వాని ఇంటిలో భోజనము చేయుట, పాపము కలిగించు ఇతర కర్మలు చేయుట, తెలిసి, తెలియక శూద్ర స్త్రీతో వ్యభిచరించుట, రేతః స్ఖలనము చేసికొనుట వంటి పాపకర్మలు చేసినప్పుడు "అప్" శబ్దమున్న మంత్రములు మరియు వరుణ దేవతాక మంత్రములను చదువుచు స్నానము చేసినచో అతడు పవిత్రుడగును.

**అథాప్యుదాహరంతి**

**అనాద్యప్రాశనాపేయప్రతిషిద్ధభోజనేఽ విశుద్ధ ధర్మాచరితే చ కర్మణి।**

**మతి ప్రవృత్తేఽ పి చ పాతకోపమైః విశుధ్యతేఽథాపి చ సర్వపాతకైః॥** 14

ఈ విషయమున ధర్మశాస్త్రవేత్తలిట్లు పేర్కొనుచున్నారు.

తినకూడని దానిని తినుట, త్రాగకూడని దానిని త్రాగుట, తినకూడని వారి ఇంట తినుట, ఇతర పాపకార్యములు చేయుట వంటి వాటిని గూర్చి ఆలోచించినను (వస్తుతః పాపకార్యములు చేయకున్నను) అవి పాతకముల వంటివేయగును. అందువలన ప్రాయశ్చిత్తమును చేసికొన్నచో సమస్త పాపములు

**త్రిరాత్రం వాౖ ప్యుపవసన్ త్రిరహ్నోౖ భ్యుపేయాదపః।**
**ప్రాణానాత్మని సంయమ్య త్రిః పఠేదఘమర్షణమ్॥** 15

మూడు సంధ్యలందు స్నానము చేయుచు మూడు దినములంతయు ఉపవాసముండుచు, ప్రాణాయామములు చేయుచు మూడు పర్యాయములఘమర్షణ సూక్తమును చదువవలెను. ఇదియే ప్రాయశ్చిత్తము.

**యథాశ్వమేధావభృథ ఏవం తన్మనురబ్రవీత్॥** 16

అశ్వమేధమందలి అవభృథ స్నానమువలె ఇది కూడ సమస్త పాపములను తొలగించును అని మనువు పల్కెను.

**విజ్ఞాయతే చ**

**చరణం పవిత్రం వితతం పురాణం యేన పూతస్తరతి దుష్కృతాని।**
**తేన పవిత్రేణ శుద్ధేన పూతా అతిపాప్మానమరాతిం తరేమేతి॥** 7

ఈ అఘమర్షణ సూక్తము పాపమును తొలగించును. పవిత్రము చేయును. మిక్కిలి గొప్పది మరియు ప్రాచీనమైనది. ఇట్టి పరిశుద్ధమైన మంత్రముచే పవిత్రులమై శత్రువు వంటి గొప్ప పాపమును కూడ పోగొట్టుకొనెదము అని వేదము చెప్పుచున్నది.

ఇతి ద్వితీయః ఖండః

అథ తృతీయః ఖండః

**ప్రాయశ్చిత్తాని వక్ష్యామోఽ విఖ్యాతాని విశేషతః।**
**సమాహితానాం యుక్తానాం ప్రమాదేషు కథం భవేత్॥** 1

ధర్మ శాస్త్రములందు చెప్పినట్లు కర్మ చేయువారు, జాగరూకులు ఐనవారు పొరపాటున దోషములను చేసినచో వారికెట్టి ప్రాయశ్చిత్తము విధింపవలెనో ఇంతవరకు ఎచ్చటను చెప్పలేదు. అందువలన ప్రస్తుతము ఇంతవరకు చెప్పని ప్రాయశ్చిత్తములను తెలుపుదును.

**ఓం పూర్వాభిర్వ్యాహృతీభిస్సర్వపాతకేష్వాచామేత్॥** 2

సమస్త పాపములను తొలగించుకొనుటకై ప్రాయశ్చిత్తము చేసికొనునప్పుడు ఓంకారమును, మిగిలిన వ్యాహృతులనుచ్చరించుచు ఆచమనము చేయవలెను.

**యత్ప్రథమమాచామతి తేనర్గ్వేదం ప్రీణాతి। యద్ద్వితీయం**
**తేన యజుర్వేదం యత్తృతీయం తేన సామవేదమ్॥** 3

మొదటి ఆచమనమువలన ఋగ్వేదమును, రెండవ ఆచమనమువలన యజుర్వేదమును, మూడవ ఆచమనమువలన సామవేదమును సంతోష పెట్టుచున్నాడు.

**యత్ప్రథమం పరిమార్ష్టి తేనాథర్వవేదం**
**యద్ద్వితీయం తేనేతిహాస పురాణమ్॥** 4

ఆచమనము చేయగానే ద్విరోష్ఠౌ పరిమృజ్య అని రెండు పర్యాయములు నీటిచే పెదవులను తుడుచుట ధర్మశాస్త్ర సమ్మతము. ఆపస్తంబమహర్షి "ద్విరిత్యేకే" 1-16-4 ధర్మ సూత్రమున తెలిపెను. ఆ విధముగా మొదటి పర్యాయము తుడుచుట చేత అథర్వవేదమును, రెండవ మారు తుడుచుట చేత ఇతిహాస పురాణములను సంతోష పెట్టుచున్నాడు.

**యత్సవ్యం పాణిం ప్రోక్షతి పాదౌ శిరో హృదయం**
**నాసికే చక్షుషీ శ్రోత్రే నాభిం చోపస్పృశతి తేనౌషధి**

వనస్పతయః సర్వాశ్చ దేవతాః ప్రీణాతి
తస్మాదాచమనాదేవ సర్వస్మాత్పాపాత్ప్రముచ్యతే॥ 5

ఆచమన విధి మనుస్మృతిలో అధ్యా 2-60లో కన్పించును. ఆచమనము చేసి ఓష్ఠ పరిమార్జనము చేసికొన్న తర్వాత ఆయా అవయవములను స్పృశించుట ధర్మశాస్త్ర విహితము.

నీటిచే ఎడమచేతిని ప్రోక్షించుకొనుటవలన, పాదములు, శిరస్సు, హృదయము, ముక్కు, కండ్లు, చెవులు, బొడ్డును స్పృశించుటవలన ఓషధివనస్పతులు, సమస్త దేవతలు సంతోషింతురు. అందువలన ఆచమనము వలన సమస్త పాపములు తొలగిపోవుచున్నవి.

అష్టౌ వా సమిధ ఆదధ్యాత్ - "దేవకృతస్యైనసో౽వ
యజనమసి స్వాహా। మనుష్యకృతస్యైనసో౽వ
యజనమసి స్వాహా। పితృకృతస్యైనసో౽వయజనమసి
స్వాహా। యద్దివా చ నక్తం చైనశ్చకృమతస్యావయజనమసి
స్వాహా। యత్ స్వపంతశ్చ జాగ్రతశ్చైనశ్చకృమతస్యావ
యజనమసి స్వాహా। యద్విద్వాంసశ్చావిద్వాంసశ్చైనశ్చకృమతస్యావ
యజనమసి స్వాహా। ఏనస ఏనసో౽వయవజనమసి స్వాహా"ఇతి॥ 6

"దేవ కృతస్యైనసో" ఇత్యాది ఎనిమిది మంత్రములను చదువుచు అగ్నిలో సమిధలనుంచవలెను.

ఇక్కడ కూడ ఆంధ్ర పాఠముకంటె ద్రావిడ పాఠమే గ్రహింపబడినది.

అథాప్యుదాహరంతి

అఘమర్షణం దేవకృతం శుద్ధవత్యస్తరత్సమాః కూష్మాండ్యః
పావమాన్యశ్చ విరజా మృత్యులాంగలమ్। దుర్గావ్యాహృతయో
రుద్రా మహాదోష వినాశనాః మహాదోష వినాశనా ఇతి॥ 8

అఘమర్షణ సూక్తము. దేవకృతస్యైనసో అను అనువాకము, శుద్ధవతీ

మంత్రములు, తరత్సమందీయ మంత్రములు, కూష్మాండ్య మంత్రములు, పవమాన సూక్తమంత్రములు, ప్రాణాపానవ్యానోదాన సమానా మే శుధ్యంతామ్ ఇత్యాది విరజాశబ్దమున్న మంత్రములు, వేదాహమేతమ్" అను రెండవ పారము (దీనిని మృత్యులాంగలమందురు.) దుర్గా సూక్తము, సప్త వ్యాహృతులు, పదకొండు అనువాకములున్న రుద్రము (నమస్తే రుద్రమన్యవ ఇత్యాది మంత్రములున్న భాగము) ఇవన్నియు మహా పాపములను సహితము పోగొట్టుచున్నవి.

అధ్యాయాంతమును సూచించుచు పదములు ఆవృత్తి చేయబడినవి.

ఇతి తృతీయః ప్రశ్నః

అథ చతుర్థః ఖండః

**ప్రాయశ్చిత్తాని వక్ష్యామోఽ విఖ్యాతాని విశేషతః।**
**సమాహితానాం యుక్తానాం ప్రమాదేషు కథం భవేత్॥** 1

శాస్త్ర విధిననుసరించి ప్రవర్తించువారు, జాగరూకులై యుండువారు కూడపొరపాటువలన దోషములను చేయుదురు. అట్టి దోషములకు ప్రాయశ్చిత్తమింత వరకు చెప్పలేదు. కావున ఆ దోషములకు ప్రాయశ్చిత్తమును తెలుపుచున్నాను.

**ఋతం చ సత్యం చ ఇత్యేతదఘమర్షణం**
**త్రిరంతర్జలే పఠన్ సర్వాస్మాత్పాపాత్ప్రముచ్యతే॥** 2

"ఋతం చ సత్యం చ" అను తైత్తిరీయారణ్యక మంత్రభాగమును అఘమర్షణమందురు. ఈ అఘమర్షణ మంత్రములను జలమున నిలబడి మూడు మార్లు చదివినచో సమస్తమైన పాపములు తొలగును.

**ఆయం గౌః పృశ్ని రక్తమీదిత్యేతామృచం**
**త్రిరంతర్జలే పఠన్ సర్వస్మాత్పాపాత్ప్రముచ్యతే॥** 3

"ఆయం గౌః పృశ్ని" అను భూసూక్తమందలి ఋక్కును స్నానముచేసి ఆ జలమందే నిలబడి మూడు మార్లు జపించినచో సమస్త పాపములు నశించును.

**ద్రుపదాది వేన్ముముచాన ఇత్యేతామృచం**
**త్రిరంతర్జలే పఠన్ సర్వస్మాత్పాపాత్ప్రముచ్యతే॥** 4

"ద్రుపదాదివేన్ముముచానం। స్విన్న స్స్నాత్వీమలాదివ। పూతం పవిత్రేణైవాఽజ్యమాపశ్శుంధంతు మైనసః" అను ఋక్కును స్నానము చేసి ఆ జలములందే నిలబడి మూడు పర్యాయములు చదివినచో సమస్త పాపములు నశించును.

**హగ్ంసశ్శుచిషదిత్యేతామృచం త్రిరంతర్జలే పఠన్**
**సర్వస్మాత్పాపాత్ప్రముచ్యతే॥** 5

"హగ్ంసశ్శుచిషత్" అను మంత్రమును నీటిలో నిలబడి మూడు మార్లు చదివినచో పాపములన్ని నశించును.

**అపి వా సావిత్రీం గాయత్రీం పచ్ఛోఽర్ధశస్తతః సమస్తామ్**
**ఇత్యేతామృచం త్రిరంతర్జలే పఠన్ సర్వస్మాత్పాపాత్ప్రముచ్యతే॥** 6

లేక గాయత్రీ మంత్రమును ఒక్కొక్క పాదమును లేక పూర్వోత్తర భాగములను లేక మంత్రమునంతయు నీటిలో నిలబడి మూడు మార్లు చదివినచో సమస్త పాపములు నశించును.

**అపి వా వ్యాహృతీర్వ్యస్తాః సమస్తాశ్చేతి**
**త్రిరంతర్జలే పఠన్ సర్వస్మాత్పాపాత్ప్రముచ్యతే॥** 7

లేక సప్త వ్యాహృతులను విడివిడిగా కానిచో అన్నిటిని కలిపి నీటిలో నుండి మూడు మార్లు చదివినచో పాపములన్నియు నశించి పోవును.

**అపి వా ప్రణవమేవ త్రిరంతర్జలే పఠన్ సర్వస్మాత్పాపాత్ప్రముచ్యతే॥ 8**

లేక ఓంకారమునైనా నీటిలో మునిగి అచ్చటనే నిలబడి మూడు మార్లు జపించినచో సమస్త పాపములు నశించును.

**తదేతద్ధర్మశాస్త్రం నాభక్తాయ నాపుత్రాయ నాశిష్యాయ**
**నాసంవత్సరోషితాయ దద్యాత్।** 9

ఈ ధర్మ శాస్త్రమును భక్తుడు కానివానికి, పుత్రుడు కాని వానికి, శిష్యుడు కాని వానికి, లేక కనీసము ఒక సంవత్సరము తన దగ్గరుండి శుశ్రూష చేయనివానికి ఉపదేశింపరాదు.

**సహస్రం దక్షిణా ఋషభైకాదశం గురు ప్రసాదో వా గురుప్రసాదో వా॥10**

ఈ ధర్మ శాస్త్రమును ఉపదేశించినచో గురువునకు వేయి పణములు (బంగారు నాణెములు) లేక పది గోవులతో పాటు ఒక వృషభమును గురుదక్షిణగా ఇవ్వవలెను. లేనిచో గురువును సంతోష పెట్టుటయే గురు దక్షిణగా ఈయవలెను.

అధ్యాయాంతమును సూచించుచు పదములు ఆ వృత్తి చేయబడినవి.

ఇతి చతుర్థః ఖండః

అథ పంచమః ఖండః

**అథాతస్సంప్రవక్ష్యామి సామర్గ్యజురథర్వణామ్।**
**కర్మభిర్యైరవాప్నోతి క్షిప్రం కామాన్ మనోగతాన్॥** 1

ప్రసుత్తము ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము అధర్వవేదములలో చెప్పబడిన కర్మలవల్ల త్వరగా ఫలితము లభించు విషయము చెప్పబడును.

**జపహోమేష్టి యంత్రాద్యైః శోధయిత్వా స్వవిగ్రహమ్।**
**సాధయేత్సర్వకర్మాణి నాన్యథా సిద్ధిమశ్నుతే॥** 2

వేదములలో చెప్పబడిన జపములు, హోమములు, ఇష్టి, యంత్రములు మొదలగు వాటిచే తనను పవిత్రునిగా చేసికొన్నందువలననే సమస్త కార్యములు సిద్ధించుచున్నవి. తాను పవిత్రుడు కాక చేసిన కార్యములేవియు సిద్ధింపవు.

**జప హోమేష్టి యంత్రాణి కరిష్యన్నాదితో ద్విజః।**
**శుక్ల పుణ్యదినర్క్షేషు కేశ శ్మశ్రూణి వాపయేత్॥** 3

**స్నాయాత్త్రిషణం పాయాదాత్మానం క్రోధతోఽనృతాత్।**
**స్త్రీ శూద్రైర్నాభిభాషేత బ్రహ్మచారీ హవిర్వ్రతః॥** 4

**గో విప్ర పితృదేవేభ్యో నమస్కుర్వన్ దివాఽస్వపన్।**
**జప హోమేష్టి యంత్రస్థో దివాస్థానో నిశాసనః॥** 5

వేదములందు పేర్కొనబడిన జపమును, హోమమును, ఇష్టిని, వ్రతములను చేయుటకు ముందు శుక్లపక్షమున మంచి దినము, మంచి నక్షత్రము చూసుకొని

క్షౌరము చేయించుకొనవలెను. తరువాత తాను దీక్షతీసికొని, కర్మ పూర్తియగువరకు మూడు సంధ్యలందు చన్నీటిస్నానము చేయుచుండవలెను. ఎవ్వరిపై కోపపడరాదు. అబద్ధమాడరాదు. స్త్రీలతో శూద్రులతో మాట్లాడ కూడదు. బ్రహ్మచర్యమునవలంబింపవలెను. హవిస్సును మాత్రమే ఆహారముగా తీసుకొనవలెను. ప్రతిదినము గోవులకు, బ్రాహ్మణులకు, దేవతలకు నమస్కరించుచు ఉండవలెను. పగటిపూట నిద్రపోరాదు. వ్రత సమయమున పగటిపూట అంతయు నిలబడియే ఉండవలెను. రాత్రిపూట అంతయు కూర్చొనియుండవలెను.

**ప్రాజాపత్యో భవేత్ కృచ్ఛ్రో దివారాత్రావయాచితమ్।**
**క్రమశో వాయుభక్షశ్చ ద్వాదశాహం త్ర్యహం త్ర్యహమ్॥** 6

ప్రాజాపత్య కృచ్ఛ్రము పన్నెండు దినముల వ్రతము. ఈ వ్రతమున మొదటి మూడు దినములు దివా భోజనము మాత్రము చేయవలెను. తరువాతి మూడు దినములు రాత్రి భోజనము మాత్రము చేయవలెను. తరువాత మూడు దినములు యాచింపకుండ వచ్చిన దానిని మాత్రము భోజనము చేయవలెను. మిగిలిన నాలుగు దినములు ఉపవాసము (వాయుభక్షణము) చేయవలెను.

**అహరేకం తథా నక్తం అజ్ఞాతం వాయుభక్షణమ్।**
**త్రివృదేష పరావృత్తో బాలానాం కృచ్ఛ్ర ఉచ్యతే॥** 7

ఒక దినము దివాభోజనము, ఒక దినము రాత్రి భోజనము, ఒక దినము అయాచిత భోజనము ఒక దినము వాయు భక్షణము. ఈ విధముగా మూడు పర్యాయములు చేయుట కూడ ప్రాజాపత్యమే. దీనిని బాలకృచ్ఛ్రమందురు.

**ఏకైకం గ్రాసమశ్నీయాత్ పూర్వోక్తేన త్ర్యహం త్ర్యహమ్।**
**వాయుభక్షస్త్ర్యహం చాన్యదతికృచ్ఛ్రస్స ఉచ్యతే॥** 8

నెమలిగుడ్డంత పరిమాణమున్న ఒక ముద్దను దివాభోజనముగా, రాత్రిభోజనముగా, తీసికొనుచు మూడు, మూడు దినములు గడపవలెను. అయాచితమును కూడా అంతే పరిమాణమున్న ఆహారముతో మూడు దినములు తీసికొని మిగిలిన మూడు దినములు ఉపవాసమున్నచో అది అతికృచ్ఛ్రమను ప్రాజాపత్యము.

**అంబుభక్షస్త్ర్యహానేతాన్ వాయుభక్షస్తతః పరమ్।**

**కృచ్ఛ్రాతికృచ్ఛ్రస్తృతీయో విజ్ఞేయస్సోఽతిపావనః॥** 9

ఆహారమునకు బదులుగా మూడు దినములు పగటి పూట జలమును, మూడు దినములు రాత్రిపూట జలమును, మూడు దినములు అయాచితముగా వచ్చిన జలమును మాత్రము ఆహారముగా తీసికొని మిగిలిన మూడు దినములు ఆహారమేమియు తీసికొనక (ఉపవాసము) ఉండుట కృచ్ఛ్రాతి కృచ్ఛ్రప్రాజాపత్యము. ఇది అత్యంత పావనమైన వ్రతము.

**త్ర్యహం త్ర్యహం పిబేదుష్ణం పయస్సర్పిః కుశోదకమ్।**

**వాయు భక్షస్త్ర్యహం చాన్యత్ తప్తకృచ్ఛ్రస్స ఉచ్యతే॥** 10

మూడు దినములు వేడిపాలను, మూడు దినములు వేడినేయిని, మూడు దినములు వేడిగా ఉన్న కుశోదకమును (దర్భలువేసిన జలము) మిగిలిన మూడు దినములు ఉపవాసమున్నచో అది తప్తకృచ్ఛ్రమను ప్రాజాపత్యవ్రతము.

**గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్।**

**ఏకరాత్రోపవాసశ్చ కృచ్ఛ్రం సాంతపనం స్మృతమ్॥** 11

కృచ్ఛ్ర సాంతపనమనది రెండు దినముల వ్రతము. ఈ వ్రతమందు మొదటి దినమున గోమూత్రము, గోమయము, గోక్షీరము గోదధి, ఆవునేయి, కుశోదకము కలిపి తీసికొనవలెను. రెండవ దినమున ఉపవాసముండవలెను. కాని గోవిందస్వామి తన వ్యాఖ్యానమున ఇది ఏడు దినముల వ్రతమని చెప్పెను. ఇది విచారించ తగినది.

**గాయత్ర్యా గృహ్య గోమూత్రం గంధద్వారేతి గోమయమ్।**

**అప్యాయస్వేతి చ క్షీరం దధిక్రావ్ణేతి వై దధి।**

**శుక్రమసి జ్యోతిరసీత్యాజ్యం దేవస్య త్వా కుశోదకమ్॥** 12

కృచ్ఛ సాంతపన వ్రతమందు పై వస్తువులను తీసికొనునప్పుడు ఈ మంత్రములను చదువవలెను. గోమూత్రమును గాయత్రీ మంత్రమును చదువుచు తీసికొనవలెను. గోమయమును "గంధ ద్వారాం దురాధర్షామ్" అను మంత్రమును చదువుచు తీసికొనవలెను. గోక్షీరమును "ఆప్యాయస్వసమేతు తే" అను మంత్రము చేత తీసికొనవలెను. "దధి క్రావ్ణో అకారిషమ్" అను మంత్రము చేత ఆవు పెరుగు

తీసికొనవలెను. శుక్రమసి జ్యోతిరసి అనుమంత్రము చేత ఆవు నేయిని తీసికొనవలెను "దేవస్యత్వా సవితుః" అనుమంత్రముచేత కుశోదకమును తీసికొనవలెను. పరాశరస్మృతిలో 11-33, 34 ఈ విషయమే చెప్పబడినది.

**గోమూత్ర భాగస్తస్యార్ధం శకృత్ క్షీరస్య తు త్రయమ్।**
**ద్వయం దధ్నో ఘృతస్యైకః ఏకశ్చ కుశవారిణః।**
**ఏవం సాంతాపనః కృచ్ఛ్రః శ్వపాకమపి శోధయేత్॥** 13

ఇంతవరకు కుశోదకముతో పంచగవ్యములను తీసికొనునప్పుడు చదువవలసిన మంత్రములు చెప్పబడినవి. ఇక ఆయా వస్తువులు ఎంత పరిమాణముండవలెనో తెలుపుచున్నాడు. గోమూత్రము ఒక భాగము, గోమయము సగము భాగము, గోక్షీరము మూడు భాగములు, ఆవు పెరుగు రెండు భాగములు, ఆవు నేయి, కుశోదకము ఒక్కొక్క భాగము చొప్పున తీసికొనవలెను. పరాశరస్మృతి 11-32,33 శ్లోకములందు ఇది ఇంకను స్పష్టముగా నున్నది. ఈ విధముగా కృచ్ఛ సాంతపన ప్రాయశ్చిత్తమును చేసికొనినచో కుక్కమాంసమును వండుకొని తిన్నందువలన కలుగు పాపము కూడా నశించును.

**గోమూత్రం గోమయం క్షీరం దధిసర్పిః కుశోదకమ్।**
**పంచరాత్రం తదాహారః పంచగవ్యేన శుద్ధ్యతి॥** 14

కుశోదకముతో పంచగవ్యములను కలిపి ఐదు దినములు ఆ పంచగవ్యమునే ఆహారముగా తీసికొనినచో అతడు పంచగవ్య శుద్ధిని పొందుచున్నాడు.

**యతాత్మనోఽ ప్రమత్తస్య ద్వాదశాహమభోజనమ్।**
**పరాకో నామ కృచ్ఛ్రోఽయం సర్వపాప ప్రణాశనః॥** 15

ఇంద్రియములను జయించి అప్రమత్తుడై పన్నెండుదినములు ఉపవాసమున్నచో అది పరాకమను కృచ్ఛ్రము. ఆ ప్రాయశ్చిత్తమువలన సమస్త పాపములు తొలగును.

**గోమూత్రాదిభిరభ్యస్తమేకైకం తం త్రిసప్తకమ్।**
**మహాసాంతపనం కృచ్ఛ్రం వదంతి బ్రహ్మవాదినః॥** 16

పంచగవ్యములు, కుశోదకము, ఏకరాత్రోపవాసము అను మూడింటిని

విడివిడిగా ఏడేసి దినములు (7×3=21 దినములు) చేసినచో దానిని మహా సాంతపన కృచ్ఛ్రమందురు.

**ఏకవృద్ధ్యా సితే పిండే ఏకహాన్యాఽసితే తతః।**
**పక్షయోరుపవాసౌ ద్వౌ తద్ధి చాంద్రాయణం స్మృతమ్॥ 17**

శుక్ల పక్షమందు ఒక్కొక్క ముద్దను పెంచుచు కృష్ణపక్షమున ఒక్కొక్క ముద్దను తగ్గించుచు తినవలెను. అట్లే పూర్ణిమ అమావాస్యలందు రెండు దినములు ఉపవాసముండుటను చాంద్రాయణ వ్రతమందురు.

**చతురః ప్రాతరాశ్నీయాత్పిండాన్విప్రస్సమాహితః।**
**చతురోఽస్తమితే సూర్యే శిశుచాంద్రాయణం స్మృతమ్॥ 18**

మధ్యాహ్న సమయమున నెమలి గుడ్డు పరిమాణమున్న నాలుగు ముద్దలను, రాత్రివూట అట్లే నాలుగు ముద్దలను భోజనము చేయుటను శిశు చాంద్రాయణమందురు.

**అష్టావష్టౌ మాసమేకం పిండాన్మంధ్యందినే స్థితే।**
**నియతాత్మా హవిష్యస్య యతిచాంద్రాయణం చరేత్॥ 19**

మధ్యాహ్న సమయమున హవిష్యాన్నమును ఎనిమిది ముద్దలు మాత్రమే నియమముతో ఒక నెలవరకు తిన్నచో అది యతి చాంద్రాయణము.

**యథా కథంచిత్పిండానాం ద్విజస్త్రిస్త్వశీతయః।**
**మాసేనాశ్నన్ హవిష్యస్య చంద్రస్యైతి సలోకతామ్॥ 20**

ప్రతి దినము ఎనిమిది ముద్దల చొప్పున (మధ్యాహ్నము రాత్రి కలుపుకొని) నెలవరకు హవిష్యాన్నమును తిన్నచో అతడు తేలికగా చంద్రలోకమును పొందును.

**యథోద్యంశ్చంద్రమా హంతి జగతస్తమసో భయమ్।**
**తథా పాపాద్భయం హంతి ద్విజశ్చాంద్రాయణం చరన్॥ 21**

ఉదయించుచున్న చంద్రుడు చీకటిని తొలగించుచున్నట్లు చాంద్రాయణ వ్రతము పాపమునంతయు నశింపజేయుచున్నది.

**కణ పిణ్యాక తక్రాణి తథా చాపోఽనిలాశనః।**
**ఏక త్రి పంచ సప్తేతి పాపఘ్నోఽయం తులాపుమాన్॥ 22**

ఒక దినము నూకల అన్నమును, మూడు దినములు నూవుల పిండితో చేసిన రొట్టెను, ఐదు దినములు మజ్జిగను, తిని ఏడు దినములు నీళ్ళను మాత్రము త్రాగి ఒక దినమంతయు ఉపవాసముండుటను తులాపురుష వ్రతమందురు. దీనివలన సమస్త పాపములు నశించుచున్నవి.

యాజ్ఞవల్క్యస్మృతిలో పైన చెప్పిన వాటిని ఒక్కొక్క దానికి ఒక్కొక్క దినము చొప్పున మూడు పర్యాయములు చేసినచో అది తులాపురుష వ్రతమని చెప్పబడినది. అనగా యాజ్ఞవల్క్యుడు ఇది పదునైదు దినముల వ్రతముగా పేర్కొనెను.

**యావకస్సప్తరాత్రేణ వృజినం హంతి దేహినామ్।**
**సప్త రాత్రోపవాసో వా దృష్టమేతన్మనీషిభిః॥** 23

ఏడు దినములు యావకాన్నము తిన్నను ఏడు దినములు ఉపవాసము చేసినను సమస్త పాపములు తొలగి పోవునని విద్వాంసులందురు.

**పౌష భాద్రపద జ్యేష్ఠా ఆర్ద్రాకాశాతపాశ్రయాత్।**
**త్రీన్ శుక్లాన్ముచ్యతే పాపాత్పతనీయాదృతే ద్విజః॥** 24

పుష్యమాస శుక్ల పక్షమున తడిసిన వస్త్రములు ధరించి, భాద్రపద శుక్ల పక్షమున ఆకాశము క్రింద ఉండి, జ్యేష్ఠమాస శుక్ల పక్షమున సూర్యుని ఎండలో ఉన్నచో పతనీయములవలన వచ్చిన పాపములు తప్ప, మిగిలిన పాపములన్నియు తొలగిపోవును.

**గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్।**
**యవా చామేన సంయుక్తః బ్రహ్మకూర్చోఽతిపావనః॥** 25

పంచగవ్యములు, కుశోదకము, యవాగు వీటినన్నిటిని కలిపినచో దానిని బ్రహ్మకూర్చమందురు. ఆ బ్రహ్మకూర్చమును సేవించినచో సమస్త పాపములు నశించును. బ్రహ్మస్వరూపమైన, ఓంకారమునుచ్చరించుచు పై వానిని కలిపి సేవింపవలెనని పరాశరస్మృతి 11-37, 38, 39 శ్లోకములలో కన్పించును.

**అమావాస్యాం నిరాహారః పౌర్ణమాస్యాం తిలాశనః।**
**శుక్ల కృష్ణ కృతాత్పాపాన్ముచ్యతేఽబ్దస్య పర్వభిః॥** 26

ఒక సంవత్సరము అమావాస్యలందు ఉపవాసముండి పున్నములందు తిలాహారము మాత్రము తీసికొన్నచో, ఆ సంవత్సరము చేసిన పాపములన్నియు తొలగును.

**భైక్షాహారోఽగ్నిహోత్రిభ్యో మాసేనైకేన శుద్ధ్యతి।**
**యాయావర వనస్థేభ్యో దశభిః పంచభిర్దినైః॥ 27**

నిత్యాగ్నిహోత్రుల దగ్గర ఒక నెల భిక్ష తీసికొని తిన్నచో, యాయవర గృహస్థుల దగ్గర పది దినములు భిక్ష తీసికొనితిన్నచో, వానప్రస్థుల దగ్గర ఐదు దినములు భిక్ష తీసికొని తిన్నచో సమస్త పాపములు తొలగును. ఈ మూడు కృచ్ఛ్రవ్రతములు.

**ఏకాహ ధనినోఽన్నేన దినేనైకేన శుద్ధ్యతి।**
**కాపోతవృత్తి నిష్ఠస్య పీత్వాఽపశ్శుద్ధ్యతే ద్విజః॥ 28**

ఒక దినమునకు సరిపడునంత మాత్రమే నిలువ చేసికొనువాని దగ్గర ఒక దినము అన్నము తిన్నను, భూమిపై పడు గింజలను ఏరుకొని తినుచు కాపోత వృత్తిలోనున్న వాని దగ్గర నీరు మాత్రము త్రాగినను పరిశుద్ధుడగును.

**ఋగ్యజుస్సామవేదానాం వేదస్యాన్యతమస్య వా।**
**పారాయణం త్రిరభ్యస్యేదనశ్నన్ సోఽతిపావనః॥ 29**

ఏమియు తినక (అనశ్నన్) ఋగ్యజుస్సామవేదములను లేక ఒకే వేదమునంతయు మూడు మార్లు పారాయణము చేసినచో అతడు అతిపవిత్రుడగును.

**అథ చేత్త్వరతే కర్తుం దివసే మారుతాశనః।**
**రాత్రే జలే స్థితో వ్యుష్టః ప్రాజాపత్యేన తత్సమమ్॥ 30**

ప్రాయశ్చిత్తమును త్వరగా చేసికొనవలెనని అనుకొన్నచో పగలంతా ఉపవాసముండి రాత్రియంతా నీళ్ళలో నిలబడి గడపినచో అది ప్రాజాపత్య ప్రాయశ్చిత్తముతో సమానమగును.

**గాయత్ర్యష్ట సహస్రం తు జపం కృత్వోత్థితే రవౌ।**
**ముచ్యతే సర్వపాపేభ్యో యది న భ్రూణహా భవేత్॥ 31**

ఇంకను సూర్యోదయమునుండి గాయత్రీ మంత్రమును వేయి ఎనిమిది (1008) మార్లు జపము చేసినచో బ్రహ్మహత్యా పాతకము తప్ప మిగిలిన పాపములన్నియు నశించును.

**యోఽన్నదస్సత్యవాదీ చ భూతేషు కృపయా స్థితః।**
**పూర్వోక్త యంత్ర శుద్ధేభ్యస్సర్వేభ్యస్సోఽతిరిచ్యతే॥ 32**

అన్నదానము చేయువాడు. సత్యము పలుకువాడు, భూత దయకలవాడైనచో పూర్వము చెప్పబడిన జప హోమేష్టి వ్రతములు మొదలైనవి చేయువారికంటె మిక్కిలి పవిత్రుడగును.

ఇతి పంచమః ఖండః

అథ షష్ఠః ఖండః

**సమాధుచ్ఛందసాం రుద్రా గాయత్రీ ప్రణవాన్వితా।**
**సప్త వ్యాహృతయశ్చైవ జాప్యా పాపవినాశనాః॥ 1**

శాకల సంహితలోని తొలి పది సూక్తములకు ఋషి మధుచ్ఛందుడు, ఆ సూక్తములతో పాటు నమస్తే రుద్రమన్యవ ఇత్యాది ఏకాదశానువాకములతో నున్న రుద్రము, ఓంకార సహితమైన గాయత్రీ మంత్రము, సప్త వ్యాహృతులు పాపనాశకములు కావున ఇవన్నియు జపము చేయదగినవి.

**మృగారేష్టిః పవిత్రేష్టిః త్రిహవిః పావమాన్యపి।**
**ఇష్టయః పాపనాశిన్యో వైశ్వానర్యా సమన్వితాః॥ 2**

అగ్నయేగ్ం హోముచేఽష్టాకపాలః" అను మంత్రమున్న దశహవిస్సుల ఇష్టిని మృగారేష్టి అందురు. "అగ్నయే పవమానాయ" అను దశహవిస్సుల ఇష్టి పవిత్రేష్టి. మూడు హవిస్సులుండునది సవనేష్టి. పవమానమంత్రములచే చేయు ఇష్టి పావమానేష్టి ఇంకను ద్వాదశకపాలమైన ఇష్టి వైశ్వనరేష్టి. ఈ ఇష్టులన్నియు పాపమును సంపూర్ణముగా పోగొట్టును.

**ఇదం చైవాపరం గుహ్యమ్ ఉచ్యమానం నిబోధత।**
**ముచ్యతే సర్వపాపేభ్యో మహతః పాతకాదృతే॥** 3

ఇవి మహాపాపములను కాక మిగిలిన పాపములను పోగొట్టును. ఈ విషయము పరమ రహస్యమైనది.

**పవిత్రైర్మార్జనం కుర్వన్ రుద్రైకాదశికాం జపన్।**
**పవిత్రాణి ఘృతైర్జుహ్యాత్ ప్రయచ్ఛన్ హేమ గో తిలాన్॥** 4

పవిత్రముగా చేయు మార్జన మంత్రములచే మార్జనము చేయుచు, ఏకాదశాను వాకములున్న రుద్రమును జపించుచు, పవిత్ర మంత్రములచే ఆజ్యాహుతులనిచ్చుచు, ధనము, భూమి నూవులను దానము చేయుచు ఉన్నచో వెంటనే పాపరహితుడై పవిత్రుడగును.

**యోఽశ్నీయాద్యావకం పక్వం గోమూత్రే సశకృద్రసే।**
**సదధిక్షీర సర్పిష్కే ముచ్యతే సోఽంహసః క్షణాత్॥** 5

గోమూత్రము, గోమయరసము, ఆవు పాలు, ఆవు పెరుగు, ఆవునేయి వీటిని యావకాన్నముతో కలిపి భక్షించినచో పాపములు వెంటనే నశించును.

**ప్రసూతో యశ్చ శూద్రాయాం యేనాగమ్యా చ లంఘితా।**
**సప్తరాత్రాత్ప్రముచ్యేత విధినైతేన తావుభౌ॥** 6

శూద్రస్త్రీకి ఇతర వర్ణము వానిచే పుట్టినవాడు, అగమ్యయైన స్త్రీతో సంగమము చేసినవాడు వీరిద్దరు పై విధానమును ఏడుదినములు అనుసరించినచో వారి పాపమంతయు నశించును.

**రేతో మూత్ర పురీషాణాం ప్రాశనేఽభోజ్యభోజనే।**
**పర్యాధానేజ్యయోరేతత్ పరివిత్తే చ భేషజమ్॥** 7

రేతస్సు మొదలగు వాటిని తిన్నప్పుడు, అభోజ్యములైన పదార్థములను తిన్నప్పుడు, అన్న ఆహితాగ్ని కానప్పుడు తమ్ముడు అగ్న్యాధానము చేసినచో, (పర్యాధానము) అట్లే పెద్దవాడుండగా అతనిని కాదని తమ్ముడు నిత్యాగ్ని హోత్రము పశుహోమములు మొదలగునవి చేసినచో, (పరీజ్య) ఆరోగ్యముగా ఉన్న అన్నకంటె

ముందు తమ్ముడు వివాహము చేసికొన్నచో ఆ అన్న, (పరివిత్తుడు) వీరందరు యావకాన్నము మొదలగు వానిని కలిపి తీసికొన్నచో వారి పాపములు నశించును.

**అపాతకాని కర్మాణి కృత్వైవ సుబహూన్యపి।**

**ముచ్యతే సర్వపాపేభ్యః ఇత్యేతద్వచనం సతామ్॥** 8

మహా పాపములు, సముద్రయానాది పాతక కర్మలకంటె భిన్నమైన పాపకర్మలనేకము చేసినను పైనపేర్కొన్న ప్రాయశ్చిత్తమువలన సమస్త పాపములు వెంటనే తొలఁగునని పెద్దలు చెప్పుదురు.

**మంత్రమార్గ ప్రమాణం తు విధానే సముదీరితమ్।**

**భరద్వాజాదయో యేన బ్రహ్మణస్సమతాం గతాః॥** 9

నియమవిధానమంతయు మంత్రమూలకమై యుండును. అట్టి నియమమునును చక్కగా అష్ఠించినందువలననే భరద్వాజాది మునులు బ్రహ్మదేవునితో సమానులైరి.

**ప్రసన్న హృదయో విప్రః ప్రయోగాదస్య కర్మణః**

**కామాంస్తాంస్తానవాప్నోతి యే యే కామా హృది స్థితాః॥** 10

ప్రశాంతమైన మనస్సున్న బ్రాహ్మణుడు పైనపేర్కొన్న నియములతోనున్న కర్మలను చేసినందువలన తాను కోరుకొన్న కోరికలను పూర్తిగా పొందగలడు.

ఇతి షష్ఠః ఖండః

అథ సప్తమః ఖండః

**నివృత్తః పాపకర్మేభ్యః ప్రవృత్తః పుణ్యకర్మసు।**

**యో విప్రస్తస్య సిద్ధంతి వినా యంత్రైరపి క్రియాః॥** 1

పాపకర్మలు చేయక, పుణ్యకర్మలు చేయుచు ఉన్నట్లైతే పూర్వము చెప్పిన వ్రతములనాచరింపకున్నను అతడు కోరుకొన్న కోరికలు సిద్ధించును.

**బ్రాహ్మణా ఋజవస్తస్మాత్ యద్యదిచ్ఛంతి చేతసా।**

**తత్తదా సాధయంత్యాశు సంశుద్ధా ఋజుకర్మభిః॥** 2

పరిశుద్ధమైన కర్మలు చేయుచు పరిశుద్ధమైన హృదయమున్న బ్రాహ్మణులు కోరుకొన్న కోరికలన్నియు వారికి సిద్ధించును.

ఏవమేతాని యంత్రాణి తావత్కార్యాణి ధీమతా।
కాలేన యావతోపైతి విగ్రహం శుద్ధిమాత్మనః॥ 3

బుద్ధిమంతుడు ఏ వ్రతమును ఎంతకాలముచేసినచో ఆత్మ శుద్ధి కలుగునో ఆ వ్రతములను అంతే కాలము చేయవలెను.

ఏభిర్యంత్రైర్విశుద్ధాత్మా త్రిరాత్రోపోషితస్తతః
తదాఽ రభేత యేనర్ధిం కర్మణా ప్రాప్తుమిచ్ఛతి॥ 4

ఈ వ్రతాదులచేత పరిశుద్ధుడైన తరువాత మూడు రాత్రులు ఉపవాసముండవలెను. తరువాతనేకోరికలనుతీర్చుయాగాదులను ప్రారంభింపవలెను.

క్షాపవిత్రం సహస్రాక్షో మృగారోఽంహోముచౌ గణౌ।
పావమాన్యశ్చ కూష్మాండ్యో వైశ్వానర్య ఋచశ్చ యాః॥ 5

"క్ష" కారముతోనున్న పవిత్రమంత్రములు, (క్షాం విశ్వేభిః" మొదలైన తైత్తిరీయ బ్రాహ్మణ మంత్రములు) పురుషసూక్తమంత్రములు అగ్నేర్మన్వే మొదలైన అనువాకము, "యావాయింద్రావరుణాయతవ్యా" మొదలైన నాలుగు మంత్రములు, యోవామింద్రావరుణావగ్నౌ'' మొదలైన ఎనిమిది మంత్రములున్న అంహోముచగణములు రెండు, పవమానస్సువర్జనః అనుమంత్రములున్న పవమానానువాకము,"యద్దేవా" మొదలైన ఇరువదియొక్క మంత్రములున్న కూష్మాండీ మంత్రములు "వైశ్వానరో న ఊత్యా" ఇత్యాది ఎనిమిది ఋక్కులు వీటిని ఆత్మ పవిత్రతకై సదా జపము చేయవలెను.

ఘృతౌదనేన తా జుహ్వాత్సప్తాహం సవనత్రయమ్।
మౌనవ్రతీ హవిష్యాశీ నిగృహీతేంద్రియక్రియః॥ 6

ఏడు దినములు మౌనవ్రతమును పాటించుచు హవిష్యాన్నమును మాత్రము భక్షించుచు తన ఇంద్రియములను కర్మలను నిగ్రహించుకొనవలెను. ఇంకను ఆ ఏడు దినములు మూడు సంధ్యలందు ఆజ్యాహుతులచే అన్నా హుతులచే హోమము చేయవలెను.

సింహో మే ఇత్యపాం పూర్ణే పాత్రేఽవేక్ష్య చతుష్పథే।
ముచ్యతే సర్వపాపేభ్యః మహతః పాతకాదపి॥ 7

పాత్రలో నిండుగా నీరు తీసికొని చతుష్పథమునకు పోయి తూర్పుముఖముగా నిలబడి అక్కడ ఉపస్థగా (ఎడమ కాలును మడచి దానిపై కుడి కాలుపెట్టి కూర్చుండుట) కూర్చుండి తాను చేసిన పాపమును తలచుకొని నీటి పాత్రలో చూడవలెను. తరువాత "సింహెూ మే" అను అనువాకమును చదువుచు పాత్రలో నున్న నీటివైపు చూడకుండ దానిని నైర్‌ఋతి దిక్కున పోసి వెనకకు తిరగకుండ పోవలెను. ఈ విధముగా చేసినచో మహాపాపములు కూడా నశించును.

**వృద్ధత్వే యౌవనే బాల్యే యః కృతః పాపసంచయః।**
**పూర్వజన్మసు వాஉజ్ఞానాత్ తస్మాదపి విముచ్యతే॥** 8

ముసలి తనమున, యౌవనమున, బాల్యావస్థయందు అజ్ఞానమువలననైనా, చేసిన పాపము, పూర్వజన్మలలో చేసిన పాపమైనను అంతయు పై ప్రాయశ్చిత్తమువలన నశించును.

**భోజయిత్వా ద్విజానంతే పాయసేన సుసర్పిషా।**
**గో భూమి తిల హేమాని భుక్తవద్భ్యః ప్రదాయ చ॥** 9
**విప్రో భవతి పూతాత్మా నిర్దగ్ధ వృజినేంధనః।**
**కామ్యానాం కర్మణాం యోగ్యః తథాஉధానాది కర్మణామ్॥** 10

పై విధముగా ఏడు దినములు ప్రాయశ్చిత్తము చేసికొని ఏడవదినము మధ్యాహ్నమున బ్రాహ్మణులకు నేయి పాయసములతో మృష్టాన్న భోజనమును పెట్టవలెను. వారికి భోజనానంతరము గోవులు, భూమి నూవులు ధనము మొదలగు దానముల నీయవలెను. అట్లు చేసినచో అతడు చేసిన పాపములన్నియు నశించి కోరిన కోరికలన్నియు తీరును. అట్లే అతడు అగ్న్యాధానము మొదలగు యజ్ఞ కర్మలకు అర్హుడగును.

ఇతి సప్తమః ఖండః

అథ అష్టమః ఖండః

**అతిలోభాత్ప్రమాదాద్వా యః కరోతి క్రియామిమామ్।**
**అన్యస్య సోఽంహసాఽఽవిష్టో గరగీరివ సీదతి॥** 1

ధనమునకు ఆశపడి లేక పొరపాటువల్ల ఇతరుల గురించి పై ప్రాయశ్చిత్త క్రియ చేయువాడు పాపమునకు గురియై విషము తిన్నట్లు బాధపడును.

**ఆచార్యస్య పితుర్మాతుః ఆత్మనశ్చ క్రియామిమామ్।**
**కుర్వన్భాత్యర్కవద్విప్రః సా కార్యైషామతః క్రియా॥** 2

కాని తనయొక్క ఆచార్యునిగురించి, తండ్రి గురించి తల్లిగురించి ఈ ప్రాయశ్చిత్త క్రియనాచరించినచో సూర్యునివలె అతడు ప్రకాశించును కావునపై వారి గురించి మాత్రము ఈ ప్రాయశ్చిత్త క్రియను చేయవచ్చును. దానివల్ల దోషము కలుగదు.

**క ఏతేన సహస్రాక్షం పవిత్రేణాకరోచ్ఛుచిమ్।**
**అగ్నిం వాయుం రవిం సోమం యమాదీంశ్చ సురేశ్వరాన్॥** 3

పూర్వ కాలమున (కశ్యప) ప్రజాపతి తన సంతానమైన ఇంద్రుడు, అగ్ని, వాయువు, చంద్రుడు, యముడు మొదలగు వారి గురించి పవిత్రమైన ఈ గణహోమమును చేసెను.

**యత్కించిత్పుణ్యనామేహ త్రిషు లోకేషు విశ్రుతమ్।**
**విప్రాది తత్కృతం కేన పవిత్ర క్రియయాఽనయా॥** 4

ప్రజాపతి ఈ గణహోమము చేయుటవలన ముల్లోకములందు పవిత్ర కార్యముగా కీర్తింపబడుచున్న సృష్టిని చేయగలిగెను.

**ప్రాజాపత్యమిదం గుహ్యం పాపఘ్నం ప్రథమోద్భవమ్।**
**సముత్పన్నాన్యతః పశ్చాత్ పవిత్రాణి సహస్రశః॥** 5

ఈ అష్టగణహోమమును ప్రజాపతి తొలుత ఆచరించెను. అందువలన ఇది ప్రాజాపత్యమైనది. ఈ గణహోమము పరమ రహస్యమైనది. పాపములనన్నిటిని తొలగించునది. ఈ ప్రాజాపత్యహోమము తరువాతనే పవిత్రముగా చేయు వేలకొలది ఇతర కర్మలు పుట్టినవి.

**యో౽బ్దాయనర్తుపక్షాహాన్ జుహోత్యష్టౌ గణానిమాన్।**
**పునాతి చా౽త్మనో వంశ్యాన్ దశ పూర్వాన్ దశాపరాన్॥** 6

ఈ అష్టగణహోమమును సంవత్సరము, అయనము, ఋతువు, పక్షము, దినము వీటి యొక్క ప్రారంభమున ఆచరించినచో విశేష ఫలమునిచ్చి తనను, తన పూర్వీకులను పదితరముల వారిని, రాబోవు పది తరములను పవిత్రము చేయును

**ఏతానష్టౌ గణాన్ హోతుం న శక్నోతి యది ద్విజః।**
**ఏకో౽పి తేన హోతవ్యో రజస్తేనాస్య నశ్యతి॥** 7

ఈ గణహోమములు ఎనిమిదింటిని కలిపి చేయలేనివాడు ఒక్క గణహోమము చేసినను అతని పాపమంతయు నశించును

**సూనవో యస్య శిష్యా వా జుహ్వత్యష్టౌ గణానిమాన్**
**అధ్యాపన పరిక్రీతైః అంహసస్సో౽పి ముచ్యతే॥** 8

ఈ అష్టగణహోమములను తన శిష్యులు లేక పుత్రులు చేసినచో వారు గురువునకు దక్షిణ సమర్పించినట్లగుటయే కాక గురువునకు కూడ పాప విమోచనము కలిగించినవారగుదురు.

**ధనేనాపి పరిక్రీతైరాత్మ పాపజిఘాంసయా।**
**హావనీయా హ్యశక్తేన నావసాద్యశ్శరీరధృక్॥** 9

ఈ గణహోమములను చేయుటకు తగిన శరీరబలము లేనప్పుడు తన పాపమును పోగొట్టుకొనుటకు తగిన ధనమునిచ్చి ఈ హోమములను చేయించుకొనవచ్చును. కాని శరీరమును కష్టపెట్టుట మాత్రము తగినది కాదు.

**ధనస్య క్రియతే త్యాగః కర్మణాం సుకృతామపి।**
**పుంసో౽నృణస్య పాపస్య విమోక్షః క్రియతే క్వచిత్॥** 10

ఇంకను పుణ్య కర్మలు చేయుటకై ధనమును త్యాగము చేయవలెను. అట్లే ఋణముక్తుడైనవాడు కూడా ధనత్యాగము చేయుటచే అతని పాపములనన్నీ తొలగించుకొనుచున్నాడు.

**ముక్తో యో విధినైతేన సర్వపాపార్ణసాగరాత్।**
**ఆత్మానం మన్యతే శుద్ధం సమర్థం కర్మసాధనే॥** 11

ఈ విధముగా గణహోమములు చేసి సమస్త పాపములనుండి, సమస్త

విధములైన ఋణములనుండి ముక్తుడగుచున్నాడు. అట్లే తాను పవిత్రుడైనట్లు, పుణ్య కర్మలు ~ ుటకు తగిన యోగ్యత సిద్ధించినట్లు కూడా అతడు భావించుకొనును.

**జ్ఞాయతే చామరైః ద్యుస్థైః పుణ్యకర్మేతి భూస్థితః।**
**దేవవన్మోదతే భూయస్స్వర్గలోకేఽ పి పుణ్యకృత్॥** 12

గణహోమాది కర్మలు చేసినవాడు భూలోకమున ఉన్నను, దేవతలతనిని పుణ్యకర్మ చేసినవాడని కీర్తింతురు. అట్లే అతడు స్వర్గలోకమున ఉన్నచో దేవతలవలె ఆదరింపబడుచున్నాడు.

**సర్వపాపార్ణముక్తాత్మా క్రియా ఆరభతే తు యాః।**
**అయత్నేనైవ తాస్సిద్ధిం యాంతి శుద్ధశరీరిణః॥** 13

సమస్త పాపములు, ఋణములు లేని పుణ్యాత్ముడు చేయు పుణ్యకర్మలన్నియు అప్రయత్నముగనే సిద్ధించును.

**ప్రాజాపత్యమిదం పుణ్యం ఋషీణాం సముదీరితమ్।**
**ఇదమధ్యాపయేన్నిత్యం ధారయేచ్ఛృణుతేఽ పి వా॥**
**ముచ్యతే సర్వపాపేభ్యో బ్రహ్మలోకే మహీయతే।** 14

ప్రజాపతికి సంబంధించిన ఈ అష్టగణహోమ విధానము చాల పవిత్రమైనది. దీనిని ఋషులు ఉపదేశించిరి. ఈ శాస్త్రమును అధ్యాపనము చేసినను, అధ్యయనము చేసిను, ఆ శిష్యుల ప్రక్కన ఉండి విన్నను సమస్త పాపములు నశించును. అట్లే అతడు చివరకు ఉత్తమలోకములను పొందును.

**యాన్ సిసాధయిషుర్మంత్రాన్ ద్వాదశాహాని తాన్జపేత్।**
**ఘృతేన పయసా దధ్నా ప్రాశ్య నిశ్యోదనం సకృత్॥** 15

తాను కోరుకొన్న కోరికలను సాధించి తీరవలెనని అనుకొను సాధకుడు ఈ మంత్రములను పన్నెండు దినములు జపింపవలెను. ఆ సమయమున ఘృతాన్నము లేక పాలు లేక పెరుగు ఆహారముగా తీసికొనవలెను. ఒకనాడు మాత్రము రాత్రిపూట అన్నమును తినవచ్చును.

**ఋగ్యజుస్సామ వేదానామ్ అథర్వాంగిరసామపి।**
**దశావరం తథా హోమః సర్పిషా సవనత్రయమ్॥** 16

ఆ సమయమున మూడు సంధ్యలందు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము మరియు అధర్వవేదములకు సంబంధించిన మంత్రములచే పదికి తక్కువ కాకుండ ఆజ్యాహుతులను సమర్పింపవలెను.

**పూర్వసేవా భవేదేషా మంత్రాణాం కర్మసాధనే।**

**మంత్రాణాం కర్మసాధన ఇతి॥** 17

తాము కోరుకొన్న కోరికలను సిద్ధింపజేసికొనుటకు పైన పేర్కొన్న పద్ధతి మంత్రముల పురశ్చరణ వంటిది.

అధ్యాయ పరిసమాప్తిని సూచించుచు పదములు తిరిగి ఆవృత్తి చేయబడినవి.

ఇతి అష్టమః ఖండః

చతుర్ధ ప్రశ్నశ్చ సమాప్తః

అతిలోభాత్ ప్రమాదాద్వా॥8॥ నివృత్తః పాపకర్మేభ్యః ॥7॥ సమాధుచ్ఛంద సారుద్రాః ॥6॥ అథా తస్సంప్రవక్ష్యామి॥5॥ ప్రాయశ్చిత్తాని వక్ష్యామః॥4॥ ప్రాయశ్చిత్తాని వక్ష్యామః॥3॥ ప్రాయశ్చిత్తాని వక్ష్యామః॥2॥ ప్రాయశ్చిత్తాని వక్ష్యామః॥1॥

## సమాప్తం చేదం
## బోధాయన ధర్మసూత్రమ్

శ్రీయాదగిరి లక్ష్మీనృసింహస్వామి చరణారవిందార్పణమస్తు

# కొన్ని విశేష పదముల అర్థములు

## (గోవిందస్వామి వ్యాఖ్యననునరించి ఇవ్వబడినవి)

| | | |
|---|---|---|
| కుంభీధాన్యుడు1-1-5 | = | 1) బ్రతుకు దెరువునకై పదిదినములకుమాత్రము సరిపడు ధాన్యమును నిలవ చేసికొనువాడు. 2) ఆరు దినములకు మాత్రము సరిపడు ధాన్యమునునిలువజేసికొనువడని గోవిందరాజు. 3) సంవత్సరమునకు సరిపడు ధాన్యమును నిలువ జేసికొనువాడని కుల్లూక భట్టు. 4) ఆరు నెలలకు సరిపడు ధాన్యమును నిలవజేసికొనువాడని మేధాతిథి |
| నిర్ణయము 1-2-17 | = | పూర్తిగా దూరము చేయుట |
| వర్ధనము 1-3-17 | = | గట్టిగా పలుకుట |
| అనూచానుడు1-3-37 | = | వేదమందలి ఒక శాఖను అంగములతో కలిపి అధ్యయనము చేసినవాడు. |
| శ్లాఘనమ్ 1-3-40 | = | నీటిలో చేతులు కొట్టుట |
| అంతర్వాసః1-5-2 | = | మొలత్రాడు |
| సాధవః1-7-4 | = | శాస్త్రములను క్షుణ్ణముగా అధ్యయనము చేసినవారు. |
| మేధ్యము 1-7-5 | = | మేధము= యజ్ఞము,యజ్ఞసంబంధముకలది. |
| సంతతిః 1-7-9 | = | ఎడతెగక ఉండునది. |
| శౌచమ్ 1-8-9 | = | ఇచ్చట మాత్రము ఆచమనమను అర్థము. |
| ప్రహ్వః 1-8-15 | = | వంగియున్నవాడు |
| అమత్రమ్ 1-8-25 | = | మట్టిపాత్ర |
| కుతపాః 1-8-3 | = | ఒక విధమైన గొఱ్ఱె బొచ్చుతో చేసిన గొంగళ్ళు. |
| గోచర్మ 1-10-1 | = | నూరు ఆవులు పట్టు స్థలము? |
| తిరస్కృత్య 1-10-10 | = | కప్పి? |
| కుసీదమ్ 1-10-22 | = | వడ్డీని ఆశించి ధనమునప్పుగా ఇచ్చుట. |
| కదర్యః 1-10-27 | = | అత్యాశ కలవాడు. |
| రభసః 1-10-32 | = | కటువుగా ప్రవర్తించువాడు. |

| | | |
|---|---|---|
| ప్రత్తా 1-11-5 | = | వివాహిత |
| సకుల్యులు 1-11-8 | = | స్పష్టమైన సంబంధము తెలియనిసపిండులు |
| సంసర్గః 1-11-21 | = | సంబంధము |
| తీర్థః 1-11-28 | = | గురువు (సతీర్థః) |
| సబ్రహ్మచారీ 1-11-28 | = | సహాధ్యాయి |
| అభిసంధిః 1-11-30 | = | తెలియుట |
| సంధినీ 1-12-9 | = | చూలుతోనున్న ఆవు |
| ధ్వరః 1-13-1 | = | హింసాకర్మ (అధ్వరః=హింస లేనిది యజ్ఞము) |
| ఋతసాపః 1-13-3 | = | యజ్ఞమును సేవించువారు |
| అహతమ్ 1-13-4 | = | నూతనము(వస్త్రము) |
| సత్రయాగము1-13-7 | = | పదమూడు రాత్రులు మొదలుకొని అనేక సంవత్సరముల వరకు చేయు యాగము. రెండునుండి 11 దినముల వరకు చేయు యాగములు అహీన యాగములు? |
| పల్పూలితమ్ 1-13-15 | = | బండపై బాది ఉదకబడిన వస్త్రము. |
| అవకూలనమ్1-14-1 | = | దర్భాగ్ని స్పర్శ కలిగించుట |
| మహానదులు 1-14-8 | = | తమపేరుతో సముద్రమున కలయు నదులు |
| అలాబు 1-14-10 | = | స్రుక్ స్రువములనుంచు పాత్ర?సొరకాయ బుర్ర |
| నలః 1-14-11 | = | వెదురు, రెల్లు గడ్డి |
| ఉపచారః 1-15-1 | = | సంచారము |
| విహారః 1-15-1 | = | అగ్నులుండు హోమ ప్రదేశము |
| సంస్థితః 1-15-19 | = | సమాప్తము |
| అపవర్గము 1-15-2 | = | నిర్గమనము |
| భృతః 1-17-1 | = | వేతనము తీసికొనువాడు భృత్యుడు |
| పారశవుడు 1-17-3 | = | బ్రాహ్మణునకు శూద్రస్త్రీకి పుట్టినవాడు |
| విసన్నాహః 1-18-11 | = | కవచాదులు లేనివాడు |
| భ్రూణః 1-18-12 | = | యజ్ఞము,బ్రాహ్మణుడు. చూ. 2-1-2 |
| వైరః 1-19-1 | = | పాపము |
| ఆత్రేయీ 1-19-7 | = | ఋతుస్నాతయైన స్త్రీ |
| అనడ్వాన్ 1-19-5 | = | బరువులు మోయగలిగిన ఎద్దు |

| | | | |
|---|---|---|---|
| ఉపయమనము | 1-20-37 | = | సంగమించుట |
| ప్రాయణము | 1-21-6 | = | మరణము |
| సుశ్రవః | 1-21-15 | = | కష్టపడి వేదమును విని నేర్చుకొన్నవాడు. |
| అపగూరణం | 2-1-7 | = | హింసింపబూనుట |
| సూర్మిః | 2-1-13 | = | ఉక్కుతో చేసిన స్త్రీ విగ్రహము |
| శాసనం | 2-1-16 | = | వధ |
| విసర్గః | 2-1-16 | = | మోక్షము |
| అవకీర్ణి | 2-1-29 | = | స్ఖలిత బ్రహ్మచారి |
| పరివేత్త | 2-1-39 | = | అన్న కంటె ముందు వివాహము చేసికొన్నవాడు |
| పరివిత్తుడు | 2-1-39 | = | తమ్ముని కంటెముందు వివాహము చేసికొననివాడు. |
| నిర్వేశః | 2-2-6 | = | ప్రాయశ్చిత్తము |
| పతితవృత్తి | 2-2-6 | = | బిచ్చమెత్తుకొనుట |
| పరాకము | 2-2-24 | = | ఉపవాసము |
| ఉదకోపస్పర్శనమ్ | 2-2-29 | = | స్నానము |
| దాయః | 2-3-2 | = | ద్రవ్యము |
| అవీరా | 2-3-32 | = | భర్తగాని పుత్రుడుగాని లేని స్త్రీ |
| ఉపచయః | 2-3-37 | = | న్యాయముగా తీసికొను వడ్డీ |
| సంగ్రహణము | 2-4-1 | = | ఇతరుని భార్యతో అక్రమ సంబంధము పెట్టుకొనుట. |
| చారణదారాః | 2-4-3 | = | దేవదాసీ స్త్రీలు |
| రంగావతారః | 2-4-3 | = | నృత్యము చేయు వేశ్య స్త్రీలు |
| వశా | 2-4-10 | = | వంధ్య |
| వ్యవాయః | 2-4-13 | = | స్త్రీ సంగమనము |
| ఆరా | 2-4-21 | = | ముల్లు గజ్జి |
| అభ్యుచ్ఛందనమ్ | 2-4-21 | = | పారమొదలగువానికి అంటుకొన్న మట్టిని తొలగించుట |
| నిపానము | 2-5-5 | = | వాపీ కూప తటాకములు |
| అగ్రం | 2-5-15 | = | నెమలిగుడ్డు అంత ఉన్న అరువదినాలుగు అన్నము ముద్దలు |

| | | | |
|---|---|---|---|
| సంవిభాగము | 2-5-16 | = | దానము |
| నివేశః | 2-5-19 | = | వివాహము |
| కృతాన్నమ్ | 2-5-20 | = | పక్వాన్నము |
| బాహుకుడు | 2-6-26 | = | ఈత గొట్టువాడు |
| ఉదపానమ్ | 2-6-31 | = | కూపము |
| వృషలీ | 2-6-31 | = | వివాహము కంటె ముందు రజస్వలయైన స్త్రీ |
| ఋషి | 2-6-36 | = | వేదమంత్రముల యొక్క అర్థము చక్కగా తెలిసినవాడు. |
| విద్వాంసుడు | 2-6-36 | = | సాంగోపాంగమైన వేదములను ఇతిహాసాదులనధ్యయనము చేసి ఇతరులకు బోధించువాడు |
| తాంతః | 2-7-8 | = | అలసిపోయినవాడు |
| ఉదయనం | 2-11-8 | = | పరిసమాప్తి |
| మహిమా | 2-11-32 | = | పరమాత్మ |
| విఘసము | 2-13-7 | = | అన్నశేషము |
| చరణమ్ | 2-14-6 | = | ఆచారము |
| పిండతర్కకాః | 2-15-12 | = | శ్రాద్ధమున పిండమును గోరు మాతామహుడు మొదలైనవారు |
| వీరాసనమ్ | 2-18-17 | = | ఒకేవిధముగా కూర్చొనుట |
| త్రైవిద్య వృద్ధాః | 2-18-19 | = | వేదములనుఅర్థముతో అధ్యయనము చేసినవారు |
| ధ్రువావృత్తి | 3-1-5 | = | బిచ్చమెత్తుకొనుట |
| వీవధము | 3-2-6 | = | జోలె |
| ప్రసృతమ్ | 3-6-1 | = | చారెడు |
| రేపము | 3-7-5 | = | ఒక పాపము. |
| పారాయణమ్ | 3-8-1 | = | వేదమును సంపూర్ణముగా అధ్యయనము చేయుట |
| ప్రతినివేశః | 4-1-22 | = | ఇష్టపడక పోవుట |
| శిష్యః | 4-4-9 | = | ఉపనయనము చేసికొని వేదమును అధ్యయనము చేయువాడు |

************

కృష్ణయజుర్వేదాంగమైన కల్పాన్ని రచించిన వారిలో బోధాయనుడు అగ్రగణ్యుడు. చాలా ప్రాచీనుడు కూడా. పైగా ఈ మహర్షి దాక్షిణాత్యుడు. అందువల్లనే కాబోలు దాక్షిణాత్యులలో బోధాయనులెక్కువగా కన్పించుచున్నారు. బోధాయనమహర్షి కల్పాంగమైన శ్రౌతసూత్రం, గృహ్యాసూత్రం, ధర్మసూత్రం కూడా రచించి భారతీయులకు పరమోపకారం చేసినాడు.

ధర్మసూత్రంలో బ్రహ్మచారి (విద్యను నేర్చుకొనువాడు) గృహస్థు (వివాహంచేసికొని సామాజిక స్పృహతో ఉన్నవాడు) వానప్రస్థుడు (సంతానానికి ఇంటి బాధ్యతలప్పగించి విశ్రాంతి తీసికొనుచున్నవాడు) మరియు సన్యాసి (ఐహిక విషయాల కంటే పారమార్థిక విషయాలకు ఆచరణలో ప్రాధాన్యమిచ్చువాడు) ఆచరించాల్సిన వివిధ ధర్మాలను విపులంగా తెలిపినాడు.

పైగా ధర్మ నిర్ణయం చేయాల్సిన ధర్మ పరిషత్తు గురించి, తీర్పు చెప్పేటప్పుడు అనుసరించవలసిన పద్ధతి గురించి, స్త్రీల ఆస్తి గురించి వివరిస్తూ ఇంకా అనేక ప్రాయశ్చిత్తాలను తెలిపినాడు.

పుత్రసంతానం లేనివాడు తన కూతురు యొక్క పుత్రుని తీసికొని అతనికి తన ఆస్తిని అప్పగించవచ్చునన్నాడు. ధర్మబద్ధంగా తీసికొన్న ఆ మనుమని "పుత్రికా పుత్రు"డందురని తెలిపినాడు.

భగవంతునికి నివేదించక, సాటివానికీ పెట్టక, తాను, తన కుటుంబము మాత్రము తినరాదని అన్నాడు. అతిథులకు, ఇంటిలోనున్న గర్భిణీ స్త్రీలకు, బాలురకు, వృద్ధులకు, దీనులకు, రోగగ్రస్తులకు భోజనము పెట్టిన తరువాతనే తాను భుజించాలని సామాజిక ధర్మాన్ని ఉపదేశించినాడు.

అధికమైన వడ్డీకి డబ్బు అప్పిచ్చి బ్రతుకువాడు నిందించతగినవాడని తెలిపినాడు.

తనసంసారాన్ని పోషించుకొనుచు యౌవనంలో ధార్మికుడుగా లేక పోయినప్పటికీ మలివయస్సులోనైనా ధార్మికక్రియలు తప్పక చేయాలని ఉద్బోధించినాడు.

ఈ విధంగా అనేకమైన ధార్మిక విషయాలను తెలుసుకోవడానికి ఉపయోగించే ఈ గ్రంథం సర్వజనులకు పఠన పాఠనయోగ్యం.